# హేమలంబ నామ సంవత్సర

# కామకోటి పీఠ పంచాంగము

## 2017-18

- శ్రీ కుప్పా ఆంజనేయశాస్త్రి



mohan PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదురు,
రాజమహేంద్రవరం - 533101.

శ్రీరామ

స్వస్తి శ్రీ చాన్ద్రమాన

# హేమలంబ నామ సంవత్సర
# కామకోటి పీఠ పంచాంగము

## 2017 - 2018

శ్రీ శ్రీ శ్రీ గురు చన్ద్రశేఖర జయ శ్రీ శంకరేన్ద్రాకృతి ష్వాస్తే యా త్రిపురా త్రిశక్తి రుచిరా వేదత్రయాతిత్రికా।
యాకాప్యాయతన త్రయేజ్యమహిమా సచ్చిత్సుఖా తత్త్వతః కామాక్షీ పరిపాతు న స్సకలదా సైకామ్రనాథా సదా॥
శ్రీ శ్రీ జయేన్ద్ర విజయేన్ద్ర సురూపతో యా - శ్రీ చన్ద్రశేఖర మహా గురు దివ్యమూర్తిః।
శ్రీ కామకోటి గురుపీఠ మధిష్ఠితాఽఽస్తే - సా భా జగన్తి పరిపాతు సమస్త కాలమ్॥

దేవీ జయేన్ద్ర వినుతా విజయేన్ద్ర గీతా శ్రీ చన్ద్రశేఖర నుతా చ జనార్దనేడ్యా।
త్రైవేదికీ త్రిపురుషా విగతత్రికా సా త్రైకాలికీ సకరుణావతు కామకోటిః॥


రచయిత

శ్రీ కాంచీ కామకోటి పీఠ ఆస్థాన సిద్ధాంతి

**శ్రీ కుప్పా శ్రీ ఆంజనేయ శాస్త్రి**

శ్రీ వేదవ్యాస పాఠశాల,

బి - 22, ఎస్.బి.హెచ్. కాలని, సైదాబాద్, హైదరాబాద్ - 59.

ఫోన్ : 040-6444 8800, 09492888088

e-mail : kuppasastry@gmail.com, http:///www.kaladarsini.in



ప్రాప్తి స్థానము

**శ్రీ కాంచీ కామకోటి పీఠము**

శ్రీమఠం సంస్థానము, రోడ్ నెం. 1, శాలై స్ట్రీట్, కాంచీపురం, తమిళనాడు.

**శ్రీ వేదవ్యాస పాఠశాల**

బి - 22, ఎస్.బి.హెచ్. కాలని, సైదాబాద్, హైదరాబాద్ - 59.



# WORDS TO REMEMBER
## Sayings of
# SADGURU SRI SIVANANDA MURTHY GARU



- Culture is our father, mother and Lord. Only by respecting it we maintain our humanness and safeguard our future.
- Every culture has hated other cultures – this is the only culture that has accommodated every one and yet it has withstood the onslaughts and the harm from others.
- If you pay less attention on material things and more attention on God even your material things will be automatically taken care of Samsara does not bend in our favour despite our paying attention on it. On the other hand paying attention on God bends Samsara in our favour. This is wisdom and this is aphorism for life.
- Aryan dharma is universal and is applicable at all times in all places. It was the Aryans who taught the art of lining and the science of living.
- Indian's unity is not geographical and never political but cultural.
- A Hindu is the one who worships spirit in matter to achieve the matter less spirit.
- You must take pride that you are born in this country. Live within the frame work of Dharma. Live gently and leave smoothly.
- Pray for the restorahon of the pristine glory of Bharat. By doing so you shall be redeeming your indebtedness. Only then, spiritual progress will be spontaneous.

## శ్రీ కాంచీ కామకోటి పీఠమున జరుగు ప్రధాన ఉత్సవములు 2017-18

**28/03/17 శ్రీ హేమలంబ నామ సంవత్సరాది**
**04/04/17 శ్రీరామనవమి**
07/04/17 సర్వేషామేకాదశీ
08/04/17 ప్రదోష పూజ
10/04/17 పౌర్ణమీ పూజ
**14/04/17 సౌర నూతన సంవత్సరాది**
14/04/17 సంకష్టహర చతుర్థి
22/04/17 స్మార్తైకాదశి
24/04/17 ప్రదోష పూజ
28/04/17 పరశురామజయంతి
29/04/17 **అక్షతదియ**
**30/04/17 శంకర జయంతి**
02/05/17 శ్రీవిద్యారణ్యస్వామి జయంతి
06/05/17 సర్వేషామేకాదశి
08/05/17 ప్రదోష పూజ
**09/05/17 నృసింహ జయంతి**
10/05/17 పౌర్ణమీ పూజ
10/05/17 వ్యాసపూర్ణిమ
**11/05/17 శ్రీ కాంచీ పరమాచార్యుల జయంతి**
14/05/17 సంకష్టహర చతుర్థి
**21/05/17 హనుమజ్జయంతి**
22/05/17 సర్వేషామేకాదశీ
23/05/17 ప్రదోష పూజ
05/06/17 సర్వేషామేకాదశీ
06/06/17 ప్రదోష పూజ
08/06/17 పౌర్ణమీ పూజ
13/06/17 సంకష్టహర చతుర్థి
20/06/17 సర్వేషామేకాదశి
21/06/17 ప్రదోష పూజ
28/06/17 స్కంద పంచమి
29/06/17 కుమార షష్ఠి
**04/07/17 శయనైకాదశి, తొలి ఏకాదశి**
06/07/17 ప్రదోష పూజ
08/07/17 పౌర్ణమీ పూజ
**09/07/17 గురుపూర్ణిమ, వ్యాస పూజ**
12/07/17 సంకష్టహర చతుర్థి
19/07/17 స్మార్తైకాదశి
21/07/17 ప్రదోష పూజ

03/08/17 సర్వేషామేకాదశి
**04/08/17 వరలక్ష్మీవ్రతం**
05/08/17 శని ప్రదోష పూజ
**08/08/17 శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి వారి జన్మదినోత్సవం**
11/08/17 ముఖ్య సంకష్టహర చతుర్థి
**14/08/17 శ్రీకృష్ణాష్టమి**
18/08/17 సర్వేషామేకాదశి
19/08/17 శని ప్రదోష పూజ
**25/08/17 వరసిద్ధి వినాయక వ్రతం**
26/08/17 ఋషిపంచమీ వ్రతం
02/09/17 సర్వేషామేకాదశి
03/09/17 ప్రదోష పూజ
05/09/17 అనంతపద్మనాభవ్రతం, పౌర్ణమీపూజ
**06/09/17 విశ్వరూప యాత్ర**
09/09/17 సంకష్టహర చతుర్థి
16/09/17 సర్వేషామేకాదశి
17/09/17 ప్రదోష పూజ
**21/09/17 శరన్నవరాత్రారంభః**
**27/09/17 పుస్తకరూప సరస్వతీ పూజ**
**28/09/17 దుర్గాష్టమి**
**29/09/17 మహానవమి**
**30/09/17 విజయదశమి**
01/10/17 సర్వేషామేకాదశి
03/10/17 ప్రదోష పూజ
05/10/17 పౌర్ణమీ పూజ
08/10/17 సంకష్టహర చతుర్థి
15/10/17 సర్వేషామేకాదశి
17/10/17 ప్రదోష పూజ
18/10/17 నరకచతుర్దశి
**19/10/17 దీపావళి**
29/11/17 అక్షయ నవమి వ్రతం
31/10/17 ఉత్థానైకాదశి
01/11/17 ప్రదోష పూజ
02/11/17 వైకుంఠ చతుర్దశి
03/11/17 పౌర్ణమీ పూజ
07/11/17 సంకష్టహర చతుర్థి
14/11/17 సర్వేషామేకాదశి

15/11/17 ప్రదోష పూజ
**24/11/17 సుబ్రహ్మణ్య షష్ఠి**
30/11/17 సర్వేషాం మోక్షదైకాదశి
01/12/17 ప్రదోష పూజ
**03/12/17 దత్తాత్రేయ జయంతి**
పౌర్ణమీ పూజ
06/12/17 సంకష్టహర చతుర్థి
13/12/17 సర్వేషామేకాదశి
**14/12/17 శ్రీ కాంచీ పరమాచార్యుల ఆరాధన**
**16/12/17 ధనుర్మాసారంభః**
**29/12/17 వైకుంఠైకాదశి**
30/12/17 ప్రదోష పూజ
01/01/18 పౌర్ణమీ పూజ
04/01/18 సంకష్టహర చతుర్థి
12/01/18 సర్వేషామేకాదశి
14/01/18 ప్రదోష పూజ
22/01/18 వసంతపంచమి
**24/01/18 రథసప్తమి**
27/01/18 స్మార్త భీష్మైకాదశీ
28/01/18 భీష్మైకాదశీ
29/01/18 ప్రదోష పూజ
31/01/18 పౌర్ణమీ పూజ
03/02/18 సంకష్టహర చతుర్థి
**07/02/18 కలవై పరమేష్ఠి గురు ఆరాధన**
11/02/18 సర్వేషామేకాదశి
13/02/18 ప్రదోష పూజ
**13/02/18 శ్రీ విజయేంద్ర సరస్వతీ స్వామి వారి జన్మదినోత్సవం**
**14/02/18 మహాశివరాత్రి**
**16/02/18 కలవై పరమగురు ఆరాధన**
26/02/18 సర్వేషామేకాదశి
27/02/18 ప్రదోష పూజ
01/03/18 పౌర్ణమీ పూజ
05/03/18 సంకష్టహర చతుర్థి
13/03/18 సర్వేషామేకాదశి
14/03/18 ప్రదోష పూజ
**18/03/18 శ్రీ విలమ్బ నామ సంవత్సరాది**

శ్రీరామ

# స్వస్తి శ్రీ చాన్ద్రమాన హేమలంబ నామ సంవత్సర పంచాంగము 2017-2018

- ఓమ్ -

**వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే।**

**యం నత్వా కృత కృత్యాస్స్యు స్తన్నమామి గజాననమ్॥**

సరస్వతి నమస్తుభ్యం వరదే కామరూపిణి ।

విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా ॥

**కారణపరచిద్రూపా కాఞ్చీపురసీమ్ని కామపీఠగతా।**

**కాచన విహరతి కరుణా కాశ్మీర స్తబక కోమలాంగలతా॥**

**చిన్తిత ఫల పరిపోషణ చిన్తామణి రేవ కాఞ్చినిలయా మే।**

**చిరతర సుచరిత సులభా చిత్తం శిశిరయతు చిత్సుధాధారా॥**

శివనామని భావితేஉ తరంగే మహతి జ్యోతిషి మానినీ మయార్ధే ।

దురితాన్యపయాన్తి దూరదూరే ముహు రాయాన్తి మహాన్తి మంగళాని ॥

**స శంఖ చక్రం సకిరీట కుండలం సపీత వస్త్రం సరసీరుహేక్షణమ్।**

**సహార వక్ష స్థలశోభి కౌస్తుభం నమామి విష్ణుం శిరసా చతుర్భుజమ్॥**

ఆదిత్యాయ చ సోమాయ మంగళాయ బుధాయ చ ।

గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవే నమః ॥

సదాశివ సమారంభాం శంకరాచార్య మధ్యమామ్ ।

అస్మదాచార్య పర్యన్తాం వందే గురు పరంపరామ్ ॥

గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్ ।

నిధయే సర్వ విద్యానాం దక్షిణామూర్తయే నమః ॥

శ్రుతి స్మృతి పురాణానా మాలయం కరుణాలయమ్ ।

నమామి భగవత్పాద శంకరం లోకశంకరమ్ ॥

**త్రయీమయం త్రయీవేద్యం త్రయీధర్మప్రవర్తకమ్।**

**త్రిమూర్తిం కాల విజ్ఞాన బోద్ధారం నౌమి భాస్కరమ్॥**

**యే మయాద్యాశ్చ మన్వాద్యా వరాహమిహిరాదయః।**

**మాధవాద్యాః కేత్కరాద్యాః కాలధర్మ ప్రబోధకాః॥**

**సిద్ధాన్త కరణగ్రన్థ ధర్మశాస్త్రాది రూపతః।**

**సత్సంప్రదాయ గురవ స్తేభ్యో నిత్యం నమో నమః॥**

**శ్రీ శ్రీ శ్రీ గురు చన్ద్రశేఖర జయ శ్రీ శంకరేన్ద్రాకృతి -**

**శ్వాస్తే యా త్రిపురా త్రిశక్తి రుచిరా వేదత్రయాతిత్రికా ।**

**యాకాప్యాయతన త్రయేజ్యమహిమా సచ్చిత్సుఖా తత్త్వతః**

**కామాక్షీ పరిపాతు న స్సకలదా సైకాగ్రనాథా సదా ॥**

**శ్రీ శ్రీ జయేన్ద్ర విజయేన్ద్ర సురూపతో యా**

**శ్రీ చన్ద్రశేఖర మహా గురు దివ్యమూర్తిః ।**

**శ్రీ కామకోటి గురుపీఠ మధిష్ఠితాஉஉస్తే**

**సా భా జగన్తి పరిపాతు సమస్త కాలమ్ ॥**

దేవీ జయేన్ద్రవినుతా విజయేన్ద్రగీతా శ్రీ చన్ద్రశేఖరనుతా చ జనార్దనేడ్యా ।

త్రైవేదికీ త్రిపురుషా విగతత్రికా సా త్రైకాలికీ సకరుణావతు కామకోటిః ॥

**పుష్పత్రయం షట్ఫలాని మద్భక్తానాం సదేతి యః।**

**శిర్షైః కరై స్సూచయన్స్వాన్ భక్తాన్పాతి దయామయః।**

**దత్తాత్రేయ స్స్వర్య గామీ సచ్చిదానన్దవాహినీ**

**దద్యాచ్ఛ్రీ విజయానన్ద తీర్థం చాపి సదాపి నః॥**

**అహైతుక ప్రేమ సుధార్ణవానాం ధర్మైకరక్షా పరినిష్ఠితానామ్ ।**

**శ్రీ శ్రీ శివానన్ద గురూత్తమానాం పాదారవిన్దే ప్రణమామి నిత్యమ్ ॥**

**సమాజ కల్యాణ విధాయకానాం వివేక విజ్ఞాన విభూతి ధామ్నామ్ ।**

**శ్రీ శ్రీ శివానన్ద మహోదయానాం పాదారవిన్దే శరణం మమ స్తామ్ ॥**

**శ్రీ శ్రీ శివానన్ద సుమూర్తిభాజాం శ్రీ శ్రీ శివానన్ద సునామభాజామ్ ।**

**శ్రీ శ్రీ శివానన్ద పద ప్రదే శ్రీ శ్రీ శ్రీ శివానన్ద పదే నతోஉస్మి ॥**

విద్యాగురు ప్రార్థన

**వేద వేదాంగ వేదార్థ వేదాన్తాది విదీడితమ్।**

**తప స్స్వాధ్యాయ నిరతం నిత్యాగ్న్యాదివ్రతం శుచిమ్॥**

**సత్సంస్కారం సదాచారం వాస్తు జ్యోతిః కళానిధిమ్।**

**వేద జ్యౌతిష సాహిత్య వ్యాకృత్యాదిషు మే గురుమ్॥**

**యేడిద్యన్వయ సద్రత్నం స్థాపత్య విదుషాం వరమ్।**

**సూర్యనారాయణాభిఖ్యం సద్గురుం నౌమి సర్వదా॥**

బిజుమళ్ళ కులాబ్ధీందుం జ్యోతిర్విద్యా విశారదమ్ ।

కీర్తిశాలిన మాచార్యం సూర్యనారాయణం నుమః ॥

వృద్ధం పంచాంగ గణన ప్రజ్ఞా పరిణతం గురుమ్ ।

నిర్మలం నిర్మలావాసం రాజేశ్వర బుధం నుమః ॥

చిఞ్చాపూరి కులోద్భూతం జ్యౌతిషార్ణవ మంథరమ్ ।

సుబ్రహ్మణ్యాఖ్యమమలం పితృతుల్యం గురుం నుమః ॥

స్వీయ విజ్ఞాపనా

యన్నామ వర్ణాంచిత కర్ణరంధ్రా ఆంధ్రా భవంత్యుత్పులకీ కృతాంగాః ।

యద్వంశజా స్సర్వ దిగంతతాంత భ్రాజద్యశ శ్శాలిన ఏవ లోకే ॥

కౌండిన్యగోత్ర ప్రథితో హి సోஉయం వర్వర్తి కుప్పాహ్వయ వంశమౌళిః ।

తజ్జ స్తపస్వీ గ్రహవేదవేత్తా శ్రీ దక్షిణామూర్తి రితీడ్యశీలః ॥

తత్పుత్రరత్నం స్పృహణీయశీలః లక్ష్మావధానీ శ్రుతితత్త్వవేత్తా ।

జనార్దనానంద సరస్వతీతి తుర్యాశ్రమే యః ప్రథితః ప్రపంచే ॥

దృష్టాంతభూతస్య నవీనకాలే జీవన్విముక్తే ర్విధితత్పరస్య ।

తస్యోత్పునానస్య గృహస్థ భావం త్రయః ప్రజాతా స్తనయాః పవిత్రాః ॥

తన్మధ్యమో మే జనకో గుణీ సుబ్రహ్మణ్యశాస్త్రీతి సునామధారీ ।

మీనాక్షికా మే జననీ సుసాధ్వీ తయో ర్వయం వై తనుజా స్త్రయ స్స్మః ॥

తన్మధ్యమోహం గురుమధ్యగామీ శ్రీయాంజనేయ స్సుధియాం విధేయః ।

వంశర్షిమాలా కృపయాత్తవిద్యః కరోమి పంచాంగ మిహాన్వయాప్తమ్ ॥

**శుభాభివృద్ధ్యా అశుభ ప్రశాన్త్యై నృజన్మన స్సార్థకతా ప్రసిద్ధ్యై।**

**సత్కర్మ కాలస్య వివేక సిద్ధ్యై పంచాంగ మేతత్సుధియాం ముదేஉస్తు॥**

**విషయా వినివర్తన్తే చిత్తే యద్విషయే సతి ।**
**సమస్త విషయాతీతం బ్రహ్మ తన్మంగళం పరమ్ ॥**

## పంచాంగ పద్ధతి - ముఖ్య గమనిక

**1. ఈ పంచాంగము శ్రీ కేత్కరీయ జ్యోతిర్గణిత దృక్సిద్ధాంత విధానములో గుణించబడినది. ఇందు కాలమానము హైదరాబాదు ప్రాంతమునకు చూపబడినది.**

**2.** పూర్వకాలపు పంచాంగాలలో తిథి వారాదులు, వర్జ్యాలు మొదలైనవన్నీ ఒకే వరుసలో ఉండేవి. గ్రహస్థితి గతులు స్పష్టంగా తెలియుట చాల ఇబ్బందే అయేది. నవీనులు కొందరు ప్రతిదిన చక్రాలు వేస్తున్నారు. ఈ పంచాంగములో ఈ రెండు పద్ధతులను సమ్మేళనం చేసి ప్రతిదిన చక్రాల దగ్గరనే పంచాంగాలలో ఉండవలసిన విశేషాలన్నీ పొందు పరచడమైనది.

**3.** పండుగలు, తిథి పర్వాదుల విషయమున మన దేశమున ప్రసిద్ధములు, శిష్టులందరు ప్రమాణముగ గ్రహించుచున్న నిర్ణయ సింధువు, ధర్మసింధువు, కాలమాధవీయము, కాల నిర్ణయ చంద్రిక మున్నగు గ్రంథములను, మా పూర్వుల / ఇతర ప్రసిద్ధ పూర్వ పంచాంగ కర్తల నిర్ణయములను సరి చూచుకుని, పెద్దలను సంప్రదించి, యథామతి, నిర్ణయించటమైనది. ముఖ్యమైన కొన్ని తిథి పర్వాదుల విషయాలలో నిర్ణయాలకు తగిన ప్రమాణ వాక్యాలు కూడా సంగ్రహంగా తెలుపబడినాయి. ఇట్టి వాటిలో కులాచార/ వర్ణాచార / దేశాచార / ప్రాంతీయ సంప్రదాయ భేదములు ఉంటాయి. ఎవరికి వారు తమ తమ సంప్రదాయమును, తగిన పెద్దల ద్వారా, నిర్ణయించుకుని అనుసరించుటయే న్యాయము. అవసరమును బట్టి పంచాంగ కర్తను కూడ సంప్రదించవచ్చును.

**4. ప్రతిరోజు :** గ్రహస్థితులు ఉదయం 5:30 ని. I.S.T. కి సరిపోవునట్లుగా సవ్యకుండలనీ చక్రములో ఇవ్వబడినవి. (గ్రహములకు ప్రక్కనున్న అంకెలు డిగ్రీలు, నిమిషములు). అలాగే తిథి, నక్షత్ర, యోగ, కరణముల అంతము, అట్లే వర్జ్యము, అమృత ఘడియల ఆద్యంతములు I.S.T. లో ఇవ్వబడినాయి. కనుక ఇవన్నియు భారతదేశమున అన్ని ప్రాంతములకు సరిపోవును. (ఏ మార్పు అవసరము లేదు.)

**5.** కాని, సూర్యోదయా స్తమయములు, లగ్నప్రమాణ, లగ్నాంతములు స్థానిక అక్షాంశ, రేఖాంశములతో ముడిపడియున్న స్థానికాంశములు. వారదుర్ముహూర్త, రాహు/గుళిక/యమకంటక కాలాదులు కూడా స్థానికములే. ఇక - కర్మానుష్ఠానమునకు వలయు తిథి-పర్వాదుల నిర్ణయము I.S.T. పై గాక, స్థానిక సమయాదులపైననే ఆధారపడును. సంధ్యావందనాది నిత్యకర్మలకు సూర్యోదయ కాలీన తిథి, ఆబ్దికాది నైమిత్తికములకు అపరాహ్ణ వ్యాప్తి, అట్లే వివిధ వ్రత పర్వాదులకు అహోరాత్రములందలి నిర్దిష్ట భాగములలో తిథి వ్యాప్తి - కొన్నిటికి నక్షత్రవ్యాప్తి కూడ ప్రధానములు. ఈ వ్యాప్తులన్నియు స్థానిక సూర్యోదయాస్తమయ కాలములను బట్టి మారుచుండును. సన్నిహిత ప్రాంతములలో కూడ - ఈ తిథి పర్వాదులు ఖచ్చితముగ ఒకే రోజున అని అనుట ఏ మాత్రము శాస్త్రీయము కాదు. కనుక వీటిని ఆయా ప్రాంతములకు సరిచూచుకొనుటయే శాస్త్రీయము. తప్పదు.

**6. కాగా - ఈ పంచాంగమున ప్రతిదిన చక్రముల దగ్గర సూచించిన సూర్యోదయ అస్తమయములు, లగ్నాంతములు, వారదుర్ముహూర్తములు** I.S.T. **లో హైదరాబాదు ప్రాంతమునకే సరిపోవును. అట్లే ఇట సూచించిన తిథి పర్వాదుల నిర్ణయములు కూడ హైదరాబాదు ప్రాంతమునకే.**

**7.** కొన్ని ఇతర ప్రాంతములకు సూర్యోదయా స్తమయముల పట్టికలు, లగ్నప్రమాణ లగ్నాంతములకు వలయు సంస్కార పట్టికలు కూడ ఇవ్వబడినాయి. తిథి పర్వాదుల విషయమున ఇతర ప్రాంతములకు వలయు సూచనలు కూడ కొన్ని ఇవ్వబడినాయి.

**8.** ఇట్టి స్థానికాంశములన్నిటిని - ప్రతిరోజు - అన్ని ప్రాంతములకు ఒకే చోటున సూచించుట పాఠకులకు అత్యంతము అసౌకర్యము అయి తీరును. కనుక ఆపని చేయుటలేదు. కనుక ఇతర ప్రాంతములకు వీటిని తగురీతిగ సరిచూచు కొనుచుండుట తప్పదు.

**9.** పూర్వకాలములో పంచాంగములు సామాన్యంగా ఆయా పంచాంగ కర్తల ప్రాంతములకు పరిమితమై ఉండెడివి. కనుక తిథిపర్వాది నిర్ణయములలో సవరణలను సూచించెడి అలవాటు ఉండెడిది కాదు. ప్రస్తుతకాలమున ఒకే పంచాంగము అనేక ప్రాంతములలో ఉపయోగింపబడుచున్నది. కావున విజ్ఞుల ఉపయోగము కొరకై పై సూచనలు అందించబడుచున్నాయి. **అవసరమును బట్టి పండితుల సహాయమున స్థానిక తిథ్యాది పర్వ నిర్ణయములను చేసుకొనవలెను.**

**10. దిన చక్రముల మధ్యలో ఉన్న సంకేతములు :-** తి = తిథి, న = నక్షత్రము, యో = యోగము, క = కరణం, అ.ఘ = అమృత ఘడియలు, దు = దుర్ముహూర్తము, వ = వర్జ్యము, ప = పగలు, రా = రాత్రి, రా.తె = రాబోవు తెల్లవారుజాము.

**11. సత్కర్మానుష్ఠానమునకు వలయు కాలవిశేషములను తెలిసికొనుటయే పంచాంగము యొక్క పరమ ప్రయోజనము.** తదర్థమై సనాతన ధర్మశాస్త్రమునకు, అధునాతన విజ్ఞాన శాస్త్రమునకు రెంటికీ సరి పోవునట్లుగా నిర్ణయములు వచ్చు రీతిలో ఈ పంచాంగము సత్పురుషుల సేవలో సవినయముగా సమర్పించబడుచున్నది.

**సత్కర్మ కాలస్య వివేక సిద్ధ్యై పంచాంగమేతత్సుధియాం ముదేఽస్తు**

## శ్రీరామ

**శ్రీ కల్యాణ గుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం గంగా స్నాన విశేష పుణ్య ఫలదం గోదాన తుల్యం నృణామ్ ।**
**ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదం నానాకర్మ సుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్ ॥**

అస్య శ్రీ సమస్త కల్యాణ భాజనస్య శ్రౌత స్మార్త నిత్య నైమిత్తిక కామ్య కర్మానుష్ఠాన నిదాన భూతస్య స్వస్తి శ్రీ చాంద్రమాన హేమలంబ నామ సంవత్సరస్య సృష్ట్యాది గత సౌరాబ్దాః 195,58,85,118 కల్యాది గతాబ్దాః 5118, విక్రమార్క శకాబ్దాః 2074, శాలివాహన శకాబ్దాః 1939, క్రీస్తు శకాబ్దాః 2017-2018. **వ్యవహారమానేన –** అథాస్మిన్దేశే లోక వ్యవహారార్థం చాంద్రమానాబ్దో గ్రాహ్యః. వింధ్యస్యోత్తరదేశే బార్హస్పత్యమానాబ్దో గ్రాహ్యః. శేషాచలస్య దక్షిణదేశే సౌరమానాబ్దో గ్రాహ్యః. చాంద్ర, సౌరమానవశా దయం **హేమలంబ** నామ సంవత్సరః. బార్హస్పత్యమానవశాత్ సాధారణ నామ సంవత్సరః. గురూదయ వశాత్ చైత్రాబ్దః, **అయనాంశాః** 24°05'33''

## సంవత్సర ఫలితాంశములు

| | | | |
|---|---|---|---|
| ర చ (శు) | ల కు బు | | |
| కే | వర్ష లగ్న | | |
| | కుండలి | | రా |
| శ | | | (గు) |

| | | | |
|---|---|---|---|
| (శు) | ర (బు) | కు | |
| కే | జగల్లగ్న | | |
| ల | కుండలి | | రా |
| (శ) | చ | | (గు) |

### సంవత్సర నాయకాః

**01. రాజా కుజః**
**02. మంత్రీ శుక్రః**
**03. సేనాధిపః బుధః**
**04. సస్యాధిపః రవిః**
**05. ధాన్యాధిపః శనిః**
**06. అర్ఘాధిపః గురుః**
**07. మేఘాధిపః గురుః**
**08. రసాధిపః కుజః**
**09. నీరసాధిపః రవిః**
10. పురోహితః రవిః
11. పరీక్షకః శనిః
12. గణకః చంద్రః
13. గ్రామపాలకః గురుః
14. దైవజ్ఞః బుధః
15. రాష్ట్రాధిపః కుజః
16. ఉద్యోగపః శుక్రః
17. అశ్వాధిపః శుక్రః
18. గజాధిపః రవిః
19. పశ్వధిపః గురుః
20. దేవాధిపః రవిః
21. నరాధిపః బుధః
22. గ్రామపః శనిః
23. వస్త్రాధిపః కుజః
24. రత్నాధిపః గురుః
25. వృక్షాధిపః శనిః
26. జంగమాధిపః రవిః
27. సర్పాధిపః చంద్రః
28. మృగాధిపః బుధః
29. శుభాధిపః కుజః
30. స్త్రీణామధిపః గురుః

వీరు సంవత్సర నాయకులు. వీరిలో మొదటి తొమ్మిది మంది ప్రధాన నాయకులు. మిగిలిన వారు ఉపనాయకులు. వీరిని బట్టి ఈ సంవత్సర కాలంలో భారతదేశంలోని ప్రజల మనోవృత్తుల గణనములు, శుభాశుభ విషయములలో ఎట్లు ప్రవర్తించునో తెలియును. ప్రకృతమున ఈ సంవత్సరము 9 మంది ప్రధాన నాయకులలో 4 శుభులు. 21 మంది ఉపనాయకులలో 11 మందికి శుభత్వం కలిగినది.

కాగా, ఈ సంవత్సరము రాజ్యాధిపత్యం అశుభుడైన కుజునికి రావటం, అందునా ఎక్కువ ఆధిపత్యాలు అశుభ గ్రహములకే వచ్చినందున దేశములో అశుభ ఫలితములే ఎక్కువ ఉండేందుకు అవకాశం ఉన్నను మంత్రిత్వం శుభుడైన శుక్రునకు రావటం, అలాగే అర్ఘ మేఘాధిపత్యాలు శుభులకు రావటం వలన మొత్తం మీద గత సంవత్సరము వలే లాభ నష్టాలు రెండు కూడ తీవ్రస్థాయిలో కన్పిస్తున్నప్పటికిని దేశమంతా కొంత వరకు సస్య శ్యామలంగా ఉండి, ప్రజలు తరచు అన్యోన్య సహకారములతో వ్యవహరించుకునే ధోరణి కనిపించుచున్నది. కాగా, సేనాధిపతి మృదు గ్రహము అగుటచే శాంతి భద్రతలవిషయములోను, దోషులను అదుపు చేయటంలో కొంత కఠినత్వము, మెత్తదనము, అసమర్థత కనిపించు చుండును. అలాగే సైన్యాధిపతులకు, రాజకీయ నాయకులకు వైషమ్యములు పొడచూపవచ్చును. కాగా, శత్రుదేశముల వైఖరిలో స్వల్ప సానుకూలతను నాయకులు సాధించగలుగు సూచనలున్నాయి. అలాగే, అంతర్జాతీయంగా కొన్ని ఒత్తిళ్ళు ఎదుర్కొనప్పటికిని నాయకులు, అధికారులు దృఢసంకల్పం తోనే వ్యవహరిస్తారు. సస్య, ధాన్య, అర్ఘ, మేఘ, రస, నీరసాధిపతులను పరిశీలించగా అన్ని రంగాలలోను, ఆర్థిక వ్యూహాలలోను సరిక్రొత్త ఆలోచనలు, ప్రణాళికలు వెలువడును. కాని, పాలకులకు అధికారులకు సమన్వయము లోపించుట వలన తరచు కొన్ని చిక్కులు కలుగును. కాని అవి వీధిమీద పడవు. అలాగే ఈ సంవత్సరము కొన్ని ప్రాంతాలలో వర్షాలు సమృద్ధిగా కురవటం, కొన్ని ప్రాంతాలలో అకాల గాలివానలతో ప్రజలు భయ భ్రాంతులకు లోనవుతూ ఉండటం ఎక్కువగా కనిపిస్తున్నది. కాగా, మొత్తం మీద పంటలు బాగా పెరుగు సూచనలు ఉన్నాయి. అయినను, కొన్ని ప్రాంతములలో చేతికి అందిన పంటకు గిట్టుబాటగు సూచనలు తక్కువగా ఉన్నాయి. మొత్తము మీద అన్ని రంగములలోను ఇటు ప్రజలకు అటు పాలకులకు సంక్లిష్ట పరిస్థితి ఎదురవుతున్నను కొంత ధర్మానికి, న్యాయానికి కట్టుబడి ఉండే లక్షణములు ఉన్నాయి. ఈ అంశములను పునాదిగా పెట్టుకొని వర్షలగ్న, జగల్లగ్నాలను విచారణ చేయగా –

రాష్ట్ర ప్రభుత్వం సుస్థిరంగా ప్రజోపయోగ పథకాలు అమలు పరుస్తున్నప్పటికిని అధికారుల సమన్వయ లోపము వలన శుభఫలములు అన్నియు ప్రజలకు ఆశించినంతగ అందుబాటులోనికి రావు. అలాగే అకాల విపత్తులను ఎదుర్కొనటంలో ప్రభుత్వ వైఫల్యాల వల్ల సామాన్య ప్రజానీకం ఇక్కట్లు పాలయ్యే సూచనలు ఉన్నాయి. ద్వితీయ స్థానమును పరిశీలించగా రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని మెరుగుపరచే విషయంలో ప్రభుత్వము చేయు ప్రయత్నములన్నియు ఇసుకలో బండి లాగుటవంటివే అగును. అలాగే, కుటుంబ వ్యవహారాలలో కూడా కొంత విపరీత ధోరణులు పెరుగుతాయి. బ్యాంకింగ్ రంగములో ఆరోగ్యవంతమైన పోటీతత్త్వము పెరిగి ఖాతాదారు

లకు తగిన సేవను అందించడంలో బ్యాంకులు సఫలమవుతాయి. తృతీయస్థానమును పరిశీలించగా రాష్ట్ర రవాణారంగములో పెను క్లిష్ట సమస్యలు ఎదురవుతున్నప్పటికిని పలు ఆకర్షణీయ ప్రజోపయోగ పథకాలతో ప్రజల మన్ననలు అందుకుంటుంది. అలాగే పత్రికా, సమాచార రంగాలలో వినూత్నమైన సంస్కరణలతో కూడిన మార్పులు వస్తాయి. చతుర్థస్థానమును పరిశీలించగా రియల్ ఎస్టేటు రంగాలలో ప్రభుత్వ ప్రోత్సాహ, సహకారము కొంత తక్కువగా కనిపించుచున్నవి. వ్యవసాయ రంగములో ప్రకృతి / ఈతిబాధలు పెరిగినను ప్రభుత్వపు ప్రోత్సాహముతో కొంత మేలైన పరిణామములు గోచరించుచున్నవి. విద్యారంగమున ప్రగతి కనిపించుచున్నది. కానీ, విద్యార్థి సంఘములలో కుటిల రాజకీయములు ప్రవేశించి సమాజమునకు సమస్యలు సృష్టించు పరిస్థితి కనిపించుచున్నది. పంచమ స్థానమును పరిశీలించగా శిశుసంక్షేమం, సంగీత, సాహిత్య, పరిశోధనా రంగాలలో ప్రభుత్వ అలసత్వ ధోరణి ఉన్నప్పటికిని ప్రభుత్వేతర సహకారం, ప్రోత్సాహాలతో కాస్త నిలదొక్కుకుంటాయి. షష్ఠస్థానమును పరిశీలించగా అన్ని రంగాలలోను ఆరోగ్యకరమైన పోటీకి తగినట్లు అభివృద్ధి కనిపించుచున్నది. భద్రతాదళ, శ్రామిక వ్యవస్థల అభివృద్ధికై నిధులు పెంచవలసివచ్చును. కాగా, రాష్ట్రంలో అంటువ్యాధుల నివారణ, ప్రజా రక్షణ విషయంలో ప్రభుత్వం సమర్థవంతముగా వ్యవహరించి ప్రజల మన్ననను చూడగొంటుంది. సప్తమ స్థానమును పరిశీలించగా రాష్ట్రం కేంద్ర ప్రభుత్వాల మధ్య సయోధ్య తక్కువగా ఉండే అవకాశాలు ఉన్నాయి. కాగా, రాష్ట్ర వాణిజ్య వ్యవహారాలు నిరుడు కంటే కొంత కుంటుబడే అవకాశం ఎక్కువగా ఉన్నది. అలాగే, రాష్ట్రంలో ఆదర్శ వివాహ వ్యవస్థలు కొంత బలహీనపడుతున్నప్పటికిని కుటుంబ విలువలకు ప్రాధాన్యతల నివ్వటం కొంత శుభసూచకంగా గోచరిస్తున్నది. ప్రభుత్వరంగ సంస్థలలో రహస్యములు బయటపడుట ద్వారా ప్రభుత్వం కొంత అప్రతిష్ఠ పాలు కావలసివచ్చును. అలాగే విచిత్రమైన అంటువ్యాధులు ప్రబలిల్లుట, తద్వారా ప్రజల ఇబ్బందులు, వాటి నియంత్రణ విషయములో ప్రభుత్వ వైఫల్యము బహిర్గతమగును. నవమ స్థానమును పరిశీలించగా న్యాయ వ్యవస్థ కూడా తన గౌరవమును నిలబెట్టుకొనుటలో కొంతవరకు సఫలీకృతమవుతుంది. మత సంబంధ / ఆధ్యాత్మికత విషయాలలో పీఠాధిపతుల, మఠాధిపతుల కృషి విశేషంగా ఉండి ఇటు ప్రజలలోను, అటు పాలకులలోను ఆధ్యాత్మికత పెరుగుట, ధర్మానికి కట్టుబడి ఉండే లక్షణములు ఎక్కువగా ఉన్నాయి. దశమ, ఏకాదశ స్థానములను పరిశీలించగా చట్ట విరుద్ధమైన పనులు జరుగుచున్నప్పటికిని, వాటిని సమర్థవంతంగా అడ్డుకోవడంలో ప్రభుత్వము కొంతవరకే సఫలమవుతుంది. ప్రభుత్వరంగ సంస్థలలో పరస్పర సుహృద్భావ ధోరణలు బాగా పెరుగుతాయి. అలాగే, గ్రామీణ, వ్యవసాయ రంగాలలో మాత్రము సానుకూల సూచనలు అధికంగా కనిపిస్తున్నాయి. రైతులు, ప్రభుత్వము కూడా ఆహారధాన్య విషయములలో శ్రద్ధ వహిస్తారు. వాటి ఫలితాలు కూడా ప్రోత్సాహకరంగా ఉంటాయి. అలాగే వివిధ రంగాల ద్వారా రావలసిన ఆదాయం కూడా పెరిగే సూచనలు ఉన్నాయి. ద్వాదశ స్థానమును పరిశీలించగా రాష్ట్రంలో రాజకీయ ఆందోళనకారులు, అంతర్గత శత్రువులు, విప్లవకారుల దౌర్జన్యాలను అదుపు చేయటంలోను, అరికట్టడంలోను ప్రభుత్వం విజయం సాధిస్తుంది.

కాగా, కేంద్ర ప్రభుత్వములోను, రాజకీయ రంగాలలోను పెను మార్పులకు తగిన గ్రహ సన్నివేశములు కనిపించుచున్నవి. దేశ భాగస్వామ్య పార్టీలలో చైతన్యం మరింత పెరిగి నిర్దేశక సూత్రాలను ఎంచుకొని దేశాభివృద్ధికి పాటుపడుతారు. అంతర్జాతీయంగా మన దేశఖ్యాతి గతయేడు కంటే మరింత వృద్ధి చెందుతుంది. ద్వితీయ స్థానమును పరిశీలించగా దేశ ఆర్థికవిధానాలలో ముందుచూపు నిర్ణయాలు, పాలనాయంత్రాంగం సరిగ్గా స్పందించడం, కొన్ని జాతీయ పనులు వెంటనే కార్యరూపం దాల్చడం వంటివి ప్రజల అభివృద్ధికి దోహదం చేస్తాయి. అలాగే అంతర్జాతీయ స్నేహ సంబంధాల వలన విదేశాల నుండి ఋణ ఆర్థిక సహాయమును అధికముగా తీసుకురాగల సూచనలున్నవి. అలాగే ఇంటా బయట శత్రువులను ఇనుప పాద ధోరణితో అణచడం, తద్వారా రక్షణ వ్యయం కొంత తగ్గడం, సామాన్యులపై భారం తరగడం వంటి సూచనలు ఉన్నాయి. తృతీయస్థానమును పరిశీలించగా ఇతర దేశాలతో దౌత్య సంబంధాలు, ఒప్పందాలు కుదర్చడంలో ప్రభుత్వం సమర్థతతో వ్యవహరించి ఊహించని పురోగతిని సాధిస్తుంది. సమాచార రంగంలో విప్లవాత్మకమైన మార్పులు, సంస్కరణలు వస్తాయి. చతుర్థ స్థానమును పరిశీలించగా కేంద్రప్రభుత్వ నిరాదరణ ధోరణితో విద్యారంగంలో ప్రగతి కనిపించుచున్నది. కాని, సమర్థులైన వైజ్ఞానికులు, వైద్యులు ఉన్నప్పటికిని విద్యార్థి సంఘములలో కుటిల రాజకీయములు ప్రవేశించి సమాజమునకు, అలాగే, ఆయా రంగాలలో అంతర్జాతీయస్థాయికి తగిన కృషిని ప్రోత్సహించ లేని పరిస్థితిని సృష్టించును. వ్యవసాయ రంగములో రైతులకు వ్యాపార పంటలపై ఆసక్తి పెరిగి ఆహారధాన్యాలు, పశుగ్రాసములను నిర్లక్ష్యము చేయు సూచనలున్నవి. ప్రభుత్వము వారి ధరల మద్దతు గూడ ఆదిశలోనే నడుచును. పొగాకు వంటి ఆరోగ్య భంగకరమైనటువంటి పంటలు కూడా పెరగవచ్చు. పంచమస్థానమును పరిశీలించగా సంగీత, సాహిత్య, కళా రంగాలలో ప్రభుత్వప్రోత్సాహం కొంత తగ్గవచ్చు. కాగా, మన దేశ దౌత్యాధికారులు అంతర్జాతీయంగా దేశ ఖ్యాతిని ఇనుమడింప చేస్తారు. షష్ఠస్థానమును పరిశీలించగా శత్రుదేశముల వెన్నుపోట్లను సమర్థవంత ముగా త్రిప్పికొట్టడం, ఉగ్రవాదులను అణగద్రొక్కు విధానములతో అంతర్జాతీయముగా మన దేశానికి మద్దతు పెరిగే సూచనలున్నాయి. సప్తమ స్థానమును పరిశీలించగా విదేశములతో అనుకూల సంబంధాలను వాణిజ్యపరంగాను, వ్యావహారిక పరంగాను వృద్ధి చేసుకోవటంలో కేంద్ర ప్రభుత్వం గతం కంటే మరింత సమర్థవంతముగా వ్యవహరించే సూచనలు ఉన్నాయి. అష్టమ స్థానమును పరిశీలించగా షేర్ మార్కెట్లు, స్పెక్యులేషన్ వ్యవహారాలు, ఆర్థిక వ్యాపారాలలో ప్రోత్సాహకరమైన మార్పు కనిపిస్తున్నది. నవమ స్థానమును పరిశీలించగా దేశంలో ఆధ్యాత్మిక భావాలు, ప్రజలలో దేశభక్తి, జాతీయభావములు బాగా పెరుగుతాయి. అలాగే ఆధ్యాత్మిక గురువులు నైతికవిలువలను, ఆధ్యాత్మిక విలువలను పెంచడంలో విపరీతమైన కృషి చేస్తారు. అలాగే న్యాయశాఖలో జాతీయ ప్రాముఖ్యము గల విప్లవాత్మక తీర్పులు కొన్ని రావచ్చును. దశమస్థానమును పరిశీలించగా పారిశ్రామిక రంగములోను, భారీ పరిశ్రమరంగంలో ఈ ఏడు కొంత మంచి వాతావరణం ఏర్పడి నిలకడగల అభివృద్ధిని సాధించడం జరుగు తుంది. యాజమాన్య కార్మిక సంబంధములు మొత్తము మీద తృప్తికరంగా ఉండగలవు. ఏకాదశ స్థానమును పరిశీలించగా దేశంలో నిరుద్యోగ తీవ్రత గణనీయముగా తగ్గే అవకాశమున్నది. ప్రభుత్వము వివిధ పథకముల ద్వారా సమృద్ధిగా ఆదాయ వనరులు సమీకరించుకొనును. కాగా, వ్యాపారరంగంలో లాభాలు పొంగి పొరలుచున్నట్లు పైకి కనిపించు చుండంగానే వ్యాపారములు మునిగిపోవు సన్నివేశములున్నాయి. ద్వాదశ స్థానమును పరిశీలించగా దేశప్రయోజనాలను, శాంతి భద్రత విషయాలను, అంతరంగిక రక్షక విభాగాలు విశేషమైన పరిశ్రమతో శ్రద్ధ వహించటంలో విజయములు సాధిస్తాయి. అలాగే శత్రుదేశముల, ఉగ్రవాదుల ధాటియును నియంత్రించడంలో ప్రభుత్వం విజయం సాధిస్తుంది.

మొత్తం మీద ఈ సంవత్సరమున రాజైన కుజుని ప్రభావము ఉన్నను, మంత్రి అయిన శుక్రుని సహకారం వలన ఎన్ని ఇబ్బందులు ఎదురైనను, వాటిని ధైర్యంగా అధిగమించి దేశమును అభివృద్ధి పథములో పయనింప చేయుటలో ప్రభుత్వములు సఫలీ కృతమయ్యే అవకాశము మెండుగా కనిపించుచున్నది. ప్రజలును దైవభక్తి, ధర్మనిరతి కలిగి, దైవానుగ్రహమున శుభ సుఖములనే అధికముగా పొందెదరు.

ఈ సంవత్సరము మన దేశమును పాలించు గ్రహములలో దత్తాత్రేయ, సుబ్రహ్మణ్య అంశలు ఎక్కువ ఉన్నందున **దత్తాత్రేయ, సుబ్రహ్మణ్యుల** ఆరాధనము ప్రజలకు శ్రీరామరక్ష.

# స్వస్తి శ్రీ చాన్ద్రమాన హేమలంబ నామ సంవత్సర పంచాంగం 2017-2018



**మార్చి 2017**

28 **స్వస్తి శ్రీ హేమలంబ నామ సంవత్సరాదిః** వసంత నవరాత్రారంభః
29 **శుక్రమౌఢ్యత్యాగః**
30 మాసగౌరీ/సౌభాగ్యశయన వ్రతం, మత్స్య జయన్తీ

**ఏప్రిల్ 2017**

04 (స్మార్త) **శ్రీరామనవమి**
05 (వైష్ణవ) **శ్రీరామనవమి**
07 సర్వేషాం కామదైకాదశీ
08 వామనద్వాదశీ **శని త్రయోదశీ**
09 అనంగత్రయోదశీ
11 **మహాచైత్రీ**
13 మేషసంక్రమణం
14 సౌర సంవత్సరాదిః **సంకష్టహరచతుర్థీ**
20 వరాహ జయంతి
22 (స్మార్త) వరూథిన్యేకాదశీ
23 వైష్ణవైకాదశీ
24 **మాసశివరాత్రిః**
25 **కృష్ణాంగార చతుర్దశీ**
27 **వైశాఖస్నానారంభం**
28 పరశురామజయన్తీ
29 **అక్షయతృతీయ,** నాగ 4 **శ్రీ జనార్దనానన్ద సరస్వతీ స్వామి నామారాధనమ్**
30 **శ్రీశంకర జయంతి**

**మే 2017**

02 శ్రీవిద్యారణ్య జయంతి
03 బుధాష్టమి
04 డొల్లు కర్తరీ
06 సర్వేషాం మోహిన్యేకాదశీ
07 పరశురామ ద్వాదశీ
09 **నరసింహజయన్తీ**
10 **మహావైశాఖీ,** వ్యాస పూర్ణిమ, సంపద్గౌరీవ్రతం
11 నిజకర్తరీ, **శ్రీ కాంచీ పరమాచార్యుల జయన్తి**
14 వృషభ సంక్రమణం **సంకష్టహరచతుర్థీ**
21 **శ్రీ హనుమజ్జయంతి**
22 సర్వేషామపరైకాదశీ
24 **మాసశివరాత్రిః**
27 బుద్ధ, కల్కి జయంతులు
28 రంభావ్రతం, కర్తరీ త్యాగః

**జూన్ 2017**

04 దశపాపహరావ్రతం
05 సర్వేషాం నిర్జలైకాదశీ కూర్మజయంతి
06 రామలక్ష్మణ ద్వాదశీ, శ్రీవిద్యారణ్య స్వామ్యారాధనం
09 బిల్వ త్రిరాత్ర వ్రతం
13 భాను చతుర్థీ **సంకష్టహరచతుర్థీ**
14 మిథునసంక్రమణం
20 సర్వేషాం యోగిన్యేకాదశీ
22 **మాసశివరాత్రిః**
27 భౌమచతుర్థీ
28 స్కన్దపంచమీ
29 కుమారషష్ఠి

**జూలై 2017**

04 **సర్వేషాం శయనైకాదశీ** చాతుర్మాస్యా వ్రతారంభః
05 వాసుదేవ, వామన 12లు
09 **మహాషాఢీ, గురుపూర్ణిమా యతి చాతుర్మాస్యారంభః** బోధయన నూతనోపాకర్మ
12 **సంకష్టహర చతుర్థీ**
16 **కర్కాటక సంక్రమణం (దక్షిణాయన పుణ్యకాలము)** భానుసప్తమి
19 స్మార్త కామికైకాదశీ
20 మాధ్వవైష్ణవానాం ఏకాదశ్యువాసః
21 **మాసశివరాత్రిః**
25 **మంగళగౌరీ వ్రతారంభః**
26 నాగ చతుర్థీ, దూర్వా గణపతి వ్రతం, మధుశ్రవా వ్రతం, స్వర్ణ గౌరీ వ్రతం
27 నాగ గరుడ పంచమ్యౌ కాణ్వ మాధ్యందినాది కాత్యాయనానాం నూతనోపాకర్మ
28 **బహ్వృచానాం నూతనోపాకర్మ**
30 భానుసప్తమి

**ఆగస్టు 2017**

03 సర్వేషాం పుత్రదైకాదశీ ఏకాదశీ గురువార వ్రతం
04 **వరలక్ష్మీ వ్రతం**
05 **శని త్రయోదశీ**
07 సర్వేషాం ప్రాచీనోపాకర్మ, **రక్షాబన్ధనం, చంద్రగ్రహణం**
11 **ముఖ్య సంకష్టహర చతుర్థీ**
14 **(స్మార్త) శ్రీ కృష్ణ జన్మాష్టమీ**
15 **స్వాతంత్ర్య దినోత్సవము**
18 సర్వేషాం అజైకాదశీ
19 **శనిత్రయోదశీ**
20 **మాసశివరాత్రిః**
21 అమాసోమవార వ్రతం
23 బలరామ జయంతి
25 **వరసిద్ధి వినాయక వ్రతం సామగోపాకర్మ**
26 ఋషి పంచమీ వ్రతం
27 సూర్యషష్ఠి, పాపహరషష్ఠి
28 ఆముక్తాభరణ సప్తమీ
30 కేదారనవమి, నన్దానవమి
31 గజలక్ష్మీ వ్రతం

**సెప్టెంబరు 2017**

02 సర్వేషాం పరివర్తనైకాదశీ వామనజయంతి
03 కల్కి శక్ర ద్వాదశ్యౌ
05 **అనన్తపద్మనాభ చతుర్దశీ**
06 **ఆపస్తంబ నూతనోపాకర్మ మహాలాయపక్షారంభః**
08 **ఉండ్రాళ్ళ తద్దె**
09 **సంకష్టహరచతుర్థీ**
13 **శ్రీ కృష్ణజయన్తీ**
16 సర్వేషాం ఇన్దిరైకాదశీ కన్యా సంక్రమణం
17 ఉపేంద్ర ద్వాదశీ
18 **మాసశివ రాత్రిః**
19 **కృష్ణాంగారక చతుర్దశీ మహాలయామావాస్య**
21 **శరన్నవరాత్రారంభః**
23 స్తన్యవృద్ధిగౌరీవ్రతం
27 **పుస్తకరూప సరస్వతీ పూజా,** దేవీత్రిరాత్రవ్రతం
28 **దుర్గాష్టమీ,** ఆయుధ పూజా
29 **మహానవమీ**
30 **విజయదశమీ,** శమీ పూజా, అపరాజితాపూజా

**అక్టోబరు 2017**

01 సర్వేషాం విజయైకాదశీ తులసీవ్రతారంభః
02 గోపద్మనాభ ద్వాదశ్యౌ
05 కౌముదీ పూజ
07 **అట్లతద్ది**
08 **సంకష్టహర చతుర్థీ**
11 **గురుమౌఢ్యారంభః**
12 **శ్రీ జనార్దనానంద సరస్వతీ స్వామి జయన్తి**
15 సర్వేషాం రమైకాదశీ
16 గోవత్సద్వాదశీ
17 తులాసంక్రమణం
18 **నరకచతుర్దశీ మాసశివరాత్రిః**
19 దీపావళిః, కేదార గౌరీశ్వర వ్రతం, ధనలక్ష్మీపూజా
20 **కార్తికస్నానారంభః** బలిపాడ్యమీ, గోక్రీడనం ఆకాశదీపారంభః
21 యమద్వితీయ
23 నాగచతుర్థీ దూర్వాగణపతి వ్రతం
24 భౌమచతుర్థీ
25 నాగపంచమీ
28 గోష్ఠాష్టమీవ్రతం కార్తవీర్య జయంతి
29 **అక్షయనవమి**
31 సర్వేషాం ఉత్థానైకాదశీ భీష్మపంచకవ్రతారంభం తులసీపద్మవ్రతం

**నవంబరు 2017**

01 క్షీరాబ్ధి, చిలుకు, యోగీశ్వర ద్వాదశులు
02 **వైకుంఠచతుర్దశీ**
03 తులసీ, కార్తికవ్రతోద్యాపనం జ్వాలాతోరణం విశ్వేశ్వర ప్రతిష్ఠా దినం భార్గవ రాకా వ్రతం
04 **మహాకార్తికీ** సముద్రస్నానం
07 భౌమచతుర్థీ **సంకష్టహరచతుర్థీ**
08 **గురుమౌఢ్య త్యాగః**
14 సర్వేషాం ఉత్పన్నైకాదశీ
16 వృశ్చికసంక్రమణం **మాసశివరాత్రిః**
23 నాగ పంచమీ
24 **సుబ్రహ్మణ్య షష్ఠి**
25 మిత్రసప్తమి, నందాసప్తమి
27 కాలాష్టమీ, నన్దినీనవమీ
28 **శుక్రమౌఢ్యారంభః**
30 గాన్ధారైకాదశీ, **గీతా జయన్తి,** మోక్షదైకాదశీ, ఏకాదశీ గురువార వ్రతం

**డిశంబరు 2017**

01 మత్స్య, వాసుదేవ, రుక్మాంగద ద్వాదశులు హనుమద్వ్రతం
02 పాషాణచతుర్దశీ
03 **దత్తాత్రేయ జయన్తీ**
06 **సంకష్టహర చతుర్థీ**
10 **ప్రధాన అనఘాష్టమీ**
13 సర్వేషాం సఫలైకాదశీ
14 **శ్రీ కాంచీ పరమాచార్యాణామారాధనం**
15 ధనుస్సంక్రమణం
16 ధనుర్మాసారంభః **మాసశివరాత్రిః**
18 అమాసోమవార వ్రతం
29 **సర్వేషాం వైకుంఠైకాదశీ**
30 కూర్మద్వాదశీ, **శనిత్రయోదశీ**

**జనవరి 2018**

01 **ఆర్ద్రోత్సవః**
04 **సంకష్టహర చతుర్థీ**
06 శ్రీత్యాగరాజస్వామ్యారాధన
07 భానుసప్తమీ
12 సర్వేషాం షట్తిలైకాదశీ
13 **భోగి,** తిలద్వాదశీ
14 **మకరసంక్రాంతి ఉత్తరాయణ పుణ్యకాలం**
15 కనుమ, **మాసశివరాత్రిః**
16 సావిత్రీగౌరీ వ్రతారంభః
18 మాఘస్నానారంభః
22 **శ్రీపంచమీ**
24 **రథసప్తమి**
25 భీష్మాష్టమి
26 **గణతంత్ర దినోత్సవము**
27 (స్మార్త) భీష్మ, భీమ, జయైకాదశులు భీష్మపంచక వ్రతారంభః
28 (స్మార్త) భీష్మ, ప్రహ్లాద, వరాహ, తిల ద్వాదశులు
31 **మహామాఘీ,** సముద్రస్నానం **చంద్రగ్రహణం**

**ఫిబ్రవరి 2018**

03 **సంకష్టహర చతుర్థీ**
11 సర్వేషాం విజయైకాదశీ
12 కుంభసంక్రమణం
14 **మహాశివరాత్రిః**
19 **శుక్రమౌఢ్య త్యాగః**
26 సర్వేషామమలైకాదశీ
27 నరసింహద్వాదశీ
28 కామదహనం

**మార్చి 2018**

01 **హోళికోత్సవః**
05 **సంకష్టహరచతుర్థీ**
13 సర్వే.పాపవిమోచిన్యేకాదశీ
14 మీనసంక్రమణం
15 **మాసశివరాత్రిః**
18 **స్వస్తి శ్రీ విలంబ నామ సంవత్సరాదిః**

# వైష్ణవ తిరునక్షత్రములు

## మీన మాసము

| | | |
|---|---|---|
| రేవతి | పెరియ పెరుమాళ్ | 29-03-17 |
| రోహిణి | నెంబెరుమాళ్ | 01-04-17 |
| పుష్యమి | సెల్వపిళ్ళై | 05-04-17 |
| ఉ.ఫల్గుని | శ్రీరంగ నాచ్చియార్ | 09-04-17 |
| ఉ.ఫల్గుని | నంజీయర్ | 09-04-17 |
| హస్త | తిరునారాయణ పెరుమాళ్ | 10-04-17 |
| హస్త | తిరువ రంగత్త ముధనార్ | 10-04-17 |

## మేష మాసము

| | | |
|---|---|---|
| రేవతి | పెరియ పెరుమాళ్ | 25-04-17 |
| అశ్విని | వటుకనంబి | 26-04-17 |
| కృత్తిక | ఉయ్యక్కొండార్ | 28-04-17 |
| ఆర్ద్ర | ఎంబెరు మానార్ | 30-04-17 |
| పునర్వసు | చక్రవర్తి తిరుమానార్ | 01-05-17 |
| పునర్వసు | ముదలియాండాన్ | 01-05-17 |
| హస్త | తేవప్పెరుమాళ్ | 08-05-17 |
| హస్త | కిడాంబియాచార్ | 08-05-17 |
| చిత్ర | మధురకవి యాళ్వార్ | 09-05-17 |
| చిత్ర | ఆనందాళ్వార్ | 09-05-17 |
| స్వాతి | పెరియనంబి | 10-05-17 |

## వృషభ మాసము

| | | |
|---|---|---|
| రోహిణి | తిరుక్కోటి యార్నంబి | 26-05-17 |
| హస్త | దేవిప్పెరుమాళ్ | 04-06-17 |
| స్వాతి | హాళయంగర్ | 05-06-17 |
| స్వాతి | పెరియతిరుమలై నంబి | 05-06-17 |
| విశాఖ | నమ్మాళ్వార్ | 07-06-17 |
| విశాఖ | పిళ్ళై తిరుమలై నంబి | 07-06-17 |
| విశాఖ | తిరువాయ్ మెళి పిళ్ళై | 07-06-17 |
| అనూరాధ | పరాశరభట్టర్ | 08-06-17 |
| అనూరాధ | శ్రీరామ పిళ్ళై | 08-06-17 |
| అనూరాధ | కొయిల్ కందాడై అణ్ణన్ | 08-06-17 |
| జ్యేష్ఠ | తిరువరంగ పెరుమాళ్ | 09-06-17 |

## మిథున మాసము

| | | |
|---|---|---|
| ఆశ్రేష | మారనేర నంబి | 27-06-17 |
| స్వాతి | పెరియాళ్వార్ | 03-07-17 |
| స్వాతి | నడక్కుత్తిరువీధి పిళ్ళై | 03-07-17 |
| స్వాతి | తిరువరంగ పెరుమానార్ | 03-07-17 |
| అనూరాధ | నాథమునిగళ్ | 05-07-17 |
| మూల | తిరుయాళ్వార్ | 08-07-17 |
| మూల | కందాడై కోషప్ప | 08-07-17 |

## కర్కాటక మాసము

| | | |
|---|---|---|
| పుష్యమి | ప్రతివాది భయంకరం అణ్ణన్ | 24-07-17 |
| పూ.ఫల్గుని | చూడి కుడుత్త నాంచార్ | 26-07-17 |
| పూ.ఫల్గుని | శ్రీయాండాళ్ | 26-07-17 |
| పూ.ఫల్గుని | కందాడై శోషప్ప | 26-07-17 |
| పూ.ఫల్గుని | యదుగిరి నాచ్చియార్ | 26-07-17 |
| హస్త | బదరీనారాయణ పెరుమానార్ | 28-07-17 |
| ఉత్తరాషాఢ | ఆళవందార్ | 06-08-17 |
| ఉత్తరాషాఢ | పుండరీకాక్ష | 06-08-17 |
| శ్రవణం | తీర్కాళ్వార్ | 07-08-17 |

## సింహ మాసము

| | | |
|---|---|---|
| మృగశిర | పరవస్తు భట్టర్ పిరాన్ | 17-08-17 |
| మృగశిర | తిరుక్కురుగైప్పిరాచ్ పిళ్ళన్ | 17-08-17 |
| రోహిణి | శ్రీ కణ్ణ పిరాన్ | 12-09-17 |
| రోహిణి | పెరియనాచ్చారి ప్పిళ్ళై | 12-09-17 |
| రోహిణి | నాయనారచ్చం పిళ్ళై | 12-09-17 |

## కన్యా మాసము

| | | |
|---|---|---|
| విశాఖ | తిరుమలై నంబి | 24-09-17 |
| శ్రవణం | వేదాంత దేశికర్ | 01-10-17 |
| శ్రవణం | తిరువేంగడత్తాన్ | 01-10-17 |

## తులా మాసము

| | | |
|---|---|---|
| మూల | మణవాళ మహాముని | 25-10-17 |
| మూల | పెరియ జీయర్ | 25-10-17 |
| పూర్వాషాఢ | గురువ ఇప్పిరాన్ | 26-10-17 |
| పూర్వాషాఢ | శేనై ముదలియార్ | 26-10-17 |
| ఉత్తరాషాఢ | వేలాంజీ వైయప్పర్ | 27-10-17 |
| శ్రవణం | పొయిఘ యాళ్వార్ | 28-10-17 |
| శ్రవణం | పిళ్ళై లోకాచార్య | 28-10-17 |
| ధనిష్ఠ | పూధత్తాళ్వార్ | 29-10-17 |
| ధనిష్ఠ | తిరుమలైయాండార్ | 29-10-17 |
| ధనిష్ఠ | నడువిల్ తిరువీధి పిళ్ళై భట్టర్ | 29-10-17 |
| శతభిషం | పేరియాళ్వార్ | 30-10-17 |
| శతభిషం | పిన్బంగియ పెరుమాళ్ జీయర్ | 30-10-17 |
| ఉత్తరాభాద్ర | విళాంజోలై పిళ్ళై | 01-11-17 |
| రేవతి | ఎఱ్ఱుమ్బి అప్పా | 02-11-17 |
| కృత్తిక | కూపకులోత్తమ దాసర్ | 05-11-17 |
| ఆర్ద్ర | కూర కులోత్తమ దాసర్ | 08-11-17 |

## వృశ్చిక మాసము

| | | |
|---|---|---|
| అనూరాధ | కోటికన్యాదానం తాతాచార్యర్ | 19-11-17 |
| భరణి | ఈయుణ్ణి మాధవప్పెరుమాళ్ | 02-12-17 |
| భరణి | ఆరుళాళప్పెరుమాళెంబెరుమానార్ | 02-12-17 |
| కృత్తిక | తిరుమంగ యాళ్వార్ | 03-12-17 |
| కృత్తిక | నంబిళ్ళై | 03-12-17 |
| రోహిణి | తిరుప్పాణి యాళ్వార్ | 03-12-17 |

## ధనుర్మాసము

| | | |
|---|---|---|
| అనూరాధ | నాలూచాన్ | 16-12-17 |
| జ్యేష్ఠ | నాలూరాచ్చాన్ పిళ్ళై | 17-12-17 |
| జ్యేష్ఠ | తొండర డిప్పొడి | 17-12-17 |
| జ్యేష్ఠ | పెరియనంబి | 17-12-17 |
| జ్యేష్ఠ | అళగియ మణవాళప్పెరుమాళ్ | 17-12-17 |
| పునర్వసు | తిరుమలై యాండార్ | 03-01-18 |

## మకర మాసము

| | | |
|---|---|---|
| పూర్వాభాద్ర | నాలూరాచ్చాన్ పిళ్ళై | 21-01-18 |
| పూర్వాభాద్ర | శొట్టైనంబి | 21-01-18 |
| మృగశిర | కోవులూన్ ఎంబర్‌మానార్ | 28-01-18 |
| పునర్వసు | ఎంబార్ | 30-01-18 |
| మఘ | తిరుమడి శైయ్యాళ్వార్ | 02-02-18 |
| హస్త | కూరత్తాళ్వార్ | 05-02-18 |
| విశాఖ | గురు కావలప్పన్ | 08-02-18 |

## కుంభ మాసము

| | | |
|---|---|---|
| అశ్విని | శిరియ గోవింద ప్పెరుమాళ్ | 21-02-18 |
| రోహిణి | నంబెరుమాళ్ | 24-02-18 |
| మృగశిర | తిరుక్కచ్చి నంబి | 25-02-18 |
| పునర్వసు | కులశేఖరాళ్వార్ | 26-02-18 |
| పునర్వసు | తిరుమలైయాండాల్ | 26-02-18 |
| ఆశ్రేష | పిళ్ళై యురంగావిల్లి దాసర్ | 28-02-18 |
| ఆశ్రేష | తిరుమలై యాండాళ్ | 28-02-18 |
| మఘ | మరణం గాల్నంబి | 01-03-18 |
| మఘ | మణక్కాల్ నంబి | 01-03-18 |

**-: గమనిక :-**

కొన్ని తిరు నక్షత్రములు మతాంతరములను బట్టి మరల ఇవ్వబడినాయి.

## మాధ్వ పుణ్యదినములు

| | | |
|---|---|---|
| శ్రీ వేదవ్యాస తీర్థ | చైత్ర శుక్ల ద్వితీయ | 29-03-17 |
| సత్య ప్రజ్ఞ తీర్థ | చైత్ర శుక్ల ద్వితీయ | 29-03-17 |
| సత్య ధ్యాన తీర్థ | చైత్ర శుక్ల అష్టమి | 04-04-17 |
| కవీన్ద్ర ముని | చైత్ర శుక్ల నవమి | 05-04-17 |
| సత్యప్రియ ముని | చైత్ర శుక్ల త్రయోదశి | 09-04-17 |
| వాగీశ తీర్థ | చైత్ర కృష్ణ తృతీయ | 14-04-17 |
| సత్య విజయ తీర్థ | చైత్ర కృష్ణ దశమి | 21-04-17 |
| సత్య విజయ ముని | చైత్ర కృష్ణ ఏకాదశి | 22-04-17 |
| సత్య విజయ తీర్థ | చైత్ర కృష్ణ త్రయోదశి | 24-04-17 |
| సత్యానన్ద తీర్థ | వైశాఖ శుక్ల ప్రతిపత్ | 27-04-17 |
| విద్యాధిరాజ తీర్థ | వైశాఖ శుక్ల తృతీయ | 29-04-17 |
| రామచన్ద్ర ముని | వైశాఖ శుక్ల షష్ఠి | 01-05-17 |
| సత్యసన్ధ ముని | జ్యేష్ఠ శుక్ల ద్వితీయ | 27-05-17 |
| సత్యాభినవ తీర్థ | జ్యేష్ఠ శుక్ల చతుర్దశి | 08-06-17 |
| పాదరాజ తీర్థ | జ్యేష్ఠ శుక్ల పూర్ణిమ | 09-06-17 |
| కృష్ణద్వైపాయన | జ్యేష్ఠ కృష్ణ ప్రతిపత్ | 10-06-17 |
| సత్యపూర్ణ ముని | జ్యేష్ఠ కృష్ణ ద్వితీయ | 11-06-17 |
| రఘువర తీర్థ | జ్యేష్ఠ కృష్ణ తృతీయ | 12-06-17 |
| సత్యధీర | జ్యేష్ఠ కృష్ణ నవమి | 18-06-17 |
| విద్యాపతి | జ్యేష్ఠ కృష్ణ ఏకాదశి | 20-06-17 |
| విజయీంద్ర తీర్థ | జ్యేష్ఠ కృష్ణ త్రయోదశి | 22-07-17 |
| సత్యాధిరాజ తీర్థ | ఆషాఢ శుక్ల నవమి | 02-07-17 |
| సత్యసంకల్ప తీర్థ | ఆషాఢ శుక్ల పూర్ణిమ | 09-07-17 |
| జయ తీర్థ ముని | ఆషాఢ కృష్ణ పంచమి | 14-07-17 |
| సత్యాధీశముని | ఆషాఢ కృష్ణ అమావాస్య | 23-07-17 |
| సత్యవర తీర్థ | శ్రావణ శుక్ల సప్తమి | 30-07-17 |
| రాఘవేన్ద్రముని | శ్రావణ కృష్ణ ద్వితీయ | 09-08-17 |
| సత్యధర్మ తీర్థ | శ్రావణ కృష్ణ త్రయోదశి | 19-08-17 |
| సత్యేష్టకామ | భాద్రపద శుక్ల దశమి | 01-09-17 |
| సత్యేష్ట తీర్థ | భాద్రపద శుక్ల ఏకాదశి | 02-09-17 |
| శ్రీనివాస తీర్థ | భాద్రపద కృష్ణ ద్వితీయ | 08-09-17 |
| మాధవ తీర్థ | భాద్రపద కృష్ణ అమావాస్య | 20-09-17 |
| మాధవ తీర్థ | ఆశ్వయుజ శుక్ల ప్రతిపత్ | 21-09-17 |
| సత్య పరాయణ తీర్థ | ఆశ్వయుజ శుక్ల సప్తమి | 27-09-17 |
| విష్ణు తీర్థ | ఆశ్వయుజ శుక్ల ఏకాదశి | 01-10-17 |
| సత్యప్రమోద తీర్థ | కార్తిక శుక్ల తృతీయ | 22-10-17 |
| వేదనిధి ముని | కార్తిక శుక్ల ఏకాదశి | 31-10-17 |
| విద్యానిధి | కార్తిక కృష్ణ చతుర్థి | 07-11-17 |
| పద్మనాభ తీర్థ | కార్తిక కృష్ణ చతుర్దశి | 17-11-17 |
| రఘువీర తీర్థ | మార్గశిర శుక్ల తృతీయ | 21-11-17 |
| సత్యనిధి ముని | మార్గశిర శుక్ల దశమి | 29-11-17 |
| సత్యనాథ ముని | మార్గశిర శుక్ల ఏకాదశి | 30-11-17 |
| అక్షోభ్య ముని | మార్గశిర కృష్ణ పంచమి | 07-12-17 |
| రఘునాథముని | మార్గశిర కృష్ణ ఏకాదశి | 13-12-17 |
| రఘూత్తమ ముని | పుష్య శుక్ల ఏకాదశి | 29-12-17 |
| సత్యకామ తీర్థ | పుష్య కృష్ణ షష్ఠి | 07-01-18 |
| నరహరి తీర్థ | పుష్య కృష్ణ సప్తమి | 08-01-18 |
| సత్యాభిజ్ఞ తీర్థ | పుష్య కృష్ణ అష్టమి | 09-01-18 |
| పురందర దాస తీర్థ | పుష్య కృష్ణ అష్టమి | 09-01-18 |
| విద్యాధీశముని | పుష్య కృష్ణ చతుర్దశి | 15-01-18 |
| పురందరదాస తీర్థ | పుష్య కృష్ణ అమావాస్య | 16-01-18 |
| శ్రీమదానన్ద తీర్థ | మాఘ శుక్ల నవమి | 26-01-18 |
| నంద ముని | మాఘ శుక్ల నవమి | 26-01-18 |
| సత్యజ్ఞాన తీర్థ | మాఘ శుక్ల ఏకాదశి | 28-01-18 |
| రామానంద తీర్థ | మాఘ కృష్ణ నవమి | 09-02-18 |
| సత్య బోధ తీర్థ | ఫాల్గున శుక్ల ద్వితీయ | 17-02-18 |
| వాదిరాజ తీర్థ | ఫాల్గున శుక్ల తృతీయ | 18-02-18 |
| వ్యాసరాయ తీర్థ | ఫాల్గున శుక్ల చతుర్థి | 19-02-18 |
| సత్యవ్రత మునీంద్ర | ఫాల్గున శుక్ల షష్ఠి | 21-02-18 |
| సత్యబోధ తీర్థ | ఫాల్గున కృష్ణ ద్వితీయ | 03-03-18 |
| సత్య సంతుష్ట తీర్థ | ఫాల్గున కృష్ణ అమావాస్య | 17-03-18 |

**గమనిక :-** కొన్ని పుణ్యతిథులు మతాంతరములను బట్టి మరల ఇవ్వబడినాయి.

## శ్రీ సంవత్సర దేవతా ధ్యానమ్

ఆదిత్యం తేజసాం స్థానం హేవిలమ్బ కృతాహ్వయమ్ ।
సప్త సప్తి సమారూఢం జగతాం నేత్ర మాశ్రయే ॥

## అబ్దత్రయఫలం

**చాంద్రసౌరమానాభ్యాం హేమలమ్బ సంవత్సరఫలమ్ :-** హేమలంబే నృపా స్సర్వే పరస్పర విరోధినః । ప్రజాపీడా త్వనర్ఘః స్యాత్ తథాపి సుఖినో జనాః ॥ ॥తా॥ హేమలంబ నామ సంవత్సరమున రాజుల (అధికారుల) పరస్పర విరోధ వ్యవహారములతో కొంత ఇబ్బందులు కలుగుచున్నను ధరలు ఒకింత అందుబాటులో ఉండి ప్రజలు సుఖముగనే ఉందురు.

**బార్హస్పత్యమానేన సాధారణ నామ సంవత్సర ఫలమ్ :-** సాధారణాబ్దే వృష్ట్యర్ఘచయా స్సాధారణాభృశమ్ । వివైరిణోఖిలా భూపాః ప్రజాస్సు స్వస్థచేతసః ॥ వర్షాన్తే సర్వసస్యానాం ఫలం సక్రిమిపీడనమ్ । లోకానాం ప్రీతి రన్యోన్య మబ్దే సాధారణే భవేత్ ॥తా॥ సాధారణ సంవత్సరమున వర్షములు, ధరలు కూడా సాధారణముగానే ఉండును. రాజులకు విరోధులు తగ్గుదురు. ప్రజలందరును సుఖముగాను, స్నేహముతోను మెలుగుదురు. సంవత్సరాంతమున అన్ని పంటలకు క్రిమికీటకాల పీడ కలుగును.

**గురూదయవశాత్ చైత్రాబ్ద ఫలమ్ :-** చైత్రాబ్దే భూమిపా స్స్వస్థాః క్షోణీ చాల్పఫలప్రదా । సుదుర్లభం చోత్తమాన్నం ప్రజానాం వ్యాధితో భయమ్ ॥తా॥ చైత్రాబ్దమున రాజులు ప్రశాంతముగా నుందురు. పంటలు కొంత తక్కువగా పండును. ప్రజలకు శుచికరమైన పోషకాహారము లభించుట దుర్లభమగును. అందరకు అనారోగ్య భయములు ఎక్కువ అగును.

**రాజ్ఞః కుజస్య ఫలం :-** అగ్ని తస్కర రోగాస్యు ర్నృపవిగ్రహతా భృశమ్ । హత సస్యో బహువ్యాళో భౌమే వర్షాధిపే సతి ॥తా॥ కుజుడు రాజగుట వలన నాయకులలో ఐక్యత తక్కువగా ఉంటుంది. అగ్నిభయము అధికముగా ఉంటుంది. చోరభయము, రోగభయము, సర్పభయము అధికమవుతాయి. వర్షములు తక్కువగా ఉంటాయి. పంటలు తక్కువగా ఉంటాయి. ఆహార పదార్థాల ధరలు ఎక్కువగా ఉండి సామాన్యులకు అందుబాటులో ఉండవు.

**మంత్రిణః శుక్రస్య ఫలం :-** స్త్రీ సంయోగే సదా ప్రీతిః ఫలితా ధాన్య జాతయః । భవంతి గావ స్సుదుఘా స్సువృష్టి స్సచివే భృగౌ ॥ ఉచ్ఛలితా ధ్వని రనిశం విప్రాణా మధ్వరే చరత్యఖిలమ్ । అనిమిష హృదయానన్దం కుర్వన్ సచివే సురారి గురౌ ॥తా॥ పురుషులు స్త్రీ సంయోగమునందు సదా ప్రీతి గల వారగుదురు. ధాన్య జాతులు ఫలించును. గోవులు పుష్కలముగా పాలనిచ్చును. సువృష్టి కలుగును. విప్రులు దేవతలకు ప్రీతికరముగా యజ్ఞములు చేయుట యందు నిరతులగుదురు. శలభ, మూషిక బాధ అధికముగా ఉండును. ధాన్యములు బాగా పండును. నదుల యందు, భూమియందు జలసమృద్ధి బాగుండును.

**సేనాధిపతేః బుధస్య ఫలం :-** వాతాహతా వారిధరాః కదాచిత్ వర్షంతి సస్యాని ఫలన్వితాని । నరాస్త్రియః కామరతా భవేయు స్సేనాపత్యే ఖలు సోమసూనోః ॥తా॥ బుధుడు సేనాధిపతి అయితే ఒక్కొక్కసారి గాలితో కూడిన వర్షాలు పడతాయి. పంటలు పరిపూర్ణంగా పండుతాయి. స్త్రీ, పురుషులు రతి క్రీడలందాసక్తి కల్గి ఉంటారు.

**సస్యాధిపతేః రవేః ఫలం :-** గోధుమ యవ ముఖ్యాని కుళుత్థ చణకాని చ । సమృద్ధాని భవిష్యంతి రవౌ సస్యాధినాయకే ॥తా॥ రవి సస్యాధిపతి అయితే గోధుమలు, యవలు, ఉలవలు, సెనగలు మొదలైన ధాన్యాలు సమృద్ధిగా పండుతాయి.

**ధాన్యాధిపతేః శనేః ఫలం :-** కృష్ణ ధాన్యాని సర్వాణి సూక్ష్మ ధాన్యాని యాని చ । కృష్ణ భూమి స్సుఫలితా ధాన్యాధీశే శనైశ్చరే ॥తా॥ మినుములు, నువ్వులు మొదలగు నల్ల ధాన్యములన్నియు, చిఱు ధాన్యములు, నల్ల భూమియు చక్కగ ఫలించును.

**అర్ఘాధిపతేః గురోః ఫలం :-** సువృష్టిభి ర్ధాన్య ధనై ర్విరాజితా భూమి ర్మహాయజ్ఞపరై ర్మహీసురైః । నిత్యోత్సవై ర్మంగళ తూర్య నిస్వనై రర్ఘాధిపే దేవగురౌ చ శశ్వత్ ॥తా॥ అర్ఘాధిపతి గురువు అగుట వలన భూమి యందు మంచి వర్షములు కురియును. పంటలు చక్కగ పండును. వస్తుసౌలభ్యములు పెరుగును. బ్రాహ్మణులు యజ్ఞములందు ఆసక్తులై ఉందురు. నిత్యము మంగళప్రదములగు ఉత్సవములతో అంతటా శుభముగా ఉండును.

**మేఘాధిపతేః గురోః ఫలం :-** సస్యార్ఘ వృష్టిభి స్తుష్టా భవే ద్ధాత్రీ నిరంతరమ్ । వీతరోగభయా స్సర్వే మేఘాధీశే బృహస్పతౌ ॥తా॥ భూమి సస్యములచే, వస్తు సౌలభ్యముచే చక్కటి వర్షములచే తుష్టిగ, పుష్టిగ నుండును. ప్రజలకు, పశువులకు రోగభయము ఉండదు.

**రసాధిపతేః కుజస్య ఫలం :-** జీరక లవణం సర్పి స్తిల తైల గుడాదయః । శూన్యార్ఘం యాంతి తే సర్వే భౌమే యది రసాధిపే ॥తా॥ కుజుడు రసాధిపతి అయితే జీలకఱ్ఱ, ఉప్పు, నేయి, నూనె, బెల్లం మొదలైన రస వస్తువుల ధరలు బాగా తగ్గును.

**నీరసాధిపతేః రవేః ఫలం :-** మణి రత్న గంధ నివహా తామ్ర స్వర్ణాది ధాత్వనర్ఘతా సతతమ్ । దివస్పతే నీరసపే రాష్ట్ర క్షోభశ్చ జనవినాశ స్స్యాత్ ॥తా॥ రవి నీరసాధిపతి అయితే మణులు, రత్నములు, సుగంధములు, వాహనములు, రాగి, స్వర్ణము మొదలైన ధాతువులుకు ధరలు బాగా తగ్గును. రాష్ట్రంలోను, ప్రజలకు క్షోభలు పెరుగును. అనారోగ్యములు పెరుగును.

**పురోహితాదిఫలం:-** క్రూర గ్రహ ఫలం క్రూరం శుభ గ్రహ ఫలం శుభం । పురోహితాది సర్వేషాం భవేదీశ సముద్భవమ్ ॥తా॥ పురోహితాదులు క్రూర గ్రహములయిన క్రూరఫలమును, శుభ గ్రహములయిన శుభఫలము నిత్తురు.

**పశుపాలకస్య యమస్య ఫలం :-** అనర్ఘ మల్పవృష్టిశ్చ స్వల్పక్షీరం తథా తృణం । పశుపీడా భవేన్నిత్యం యమశ్చేత్పశునాయకే ॥తా॥ యముడు పశు నాయకుడు అగుట వలన ధరలు తగ్గును. వర్షములు తక్కువగా కురియును. పశునాశము ఎక్కువ అగును. గడ్డి, పాల ఉత్పత్తి తగ్గును.

**గోష్ఠ ప్రాపకస్య బలరామస్య ఫలం :-** సువృష్టి స్సర్వసస్యానాం సర్వసస్య సమృద్ధయః । మధ్యదేశే మహద్వర్షం రామే తు పశునాయకే ॥తా॥ బలరాముడు గోవులను దొడ్డిపెట్టువాడు అగుట వలన ఆనుకూల్యములైన వర్షములతో అన్ని పంటలు సమృద్ధిగా పండును. మధ్యదేశమున ఎక్కువ వర్షములు కురియును.

**గోష్ఠ బహిష్కర్తుః శ్రీకృష్ణస్య ఫలం :-** పశువృద్ధి స్సుభిక్షం చ బహు సస్యార్ఘ సంపదః । సంపూర్ణ తృణ వృద్ధిశ్చ గోపాలే పశునాయకే ॥తా॥ శ్రీకృష్ణుడు పశువులను దొడ్డినుండి విడిపించువాడగుట వలన పశువులు సుభిక్షముగా

ఉండును. తృణాదుల సమృద్ధి బాగా ఉండును. పాలు సమృద్ధిగా లభించును. ధరలు సరసముగా ఉండును.

**ఆఢకాది నిర్ణయః, ఫలం చ :-** అస్మిన్వర్షే ద్వ్యాఢక పరిమితం వర్షం. "మధ్యవృష్టి ర్ద్విరాఢకే" 2 కుంచముల వర్షము. "షష్ఠి యోజన విస్తీర్ణం శతయోజన మున్నతమ్ । ఆఢకస్య ప్రమాణం తు దేవమానేన గణ్యతే ॥ దశభాగా స్సముద్రేషు భూధరేషు చ సప్త చ । ద్వౌ భాగౌ భువి పర్జన్య శ్చైవం వర్షతి చ త్రిధా" సముద్రములలో 10, పర్వతములపై 7, భూమిపై 2 భాగములు వర్షించును.

**మేఘాది నిర్ణయః ఫలం :-** ఈ వత్సరమున దక్షిణ దిశలో **కాలః** అను మేఘము కలుగును. "మధ్యదేశే సువృష్టిశ్చ సర్వసస్యాభివర్ధనమ్ । శుభాభివృద్ధి ర్లోకానాం కాలాభ్రే తు ఫలం స్మృతమ్" మధ్యదేశమంతటా వర్షములు ఎక్కువగా ఉంటాయి. పంటలు బాగా ఫలిస్తాయి. అంతటా శుభాభివృద్ధి ఉంటుంది. చతుర్మేఘపక్షములో **పుష్కరః** అను మేఘము. "మధ్యవృష్టి ర్మంద సస్యం మహావాయు ప్రపీడనమ్ । పుష్కరాహ్వాయ మేఘేస్మిన్ సర్వమూల వినాశనమ్" పుష్కరుడు మేఘుడగుట వలన వర్షములు తక్కువగా కురియును. పంటలు కూడా సామాన్యముగా పండును. **వివహ** నామకో వాయుః. "వివహే వృష్టినాశనమ్" వివహుడు వాయువగుటచే వర్షములు తక్కువ. **చంచలా** నామ్నీ విద్యుత్. "చంచలా తు సుభిక్షకృత్" చంచల అను మెఱుపు వలన సుభిక్షముగా నుండును. **నిర్ఘోష** నామకం గర్జితం. "నిర్ఘోషే చాల్పవృష్టిః స్యాత్" వర్షములు తక్కువగా కురియును. **క్షార** నామక స్సముద్రః. "క్షారో వాయు స్సమాయుక్తః" వాయువులతో కూడిన మంచి వర్షములుండును. **శంఖక** నామక శ్శేషః భూమిం వహతి, "శంఖకాఖ్యే భూమివహే సుఖం భవతి భూతలే" శంఖకుడు భూభారము వహించుచున్నందున ప్రజలందరు సమస్త సుఖములతో సంతోషముగా జీవించుదురు.

### రవిచార ఫలం

వత్సరాది నుండి ఏప్రిల్ 13 వరకు "సర్వధాన్య మహర్ఘతా । లవణం తిల తైలాని మహర్ఘత్వం ప్రయాన్తి వై" అన్ని ధాన్యములకు, ఉప్పు, నువ్వులు, నూనె, మొదలగు వాటికి ధర పెరుగును. ఏప్రిల్ 14 నుండి మే 14 వరకు "ఫలాని తూలకం తథా । ఇక్ష్వాది తిల తైలం చ మహర్ఘత్వం ప్రయాన్తి వై" పండ్లు, ప్రత్తి, చెఱుకు, నువ్వుల నూనె మొదలగునవి ధర పెరుగును. మే 15 నుండి జూన్ 14 వరకు "సర్వధాన్య మహర్ఘతా" అన్ని ధాన్యములకు వెల హెచ్చును. జూన్ 15 నుండి జూలై 16 వరకు "కర్పాసం కంద మూలం చ తిలాశ్చ వసుధా తలే । సర్వధాన్యం మహర్ఘత్వం" ప్రత్తి, దుంపలు, నువ్వులు అన్ని ధాన్యములకు ధరలు పెరుగును. జూలై 17 నుండి ఆగస్టు 16 వరకు "ఆశ్రేషాయాం తత్ర వర్షతి । ధాన్యాని తు మహర్ఘాణి లోకే చోర భయం తథా" ఆశ్రేష కార్తెలో వర్షములు కురియును. ధాన్యములకు విలువ పెరుగును. దొంగల బాధ మెండుగ ఉండును. ఆగస్టు 17 నుండి సెప్టెంబరు 16 వరకు "ఇక్ష్వాది ర్మిష్ట శర్కరా । రక్తాని సర్వధాన్యాని తిలా స్తైలం మహర్ఘతా" చెరకు, పంచదార, అన్ని ధాన్యములు, నూనెలు మొదలగునవి ధరలు పెరుగును. సెప్టెంబరు 17 నుండి అక్టోబరు 17 వరకు "మంజిష్ఠాది మహర్ఘతా । నారికేళం తిలాస్తైలం సర్వసస్య మహర్ఘతా" బంగారము, పసుపు, కొబ్బరి, నువ్వులనూనె, సమస్త ధాన్యములకు ధర హెచ్చును. అక్టోబరు 18 నుండి నవంబరు 16 వరకు "మహార్ఘతా సర్వధాన్యానాం హేమ ద్రవ్యాణామ్ కుంజరాణాం వినాశనమ్" అన్ని ధాన్యములకు, బంగారు వస్తువులకు ధర పెరుగును. ఏనుగులు నశించును. నవంబరు 17 నుండి డిశెంబరు 15 వరకు "తదాన్నస్య మహార్ఘతా । సర్వ ద్రవ్యాణి స్వల్పార్ఘత్వం ప్రయాన్తి వై" అన్నమునకు వెల హెచ్చును. ఇతర సర్వపదార్థములకు ధర తగ్గును. డిశెంబరు 16 నుండి జనవరి 14 వరకు "తృణ కాష్ఠం చతుష్పదం మహార్ఘం జాయతే సర్వం" గడ్డి, కొయ్య, పశువులు మొదలగు వాటికి ధర హెచ్చును. జనవరి15 నుండి ఫిబ్రవరి 12 వరకు "ఘృత తైల మహార్ఘతా । సుభిక్షం సర్వ ధాన్యానాం లోకానాం దుఃఖ పీడనమ్" నెయ్యి, నూనెలకు ధర పెరుగును. ధాన్యము సమృద్ధిగా నుండును. కానీ ప్రజలు సంతోషముగా ఉండలేరు. ఫిబ్రవరి 13 నుండి మార్చి 14 వరకు "సమృద్ధి స్తత్ర జాయతే । లవణం తిలతైలాని స్వల్పార్ఘత్వం ప్రయాన్తి వై" సర్వపదార్థములు సమృద్ధముగా నుండును. ఉప్పు, నువ్వులు, నూనెలు మొదలైనవి ధరలు తగ్గును. మార్చి 15 నుంచి వత్సరపర్యన్తం "సర్వధాన్య మహార్ఘతా । లవణం తిలతైలాని మహార్ఘత్వం ప్రయాన్తి వై" అన్ని ధాన్యములకు, ఉప్పు, నువ్వులు, నూనెలు మొదలగునవి ధర పెరుగును.

### ఆర్ద్రా నక్షత్ర ప్రవేశ రవి ఫలమ్

**వారఫలం:** అధికధరలు, **తిథిఫలం:** జలసమృద్ధి, **నక్షత్రఫలం:** సువృష్టి, **యోగఫలం :** సుభిక్షము, **కరణఫలం:** దుర్భిక్షము, **లగ్నఫలం:** మంచి వర్షములు, **కాలఫలం:** సస్యాభివృద్ధి, **మండలఫలం:** సస్యవృద్ధి, **గ్రహస్థితి ఫలం:** సామాన్య వర్షములు.

### మకర సంక్రాంతి పురుష ఫలమ్



**అష్టకర్ణో విశాలాక్షో లమ్బభ్రూ దీర్ఘనాసికః ।**
**అష్టబాహు శ్చతుర్వక్త్రః సంక్రాన్తేః పురుషాకృతిః ॥**
**శత యోజన మౌన్నత్యం విస్తారో ద్వాదశ స్మృతః ।**
**ఏవం రూపం తు విజ్ఞేయం సంక్రాన్తేః పురుషస్య హి ॥**

ఈ సంక్రాంతి పురుషనకు **ఘోరః** అను పేరు. ఈ సంక్రాంతి పురుషుడు అగరు నీటిచే స్నానము చేసి, కంబళి వస్త్రములను ధరించి, వసా గంధమును పూసుకొని, నల్ల కలువ పుష్పమును మరియు పడడముతో కూడిన ఆభరణములను ధరించినవాడై సత్తుపాత్రలో అన్నమును భుజించి, పెరుగును సేవించి తాటి పండ్లను ఫలహారము చేసి, **దున్నపోతు వాహనము**ను ఎక్కి తోమరమును మరియు నెమలి కన్నులు గల గొడుగును ధరించి వాయవ్య దిక్కుగా ప్రయాణము చేయుచూ లోలా ముఖముతో కూడినవాడై కూర్చుని యుండును. సంక్రాంతిపురుషుని ఈ రకమైన స్థితి వలన శూద్రులకు కీడు కలుగును. ముఖ్యముగా వాయవ్య దిశలోని దేశాల వారికి అశుభములు పెరుగును. పండ్ల తోటలకు నాశనము కలుగును. దుష్టులు నశించును. ఆధ్యాత్మిక సాధకులకు మాత్రము కొన్ని ఇబ్బందులు తలెత్తును. మిగితా వారికి అశుభకరముగాను, అనారోగ్యములు, తేజోనాశనము, ఆకలిబాధలు, పుష్టి లోపించుట, యుద్ధభయములు ఎక్కువ అగుచున్ననూ మొత్తము మీద కొంత వరకు శుభము, సువృష్టి, ఆయుర్వృద్ధి, ధరలు అందుబాటులో ఉండుట సుఖముగానే ఉందురు.

**పక్షఫలమ్:–** శ్లో॥ కృష్ణపక్షే యదా పౌషే మకరస్థే దివాకరే । సుభిక్షం క్షేమ మారోగ్యం జంతూనా మశుభప్రదమ్ ॥ పుష్య కృష్ణమున మకర సంక్రాంతి అగుట వలన దేశము సుభిక్షముగాను, క్షేమముగాను, ఆరోగ్యముగాను ఉండును. జంతువులకు నాశనము కలుగును. **తిథిఫలం :** సుభిక్షము, **వారఫలం :** దుర్భిక్షము, **నక్షత్రఫలం :** అధిరవర్షములు, **లగ్నఫలం :** గోవులు అధికముగా పాలనిచ్చును, **కాలఫలం :** శుభప్రదము.

సంక్రాంతి పురుషోత్పత్తికాలే దానం స్వశక్తితః ।
ఫలం కాంస్యాది ధాన్యాని దీయతే దోషనాశనమ్ ॥
ఫలాని మూలాన్యజినం సువర్ణం గ్రామాంశుకాద్యం సతిలేక్షు గావః ।
ధాన్యం ఖరాంశో ర్మకర ప్రవేశ ఏతాని దానాని విశేషితాని ॥

### చంద్రచారః

**జ్యేష్ఠ శుక్ల ప్రతిపత్ భృగువార ఫలం :** శ్లో॥ ప్రజారోగ్యం సుభిక్షం చ క్షేమం సస్యవివర్ధనమ్ । సువృష్టి స్సర్వదేశేషు జ్యైష్ఠ్యాది ర్భృగువాసరే ॥ అందరకు మంచి ఆరోగ్యము, సుభిక్షము, క్షేమము కలుగును. మంచిపంటలు పండును. మంచి వర్షములు కురియును.

**ఆషాఢ శుక్ల పంచమీ యుక్త సౌమ్యవారఫలం :–** ఆషాఢసిత పంచమ్యాం సౌమ్యవారో యదా భవేత్ । సుభిక్షం దేహమారోగ్యం జాయతే వృద్ధి రుత్తమమ్ ॥ అంతటా సుభిక్షము, ఆరోగ్యము వృద్ధిచెందును.

**ఆషాఢ శుక్లపక్షే స్వాతీ నక్షత్రయుక్త తిథిఫలం :–** ఆషాఢే శుక్ల పక్షే తు దశమీ యది సంయుతా । స్వాతీయుక్తేన చంద్రేణ మహావర్షం భవేద్ధ్రువమ్ ॥ వర్షములు బాగుగా కురియును.

**ఆషాఢ కృష్ణపక్షే రోహిణీ నక్షత్రయుక్త తిథిఫలం:–** ఆషాఢే కృష్ణ పక్షే తు రోహిణీ ద్వాదశీ యుతా । మేదిన్యాం సర్వకాలేషు సర్వసస్య వినాశనమ్ ॥ అన్ని కాలములలోను పాడిపంటలు బాగా దెబ్బతినును.

**చంద్రార్ఘ్యః :–** చైత్ర, వైశాఖ, ఆశ్వయుజ, పుష్య, మాఘ, ఫాల్గున మాసము లందు సమార్ఘము. ఆషాఢ, భాద్రపద మాసములందు అత్యర్ఘము. జ్యేష్ఠ, శ్రావణ, కార్తిక, మార్గశిర మాసములందు శూన్యార్ఘము.

### కుజచార ఫలమ్

వత్సరాది నుండి ఏప్రిల్ 7 వరకు "ద్విజపీడా । నాశస్స్యాదతి శీఘ్రతా" బ్రాహ్మణులకు పీడ కలుగును. ఏప్రిల్ 8 నుండి 27 వరకు "సర్వదేశే గ్రామపీడా ధాన్యానాం చ మహర్ఘతా" అన్ని దేశాలలోను గ్రామపీడ ఎక్కువ అగును. ధాన్యమునకు వెలలు పెరుగును. ఏప్రిల్ 28 నుండి మే 16 వరకు "వృక్ష పీడా శ్వావదానాం రోగస్స్యాత్ । మహర్ఘతాపి కార్పాసే వస్త్రే సూత్రే విశేషతః" వృక్షములు నశించును. పులులకు రోగములు కలుగును. ప్రత్తికి ధరలు పెరుగును. వస్త్రములకు, ధారములకు వెలలు పెరుగును. మే 17 నుండి జూన్ 5 వరకు "కార్పాస నాశః ప్రబలం సుభిక్షం । భూర్జుల పూరితేన" ప్రత్తికి నాశనము కలుగును. భూమి అంతా వర్షములతో సుభిక్షముగా ఉండును. జూన్ 6 నుండి 25 వరకు "వృష్టిశ్చ" వర్షములు బాగా కురియును. జూన్ 26 నుండి జూలై 16 వరకు "తిలానాం నాశో వినాశో మహిషీ కులస్య" నూవులకు, గేదెలకు నాశనము కలుగును. జూలై 17 నుండి ఆగష్టు 5 వరకు "చోరభయం విరోధాత్ శుభం న కించి నృప నిర్బలత్వం" దొంగల భయము, విరోధములు ఎక్కువగా పెరుగును. శుభములు తక్కువ. రాజులకు అధికారములు తగ్గును. ఆగష్టు 6 నుండి 26 వరకు "అల్పవృష్టి ర్బహుధాన్య నాశో దుర్భిక్ష మేవోరగదంశ భీతిః" ధాన్యనాశనము అధికముగా ఉండును. దుర్భిక్షము కలుగును. పాముకాటుల భయములు పెరుగును. ఆగష్టు 27 నుండి సెప్టెంబరు 16 వరకు "వృష్టి స్తిల మాష ముద్గ వినాశనం । దుర్లభతా చాన్యధాన్యే" నువ్వులకు, మినుములకు వృద్ధి ఉండదు. ఇతర ధాన్యములు కూడా అరుదుగా లభించును. సెప్టెంబరు 17 నుండి అక్టోబరు 7 వరకు "అల్పవృష్టిః ప్రజాసు పీడా గురుతైలమూల్యం" వృష్టి స్వల్పముగా ఉంటుంది. ప్రజలకు పీడ ఎక్కువగా ఉంటుంది. అగరు నూనెలకు ధరలు పెరుగును. అక్టోబరు 8 నుండి 28 వరకు "జలవృష్టి ర్నిరోధా చతుష్పదే పీడన మశ్వ మూల్యం" జలవృష్టి కలుగదు. పశువులకు నష్టములు ఎక్కువ కలుగును. అక్టోబరు 29 నుండి నవంబరు 19 వరకు "అల్పాంబుజ తుచ్ఛధాన్యం ఘృతం గుడో వా లవణం మహార్ఘం" తుచ్ఛధాన్యముకు, నేతికి, బెల్లము, ఉప్పు మొదలగు వానికి వెలలు అధికమగును. నవంబరు 20 నుండి డిశంబరు 10 వరకు "తీవ్ర రుజోతిపీడా శాలీష్ట గోధూమ మహార్ఘతాపి" తీవ్రమగు రోగములవలన నధికపీడ కలుగును. వరికి, గోధుమలకు వెలలుండును. డిశంబరు 11 నుండి 31 వరకు "అనావృష్టి రథద్విదైవే కార్పాస గోధూమ మహార్ఘభావః" అనావృష్టి, దూదికి, గోధుమలకు వెలయుండును. జనవరి 1 నుండి 22 వరకు నువ్వులకు, నూలుకు, వస్త్రములకు, దూదికి, పోకలకు వెలలు అధికమగును. జనవరి 23 నుండి ఫిబ్రవరి 12 వరకు సుభిక్షము, పశుపక్ష్యాదులకు పీడ. ఫిబ్రవరి 13 నుండి మార్చి 7 వరకు స్వల్ప వర్షము, రోగములు కలుగును. మార్చి 8 నుండి సంవత్సరాంతము వరకు ద్విజులకు, క్షత్రియులకు పీడ కలుగును. పొట్టు ధాన్యములకు వెలలు అధికమగును.

### బుధచార ఫలమ్

వత్సర ప్రభృతి జూన్ 3 వరకు "మహార్ఘం చ చతుష్పదామ్ । స్వర్ణం మహార్ఘతాం యాంతి" పశువులు, బంగారము మొదలగువాటికి ధరలు పెరుగును. జూన్ 4 నుండి జూన్ 18 వరకు "మేదినీ నవఖండేషు కలహాశ్చ మహాభయమ్" అంతటను కలహములు, భయములు కలుగును. జూన్ 19 నుండి జులై 2 వరకు "తదా వాయుం విజానీయాత్ మేఘశ్చ ప్రబలో భవేత్" పెనుగాలి, మేఘాడంబరము సంభవించును. జులై 3 నుండి జులై 20 వరకు "తతోతి మంగళం లోకే సుభిక్షం జాయతే తదా" అంతటా సుభిక్షముగాను, అత్యంత శుభకరముగాను ఉండును. జులై 21 నుండి సెప్టెంబరు 26 వరకు "ధాన్యార్ఘం చ సమం భవేత్ । సూత్రం చ దేవదారుశ్చ మహార్ఘం జాయతే తదా" నూలు, దేవదారు మొదలగు వాటికి ధరలు పెరుగును. సెప్టెంబరు 27 నుండి అక్టోబరు 13 వరకు "మేఘానా మధిక వ్యాప్తిః । వాతాధిక్యం సమీరితం" మబ్బులు అధికముగా పట్టును. గాలి వానిని చెదరగొట్టును. అక్టోబరు 14 నుండి నవంబరు 1 వరకు "మేఘస్య వర్షణం తత్ర మేదినీ కలహాన్వితా" అంతటా కలహములు అధికమగును. అధిక వర్షములు కురియును. నవంబరు 2 నుండి నవంబరు 24 వరకు

"హరిద్రాయః పశూనాం చ స్వర్ణస్య చ మహార్ఘతా" పసుపు, పశువులు, బంగారము మొదలగు వాటికి ధరలు పెరుగును. నవంబరు 25 నుండి డిశంబరు 10 వరకు ॥శ్లో॥ సుఖ దుఃఖే సమే జ్ఞేయే- సుఖ దుఃఖములు సమానములు. డిశంబరు 11 నుండి జనవరి 6 వరకు "హరిద్రాయః పశూనాం చ స్వర్ణస్య చ మహార్ఘతా" పసుపు, పశువులు, బంగారము మొదలగు వాటికి ధరలు పెరుగును. జనవరి 7 నుండి జనవరి 27 వరకు ॥శ్లో॥ సుఖ దుఃఖే సమే జ్ఞేయే- సుఖ దుఃఖములు సమానములు. జనవరి 28 నుండి ఫిబ్రవరి 14 వరకు ॥శ్లో॥ దుర్భిక్షం ప్రచురం భవేత్ । మేదినీ దుఃఖ సంయుక్తా ॥ కరవు అధికము అగును. ప్రజలు దుఃఖక్రాంతులగుదురు. ఫిబ్రవరి 15 నుండి మార్చి 2 వరకు ప్రాగ్దేశే సుభిక్షం - తూర్పు ప్రాంతాలవారికి సుభిక్షము. మార్చి 3 నుండి సంవత్సరాంతము వరకు "మారయేచ్చ హయాన్ గజాన్" గుఱ్ఱములు, ఏనుగులకు హాని.

## గురుచార ఫలం

వత్సరాది నుండి సెప్టెంబరు 11 వరకు "జీవే కన్యారాశి గతే పుష్టా స్తుష్టాః క్షితీశ్వరాః । మహోత్సుకాః క్షితిసురాః స్వస్థాస్యుః నిఖిలా జనాః " ॥ భూపాలకులు స్వస్థత చెంది తుష్టి, పుష్టి కలిగియుందురు. భూసురులు మంచి ఉత్సాహముతో ఉందురు. సమస్త ప్రజలు స్వస్థత కలిగియుందురు. తదాది వత్సరపర్యన్తం "తులాన్వితే దేవగురౌ సువృష్టి స్సంపూర్ణ సస్యాని ఫలంతి భూమౌ । యానీహ వస్తూని తులోద్ధృతాని స్యు స్తాని సర్వాణి సుదుర్లభాని"॥ వర్షములు బాగా కురియును. పంటలు సమృద్ధిగా ఫలించును. తూకముతో తూచే వస్తువుల ధరలు బాగా పెరుగును.

## శుక్రచార ఫలం

వత్సర ప్రభృతి మే 30 వరకు "మహిషీ పశుపీడా చ మేఘై ర్వృష్టి ర్భవిష్యతి" గేదెలు మొదలగు పశువులకు బాధలు కలుగును. వర్షములు కురియును. మే 31 నుండి జూన్ 29 వరకు ॥శ్లో॥ దుర్భిక్షం ప్రచురం భవేత్ । మేదినీ దుఃఖ సంయుక్తా ॥తా॥ కరవు హెచ్చును. ప్రజలు కష్టములపాలగుదురు. జూన్ 30 నుండి జులై 26 వరకు "ఘృత క్షీర మహార్ఘతా" పాలు, నెయ్యి మొదలగు వాటికి ధరలు పెరుగును. జులై 27 నుండి ఆగష్టు 20 వరకు "వాయుః" పెనుగాలి వీచును. ఆగష్టు 21 నుండి సెప్టెంబరు 14 వరకు "వృష్టిః" వర్షములు ఎక్కువగా నుండును. సెప్టెంబరు 15 నుండి అక్టోబరు 9 వరకు "హేమ రక్తం చతుష్పదం । ధాన్యానికి మహార్ఘాణి" ఎఱ్ఱని వస్తువులు, బంగారము, ధాన్యములు మొదలగు వాని ధరలు పెరుగును. అక్టోబరు 10 నుండి నవంబరు 2 వరకు ॥శ్లో॥ సర్వ సస్యం వినశ్యతి । తత్ర ధాన్యం మహార్ఘం స్యాత్ । శాలీనాం తు విశేషతః ॥తా॥ పైరులు చెడును. ధాన్యములకు ధర పెరుగును. వరి ధాన్యమునకు ఎక్కువగా ధర పెరుగును. నవంబరు 3 నుండి నవంబరు 26 వరకు "మేదిన్యాం క్షేమ మారోగ్యం క్వచిత్ క్వచిద్విరోధకృత్ ॥తా॥ దేశమంతటను క్షేమము, ఆరోగ్యము. అచ్చటచ్చట ప్రజలకు పరస్పర విరోధములు సంభవించును. నవంబరు 27 నుండి డిశంబరు 20 వరకు "సర్వధాన్య మహార్ఘతా । లోకస్తు నిర్భయ స్తత్ర సుఖం స్వస్థం ప్రవర్తతే" అన్ని ధాన్యములకు ధర పెరుగును. కాని ప్రజలు సుఖముగ నుందురు. డిశంబరు 21 నుండి జనవరి 13 వరకు "మహార్ఘం చ విజానీయాత్ సర్వసస్య వినశ్యతి" పైరులకు తెగుళ్ళు తగులును. ధరలు పెరుగును. జనవరి 14 నుండి ఫిబ్రవరి 5 వరకు ॥శ్లో॥ దుర్భిక్షం ప్రచురం భవేత్ । మేదినీ దుఃఖ సంయుక్తా ॥తా॥ కరవు హెచ్చును. ప్రజలు కష్టములపాలగుదురు. ఫిబ్రవరి 6 నుండి మార్చి 1 వరకు "సర్వధాన్య మహార్ఘతా'' ధాన్యమునకు ధరలు పెరుగును. మార్చి 2 నుండి సంవత్సరాంతము వరకు "మహిషీ పశుపీడా చ మేఘై ర్వృష్టి ర్భవిష్యతి" గేదెలు మొదలగు పశువులకు బాధలు కలుగును. వర్షములు కురియును.

## శనిచార ఫలం

వత్సరాది నుండి జూన్ 20 వరకు "ధనూరాశి స్థితే మందే భూపానా మాహవప్రదః । జనానాం వ్యాధిపీడా చ క్షుత్పీడా శస్త్రబాధతః" రాజులకు యుద్ధములు పెరుగును. అంతటా వ్యాధులు, శస్త్రచికిత్సలు, ఆకలి బాధలు పెరుగును. తదాది అక్టోబరు 26 వరకు "భూమీశాః క్రోధపూర్ణా విషధర ముదితాః పక్షిణా సన్నిపాతః సప్తద్వీపా ప్రకల్పా న్నరపతి మరణం యాంతి మేఘా వినాశమ్ । వైకల్యా ద్వ్యాప్యమానః సకల జన రిపుః సర్వకార్యం నిమంతి సర్వే తే యాంతి నాశం సకల గుణవిధే ర్వృశ్చికే సూర్యపుత్రే ॥ అధికారులకు, నాయకులకు అసహనములు, కోపములు పెరుగును. పక్షులకు, సర్పములకు మంచి వృద్ధి. పాలకులకు, మేఘములకు నాశనము. పరాయివాళ్ళ ఆధిక్యత ఎక్కువ అవుతుంది. అలాగే అయిన వారి వలన అన్ని విధముల ఇబ్బందులు కూడా పెరుగుతాయి. తదాది వత్సరపర్యన్తం "మందే స్థితే ధన్విని వృష్టిహానిః స్యాద్భూపతీనాం కలహో నచార్ఘః । పాంచాల కాశీ కురు కోసలాశ్చ నష్టాశ్చ కాశ్మీర కలింగ వంగాః" వర్షములు తక్కువగా కురియును. రాజులకు కలహములు ఎక్కువగును. ధరలు తగ్గిపోవును. పాంచాల, కాశీ, కురు, కోసల, కాశ్మీర, కలింగ, వంగ ప్రాంతములకు ఎక్కువ నష్టము కలుగును.

## కర్తరీ సమయము

వైశాఖ శుక్ల నవమీ గురువారం (04.05.2017) నుండి డొల్లు కర్తరి. వైశాఖ కృష్ణ పాడ్యమీ గురువారం (11.05.2017) లగాయితు జ్యేష్ఠ శుక్ల తృతీయా ఆదివారము (28.05.2017) వరకు నిజకర్తరీ.

## మౌఢ్య సమయములు

ఫాల్గున కృష్ణ సప్తమి ఆదివారము 19-03-2017 నుండి చైత్ర శుక్ల విదియ బుధవారము 29-03-2017 వరకు **శుక్రమౌఢ్యము.** ఆశ్వయుజ కృష్ణ షష్ఠి బుధవారము 11-10-2017 నుండి కార్తిక కృష్ణ పంచమీ బుధవారము 08-11-2017 వరకు **గురుమౌఢ్యము.** మార్గశిర శుక్ల నవమి మంగళవారము 28-11-2017 నుండి ఫాల్గున శుక్ల చవితి సోమవారము 19-02-2018 వరకు **శుక్రమౌఢ్యము.**

## పుష్కర ప్రవేశ సమయము

భాద్రపద బహుళ సప్తమీ మంగళవారం 12-09-2017 నుండి సార్ధ త్రికోటి తీర్థ సహిత **కావేరీ నదీ పుష్కరములు** ప్రారంభమగును.

## వర్షధాన్యాది ప్రమాణములు (వింశోపకములు)

వర్షం 19, ధాన్యం 15, శీతం 7, తృణం 7, ఉష్ణం 7, మారుతం 17, ప్రజావృద్ధిః 13, తన్నాశః 15, రాజవిద్వరం 15, ఉగ్రం 11, పుణ్యం 11, పాపం 11, వ్యాధి 13, ఉపశమనం 13, ఆచారం 19, అనాచారం 19, జన్మాని 17, మరణాని 17, దేశోపద్రవం 5, దేశస్వాస్థ్యం 19, చోరభయం 11, చోరనాశనం 17, అగ్నిభయం 5, శాంతిః 11, మృగోపద్రవం 21, మృగక్షయం 19, కీటభయం 5, తన్నాశం 15, మూషకోద్భవం 17, తన్నాశం 11, సర్పోపద్రవం 15, తన్నాశం 13, కామం 5, క్రోధం 9, లోభం 9, మోహ 9, మదం 9, మాత్సర్యం 5, సుఖం 15, దుఃఖం 5, భోగం 9, విడంబం 11, మనోవేదన 11, ద్వేషం 9, ప్రతిష్ఠ 5, అప్రతిష్ఠ 17, ద్యూతం 11, మత్తత 21, పురుషోత్పత్తి 13, స్త్రీణాముత్పత్తి 11, ధాతువాదం 11, భయం 17, శౌర్యం 19, దుష్ట నిగ్రహం 5, శిష్టపాలన 7, సత్యం 5, అసత్యం 9, విశ్వాసం 13, విశ్వాసఘాతం 17, దయ 21, నిర్దయ 7, న్యాయం 9, అన్యాయం 11, నక్కలవృద్ధి 5, తన్నాశం 9, పురుగుల వృద్ధి 3, తన్నాశం 9, మిడతల వృద్ధి 11, తన్నాశం 5, సస్యవృద్ధి 7, తన్నాశం 9, పశువృద్ధి 12, తన్నాశం 4, శుకవృద్ధి 7, తన్నాశం 5, కోకిల వృద్ధి 7, తన్నాశం 7, కుక్కుటవృద్ధి 8, తన్నాశం 8, ద్రుమ కీట భయం 3, తన్నాశం 9, క్షుధా 15, తృష్ణా 9, నిద్రా 3, ఆలస్య 6, ఉద్వేగం 13, శాంతం 13, క్రోధం 11, డంబం 3, మిత్రభేదం 15, ఇష్టత 5, రసనిష్పత్తి 7, ఫలనిష్పత్తి 11, ఉత్సాహం 1, జ్ఞానం 17, అజ్ఞాన 16, కాపట్యం 19, నిష్కాపట్యం 5, ధార్మికం 17, అధార్మికం 3, గోమాయువృద్ధి 4, తన్నాశం 4, సస్యకీటవృద్ధి 3, తన్నాశం 9, శలభవృద్ధి 11, తన్నాశం 5, మశకవృద్ధి 9, తన్నాశం 7, మత్కుణవృద్ధి 5, తన్నాశం 9, వృశ్చికవృద్ధి 9, తన్నాశం 11, వ్యాఘ్రవృద్ధి 11, తన్నాశం 3, పక్షివృద్ధి 4, తన్నాశం 3, ధేనువృద్ధి 2, తన్నాశం 2, మహిషవృద్ధి 6, తన్నాశం 6, మృగవృద్ధి 2, తన్నాశం 5, ఛాగవృద్ధి 5, తన్నాశం 2, అశ్వవృద్ధి 4, తన్నాశం 4, గజవృద్ధి 2, తన్నాశం 2, ఉష్ట్రవృద్ధి 3, తన్నాశం 2, విప్రవృద్ధి 4, తన్నాశం 3, క్షత్రియవృద్ధి 6, తన్నాశం 5, వైశ్యవృద్ధి 5, తన్నాశం 2, శూద్రవృద్ధి 6, తన్నాశం 4, మ్లేచ్ఛవృద్ధి 5, తన్నాశం 5, సంకరవృద్ధి 4, తన్నాశం 2, నవరత్నవృద్ధి 3, తన్నాశం 5, మరకతవృద్ధి 5, మాణిక్యవృద్ధి 5, వజ్రవృద్ధి 4, వైఢూర్యం 6, గోమేధికం 3, పుష్యరాగం 4, ఇంద్రనీలం 5, ప్రవాళం 5, మౌక్తికం 5, ఇతర రత్నాని 1, సువర్ణవృద్ధి 14, రజతవృద్ధి 10, తామ్రవృద్ధి 2, కాంస్యవృద్ధి 2, లోహవృద్ధి 12, ఆయవృద్ధి 8, త్రపువృద్ధి 10, సీసవృద్ధి 10, రసవృద్ధి 6, వ్రీహివృద్ధి 4, శాలివృద్ధి 14, కుళుత్థవృద్ధి 10, తిలవృద్ధి 12, మాషవృద్ధి 18, ముద్గవృద్ధి 6, సర్షపవృద్ధి 18, చణకవృద్ధి 18, ఆఢకవృద్ధి 6, గోధూమవృద్ధి 8, కోద్రవవృద్ధి 16, ప్రియంగవవృద్ధి 18, యావనాళ వృద్ధి 4, శ్యామాకవృద్ధి 12, రాజమాషవృద్ధి 4, నీవారవృద్ధి 16, శింబిధాన్యవృద్ధి 2, పనసవృద్ధి 25, నారికేళవృద్ధి 16, మాతులుంగ వృద్ధి 7, జంబీరవృద్ధి 19, ఖర్జూరవృద్ధి 1, రంభావృద్ధి 16, చూతవృద్ధి 10, కపిత్థవృద్ధి 1, తింత్రిణివృద్ధి 1, ధాత్రీఫలవృద్ధి 1, అతివృష్టి 17, అనావృష్టి 17, మూషకవృద్ధి 11, శలభవృద్ధి 19, శుకవృద్ధి 15, స్వచక్ర 7, పరచక్ర 7, స్వప్నం 14, సుషుప్తి 10, జాగ్రత్ 2, పిశునం 2, క్రోధం 12, సంగమం 8, జ్ఞానం 10, అజ్ఞానం 10, భుక్తి 0, ధాన్యం 0, అండజ 19, తన్నాశ 15, స్వేదజ 7, తన్నాశ 7, ఉద్భిజ 17, తన్నాశ 13, జరాయుజ 15, తన్నాశ 15, స్థావర 11, తన్నాశ 11, జంగమ 11, తన్నాశ 11.

## చంద్ర గ్రహణం



ఈ సం॥ శ్రావణ శుక్ల పూర్ణిమా సోమవారము 07-08-2017 నాడు శ్రవణా నక్షత్రములో మకరరాశిలో **చూడామణి** నామక అర్ధాల్పగ్రాస **కేతుగ్రస్త చంద్రగ్రహణం** సంభవించును. ఈ గ్రహణమున పుణ్యము అధికముగా వచ్చును.

| | | | |
|---|---|---|---|
| స్పర్శ కాలం | రాత్రి | గం | 10:52 |
| మధ్యకాలం | రాత్రి | గం | 11:50 |
| మోక్ష కాలం | రాత్రి | గం | 12:49 |
| **మొత్తం పుణ్యకాలం** | | గం | **01:57** |

## నిత్య భోజన ప్రత్యాబ్దికాది నిర్ణయము

**సూర్యగ్రహే తు నాశ్నీయా త్పూర్వం యామ చతుష్టయమ్ ।**
**చన్ద్రగ్రహే తు యామాంస్త్రీన్ బాల వృద్ధాతురాన్వినా ॥**

ఇది రాత్రి ద్వితీయ యామమున ఆరంభమగుచున్నది. కనుక నిత్య భోజన, ఆబ్దికాదులను పగలు ద్వితీయ యామము లోగానే (అనగా పగలు 12.20 లోగానే) జరుపుకొనవలెను.

అశక్తులు (అనగా చిన్నపిల్లలు - వృద్ధులు - వ్యాధితులు - గర్భిణులు) మాత్రము గ్రహణారంభ యామము నుండి సార్ధయామ కాలమును విడచి - అనగా ఈనాడు సా. 5.00 లోగా ఆహారాదులను స్వీకరించవచ్చును.

గ్రహణ మోక్షము అర్ధరాత్రి తరువాత గనుక సమర్థులు మోక్ష స్నానానంతరము కూడా ఈనాడు ఆహారాదులను స్వీకరించరాదు.

## గ్రహణ గోచారము

ఈ గ్రహణమును శ్రవణ నక్షత్రము వారును, అధమ ఫలము నిచ్చు రాశుల వారును అసలు చూడరాదు.

**శుభ ఫలము** : మేష, సింహ, వృశ్చిక, మీన రాశులవారలకు
**మధ్యమఫలము** : వృషభ, కర్కాటక, కన్య, ధనూ రాశులవారలకు
**అధమ ఫలము** : మిథున, తుల, మకర, కుంభ రాశులవారలకు

## చంద్ర గ్రహణం



ఈ సం॥ శుక్ల మాఘ పూర్ణిమా బుధవారము 31-01-2018 నాడు ఆశ్రేషా నక్షత్రములో కర్కాటకరాశిలో **రాహుగ్రస్త** (సంపూర్ణ) **చంద్రగ్రహణం** సంభవించును.

| | | | |
|---|---|---|---|
| స్పర్శ కాలం | సాయంకాలం | గం | 05:18 |
| సూర్యాస్తమయం (Hyd) | సాయంకాలం | గం | 06:07 |
| మోక్ష కాలం | రాత్రి | గం | 08:41 |
| **మొత్తం పుణ్యకాలం** | | **గం** | **02:34** |

(గ్రహణ ఆరంభము సా గం. 05:18 అయినను పుణ్యకాలము సూర్యాస్తమయము సా 06:07 నుండి ప్రారంభమగును.)

### నిత్య భోజన ప్రత్యాబ్దికాది నిర్ణయము

కాల నిర్ణయ చంద్రిక -

**గ్రస్తోదయే విధోః పూర్వం నాహర్భోజన మాచరేత్ ।**
**గ్రస్తోదయే భవేదిన్దోః దివా శ్రాద్ధం న కారయేత్ ।**
**రాత్రావపి తదా కుర్యాత్ ప్రత్యబ్దం మను రబ్రవీత్ ॥**
**చన్ద్రగ్రస్తే తూదితే తస్య ముక్తిం దృష్ట్వా**
**తత్ర శ్రాద్ధ మన్నేన కార్యమ్ ........ (తత్ర = తస్యాం రాత్రౌ)**

ఇత్యాది ప్రసిద్ధ నిర్ణయములను బట్టి ఈ పగలు భోజనాదుల చేయ రాదు. ఆబ్దికాదులను కూడ గ్రహణానంతరము రాత్రియందే యథావిధిగ జరుపవలెను. ఈవేళ రాత్రికాలమున శ్రాద్ధాచరణము విశేష ధర్మ శాస్త్రమును బట్టి నిర్ణయము. అయితే విధవాకర్తృకశ్రాద్ధ మగుచో ఈ రోజు (పగలు - రాత్రి) ఉపవసించి మరునాడే జరుపవలసియుండును.

యతులకు, పూర్వసువాసినులకు రాత్రి భోజనము సర్వాత్మనా నిషిద్ధము గనుక వారలు మరునాడే భోజనాదులను చేయవలసియుండును. అశక్తులు (అనగా చిన్న పిల్లలు, వృద్ధులు, వ్యాధితులు, గర్భిణులు) మాత్రము గ్రహణారంభ యామము నుండి సార్ధయామ కాలమును విడిచి అనగా ఈనాడు పగలు 01:00 లోగా ఆహారాదుల స్వీకరించ వచ్చును.

### గ్రహణ గోచారము

ఈ గ్రహణమును ఆశ్రేష నక్షత్రము వారును, అధమ ఫలము నిచ్చు రాశుల వారును అసలు చూడరాదు.

**శుభ ఫలము** : వృషభ, కన్య, తుల, కుంభ రాశులవారలకు
**మధ్యమఫలము** : మిథున, వృశ్చిక, మకర, మీన రాశులవారలకు
**అధమ ఫలము** : మేష, కర్కాటక, సింహ, ధనూ రాశులవారలకు

## ధర్మ నిర్ణయములు

### హేమలంబ నామ సంవత్సర నామ నిర్ణయము

ఇది **హేమలంబ** నామ సంవత్సరము. వాడుకలో హేవిలంబ, హేవిళంబ, హేమలంబి, హేవిలంబి, హేవిళంబి అనే రూపాలు ప్రచారంలో ఉన్నాయి. హేమాద్రి, వీరమిత్రోదయం, నిర్ణయసింధు, ధర్మసింధువులలో సంవత్సర నామములను తెలుపు శ్లోకములలో **హేమలంబ** అనియే ఉన్నది. అలాగే విశ్వేశ్వర ప్రతిష్ఠ జరిగినది హేమలంబ నామ సంవత్సరమున అని **వర్షే చ హేమలంబాఖ్యే** (నిర్ణయసింధు పుట 153, ధర్మసింధు పుట 31, వ్రతనిర్ణయ కల్పవల్లి పుట 209) ఉన్నది. ఇచట కూడా **హేమలంబ** అని అకారాంతముగనే ఉన్నది. కాలనిర్ణయచన్ద్రికలో మాత్రము హేమలంబీ అని యున్నది. కాగా మూల భూత ప్రమాణ గ్రంథములలో బహుగ్రంథ సమ్మతమూ మరియు మా పూర్వులు అనుసరించినదీ కూడా అగుటచే **హేమలంబ** అనియే ఇచట స్వీకరింపబడుచున్నది.

### సంవత్సరాది నిర్ణయము

"**చైత్ర శుక్ల ప్రతిపత్ - సూర్యోదయ వ్యాపినీ గ్రాహ్యా**" చాంద్ర సంవత్సరాదిని ఉదయకాలీన చైత్రశుద్ధ ప్రతిపత్తుని బట్టి నిర్ణయించాలని సామాన్య నియమము. ఒకప్పుడు ఆ ప్రతిపత్తు అమావాస్య నాడు ఏష్యమై - ఏనాడూ ఉదయ స్పర్శని కాకపోవచ్చు. అట్లగుచో - ఆ అమావాస్య నాడే చాంద్రసంవత్సరాది యని -

**" ఉదయ ద్వితయే పూర్వా - నోదయ యుగులేఽపి పూర్వైవ "**
**" దినద్వయే తద్వ్యాప్తౌ - అవ్యాప్తౌ వా - పూర్వైవ "**

ఇత్యాదిగా పైన పేర్కొన్న ప్రమాణ గ్రంథములన్నిట ఏకరీతిగ నిర్ణయింపబడి ఉన్నది.

ప్రస్తుతము **28-03-2017 మంగళవారము** నాడు ఫాల్గున అమావాస్య తదుపరి చైత్రశుద్ధ పాడ్యమి ఏష్యమైనది గనుక **ఈనాడే నిస్సందేహముగ హేమలంబ నామ చాంద్రమాన సంవత్సరాది యగును.** ఈ పరిస్థితి తెలంగాణా, ఆంధ్రప్రదేశము వంటి పరిసరములందే గాక - దక్షిణ భారతదేశము మొత్తము ఇంతే.

అయితే ఏ రోజున అయినను, సూర్యోదయము అన్ని ప్రాంతము లందు ఒకే సమయమున జరుగదు. అది ఒక ప్రాంతమున ఎప్పుడు అగునో - అదే రోజున ఆ ప్రాంతానికి తూర్పున ఒకింత ముందుగనే జరుగును. (దీనికి ప్రత్యక్ష పరిశీలనమే ఉత్తమము. అక్షాంశ - రేఖాంశాలను బట్టి కూడ లెక్కించవచ్చును).

ఉత్తరభారతమున కూడ పూరి, భువనేశ్వర్, కటక్, పాట్నా - ఇంకా ఉత్తరాన నేపాల్‌లోని ఖాట్మాండు ప్రాంతాలు. వాటికి పశ్చిమ ప్రాంతాలలో కూడా పరిస్థితి ఇంతే (మార్చి 28 నాడే చాంద్ర సంవత్సరాది). వాటికి తూర్పు ప్రాంతాలలో (బెంగాలు,అస్సాం ...) మాత్రం మార్చి 29 నాడు సంవత్సరాది అగును. కానీ, ఉత్తర భారతమున చాంద్రమానము గాక బార్హస్పత్యమానమును అనుసరించవలెను గనుక అచట 29-03-2017 బుధవారము నాడు **సాధారణ** నామ సంవత్సరాది యగును.

గమనిక :-

ఇపుడు మన చేతిలోనిది ప్రత్యక్ష పరిశీలనకు నిలబడే దృక్పద్ధతిలో చేయబడిన పంచాంగము, దీనిలోని తిథ్యాదుల వ్యాప్తికి - (పూర్వపద్ధతి యని ముద్రపడిన) పూర్వకాలీన గణకానందాదులతో చేయబడిన పంచాంగములలోని తిథ్యాదుల వ్యాప్తికి తేడా ఉంటుంది. ఈ రెండవ రకము వాటితో సంవత్సరాది (అట్లే తదితర పర్వదిన కాల) నిర్ణయము మరొక విధము కావచ్చును. రెండు పద్ధతులలో దృక్పద్ధతియే శాస్త్రీయమని, న్యాయమని మన పంచాంగములలో చాలా మారులు సవివరముగ చెప్పుకొనియే ఉన్నాము.

## శ్రీరామనవమి

చైత్ర శుద్ధ నవమికి మధ్యాహ్న వ్యాప్తిని బట్టి **శ్రీరామనవమి** నిర్ణయ మగును. ఔదయికాష్టమి నాడు మాత్రమే నవమికి యత్కించిత్ మధ్యాహ్న స్పర్శ యుండి మరునాడు మధ్యాహ్నస్పర్శ ఏ మాత్రము లేనిచో అపుడు అష్టమీ విద్ధయగు మాధ్యాహ్నిక నవమి నాడే **శ్రీరామనవమి**ని అనుష్ఠించ వలెనని **పుర్వేద్యు రేవ మధ్యాహ్న వ్యాపినీ చేత్ తదైవ (శ్రీరామనవమీ) కర్మకాల వ్యాప్తేః** అని నిర్ణయ సింధువు, ధర్మసింధువు మున్నగు ప్రమాణ గ్రంథములలోని నిర్ణయము.

ఈ సంవత్సరము 04-04-2017 మంగళవారము నాడు అష్టమి పగలు 11:23 వరకు మరునాడు 05-04-2017 బుధవారము నాడు నవమి పగలు 10:05 వరకు ఉండుటతో మంగళవారము నాడు మాత్రమే నవమికి మధ్యాహ్న వ్యాప్తి (అదియును సకల మధ్యాహ్న వ్యాప్తి) కలుగు చున్నది. బుధవారం నాడు నవమికి మధ్యాహ్నస్పర్శ లేనే లేదు. **కనుక 04-04-2017 మంగళవారము నాడే నిస్సందేహముగ శ్రీరామనవమి.**

ఈ సంవత్సరము అదనముగ మరొక విశేషము (కాల నిర్ణయ చన్ద్రిక, పుట 312)

పునర్వస్వృక్ష సంయోగః స్వల్పోఽపి యది దృశ్యతే ।
చైత్ర శుక్ల నవమ్యాం తు సా తిథి స్సర్వకామదా ॥
శ్రీరామనవమీ ప్రోక్తా కోటి సూర్య గ్రహాధికా ।
చైత్ర శుక్లస్య నవమీ పునర్వసు యుతా యది ॥
సైవ మధ్యాహ్నయోగేన మహాపుణ్యతమా స్మృతా ॥

**భావము :** చైత్ర శుక్ల నవమికి ఏ మాత్రం పునర్వసు స్పర్శ ఉన్నా ఆ తిథి సర్వకామప్రదము. అది కోటి సూర్య గ్రహణములకు మించిన పుణ్య ప్రదము. ఈ సంవత్సరమట్టి దివ్యమైన అవకాశము మనకి 4-4-2017 మంగళవారము నాడు లభించును. దీనిని మనమందరమును సద్వినియోగము చేసికొనవలెను.

**మరొక ముఖ్యవిషయము :**

అష్టమి నాడే శ్రీరామవనమి యున్నచో నవ (9) రాత్రులు పూర్తికాలేదు కదా? అను శంక (కొందరికి) కలగవచ్చును. ఇట్టి శంక అనవసరము.

ఇచట మనము గ్రహించవలసిన సాంకేతిక విషయము కాలనిర్ణయ చన్ద్రిక (పుట 159)లో చక్కగా వివరింపబడినది.

నవరాత్రి శబ్దః కర్మప్రవచన ఏవ

దేవీపురాణే -

**తిథివృద్ధౌ తిథిహ్రాసే నవరాత్ర మపార్థకమ్ ।**
**అష్టరాత్రౌ న దోషోఽయం ...**

**భావము :-** పాడ్యమి నుండి నవమి వరకు గల 9 తిథులలో అనుష్ఠించ వలసిన కర్మకే సాంకేతికముగ నవరాత్రమని పేరు. అంతేగాని 9 రాత్రులు అని కాదు. తిథి వృద్ధిలో ముందురోజు చేసిన పూజాదికమునే మరునాడు కూడ తిరిగి చేయవలెను. తిథి క్షయములో ఒకే దినమున రెండు తిథులకు సంబంధించిన పూజాదికమును విడివిడిగా చేయవలెను. ఇది నవ రాత్రానుష్ఠానమున పద్ధతియని (దేవీ నవరాత్రుల విషయమున కూడ ఇదే న్యాయము). కనుక ఈ సంవత్సరము అష్టమీ మంగళవారము నాడు అష్టమీ, నవమీ పూజలను రెంటిని చేయవలసి యుండును.

ఇదంతా **స్మార్త పద్ధతి.** వైష్ణవులకు అష్టమీ వేధ పనికిరాదు. మధ్యాహ్న కాలవ్యాప్తి లేకున్నను - అష్టమీ వేధ లేని శుద్ధ నవమియే వారికి గ్రాహ్యము. కనుక 05-04-2017 బుధవారము నాడు **వైష్ణవులకు మాత్రమే శ్రీరామనవమి.** ఎవరి సంప్రదాయమును వారు అనుసరించుటయే శుభము.

**ఇచట ఒక అవాంతర విషయము :** శ్రీరామనవమి నాడు ఉపవాసము, రామపూజ, పట్టాభిషేకములు, కల్యాణములు, జాగరణ ప్రసిద్ధములే. నిర్ణయసింధులో -

**ఉపోషణం జాగరణం పితౄనుద్దిశ్య తర్పణమ్ ।**
**తస్మిన్ దినే తు కర్తవ్యం బ్రహ్మ ప్రాప్తి మభీప్సుభిః ॥**

వీటితో పాటు పితృతర్పణము కూడా చేయవలెనని, అది మోక్షహేతువని, ఉపవాసము చాల ముఖ్యమనియును ఉన్నది.

## ఉపాకర్మ

ఉపాకర్మలకు (ధర్మసింధువుని బట్టి) ఋక్ - యజుః - అథర్వణ వేదులకు శ్రావణమాసమున, సామవేదులకు భాద్రపదమాసమున ముఖ్య కాలములు. ఆ ముఖ్యకాలములకు గ్రహణము, సంక్రాంతి, మౌఢ్యము, అధిక మాసము, సింహస్థ గురువు మున్నగనవి తగిలినచో గౌణకాలము లును చెప్పబడినాయి. ఈ సంవత్సరము శ్రావణ పూర్ణిమ నాడు గ్రహణము సంభవించును. కనుక **ఋక్ - యజుః - అథర్వణ వేదులు గౌణకాలము నందే ఉపాకర్మలు** చేసికొనవలసి యుండును. సామవేదుల ముఖ్యకాలము నకు ఇబ్బంది లేదు.

**గమనిక :- ఈ గౌణకాలములు నూతన వటువులకు మాత్రమే.** ప్రాచీన వటువులకును - గృహస్థులకును ముఖ్యకాలము లందే ఉపాకర్మలు. ఈ సంవత్సరపు గౌణకాలములు, ముఖ్య కాలములు ఈ విధముగా ఉన్నాయి.

**గౌణకాలములు (నూతన వటువులకు)**

1. ఋగ్వేదులకు :- శ్రావణమున హస్తతో కూడిన పంచమి లేదా హస్త నక్షత్రము నాడు. (28-07-2017 బుధవారము)

2. ఆపస్తంబులకు :- భాద్రపద పూర్ణిమ (06-09-2017 బుధవారము)
3. బోధాయనులకు :- ఆషాఢ పూర్ణిమ (09-07-2017 ఆదివారము)
4. శుక్ల యజుర్వేదులకు :- శ్రావణ పూర్ణిమ / శ్రావణమున హస్త యుక్త పంచమి / కేవల పంచమి (27-07-2017 గురువారము)
5. సామవేదులకు :- భాద్రపదమున హస్త నక్షత్రము నాటి అపరాహ్ణము(25-8-2017 శుక్రవారము) ఇది వీరికి ముఖ్యకాలమే.
6. అథర్వణ వేదులకు :- భాద్రపద పూర్ణిమ (06-09-2017 బుధవారము)

**ముఖ్య కాలములు** (ప్రాచీన వటువులకు - గృహస్థులకు)

1. ఋగ్వేదులకు :- శ్రావణమున శ్రవణ నక్షత్రము నాడు (07-08-2017 సోమవారము)
2. ఆపస్తంబులకు :- శ్రావణ పూర్ణిమ (07-08-2017 సోమవారము)
3. బోధాయనులకు :- శ్రావణ పూర్ణిమ (07-08-2017 సోమవారము)
4. శుక్ల యజుర్వేదులకు :- శ్రవణనక్షత్ర యుక్త శ్రావణపూర్ణిమ (07-08-2017 సోమవారము)
5. సామవేదులకు :- భాద్రపదమున హస్త నక్షత్రము నాటి అపరాహ్ణము(25-8-2017 శుక్రవారము)
6. అథర్వణ వేదులకు :- శ్రావణ పూర్ణిమ (07-08-2017 సోమవారము)

**గమనిక :-** ఆశౌచాదుల వలన స్వసూత్రోక్త ముఖ్య / గౌణ కాలములందు కుదరనిచో - అన్య సూత్రోక్త కాలములందైనను జరుపవలెను.

## శ్రీకృష్ణ జన్మాష్టమీ, శ్రీకృష్ణ జయన్తీ

శ్రీకృష్ణావతార దివ్య సందర్భమునకు సంబంధించిన వ్రతములు రెండు **- (1) శ్రీకృష్ణ జన్మాష్టమి (2) శ్రీకృష్ణ జయంతి.** శ్రావణ కృష్ణాష్టమికి నిశీథ వ్యాప్తిని బట్టి శ్రీకృష్ణజన్మాష్టమి నిర్ణయమగును. **ఔదయిక సప్తమి నాడు మాత్రమే అష్టమికి యత్కించిత్ నిశీథ వ్యాప్తి యుండి, మరునాడు - ఔదయికాష్టమి నాడు నిశీథ స్పర్శయైనను లేనిచో - సప్తమినాడే శ్రీకృష్ణ జన్మాష్టమి యని** - కాలమాధవీయము, నిర్ణయసింధు, ధర్మసింధు మున్నగు ప్రమాణ గ్రంథములలోని నిర్ణయము.

ఈ సంవత్సరము శ్రావణ కృష్ణ సప్తమీ సోమవారము (14-08-2017) నాడు మాత్రమే అష్టమికి సంపూర్ణ నిశీథ వ్యాప్తి యున్నది. మరునాడు అష్టమి సా. 05:07 వరకు మాత్రమే ఉండుటచే 14-08-2017 సోమవారము నాడే నిస్సందేహముగ **శ్రీకృష్ణ జనాష్టమి** అగును.

శ్రావణ కృష్ణాష్టమికి రోహిణీ యోగమును బట్టి **శ్రీకృష్ణ జయన్తి** నిర్ణయమగును. ఈ అష్టమీ-రోహిణీ యోగము పగలు గాని రాత్రిగాని - ఒక ముహూర్త మాత్రమైనను ఉండవలెను. నిశీథమున ముఖ్యము. అనుకల్పముగా రవి సింహరాశిలో నుండగా భాద్రపద కృష్ణాష్టమికి ఇలా రోహిణీ యోగము వచ్చినను **శ్రీకృష్ణ జయన్తి** యగును.

ఇది ఒక అలభ్యయోగము వంటిది. ప్రతి సంవత్సరము వచ్చునను నియమము లేదు. ఒకప్పుడు శ్రావణ భాద్రపదముల రెండింటిలోను రావచ్చును. అపుడు **శ్రావణముననే శ్రీకృష్ణ జయన్తి** యగును.

ఒకప్పుడు శ్రావణమున జన్మాష్టమి - జయన్తి ఒకే రోజున పడవచ్చును. లేదా పూర్వ పర దినములలో ఒకటి ముందు రోజు, రెండవది మరునాడు కావచ్చును. **ఇట్టి సందర్భములలో మాత్రము జన్మాష్టమిని జయన్తితో కలిపియే చేయవలెనని గాని విడిగా కాదు.**

జన్మాష్టమి నాడు చేయవలసినది - ఉపవాసము, జాగరణము శ్రీకృష్ణాదుల పూజ, చంద్రార్ఘ్యము ఇత్యాదులు (కాలమాధవీయము, పుట 222). జన్మాష్టమి నాడు కూడా అవే కానీ, తేడా ఏమనగా **- జయన్తి నాటి ఉపవాసము దానాది సహితము. జన్మాష్టమి నాడు ఉపవాసము మాత్రమే** అని కాలమాధవీయమున వివరణ (పుట 230/231).

కాలమాధవీయము, నిర్ణయసింధు, ధర్మసింధు, కాలనిర్ణయచన్ద్రిక మున్నగు ప్రమాణ గ్రంథములలో జన్మాష్టమి / జయంతుల విషయమున స్మార్త - వైష్ణవ ప్రసక్తి లేదు. జన్మాష్టమి నిత్యము. జయన్తి కామ్యము. అయినను వైష్ణవుల ఆచారము మరొక విధముగా ఉంటున్నది. కనుక కాలమాధవీయాదుల నిర్ణయము **స్మార్త పద్ధతి** యని అనబడుచున్నది.

ఇట్టి **స్మార్త పద్ధతిలో** ఈ సంవత్సరము శ్రావణమున జయన్తి యోగము లేదు. భాద్రపదమున కృష్ణ సప్తమి మంగళవారము (12-09-2017) రాత్రి 01:01 నుండి మరునాటి రాత్రి 10:47 వరకు అష్టమి ఉన్నది. అనగా దినద్వయమున అష్టమికి నిశీథ వ్యాప్తి లేదు. కాని రోహిణి మంగళవారము ఉదయము 07:54 నుండి బుధవారము ఉదయము 06:27 వరకు ఉండుటతో అష్టమికి దిన ద్వయమున నిశీథాదన్యత్ర రోహిణీ యోగము పట్టినది. ఇట్టి పరిస్థితిలో-

**దినద్వయేఽపి నిశీథావ్యాపినీ (అష్టమీ) పూర్వేద్యు రేవ నిశీథాదన్యత్ర రోహిణీ యుతా అత్ర పరైవగ్రాహ్యా । అత్రైవ పక్షే పరేద్యు రేవ ఉభయత్ర వా నిశీథాదన్యత్ర రోహిణీ యోగేఽపి పరైవేతి కైముతికన్యాయేన సిద్ధమ్ ॥**

అని (ధర్మసింధు, పుట 131లో) నిష్కర్ష చేయుటతో 13-09-2017 బుధవారము నాడు **స్మార్తులకు శ్రీకృష్ణ జయన్తి** యగును.

**వైష్ణవులకు** నక్షత్రము, వేధ, సౌరమాసము ప్రధానములు. సింహ మాసమున కృష్ణ పక్షాష్టమికి రోహిణీ యోగమున్నపుడు శ్రీ కృష్ణజయన్తి (జన్మాష్టమి దానిలోనే గతార్థము) యగును. అష్టమి / రోహిణులకు నిశీథ వ్యాప్తి అవసరము లేదు. అష్టమికి సప్తమీ వేధ గాని, రోహిణికి కృత్తికా వేధ గాని ఏ మాత్రము పనికి రావు.

**వాజివిద్ధాష్టమీ త్యాజ్యా - అగ్నివిద్ధా తు రోహిణీ**

కాగా, ఈ సంవత్సరము భాద్రపద కృష్ణాష్టమి బుధవారము (13-09-2017) నాడు వైష్ణవులకు కూడ **శ్రీకృష్ణజయన్తి** యగును.

ఇలా ఈ సంవత్సరము భాద్రపద కృష్ణాష్టమి బుధవారము 13-9-2017) స్మార్త / వైష్ణవుల కందరకును **శ్రీకృష్ణ జయన్తి** యగును. అందరకును శుభము.

అయితే ఇచట మన కొక సందేహము రావచ్చును. ఏమనగా – ఈ అష్టమీ బుధవారము నాడు రోహిణి అతి స్వల్పముగనే యున్నది. అష్టమి మాత్రము ప్రాతరారాభ్య రాత్రి 10:47 వరకు ఉన్నది. అనగా ఆనాడు అష్టమీ రోహిణీ యోగము అతి స్వల్పమే కదాయని కాలమాధవీయము (పుట 242లో). ఇట్టి పరిస్థితికి చక్కటి సమాధాన మీయబడినది.

**సర్వేషు జయన్తీ వాక్యేషు రోహిణీ సహితాష్టమీతి వ్యవహారాత్**
**అష్టమీ సహితా రోహిణీతి వ్యవహారాభావాశ్చ**
**తిథి నక్షత్రయోః క్రమేణ ప్రధానోపసర్జన భావోஉవగన్తవ్యః.**

అనగా – జయన్తీ వాక్యములన్నిటా రోహిణీ సహితాష్టమి అనియే వ్యవహారము గాని అష్టమి సహిత రోహిణి యను వ్యవహార మెచటనూ లేదు. కనుక తిథి నక్షత్రములలో తిథియే ప్రధానమని – నక్షత్రము గౌణమని గ్రహించాలి.

**ఇట్టి న్యాయమును బట్టి 13-09-2017 బుధవారము నాడు**
**స్మార్త వైష్ణవులందరు జయన్తీ వ్రతము నాచరించుటచయే శుభము.**

## విశ్వేశ్వర ప్రతిష్ఠాదినము

కార్తిక శుక్ల చతుర్దశి నాడు అరుణోదయ కాలమున విశ్వేశ్వర ప్రతిష్ఠ జరిగెను. విశ్వేశ్వర ప్రీతికై త్రయోదశి నాడు ఉపవాసము చేసి, అరుణోదయ వ్యాపినియగు చతుర్దశి యందు స్నాన సంధ్యాదులు జేసి చతుర్దశి ప్రాతః కాలమున భుజించవలెను. (నిర్ణయసింధు – పుట 153, ధర్మసింధు – పుట 31, వ్రతనిర్ణయ కల్పవల్లి – పుట 209)

**వర్షే చ హేమలంబాఖ్యే మాసే శ్రీమతి కార్తికే ।**
**శుక్లపక్షే చతుర్దశ్యా మరుణాభ్యుదయం ప్రతి ॥**
**మహాదేవ తిథౌ బ్రాహ్మే ముహూర్తే మణికర్ణికే ।**
**స్నాత్వా విశ్వేశ్వరో దేవ్యా విశ్వేశ్వర మపూజయత్ ॥**

**విశేషమేమనగా :–** ఈ ప్రతిష్ఠ జరిగినది **హేమలంబ** నామ సంవత్సరమున కనుక ఈ సంవత్సరము దీనిని మరింత శ్రద్ధగ జేయుట ఉత్తమము.

## ఆరటంతీ చతుర్దశి

పుష్య కృష్ణ చతుర్దశి **ఆరటంతీ చతుర్దశి** యనబడును. బ్రహ్మాండ పురాణమున

**మాఘ కృష్ణ చతుర్దశ్యాం విష్ణో ర్దేహా న్మరీచయః ।....**
**అనర్కాభ్యుదితే కాలే మాఘకృష్ణ చతుర్దశీమ్ ।**
**స్నాత స్సంతర్ప్య తు యమం సర్వపాపైః ప్రముచ్యతే ॥**

అని చెప్పబడినది. (కాల నిర్ణయ చన్ద్రిక – పుట 435, వ్రతనిర్ణయ కల్పవల్లి – పుట 239)

**భావము :–** మాఘ కృష్ణ చతుర్దశి నాటి అరుణోదయమున – నక్షత్రములు ఇంకను కలుగుచున్న సమయమున శ్రీ మహావిష్ణువు దేహము నుండి వేలకు వేల కిరణములు వెలువడి అన్ని వైపుల ప్రసరించుచూ – ఆ సమయమున స్నాన మొనర్చు వారల పాపములను తొలగించమని ఆ భగవంతుని ఆజ్ఞయని లోకమున **ఆరటన** (ప్రకటన) చేయుచుండును. (అందువలననే ఇది **ఆరటంతీ చతుర్దశి** అనబడుచున్నది.) త్రయోదశినాడు ఉపవాసము చేసి, ఆ రాత్రి చివరి ఘడియలలో స్నానమొనర్చి, విష్ణుమూర్తిని, నక్షత్రములను, యముడిని, నదీ నదములను, తీర్థ దేవతలను, దేవతలను, పితృదేవతలను, అగ్నిహోత్రుని పూజించి వివిధ పదార్థములను, పులగమును నివేదించి, యమతర్పణ చేయాలి. తదుపరి శ్రాద్ధమొనర్చి బ్రాహ్మణులకు పులగాన్నమును పెట్టాలి. **సర్వపాపైః ప్రముచ్యతే** కనీసము స్నానము, యమతర్పణమైనా చేయాలి అని.

అయితే ఈ కార్యక్రమము (పైశ్లోకాలని బట్టి) మన (అమావాస్యాంత) మాఘ మాసమునందని కాలనిర్ణయ చన్ద్రిక, వ్రతనిర్ణయ కల్పవల్లుల యందు కనపడుచున్నది. అగుచో మాఘ కృష్ణ త్రయోదశి నాడు ఉపవాసము – ఆ రాత్రి తెల్లవారుజామున స్నానము, పూజలు, తదుపరి శ్రాద్ధ / బ్రాహ్మణ భోజనాదులు జరగాలి. తెల్లవారు జామున బ్రాహ్మణ భోజనము చేయదలచినను కాలము సరిపోదుగనుక – తెల్లవారి శివరాత్రి నాడు జరుపవలసియుండును. కర్తకి పారణ ఎప్పుడు? శివరాత్రి ఉపవాసమెట్లు? అను సందేహాలు సహజముగ తల ఎత్తును.

నిర్ణయసింధు – ధర్మప్రదీపములందు పూర్వ నిబంధన కర్తయగు హేమాద్రి గారిని అనుసరించి ఇచటి ఈ మాఘమాసము పూర్ణిమాంత పక్షముగ (అనగా మన పుష్యమాసముగ) గ్రహించబడినది. (ఇట్లగుచో పై ప్రశ్నలకు తావు ఉండనే ఉండదు.)

**పురాణ వాక్యమునందలి మాసములు ఎచట పూర్ణిమాంతములో, ఎచట అమావాస్యంతములో సంప్రదాయాభిజ్ఞులగు నిబంధనకర్తల నిర్ణయమే మనకి శరణ్యము.**

ఉదాహరణకి –

అ) **తథా భాద్రపదే మాసి కృష్ణాష్టమ్యాం కలౌ యుగే ।**
**అష్టావింశతిమే జాతః శ్రీకృష్ణో దేవకీసుతః ॥**

శ్రీకృష్ణుడు భాద్రపద కృష్ణాష్టమినాడు పుట్టెను. (నిర్ణయసింధు – 98)

ఆ) **ఆశ్వయుక్కృష్ణ పక్షే తు శ్రాద్ధం కుర్యాత్ దినే దినే ।**

ఆశ్వయుజ కృష్ణ పక్షమున (మహాలయ పక్షము) ప్రతిరోజు శ్రాద్ధం చేయాలి. (నిర్ణయసింధు – 102)

ఇ) **కార్తికే కృష్ణ పక్షే తు చతుర్దశ్యా మినోదయే ।**
**అవశ్యమేవ కర్తవ్యం స్నానం నరక భీరుభిః ॥**

కార్తిక కృష్ణ చతుర్దశి నాటి ఉదయమున (నరక చతుర్దశీ) స్నానం తప్పనిసరిగ చేయాలి.

ఇలాంటి తావులలోని మాసములు పూర్ణమాంతములని – వాటిని మన లెక్కన అమావాస్యాంతములగు శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజములుగ గ్రహించాలని నిబంధన కర్తల నిర్ణయము. అదే లోక ప్రసిద్ధాచారము కూడ.

అట్లే ప్రకృతమగు **ఆరటంతీ చతుర్దశి** హేమాద్ర్యాదుల నిర్ణయమును బట్టి – మన లెక్కన **అమావాస్యాంత పుష్య కృష్ణ చతుర్దశి** యగునని గ్రహించుటయే సమంజసము.

శుభమ్.

# స్వస్తి శ్రీ చాన్ద్రమాన హేమలంబ నామ సంవత్సర పంచాంగం 2017-2018



## రవి చారః

### రాశి ప్రవేశ కాలః

**2017**

| | | | |
|---|---|---|---|
| 13/04 | మేషం | రా | 02:00 |
| 14/05 | వృషభం | రా | 10:55 |
| 14/06 | మిథునం | రాతె | 05:31 |
| 16/07 | కర్కాటకం | ప | 04:20 |
| 16/08 | సింహం | రా | 12:45 |
| 16/09 | కన్య | రా | 12:40 |
| 17/10 | తుల | ప | 12:35 |
| 16/11 | వృశ్చికం | ప | 12:20 |
| 15/12 | ధనుస్సు | రా | 03:00 |

**2018**

| | | | |
|---|---|---|---|
| 14/01 | మకరం | ప | 01:45 |
| 12/02 | కుంభం | రా | 02:45 |
| 14/03 | మీనం | రా | 11:40 |

### నక్షత్ర పాదాదుల ప్రవేశ కాలః

**2017**

| | | | | |
|---|---|---|---|---|
| 31/03 | రేవతి | 1 | ప | 12:40 |
| 03/04 | | 2 | రా | 09:41 |
| 07/04 | | 3 | ఉ | 06:57 |
| 10/04 | | 4 | ప | 04:23 |
| 13/04 | అశ్విని | 1 | రా | 02:00 |
| 17/04 | | 2 | ప | 11:44 |
| **19/04** | **వృషభాయనం** | | **రా** | **02:57** |
| 20/04 | అశ్విని | 3 | రా | 09:37 |
| 24/04 | | 4 | ఉ | 07:38 |
| 27/04 | భరణి | 1 | సా | 05:50 |
| 30/04 | | 2 | రా | 04:05 |
| 04/05 | | 3 | ప | 02:34 |
| 07/05 | | 4 | రా | 01:11 |
| 11/05 | కృత్తిక | 1 | ప | 12:00 |
| 14/05 | | 2 | రా | 10:55 |
| 18/05 | | 3 | ప | 09:53 |
| **20/05** | **మిథునాయనం** | | **రా** | **02:01** |
| 21/05 | కృత్తిక | 4 | రా | 08:59 |
| 25/05 | రోహిణి | 1 | ప | 08:15 |
| 28/05 | | 2 | రా | 07:29 |
| 01/06 | | 3 | ఉ | 06:53 |
| 04/06 | | 4 | సా | 06:25 |
| 08/06 | మృగశిర | 1 | ఉ | 06:05 |
| 11/06 | | 2 | సా | 05:43 |
| 14/06 | | 3 | రాతె | 05:31 |
| 18/06 | | 4 | సా | 05:15 |
| **21/06** | **కర్కాటకాయనం** | | **ప** | **09:54** |
| 21/06 | ఆర్ద్ర | 1 | రాతె | 05:05 |
| 25/06 | | 2 | ప | 04:53 |
| 28/06 | | 3 | రా | 04:45 |
| 02/07 | | 4 | ప | 04:39 |
| 05/07 | పునర్వసు | 1 | రాతె | 04:35 |
| 09/07 | | 2 | ప | 04:31 |
| 12/07 | | 3 | రా | 04:26 |
| 16/07 | | 4 | ప | 04:20 |
| 19/07 | పుష్యమి | 1 | రాతె | 04:10 |
| **22/07** | **సింహాయనం** | | **రా** | **08:45** |
| 23/07 | పుష్యమి | 2 | ప | 03:56 |
| 26/07 | | 3 | రా | 03:38 |
| 30/07 | | 4 | ప | 03:19 |
| 02/08 | ఆశ్రేష | 1 | రా | 03:00 |
| 06/08 | | 2 | ప | 02:32 |
| 09/08 | | 3 | రా | 02:01 |
| 13/08 | | 4 | ప | 01:26 |
| 16/08 | మఘ | 1 | రా | 12:45 |
| 20/08 | | 2 | ప | 11:50 |
| **22/08** | **కన్యాయనం** | | **రా** | **03:50** |
| 23/08 | మఘ | 3 | రా | 10:52 |
| 27/08 | | 4 | ప | 09:46 |
| 30/08 | పూ.ఫల్గుని | 1 | రా | 08:35 |
| 03/09 | | 2 | ఉ | 07:16 |
| 06/09 | | 3 | సా | 05:50 |
| 09/09 | | 4 | రా | 04:15 |
| 13/09 | ఉ.ఫల్గుని | 1 | ప | 02:35 |
| 16/09 | | 2 | రా | 12:40 |
| 20/09 | | 3 | ప | 10:32 |
| **22/09** | **తులాయనం** | | **రా** | **01:32** |
| 23/09 | ఉ.ఫల్గుని | 4 | రా | 08:18 |
| 27/09 | హస్త | 1 | ఉ | 06:00 |
| 30/09 | | 2 | ప | 03:24 |
| 03/10 | | 3 | రా | 12:45 |
| 07/10 | | 4 | ప | 09:57 |
| 10/10 | చిత్ర | 1 | రా | 07:00 |
| 13/10 | | 2 | రా | 03:50 |
| 17/10 | | 3 | ప | 12:35 |
| 20/10 | | 4 | రా | 09:03 |
| **23/10** | **వృశ్చికాయనం** | | **ప** | **10:56** |
| 23/10 | స్వాతి | 1 | రాతె | 05:30 |
| 27/10 | | 2 | ప | 01:39 |
| 30/10 | | 3 | రా | 09:46 |
| 03/11 | | 4 | ఉ | 05:45 |
| 06/11 | విశాఖ | 1 | ప | 01:40 |
| 09/11 | | 2 | రా | 09:19 |
| 12/11 | | 3 | రాతె | 04:54 |
| 16/11 | | 4 | ప | 12:20 |
| 19/11 | అనూరాధ | 1 | రా | 07:40 |
| **22/11** | **ధనురయనం** | | **ప** | **08:34** |
| 22/11 | అనూరాధ | 2 | రా | 02:49 |
| 25/11 | | 3 | రా | 05:45 |
| 29/11 | | 4 | ప | 04:58 |
| 02/12 | జ్యేష్ఠ | 1 | రా | 12:00 |
| 06/12 | జ్యేష్ఠ | 2 | ఉ | 06:48 |
| 09/12 | | 3 | ప | 01:37 |
| 12/12 | | 4 | ప | 08:19 |
| 15/12 | మూల | 1 | రా | 03:00 |
| 19/12 | | 2 | ప | 09:32 |
| **21/12** | **మకరాయణం** | | **రా** | **09:58** |
| 22/12 | మూల | 3 | ప | 04:05 |
| 25/12 | | 4 | రా | 10:37 |
| 28/12 | పూ.షాఢ | 1 | రాతె | 05:10 |

**2018**

| | | | | |
|---|---|---|---|---|
| 01/01 | పూ.షాఢ | 2 | ప | 11:40 |
| 04/01 | | 3 | సా | 06:11 |
| 07/01 | | 4 | రా | 12:42 |
| 11/01 | ఉ.షాఢ | 1 | ఉ | 07:15 |
| 14/01 | | 2 | ప | 01:45 |
| 17/01 | | 3 | రా | 08:14 |
| **20/01** | **కుంభాయనం** | | **ప** | **08:39** |
| 20/01 | ఉ.షాఢ | 4 | రా | 02:48 |
| 24/01 | శ్రవణం | 1 | ప | 09:30 |
| 27/01 | | 2 | ప | 04:08 |
| 30/01 | | 3 | రా | 10:55 |
| 03/02 | | 4 | ఉ | 05:46 |
| 06/02 | ధనిష్ఠ | 1 | ప | 12:45 |
| 09/02 | | 2 | రా | 07:40 |
| 12/02 | | 3 | రా | 02:45 |
| 16/02 | | 4 | ప | 09:53 |
| **18/02** | **మీనాయనం** | | **రా** | **10:48** |
| 19/02 | శతభిషం | 1 | సా | 05:10 |
| 22/02 | | 2 | రా | 12:32 |
| 26/02 | | 3 | ఉ | 08:04 |
| 01/03 | | 4 | ప | 03:44 |
| 04/03 | పూ.భాద్ర | 1 | రా | 11:35 |
| 08/03 | | 2 | ఉ | 07:27 |
| 11/03 | | 3 | ప | 03:29 |
| 14/03 | | 4 | రా | 11:40 |
| 18/03 | ఉ.భాద్ర | 1 | ప | 08:00 |

## కుజ చారః

### రాశి ప్రవేశ కాలః

**2017**

| | | | |
|---|---|---|---|
| 12/04 | వృషభం | రా | 04:10 |
| 26/05 | మిథునం | రా | 01:30 |
| 11/07 | కర్కాటకం | ప | 02:55 |
| 27/08 | సింహం | ప | 08:25 |
| 13/10 | కన్య | ప | 04:00 |
| 29/11 | తుల | రాతె | 05:20 |

**2018**

| | | | |
|---|---|---|---|
| 16/01 | వృశ్చికం | రాతె | 05:10 |
| 07/03 | ధనుస్సు | సా | 06:25 |

### నక్షత్ర పాదాదుల ప్రవేశ కాలః

**2017**

| | | | | |
|---|---|---|---|---|
| 29/03 | భరణి | 3 | రా | 10:50 |
| 03/04 | | 4 | ప | 04:02 |
| 08/04 | కృత్తిక | 1 | ప | 09:50 |
| 12/04 | | 2 | రా | 04:10 |
| 17/04 | | 3 | రా | 10:59 |
| 22/04 | | 4 | సా | 06:23 |
| 27/04 | రోహిణి | 1 | ప | 02:20 |
| 02/05 | | 2 | ప | 10:48 |
| 07/05 | | 3 | ఉ | 07:51 |
| 11/05 | | 4 | రాతె | 05:28 |
| 16/05 | మృగశిర | 1 | రా | 03:40 |
| 21/05 | | 2 | రా | 02:17 |
| 26/05 | | 3 | రా | 01:30 |
| **31/05** | **పశ్చాదస్తమయం** | | **సా** | **05:14** |
| 31/05 | మృగశిర | 4 | రా | 01:05 |
| 05/06 | ఆర్ద్ర | 1 | రా | 01:20 |
| 10/06 | | 2 | రా | 01:56 |
| 15/06 | | 3 | రా | 03:02 |
| 20/06 | | 4 | రాతె | 04:36 |
| 26/06 | పునర్వసు | 1 | ఉ | 06:35 |
| 01/07 | | 2 | ప | 08:56 |
| 06/07 | | 3 | ప | 11:43 |
| 11/07 | | 4 | ప | 02:55 |
| 16/07 | పుష్యమి | 1 | సా | 06:25 |
| 21/07 | | 2 | రా | 10:12 |
| 26/07 | | 3 | రా | 02:17 |
| 01/08 | | 4 | ఉ | 06:42 |
| 06/08 | ఆశ్రేష | 1 | ప | 11:30 |
| 11/08 | | 2 | ప | 04:22 |
| 16/08 | | 3 | రా | 09:33 |
| 21/08 | | 4 | రా | 02:51 |
| 27/08 | మఘ | 1 | ప | 08:25 |
| 01/09 | | 2 | ప | 02:07 |
| 06/09 | | 3 | రా | 08:00 |
| 11/09 | | 4 | రా | 01:59 |
| 17/09 | పూ.ఫల్గుని | 1 | ప | 08:10 |
| **17/09** | **ప్రాగుదయం** | | **ప** | **09:37** |
| 22/09 | పూ.ఫల్గుని | 2 | ప | 02:16 |
| 27/09 | | 3 | రా | 08:34 |
| 02/10 | | 4 | రా | 02:58 |
| 08/10 | ఉ.ఫల్గుని | 1 | ప | 09:30 |
| 13/10 | | 2 | ప | 04:00 |
| 18/10 | | 3 | రా | 10:32 |
| 23/10 | ఉ.ఫల్గుని | 4 | రాతె | 05:07 |
| 29/10 | హస్త | 1 | ప | 11:50 |
| 03/11 | | 2 | సా | 06:36 |
| 08/11 | | 3 | రా | 01:22 |
| 14/11 | | 4 | ప | 08:14 |

19/11 చిత్ర 1 ప 03:10
24/11 2 రా 10:08
29/11 3 రాతె05:20
05/12 4 ప 12:32
10/12 స్వాతి 1 రా 07:55
15/12 2 రా 03:21
21/12 3 ప 11:00
26/12 4 సా 06:53
31/12 విశాఖ 1 రా 03:05

**2018**

06/01 విశాఖ 2 ప 11:25
11/01 3 రా 08:06
16/01 4 రాతె05:10
22/01 అనూరాధ 1 ప 02:35
27/01 2 రా 12:32
02/02 3 ప 11:02
07/02 4 రా 10:05
13/02 జ్యేష్ఠ 1 ప 09:50
18/02 2 రా 10:23
24/02 3 ప 11:57
01/03 4 రా 02:34
07/03 మూల 1 సా 06:25
13/03 2 ప 11:36

**బుధ చారః**

**రాశి ప్రవేశ కాలః**

**2017**

03/06 వృషభం రా 07:55
18/06 మిథునం రా 10:50
02/07 కర్కాటకం రా 03:05
21/07 సింహం ప 10:20
26/09 కన్య రా 12:30
13/10 తుల రా 11:50
01/11 వృశ్చికం రా 12:45
24/11 ధనుస్సు ప 01:55
10/12 వృశ్చికం రా 04:20

**2018**

06/01 ధనుస్సు రా 07:50
27/01 మకరం రా 01:05
14/02 కుంభం రా 03:25
03/03 మీనం ఉ 06:55

**నక్షత్ర పాదాదుల ప్రవేశ కాలః**

**2017**

29/03 అశ్విని 2 సా 05:49
01/04 3 సా 05:31
06/04 4 ప 01:33
**09/04 వక్రారంభః రా 04:44**
**12/04 పశ్చాదస్తమయం ప 04:00**
13/04 అశ్విని 3 రా 12:11
19/04 2 రా 09:00
24/04 1 సా 05:48
**27/04 ప్రాగుదయం రా 11:10**
**03/05 వక్రత్యాగః రా 09:52**
12/05 అశ్విని 2 రా 01:01
17/05 3 ఉ 06:08
20/05 4 ప 01:58
23/05 భరణి 1 ప 11:25
25/05 2 రా 01:47
28/05 3 ప 11:19
30/05 4 సా 05:03
01/06 కృత్తిక 1 రా 07:50
03/06 2 రా 07:55
05/06 3 సా 05:37
07/06 4 ప 01:34
09/06 రోహిణి 1 ప 07:55
**09/06 ప్రాగస్తమయం సా 05:08**
10/06 రోహిణి 2 రా 12:44
12/06 3 ప 04:22
14/06 4 ఉ 07:02
15/06 మృగశిర 1 రా 08:55
17/06 2 ప 10:03
18/06 3 రా 10:50
20/06 4 ప 11:20
21/06 ఆర్ద్ర 1 రా 11:50
23/06 2 ప 12:21
24/06 3 రా 01:12
26/06 4 ప 02:29
27/06 పునర్వసు 1 రా 04:25
29/06 2 రా 07:00
01/07 3 ప 10:31
02/07 4 రా 03:05
04/07 పుష్యమి 1 రా 08:50
**05/07 పశ్చాదుదయం ప 11:03**
06/07 పుష్యమి 2 ప 03:51
08/07 3 ప 12:20
10/07 4 ప 10:26
12/07 ఆశ్రేష 1 ప 10:25
14/07 2 ప 12:23
16/07 3 ప 04:45
18/07 4 రా 11:52
21/07 మఘ 1 ప 10:20
23/07 2 రా 01:04
26/07 3 రా 09:36
29/07 4 రా 02:38
02/08 పూ.ఫల్గుని 1 రా 11:10
08/08 2 సా 06:28
**13/08 వక్రారంభః ఉ 06:18**
17/08 పూ.ఫల్గుని 1 ప 02:37
**20/08 పశ్చాదస్తమయం రా 09:52**
22/08 మఘ 4 రా 11:10
26/08 3 సా 06:07
30/08 మఘ 2 సా 05:53
**03/09 ప్రాగుదయం ఉ 07:19**
**05/09 వక్రత్యాగః సా 05:06**
11/09 మఘ 3 ప 08:48
14/09 4 ప 03:24
16/09 పూ.ఫల్గుని 1 రా 03:55
19/09 2 ప 08:24
21/09 3 ప 09:00
**21/09 ప్రాగస్తమయం రా 07:21**
23/09 పూ.ఫల్గుని 4 ఉ 07:17
24/09 ఉ.ఫల్గుని 1 రా 04:15
26/09 2 రా 12:30
28/09 3 రా 08:22
30/09 4 ప 04:18
02/10 హస్త 1 ప 12:30
04/10 2 ప 08:57
06/10 3 ఉ 05:56
07/10 4 రా 03:28
09/10 చిత్ర 1 రా 01:40
11/10 2 రా 12:24
13/10 3 రా 11:50
15/10 4 రా 11:58
17/10 స్వాతి 1 రా 12:50
19/10 2 రా 02:14
21/10 3 రాతె04:22
24/10 4 ఉ 07:09
26/10 విశాఖ 1 ప 10:35
28/10 2 ప 02:39
30/10 3 రా 07:22
**31/10 పశ్చాదుదయం రా 09:05**
01/11 విశాఖ 4 రా 12:45
04/11 అనూరాధ 1 ఉ 06:45
06/11 2 ప 01:30
08/11 3 రా 09:06
11/11 4 ఉ 05:42
13/11 జ్యేష్ఠ 1 ప 03:40
15/11 2 రా 03:15
18/11 3 సా 05:32
21/11 4 ప 11:55
24/11 మూల 1 ప 01:55
28/11 2 ప 12:08
**03/12 వక్రారంభః ప 12:35**
**07/12 పశ్చాదస్తమయం రా 07:00**
07/12 మూల 1 రా 01:44
10/12 జ్యేష్ఠ 4 రా 04:20
13/12 3 ప 03:23
15/12 2 రా 04:10
**18/12 ప్రాగుదయం ప 04:12**
19/12 జ్యేష్ఠ 1 సా 06:28
**23/12 వక్రత్యాగః ప 07:46**
26/12 జ్యేష్ఠ 2 రాతె04:48
31/12 3 ప 04:07

**2018**

03/01 జ్యేష్ఠ 4 రా 10:45
06/01 మూల 1 రా 07:50
09/01 2 ప 11:39
11/01 3 రా 12:26
14/01 4 ప 11:04
16/01 పూ.షాఢ 1 రా 08:10
18/01 2 రా 03:48
21/01 3 ప 10:26
23/01 4 ప 04:07
25/01 ఉ.షాఢ 1 రా 09:00
**27/01 ప్రాగస్తమయం ప 01:20**
27/01 ఉ.షాఢ 2 రా 01:05
29/01 3 రాతె04:16
01/02 4 ఉ 06:45
03/02 శ్రవణం 1 ప 08:30
05/02 2 ప 09:28
07/02 3 ప 09:42
09/02 4 ప 09:12
11/02 ధనిష్ఠ 1 ప 08:00
13/02 2 ఉ 06:01
14/02 3 రా 03:25
16/02 4 రా 12:02
18/02 శతభిషం 1 రా 08:10
20/02 2 ప 03:34
22/02 3 ప 10:35
23/02 4 రాతె05:11
25/02 పూ.భాద్ర 1 రా 11:30
27/02 2 సా 05:44
01/03 3 ప 12:05
03/03 4 ఉ 06:55
04/03 ఉ.భాద్ర 1 రా 02:35
**05/03 పశ్చాదుదయం రా 03:05**
06/03 ఉ.భాద్ర 2 రా 11:46
08/03 3 రా 11:27
10/03 4 రా 03:15
13/03 రేవతి 1 ప 02:35
16/03 2 రా 07:16

**గురు చారః**

**2017 రాశి ప్రవేశ కాలః**

12/09 తుల ఉ 06:35

**నక్షత్ర పాదాదుల ప్రవేశ కాలః**

**2017**

14/04 హస్త 4 ప 02:15
16/05 3 ప 12:15
**09/06 వక్రత్యాగ: రా 07:33**
04/07 హస్త 4 ప 08:31
04/08 చిత్ర 1 ప 08:50

# స్వస్తి శ్రీ చాన్ద్రమాన హేమలంబ నామ సంవత్సర పంచాంగం 2017-2018



25/08 2 ప 08:37
12/09 3 ఉ 06:35
28/09 4 ప 04:34
**11/10 పశ్చాదస్తమయం రా 04:20**
14/10 స్వాతి 1 ప 08:15
**08/11 ప్రాగుదయం ప 03:50**
13/11 స్వాతి 2 రా 12:06
29/11 3 సా 06:38
16/12 విశాఖ 1 ప 12:25

**2018**

03/01 విశాఖ 2 రాతె05:49
27/01 3 రా 09:09
**09/03 వక్రారంభః ప 10:15**

**శుక్రచారః**

**రాశి ప్రవేశ కాలః**

**2017**

31/05 మేషం ప 08:55
29/06 వృషభం రా 07:35
26/07 మిథునం సా 05:05
21/08 కర్కాటకం ప 10:50
15/09 సింహం ప 10:30
09/10 కన్య రా 09:25
02/11 తుల రా 12:00
26/11 వృశ్చికం రా 10:10
20/12 ధనుస్సు రా 06:30

**2018**

13/01 మకరం ప 02:45
06/02 కుంభం ప 12:00
02/03 మీనం ప 11:40

**నక్షత్ర పాదాదుల ప్రవేశ కాలః**

**2017**

**29/03 ప్రాగుదయం ప 11:59**
01/04 ఉ.భాద్ర 1 సా 05:51
10/04 పూ.భాద్ర 4 ప 02:45
**15/04 వక్రత్యాగః ప 03:48**
20/04 ఉ.భాద్ర 1 రా 08:15
30/04 2 ప 10:05
06/05 3 ప 10:38
11/05 4 ప 10:55
15/05 రేవతి 1 రా 10:35
19/05 2 రా 02:02
23/05 3 రా 12:02
27/05 4 సా 06:00
31/05 అశ్విని 1 ప 08:55
03/06 2 రా 09:14
07/06 3 ఉ 07:35
10/06 4 ప 04:12
13/06 భరణి 1 రా 11:25
16/06 2 రా 05:18
20/06 3 ప 10:07
23/06 4 ప 02:02
26/06 కృత్తిక 1 సా 05:10
29/06 2 రా 07:35
02/07 3 రా 09:13
05/07 4 రా 10:22
08/07 రోహిణి 1 రా 11:00
11/07 2 రా 11:02
14/07 3 రా 10:39
17/07 4 రా 09:50
20/07 మృగశిర 1 రా 08:40
23/07 2 రా 07:00
26/07 3 సా 05:05
29/07 4 ప 02:49
01/08 ఆర్ద్ర 1 ప 12:20
04/08 2 ప 09:26
07/08 3 ఉ 06:19
09/08 4 రా 02:56
12/08 పునర్వసు 1 రా 11:20
15/08 2 రా 07:21
18/08 3 ప 03:11
21/08 4 ప 10:50
24/08 పుష్యమి 1 ఉ 06:15
26/08 2 రా 01:23
29/08 3 రా 08:23
01/09 4 ప 03:11
04/09 ఆశ్రేష 1 ప 09:50
06/09 2 రాతె04:15
09/09 3 రా 10:30
12/09 4 ప 04:34
15/09 మఖ 1 ప 10:30
17/09 2 రాతె04:12
20/09 3 రా 09:48
23/09 4 ప 03:15
26/09 పూ.ఫల్గుని 1 ప 08:35
28/09 2 రా 01:46
01/10 3 సా 06:50
04/10 4 ప 11:48
06/10 ఉ.ఫల్గుని 1 రా 04:40
09/10 2 రా 09:25
12/10 3 ప 01:59
15/10 4 ఉ 06:31
17/10 హస్త 1 రా 11:00
20/10 2 ప 03:17
23/10 3 ఉ 07:32
25/10 4 రా 11:45
28/10 చిత్ర 1 ప 03:55
31/10 చిత్ర 2 ఉ 07:57
02/11 3 రా 12:00
05/11 4 ప 03:56
08/11 స్వాతి 1 ఉ 07:55
10/11 2 రా 11:43
13/11 3 ప 03:31
16/11 4 ఉ 07:17
18/11 విశాఖ 1 రా 11:05
21/11 2 ప 02:45
24/11 3 ఉ 06:26
26/11 4 రా 10:10
**28/11 ప్రాగస్తమయం రా 10:28**
29/11 అనూరాధ 1 ప 01:50
01/12 2 రాతె05:24
04/12 3 రా 09:01
07/12 4 ప 12:38
09/12 జ్యేష్ఠ 1 రా 04:15
12/12 2 రా 07:48
15/12 3 ప 11:23
17/12 4 రా 02:56
20/12 మూల 1 సా 06:30
23/12 2 ప 10:03
25/12 3 రా 01:36
28/12 4 సా 05:10
31/12 పూర్వాషాఢ1 ప 08:45

**2018**

02/01 2 రా 12:19
05/01 3 ప 03:55
08/01 4 ఉ 07:30
10/01 ఉ.షాఢ 1 రా 11:10
13/01 2 ప 02:45
16/01 3 ఉ 06:18
18/01 4 రా 09:56
21/01 శ్రవణం 1 ప 01:35
23/01 2 రాతె05:13
26/01 3 రా 08:55
29/01 4 ప 12:38
31/01 ధనిష్ఠ 1 రా 04:25
03/02 2 రా 08:08
06/02 3 ప 12:00
08/02 4 రా 03:45
11/02 శతభిషం 1 రా 07:40
14/02 2 ప 11:29
16/02 3 రా 03:23
**19/02 పశ్చాదుదయం ప 12:58**
19/02 శతభిషం 4 రా 07:20
22/02 పూ.భాద్ర 1 ప 11:25
24/02 2 రా 03:23
27/02 3 రా 07:30
02/03 పూ.భాద్ర 4 ప 11:40
04/03 ఉ.భాద్ర 1 రా 03:55
07/03 2 రా 08:09
10/03 3 ప 12:28
12/03 4 రాతె04:51
15/03 రేవతి 1 రా 09:20
18/03 2 ప 01:47

**శని చారః**

**2017 రాశి ప్రవేశ కాలః**

20/06 వృశ్చికం రా 05:20
26/10 ధనుస్సు ప 03:05

**నక్షత్ర పాదాదుల ప్రవేశ కాలః**

**2017**

**06/04 వక్రారంభః ప 09:10**
27/04 మూల 1 రా 07:21
20/06 జ్యేష్ఠ 4 రా 05:20
**25/08 వక్రత్యాగః ప 04:04**
26/10 మూల 1 ప 03:05
28/11 2 ప 08:20
**05/12 పశ్చాదస్తమయం ప 11:16**
26/12 మూల 3 రా 10:56

**2018**

**07/01 ప్రాగుదయం సా 05:14**
25/01 మూల 4 ఉ 06:11
02/03 పూర్వాషాఢ1 రా 11:00

**రాహు చారః**

**2017 రాశి ప్రవేశ కాలః**

18/08 కర్కాటకం ఉ 06:33

**నక్షత్ర పాద ప్రవేశ కాలః**

**2017**

14/04 మఖ 2 ప 11:13
16/06 1 ప 09:01
18/08 ఆశ్రేష 4 ఉ 06:33
19/10 3 రాతె04:15
21/12 ఆశ్రేష 2 రా 01:52

**2018**

22/02 1 రా 11:36

**కేతు చారః**

**2017 రాశి ప్రవేశ కాలః**

18/08 మకరం ఉ 06:33

**నక్షత్ర పాద ప్రవేశ కాలః**

**2017**

14/04 ధనిష్ఠ 4 ప 11:13
16/06 3 ప 09:01
18/08 2 ఉ 06:33
19/10 1 రాతె04:15
21/12 శ్రవణం 4 రా 01:52

**2018**

22/02 3 రా 11:36

# శుభ ముహూర్తములు 2017 - 2018

## చైత్రమాసము (మార్చి - ఏప్రిల్)

| తేది | పక్షం | తిథి | వారం | నక్షత్రం | లగ్నం | సమయము | ముహూర్తములు | వివరములు / విశేషములు |
|---|---|---|---|---|---|---|---|---|
| మార్చి | | | | | | | | |
| 28 | శుక్ల | ప్రతిపత్ | మంగళ | ఉత్తరాభాద్ర | వృషభం | ప 09:52 | **నూతన వస్త్రధారణం, రాజదర్శనం** | రవి గురుల శుభాధిక్యత |
| ఏప్రిల్ | | | | | | | | |
| 01 | శుక్ల | షష్ఠి | శని | రోహిణి | వృశ్చికం | రా 10:00 | **శు**భసమయం | కోణస్థ శుక్రబలం |
| 01/02 | శుక్ల | షష్ఠి | శని | రోహిణి | మకరం | రా 02:14 | **శు**భసమయం | మీనాంశ, బుధ గురుల శుభాధిక్యత |
| 02 | శుక్ల | షష్ఠి | ఆది | మృగశిర | కర్కాటకం | ప 01:22 | **శు**భసమయం | బుధ శుక్రుల శుభాధిక్యత |
| 03/04 | శుక్ల | అష్టమి | సోమ | పునర్వసు | మకరం | రా 02:31 | **శు**భసమయం | బుధ గురుల శుభాధిక్యత |
| 05 | శుక్ల | దశమి | బుధ | పుష్యమి | కర్కాటకం | ప 01:10 | **శు**భసమయం | వసుపంచకం, బుధ శుక్రుల శుభాధిక్యత |
| 05 | శుక్ల | దశమి | బుధ | పుష్యమి | వృశ్చికం | రా 10:02 | **శం**కుస్థాపన, **గృ**హప్రవేశం, **శు**భసమయం | తులాంశ, కోణస్థ శుక్రబలం |
| 07 | శుక్ల | ద్వాదశి | శుక్ర | మఘ | కర్కాటకం | ప 01:46 | **శు**భసమయం | ధనురంశ, బుధ శుక్రుల శుభాధిక్యత |
| 07 | శుక్ల | ద్వాదశి | శుక్ర | మఘ | వృశ్చికం | రా 09:54 | **వి**వాహం, **శం**కుస్థాపన, **గృ**హప్రవేశం, **శు**భసమయం | తులాంశ, కోణస్థ శుక్రబలం |
| 09 | శుక్ల | చతుర్దశి | ఆది | ఉత్తరఫల్గుని | కర్కాటకం | ప 12:55 | **శు**భసమయం | రాజపంచకం, బుధ శుక్రుల శుభాధిక్యత |
| 09 | శుక్ల | చతుర్దశి | ఆది | ఉత్తరఫల్గుని | వృశ్చికం | రా 10:12 | **వి**వాహం, **శు**భసమయం | మతాంతర రహితం, ధనురంశ, కోణస్థ శుక్రబలం |
| 09/10 | శుక్ల | చతుర్దశి | ఆది | హస్త | మకరం | రా 02:25 | **వి**వాహం, **శు**భసమయం | మతాంతర రహితం, మిథునాంశ, కోణస్థ గురుబలం |
| 10 | శుక్ల | పూర్ణిమ | సోమ | హస్త | వృశ్చికం | రా 10:08 | **వి**వాహం, **శు**భసమయం | అగ్నిపంచకం, ధనురంశ, కోణస్థ శుక్రబలం |
| 12 | కృష్ణ | ద్వితీయ | బుధ | స్వాతి | వృశ్చికం | రా 09:59 | **వి**వాహం, **శు**భసమయం | మ.ర., ధనురంశ, రిఃఫచంద్రః, కోణస్థ శుక్రబలం |
| 12/13 | కృష్ణ | ద్వితీయ | బుధ | స్వాతి | మకరం | రా 01:56 | **వి**వాహం, **శు**భసమయం | రాజపంచకం, బుధ గురుల శుభాధిక్యత |
| 14/15 | కృష్ణ | చతుర్థి | శుక్ర | అనూరాధ | మీనం | రా 05:01 | **శం**కుస్థాపన, **శు**భసమయం | తులాంశ, గురు శుక్రుల శుభాధిక్యత |
| 15 | కృష్ణ | చతుర్థి | శని | అనూరాధ | మిథునం | ప 11:33 | **అ**న్నప్రాశన, **శు**భసమయం | రాజపంచకం, షష్ఠచంద్రః, షష్ఠభావే శనిః, లాభస్థరవిబలం |
| 15 | కృష్ణ | చతుర్థి | శని | అనూరాధ | కర్కాటకం | ప 12:30 | **శు**భసమయం | కోణస్థ శుక్రబలం |
| 16/17 | కృష్ణ | షష్ఠి | ఆది | మూల | మకరం | రా 01:39 | **వి**వాహం, **శు**భసమయం | సగ్రహ రిఃఫచంద్రః, బుధ గురుల శుభాధిక్యత |
| 16/17 | కృష్ణ | షష్ఠి | ఆది | మూల | మీనం | రా 05:11 | **శం**కుస్థాపన, **శు**భసమయం | అగ్నిపంచకం, ధనురంశ, గురు శుక్రుల శుభాధిక్యత |
| 17 | కృష్ణ | షష్ఠి | సోమ | మూల | మిథునం | ప 11:25 | **అ**న్నప్రాశన, **శు**భసమయం | షష్ఠ భావే శనిః |
| 17 | కృష్ణ | షష్ఠి | సోమ | మూల | కర్కాటకం | ప 12:22 | **శు**భసమయం | మతాంతర రహితం, బుధ శుక్రుల శుభాధిక్యత |



నామకరణాదులు, సామాన్య వ్యాపార వ్యవహారాదులు, సామాన్య ప్రయాణములు, రిజిస్ట్రేషన్లు, ఆపరేషన్లు, ముఖ్యమైన సమావేశములు మొ॥ వాటికి **శుభసమయము (శు.స)** ను **సందర్భానుగుణముగా** ఉపయోగించుకొనవచ్చును.

| తేది | పక్షం | తిథి | వారం | నక్షత్రం | లగ్నం | సమయము | ముహూర్తములు | వివరములు / విశేషములు |
|---|---|---|---|---|---|---|---|---|
| ఏప్రిల్ | | | | | | | | |
| 19 | కృష్ణ | అష్టమి | బుధ | ఉత్తరాషాఢ | మిథునం | ప 11:17 | అన్నప్రాశన, శుభసమయం | షష్ఠ భావే శనిః |
| 20 | కృష్ణ | నవమి | గురు | శ్రవణం | కర్కాటకం | ప 12:10 | శుభసమయం | మతాంతర రహితం, బుధ శుక్రుల శుభాధిక్యత |
| 20/21 | కృష్ణ | నవమి | గురు | ధనిష్ఠ | మీనం | రా 04:37 | శంకుస్థాపన, గృహప్రవేశం, శుభసమయం | రాజపంచకం, తులాంశ, గురు శుక్రుల శుభాధిక్యత |
| 21/22 | కృష్ణ | దశమి | శుక్ర | ధనిష్ఠ | మకరం | రా 01:20 | వివాహం, శుభసమయం | రాజపంచకం, కోణస్థ గురుబలం |
| 21/22 | కృష్ణ | దశమి | శుక్ర | శతభిషం | మీనం | రా 04:33 | శంకుస్థాపన, గృహప్రవేశం, శుభసమయం | తులాంశ, గురు శుక్రుల శుభాధిక్యత |
| 22/23 | కృష్ణ | ఏకాదశి | శని | శతభిషం | మకరం | రా 01:16 | వివాహం, శుభసమయం | కోణస్థ గురుబలం |

## వైశాఖమాసము (ఏప్రిల్ – మే)

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఏప్రిల్ | | | | | | | | |
| 28/29 | శుక్ల | తృతీయ | శుక్ర | రోహిణి | మకరం | రా 12:52 | వివాహం, శుభసమయం | బుధ గురుల శుభాధిక్యత |
| 29 | శుక్ల | చతుర్థి | శని | రోహిణి | మిథునం | ప 10:38 | అన్నప్రాశన, శుభసమయం | షష్ఠ భావే శనిః, రవి బుధ గురు శుక్రుల శుభాధిక్యత |
| 29/30 | శుక్ల | చతుర్థి | శని | మృగశిర | మకరం | రా 12:48 | వివాహం, శుభసమయం | వసుపంచకం, బుధ గురుల శుభాధిక్యత |
| మే | | | | | | | | |
| 01 | శుక్ల | షష్ఠి | సోమ | పునర్వసు | మిథునం | ప 10:30 | అన్నప్రాశన, శుభసమయం | షష్ఠ భావే శనిః, రవి బుధ గురు శుక్రుల శుభాధిక్యత |
| 04 | శుక్ల | నవమి | గురు | మఘ | కర్కాటకం | ప 11:15 | అన్నప్రాశన, ఉపనయనం, వివాహం, శంకుస్థాపన, శు.స. | మతాంతర రహితం, బుధ శుక్రుల శుభాధిక్యత |
| 06 | శుక్ల | ఏకాదశి | శని | ఉత్తరఫల్గుని | కర్కాటకం | ప 11:07 | అన్నప్రాశన, వివాహం, శంకుస్థాపన, శు.స. | బుధ శుక్రుల శుభాధిక్యత |
| 06/07 | శుక్ల | ద్వాదశి | శని | ఉత్తరఫల్గుని | మీనం | రా 03:20 | శంకుస్థాపన, శుభసమయం | గురు శుక్రుల శుభాధిక్యత |
| 07 | శుక్ల | ద్వాదశి | ఆది | హస్త | కర్కాటకం | ప 11:04 | అన్నప్రాశన, ఉపనయనం, వివాహం, శు.స. | ప్రదోషః, బుధ శుక్రుల శుభాధిక్యత |
| 07/08 | శుక్ల | త్రయోదశి | ఆది | హస్త | మీనం | రా 03:16 | శుభసమయం | గురు శుక్రుల శుభాధిక్యత |
| 08 | శుక్ల | త్రయోదశి | సోమ | చిత్ర | కర్కాటకం | ప 11:00 | అన్నప్రాశన, వివాహం, శుభసమయం | మతాంతర రహితం, బుధ శుక్రుల శుభాధిక్యత |
| 10 | శుక్ల | పూర్ణిమ | బుధ | స్వాతి | కర్కాటకం | ప 10:52 | అన్నప్రాశన, వివాహం, శుభసమయం | మతాంతర రహితం, బుధ శుక్రుల శుభాధిక్యత |
| 11 | కృష్ణ | ప్రతిపత్ | గురు | అనూరాధ | మకరం | రా 11:46 | వివాహం, శుభసమయం | మ.ర., మీనాంశ, బుధ గురు శుక్రుల శుభాధిక్యత |
| 11/12 | కృష్ణ | ప్రతిపత్ | గురు | అనూరాధ | మీనం | రా 03:00 | శుభసమయం | మతాంతర రహితం, గురు శుక్రుల శుభాధిక్యత |
| 12 | కృష్ణ | ద్వితీయ | శుక్ర | అనూరాధ | కర్కాటకం | ప 10:44 | అన్నప్రాశన, ఉపనయనం, వివాహం, శు.స. | మతాంతర రహితం, బుధ శుక్రుల శుభాధిక్యత |
| 13 | కృష్ణ | తృతీయ | శని | మూల | మకరం | రా 11:53 | వివాహం, శుభసమయం | రిఃఫచంద్రః, బుధ గురుల శుభాధిక్యత |
| 14 | కృష్ణ | చతుర్థి | ఆది | మూల | కర్కాటకం | ప 10:36 | అన్నప్రాశన, ఉపనయనం, వివాహం, శు.స. | మ.ర., ప్రదోషః, సగ్రహ షష్ఠచంద్రః, బుధశుక్రుల శుభాధిక్యత |



నామకరణాదులు, సామాన్య వ్యాపార వ్యవహారాదులు, సామాన్య ప్రయాణములు, రిజిస్ట్రేషన్లు, ఆపరేషన్లు, ముఖ్యమైన సమావేశములు మొ॥ వాటికి **శుభసమయము (శు.స)** ను **సందర్భానుగుణముగా** ఉపయోగించుకొనవచ్చును.

# సింహ రాశి



**సౌర గోచారము : సింహ మాసములో పుట్టిన వారికి**
**చాంద్ర గోచారము : మఘ, పూర్వఫల్గుని; ఉత్తరఫల్గుని 1**
**నామనక్షత్రము : మా, మీ, మూ, మే, మో, టా, టీ, టు, టే**
**ఆదాయం 2, వ్యయం 14, రాజపూజ్యం 2, అవమానం 2**

**గురువు** : సెప్టెంబరు 11 వరకు 2న లోహమూర్తి. అనారోగ్యభావన, మానసిక ఆందోళన, అన్ని రంగాలలో అడ్డంకులు ఏర్పడును. తదాది వత్సరపర్యన్తం 3న తామ్రమూర్తి. కార్యసిద్ధిని, అనారోగ్యమును కలుగ చేయును.

**శని** : జనవరి 26 వరకు 5న రజతమూర్తి. మానసిక కష్టములు, అనవసర చికాకులు తరచు కలుగును. తదాది అక్టోబరు 26 వరకు 4న రజతమూర్తి. శ్రమ ఎక్కువ, ఫలితము తక్కువ. తదాది వత్సరపర్యన్తం 5న లోహమూర్తి. అన్ని రంగాలలోను మానసిక ఆందోళన, చికాకులు పెరుగును.

**రాహువు** : ఆగష్టు 17 వరకు 1న రజతమూర్తి. శ్రమకు తగిన ఫలితములు కలుగును. శ్రమ ఎక్కువ, ఫలితములు తక్కువగా ఉండును. తదాది వత్సరపర్యన్తం 12న సువర్ణమూర్తి. కొంచెం లాభము, అనారోగ్యం, చికాకులు పెరుగును.

**కేతువు** : ఆగష్టు 17 వరకు 7న రజతమూర్తి. శ్రమకు తగిన ఫలితములు కలుగును. తదాది వత్సరపర్యన్తం 6న సువర్ణమూర్తి. లాభం, సంతోషం, సౌఖ్యము వృద్ధి చెందును.

**వేధగోచారం :-** ఏప్రిల్ 14 వరకు **గురు** గ్రహానుకూల్యత బాగున్నది. తదాది ఆగష్టు 3 వరకు ఆనుకూల్యత లేదు. తదాది అక్టోబరు 13 వరకు ఆనుకూల్యత బాగున్నది. తదాది సంవత్సరాంతము వరకు ఆనుకూల్యత లేదు. సంవత్సరమంతా **శని** గ్రహానుకూల్యత బాగున్నది. సంవత్సరమంతా **రాహు** గ్రహానుకూల్యత లేదు. ఆగష్టు 17 వరకు **కేతు** గ్రహానుకూల్యత బాగున్నది. తదాది సంవత్సరాంతము వరకు ఆనుకూల్యత లేదు.

మొత్తము మీద ఈ రాశి వారికి ఈ సంవత్సరము స్థితి, వేధ గోచారములు పూర్తి అనుకూలముగా కాకున్నను వ్యతిరేకము మాత్రము కాదు. కొద్ది శ్రమతో శుభకార్యములు సకాలంలో నిర్విఘ్నంగా పూర్తిచేస్తారు. ఆర్థిక విషయాలలో తగు జాగ్రత్తలు పాటించవలసిన అవసరం ఏర్పడుతుంది. విద్యార్థుల విద్యా వ్యాసంగము కొంత నత్తనడకగా సాగుతుంది. వృత్తి వ్యాపార వ్యవహారాలలో కొంత మందకొడితనం ఉన్నప్పటికిని మొత్తం మీద లక్ష్యానికి చేరుకుంటారు. ఆరోగ్యం విషయములో తరచు కొంత ఇబ్బందులు ఉంటూంటాయి.

**చైత్రం :** ఈ మాసములో కుజ, బుధ, రాహువులు శుభులు. శుక్రుడు అర్ధశుభుడు. కొన్ని సౌకర్యాలు అనుభవిస్తారు. ఆకస్మిక ధన లాభమునకు అవకాశం ఉన్నది. విద్యార్థులు అధ్యాపకుల స్థాయిని బట్టి మసులుకోవాలి. సంతానమునకు అభివృద్ధి, శత్రువులపై విజయం, స్త్రీ సౌఖ్యం, మిత్రుల సహకారం, దానధర్మములు చేయుట, మాతృవంశ అభివృద్ధి, గృహనిర్మాణాలు చేపట్టెదరు. మాసాంతమున ఊహించని సన్నివేశాలు మీ విషయంలో విస్మయాన్ని కలుగ చేస్తాయి.

**వైశాఖం :** ఈ మాసములో గురు, రాహువులు శుభులు. బుధుడు అర్ధశుభుడు. అపూర్వ వస్తు సంప్రాప్తి, కీర్తి ప్రతిష్ఠలు, మిత్రుల ప్రోత్సాహం, ఉద్యోగములలో రాణింపు, కళత్ర అనారోగ్యము, గుర్రపు పందెములలో ధననష్టము, గృహనిర్మాణములు చేపడతారు. పాత బకాయిలు వసూళ్ళు అవుతాయి. కొత్త పరిచయాలకు ఈ మాసం అనుకూలం. నూతన ప్రయాణములకు అవకాశాలు కలుగును. అధికారులను, ప్రముఖులను సంప్రదిస్తారు. అన్ని సమస్యలు నిదానంగా తొలుగుతాయి.

**జ్యేష్ఠం :** ఈ మాసములో గురువు శుభుడు. బుధ, శుక్రులు అర్ధశుభులు. వివాహాది శుభకార్యములు నెరవేరుట, వాహన సౌఖ్యం, సంఘంలో పేరు, రాజకీయ నాయకుల పరిచయము, ప్రభుత్వం వారితో సఖ్యత, వ్యాపారమందు సంతృప్తి కలుగును. కోర్టు వ్యవహారాదులలో విజయం సాధిస్తారు. మీ పనితీరులో ఆకస్మికమైన వింత మార్పు జరిగే సూచనలున్నాయి. ఆర్థిక పరిస్థితి మెరుగు పడుతుంది.

**ఆషాఢం :** ఈ మాసములో రవి, బుధ, గురులు శుభులు. శుక్రుడు అర్ధశుభుడు. భవిష్య ప్రణాళికలకు అనువైన కాలము. కొత్త పరిచయాలకు ఈ మాసం అనుకూలం. మీ సమర్థతలకు గుర్తింపు లభిస్తుంది. వైద్యులకు, లాయర్లకు పదోన్నతి, గౌరవము కలుగును. వైజ్ఞానిక, ఆధ్యాత్మిక సమావేశాలలో, సదస్సులలో పాల్గొంటారు. కోర్టు వ్యాపారములు, వ్యవహారములు అనుకూలముగా ఉండును. ఆశించిన ద్రవ్యం కాని, కావలసిన వస్తువులు కాని త్వరలో పొందుతారు. ఒక ప్రముఖ ఆధ్యాత్మిక గురువు దర్శనం కలుగుతుంది.

**శ్రావణం :** ఈ మాసములో రవి, గురులు శుభులు. బుధ, శుక్రులు అర్ధశుభులు. వివాహాది శుభకార్యములు స్థిరపడగలవు. గత అనుభవాలు గుర్తుకు వస్తాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. కొనుగోళ్ళ విషయంలో శ్రద్ధ అవసరము. సంతానమునకు అభివృద్ధి కలుగును. వైజ్ఞానిక, ఆధ్యాత్మికచర్చలలో పాల్గొంటారు. వ్యాపారస్థులకు నష్టములు, ధననష్టములు, బంధు, మిత్ర విరోధములు, శారీరిక ఇబ్బందులు, మొదలగునవి కలుగును. త్రిప్పుట, అలసట ఎక్కువ. భార్యాబిడ్డల వ్యతిరేక భావములను మౌనముతో వీక్షింపవలెను. విద్యుత్ సరఫరాలో భేదము వలన ప్రమాదము రాకుండా చూచుకొనవలెను.

**భాద్రపదం :** ఈ మాసములో గురు, శుక్రులు శుభులు. రవి, బుధులు అర్ధశుభులు. యోగ, ధ్యాన, ఆరాధనలు, ఏకాగ్రత చర్చలు, దర్యాప్తు విచారణలు, విందులు, వినోదాలు అనుకూలిస్తాయి. ద్వితీయార్థంలో కాంట్రాక్టు పనుల వలన లాభములు, భూమి కొనుట, పదవీ లాభము సిద్ధించును. అవసరమైనప్పుడు సహాయము చేయు స్నేహితులు, ఆటల పోటీలయందు, జ్యోతిశ్శాస్త్రమందు ప్రావీణ్యము కలుగుట, నూతన వ్యవహార వ్యాజ్యములందు జయం కలుగును.

**ఆశ్వయుజం :** ఈ మాసములో గురు, శుక్రులు శుభులు. మతపరమైన విషయాలపై ఆసక్తి పెరుగుతుంది. విద్యార్థులు అనవసరపు ఆందోళనకు గురవుతారు. కళాకారులకు, విద్వాంసులకు గుర్తింపు, పురస్కారాలు లభిస్తాయి. మాసాంతంలో పరిమితులు తప్పిన ఆహారపానీయాల వల్ల ఆరోగ్య ఇబ్బందులు పెడుతుంది. స్పెక్యులేషన్ చేసేవారు ఆందోళనకు గురవుతారు. ఉద్యోగవిషయాలలో అత్యంత జాగ్రత్త వహించాలి. మాట పట్టింపులకు పోరాదు. పుచ్చుకునే వ్యవహారాలలో మెలకువ వహించాలి.

**కార్తికం :** ఈ మాసములో కుజ, బుధ, గురు, శుక్రులు శుభులు. రవి అర్ధశుభుడు. వాహన సౌఖ్యం, సంఘంలో పేరు, రాజకీయ నాయకుల పరిచయము, ప్రభుత్వ అధికారులతో సఖ్యత, వ్యాపారమందు సంతృప్తి కలుగును. కుటుంబ సౌఖ్యము పెరుగును. భాగస్వాములలో కలహము, ఆకస్మిక ప్రయాణములు, ధననష్టం కలుగును.

**మార్గశిరం :** ఈ మాసములో రవి, కుజ, బుధ, గురు, శుక్రులు శుభులు. కొద్దిగా భాగస్వాములలో కలహము, ధననష్టం, ఆకస్మిక ప్రయాణములు, శారీరిక ఇబ్బందులు కలుగును. ఆరోగ్యముపై శ్రద్ధ చూపవలెను. శక్తికి మించిన కార్యములు చేయవలసి వచ్చును. మాసాంతమున దానధర్మములు చేయుట, పదవీ లాభము సిద్ధించును. భూ సంబంధ ప్రయత్నములు ఫలించును. గృహంలో మార్పులకు, చేర్పులకు ఇది తగిన సమయం. ఆధ్యాత్మిక చింతన పెరుగుతుంది.

**పుష్యం :** ఈ మాసములో కుజ, గురు, శుక్రులు శుభులు. రవి, బుధులు అర్ధశుభులు. ప్రథమార్థంలో ఉద్యోగస్తులకు అధిక శ్రమ, తోటివారితో మనస్పర్థలు చికాకు కల్గించును. కళాశాల వ్యవహారాలు, పత్రికా వ్యాసాలు మీలో చురుకుదనాన్ని కలిగిస్తాయి. వ్యవహారిక శైలిలో దాపరికం అవసరం. వ్యాపారస్తులు జాగ్రత్తగా ముందుకు సాగవలెను. ఆర్థిక నష్టము రాకుండా ఉండుటకై జాగ్రత్త వహించవలెను. మానసిక ఆందోళన, అయిన వారితో పేచీల వలన చికాకు పొందుతారు.

**మాఘం :** ఈ మాసములో కుజ, గురులు, శుభులు. శుక్రుడు అర్ధశుభుడు. ఆర్థికంగా కొంత అనుకూలత పెరుగుతుంది. జాయింట్ వ్యవహారాలలో బయట వారి సహాయ సహకారాలు అందుతాయి. కొన్ని సౌకర్యాలు అనుభవిస్తారు. మధ్య మధ్య అనవసరపు ఆందోళనలకు గురవుతారు. పిల్లల వివాహ వృత్తి విషయాలలో బంధువుల సహకారాలుంటాయి. రివర్షన్ లేక సస్పెండు అయ్యే సూచనలు ఉన్నాయి. రహస్య అనుబంధాలు ఆందోళన కలిగిస్తాయి. విధుల నిర్వహణలో అకుంఠిత దీక్ష చూపిస్తారు.

**ఫాల్గునం :** ఈ మాసములో కుజ, గురులు శుభులు. బుధ, శుక్రులు అర్ధశుభులు. విలువైన వస్తు సేకరణ, పొదుపు పథకాల విషయంలో ఏమరుపాటుగా ఉండాలి. మిత్రులను దూరం పెట్టే అవకాశం ఉన్నది. ఎవరి విషయంలో మీకు ఆసక్తి, అనురాగం ఉన్నాయో వారి మూలంగా మీకు ఆనందం కలగకపోవచ్చు. పైకి చురుకుగా కనపడక పోయినప్పటికి విద్యార్థులు పరీక్షలలో విజయాలను పొందుతారు. అరుగుదల లోపం, అధిక శ్రమ ఇబ్బంది పెడతాయి. రావలసిన బాకీలపై శ్రద్ధ చూపించాలి.

**ఈ రాశి వారు ఈ సంవత్సరం ప్రతిరోజు శ్రీ గాయత్రీ సహస్ర నామ స్తోత్ర పారాయణ చేసుకున్న ఉత్తమ ఫలితములను పొందగలరు.**

## కన్యా రాశి



**సౌర గోచారము : కన్యా మాసములో పుట్టిన వారికి**

**చాంద్ర గోచారము: ఉత్తరఫల్గుని 2, 3, 4; హస్త; చిత్ర 1, 2**

**నామ నక్షత్రము : టో, పా, పి, పూ, షం, ణ, ఠ, పే, పో**

**ఆదాయం 5, వ్యయం 5, రాజపూజ్యం 5, అవమానం 2**

**గురువు** : సెప్టెంబరు 11 వరకు 1న తామ్రమూర్తి. పలుకుబడికి నష్టము కలుగును. తదాది వత్సరపర్యంతం 2న రజతమూర్తి. ఆర్థిక ఇబ్బందులు కొంత సర్దు కుంటాయి. మంచి చెడులు మిశ్రమముగా ఉండును. విఘ్నములు ఎక్కువ. అయినను సంతృప్తిగ వ్యవహార జయము కలుగును.

**శని** : జనవరి 26 వరకు 4న లోహమూర్తి. అనారోగ్యభావన, మానసిక ఆందోళన పెరుగును. అన్ని రంగాలలో అడ్డంకులుండును. తదాది అక్టోబరు 26 వరకు 3న లోహమూర్తి. ఇరుగుపొరుగుతో చికాకులు ఏర్పడును. తదాది వత్సరపర్యంతం 4న తామ్రమూర్తి. అనారోగ్యం, ధనవ్యయం, చికాకులు ఎక్కువగా ఉండును. ఎంత శ్రమ చేసినను ఫలితము తక్కువగానే ఉండును.

**రాహువు** : ఆగష్టు 17 వరకు 12న సువర్ణమూర్తి. అనారోగ్యం, కొంచెం లాభము కనబడును. చికాకులు పెరుగును. తదాది వత్సరపర్యంతం 11న తామ్ర మూర్తి. కొద్దిపాటి నష్టంతో లాభము కలుగచేయును.

**కేతువు** : ఆగష్టు 17 వరకు 6న సువర్ణమూర్తి. సంతోషం, లాభం, సౌఖ్యము వృద్ధి చెందును. తదాది వత్సరపర్యంతం 5న తామ్రమూర్తి. ఊహించని మానసిక చికాకులు ఎక్కువగును. తరచు సంతానమునకు ఆరోగ్య భంగములు కలుగును.

**వేధగోచారం :-** అక్టోబరు 13 వరకు **గురు** గ్రహానుకూల్యత లేదు. తదాది డిశంబరు 16 వరకు అనుకూల్యత బాగున్నది. తదాది సంవత్సరాంతము వరకు అనుకూల్యత లేదు. జూన్ 20 వరకు **శని** గ్రహానుకూల్యత లేదు. తదాది అక్టోబరు 26 వరకు అనుకూల్యత బాగున్నది. తదాది సంవత్సరాంతము వరకు అనుకూల్యత లేదు. సంవత్సరమంతా **రాహు, కేతు** గ్రహానుకూల్యతలు బాగున్నవి.

మొత్తము మీద ఈ రాశి వారికి ఈ సంవత్సరము స్థితి, వేధ గోచారములు రెండిట శుభానుకూలత తక్కువగా ఉన్నది. శుభకార్యములకు ఆర్థిక ఇబ్బందులు, విఘ్నాలు ఎక్కువగా ఎదురవుతూ ఉంటాయి. విద్య, ఆరోగ్య, ఆర్థిక విషయాలలో వ్యతిరేకతలు ఎక్కువగా ఉంటాయి. విద్యార్థులు ప్రత్యేక కృషి ఎక్కువ పెట్టవలసిన అవసరం వస్తుంది. వ్యక్తిగత విషయాలను గోప్యంగా ఉంచడం మంచిది. సన్నిహితులతో హద్దులలో ఉండటం చాలా మంచిది. ఏమరపాటుగా ఉన్న మీ కర్తవ్య నిర్వహణలో అయిన వారి ద్వారా అపనిందలు పడే అవకాశాలు ఉన్నాయి. వ్యాపారస్థులకు క్రొత్త వ్యాపారములు మొదలు పెట్టుటకు ఈ సంవత్సరము అనుకూలము కాదు.

**చైత్రం :** ఈ మాసములో రవి, బుధ, గురు, శుక్ర, రాహువులు శుభులు. భవిష్య ప్రణాళికలకు అనువైన కాలము. మీ సమర్ధతలకు గుర్తింపు లభిస్తుంది. వైద్యులకు, లాయర్లకు, ఇంజనీర్లకు, కాంట్రాక్టర్లకు బిల్లుల వసూళ్ళు ఆలస్యమగు సూచనలు కలవు. శాస్త్రవేత్తలకు ప్రోత్సాహం, గుర్తింపు లభిస్తాయి. ఒక ప్రముఖ ఆధ్యాత్మిక గురువు దర్శనం కలుగు తుంది. కోర్టు వ్యాపారములు, వ్యవహారములు అనుకూలముగా ఉండును. ఆశించిన ద్రవ్యం కాని, కావలసిన వస్తువులు కాని త్వరలో పొందుతారు.

**వైశాఖం :** ఈ మాసములో కుజ,శుక్ర,రాహువులు శుభులు. రవి, బుధులు అర్ధశుభులు. పిల్లల వివాహాది శుభకార్యములు నెరవేరుస్తారు. విద్యార్థులకు చదువు మీద శ్రద్ధ తగ్గి, ఇతర విషయముల మీద శ్రద్ధ పెరుగుతుంది. వాహన ప్రమాదములు కలుగు సూచనలున్నాయి. కోర్టు వ్యవహారములు స్తంభించును. శక్తికి మించిన కార్యములు చేయవలసివచ్చును. మాసాంతమున పెద్దలతో ఆంతరంగిక చర్చలు ఫలిస్తాయి. శ్రమకు తగిన ప్రతిఫలం పొందుతారు. చేపట్టిన పనులు ముగింపు దశకు వస్తాయి.

**జ్యేష్ఠం :** ఈ మాసములో శుక్రుడు శుభుడు. కుజుడు అర్ధశుభుడు. శుభకార్యక్రమాలకు తరచు అవరోధాలు కలుగుతూ ఉంటాయి. కొన్ని పరిమితులను, నియమ నిబంధనలను అనుసరించ వలసి వస్తుంది. భార్యాభర్తల మధ్య సయోధ్య లోపిస్తుంది. మీ బాధ్యతలు పెరుగుతాయి. మానసిక చింతన ఎక్కువ. ఊహించని సన్నివేశాలు విస్మయాన్ని కలుగ చేస్తాయి. ఉద్యోగ రంగంలో, ఆర్థిక విషయాలలో వత్తిడి ఎక్కువవుతుంది. ఆరోగ్యం మందగిస్తుంది. పనులలో చికాకు పెరుగుతుంది.

**ఆషాఢం :** ఈ మాసములో బుధ శుక్రులు అర్ధశుభులు. విద్యార్థులు వారి భవిష్య కార్యక్రమాలను గోప్యంగా ఉంచటం మంచిది. మీ వ్యక్తిగత విషయాలలో జోక్యం చేసుకుని ఉచిత సలహాలు చెప్పేవారిని సహించక తప్పదు. మాతృవర్గపు బంధువులతో విరోధములు, ధననష్టం, కటువుగా మాట్లాడుట కలుగును. ద్వితీయార్థంలో ఆర్థిక వ్యవహారాలు చక్కబడ తాయి. ఆరోగ్యం మెరుగుపడుతుంది. విద్యార్థులకు విదేశీమోజు చాలా వరకు తగ్గుతుంది. ఇంజనీరింగ్ విద్యార్థులు పరీక్షలలో బాగా రాణిస్తారు.

**శ్రావణం :** ఈ మాసములో బుధుడు అర్ధశుభుడు. కొన్ని పరిమితులను, నియమ నిబంధనలను అనుసరించవలసి వస్తుంది. కృషి రంగంలో మీ బాధ్యతలు పెరుగుతాయి. ఊహించని సన్నివేశాలు మీ విషయంలో విస్మయాన్ని కలుగచేస్తాయి. పనులు మందకొడిగా సాగును. ఫైనాన్స్ వ్యాపారులు ఆచితూచి వ్యవహరించవలెను. గృహనిర్మాణంలో ప్రతిష్ఠంభన, వివాహాది శుభకార్యములు ఆలస్యమగు సూచనలు, అప్పులు చేయవలసిన పరిస్థితులు ఏర్పడును. ఉద్యోగులకు ఆటంకములతో కూడిన వేతన అభివృద్ధి కలుగును. మాసమధ్యంలో కొన్ని సమస్యలు పరిష్కారవుతాయి.

**భాద్రపదం :** ఈ మాసములో కుజ, బుధులు అర్ధశుభులు. మతపరమైన విషయాలపై ఆసక్తి పెరుగుతుంది. ఇచ్చి పుచ్చుకునే వ్యవహారాలలో మెలకువ వహించాలి. విద్యార్థులు అనవసరపు ఆందోళనకు గురవుతారు. కళాకారులకు, విద్వాంసులకు గుర్తింపు, పురస్కారాలు లభిస్తాయి. మాసాంతంలో విశ్రాంతి లోపం, వేళలు, పరిమితులు తప్పిన ఆహార పానీయాల వల్ల ఆరోగ్య ఇబ్బందులు పెడుతుంది. స్పెక్యులేషన్ చేసేవారు ఆందోళనకు గురవుతారు. మాట పట్టింపులకు పోరాదు.

**ఆశ్వయుజం :** ఈ మాసములో శుక్రుడు శుభుడు. కుజ, బుధులు అర్ధ శుభులు. వివాహాదులు నెరవేరుట, వాహన సౌఖ్యం, సంఘంలో పేరు, ప్రభుత్వం వారితో సఖ్యత, వ్యాపారమందు సంతృప్తి కలుగును. కోర్టు వ్యవహారాదులలో విజయం సాధిస్తారు. మీ పనితీరులో ఆకస్మికమైన మార్పులున్నాయి. ఆర్థికస్థితి మెరుగుపడుతుంది. ఆధ్యాత్మిక, వైజ్ఞానిక విషయాలలో ఆసక్తి, కళా సారస్వత విషయాలలో ప్రోత్సాహం పెరుగుతుంది.

**కార్తికం :** ఈ మాసములో రవి, బుధులు శుభులు. వివాహాది శుభ కార్యములు అతి ప్రయాసతో నెరవేరును. కళాకారులకు, ఆధ్యాత్మిక రంగాలలోని వారికి అభివృద్ధి కలుగును. నిరుద్యోగులకు ఉపాధి కలుగును. ధనాభివృద్ధి సిద్ధించును. సంతానమునకు స్వల్పముగా ఆరోగ్యభంగములు, కళత్ర విరోధము ఏర్పడును. మాసాంతములో అనుకూలంగా ఉన్నది. ప్రయత్న పూర్వకముగా చేసిన పనులలో కొన్నింట విజయమును సాధించగలరు.

**మార్గశిరం :** ఈ మాసములో రవి, బుధ, శుక్రులు శుభులు. పిల్లల వివాహాది శుభకార్యములు నెరవేరుస్తారు. విద్యార్థులకు చదువు మీద శ్రద్ధ తగ్గుతుంది. వాహన ప్రమాదములు కలుగు సూచనలున్నాయి. కోర్టు వ్యవహారములు స్తంభించును. శక్తికి మించిన కార్యములు చేయవలసివచ్చును. మాసాంతమున శ్రమకు తగిన ప్రతిఫలం పొందుతారు. చేపట్టిన పనులు ముగింపు దశకు వస్తాయి. మీ నివాసంలో మార్పులు, స్నేహితుల సహాయ సహకారములు బాగా లభిస్తాయి.

**పుష్యం :** ఈ మాసములో బుధ, శుక్రులు శుభులు.రవి అర్ధశుభుడు. శుభకార్యక్రమాలకు ఈ మాసం చాలా బాగున్నది. ఒక ప్రముఖ ఆధ్యాత్మిక గురువు దర్శనం కలుగుతుంది. తీర్థ యాత్రలు చేయుట, భార్యా భర్తలకు అవగాహన, స్త్రీమూలక ధనం, వ్యాపారాభివృద్ధి, ఋణ విముక్తి, నవవస్త్రాభరణ ప్రాప్తి, కళత్ర సౌఖ్యము, రాజకీయ నాయకులకు పదవీ యోగం, భూ వివాదం పరిష్కారమగుట కలుగును. వైజ్ఞానిక, ఆధ్యాత్మిక సమావేశాలలో, సదస్సులలో పాల్గొంటారు.

**మాఘం :** ఈ మాసములో శుక్రుడు శుభుడు, బుధుడు అర్ధ శుభుడు. బంధువులతో విరోధములు, కటువుగా మాట్లాడుట కలుగును. సాహస ప్రయత్నాలు పనికిరావు. రాజకీయ నాయకులు తొందరపడి వాగ్దానాలు చేసి చిక్కుల్లో పడతారు. ఋణ ప్రయత్నాలు ఫలించే అవకాశాలు తక్కువ. విద్యారంగంలో ఉన్నవారు ఆందోళనకు గురవుతారు. ప్రైవేటు సంస్థలలోని వారికి బరువు బాధ్యతలు అధికమవుతాయి.

**ఫాల్గునం :** ఈ మాసములో బుధుడు శుభుడు. రవి, శుక్రులు అర్ధశుభులు. ప్రాణాయామం వంటి యోగ ప్రక్రియలకు అనుకూలమైన సమయం. కుటుంబ సభ్యుల మాటతీరు మీకు రుచించక పోవచ్చు. ఫైనాన్స్, చిట్‌ఫండ్ రంగాలలో వారికి కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి. గొప్పవారితో స్నేహము, వారి మూలకముగా ధనసిద్ధి కలుగును. ద్వితీయార్థంలో కార్యకర్తలలో వచ్చిన మార్పు రాజకీయవాదులకు ఆందోళన కలిగిస్తుంది.

**ఈ రాశి వారు ఈ సంవత్సరం ప్రతిరోజు శ్రీ దత్తాత్రేయ స్తోత్ర పారాయణ చేసుకున్న ఉత్తమ ఫలితములను పొందగలరు.**

# తులా రాశి



**సౌర గోచారము : తులా మాసములో పుట్టిన వారికి**
**చాంద్ర గోచారము : చిత్ర 3, 4; స్వాతి; విశాఖ 1, 2, 3**
**నామ నక్షత్రము : రా, రి, రూ, రే, రో, తా, తీ, తూ, తే**
**ఆదాయం 2, వ్యయం 8, రాజపూజ్యం 1, అవమానం 5**

**గురువు** : సెప్టెంబరు 11 వరకు 12న రజతమూర్తి. అంతటా శ్రమతో కూడిన విజయము సిద్ధించును. తదాది వత్సరపర్యన్తం 1న లోహమూర్తి. అపకీర్తి అనారోగ్యములు, ధననష్టము పెరుగును.

**శని** : జనవరి 26 వరకు 3న తామ్రమూర్తి. కార్యసిద్ధిని, అనారోగ్యమును కలుగ చేయును. తదాది అక్టోబరు 26 వరకు 2న తామ్రమూర్తి. మాట విలువ, ఆర్థిక పురోగతి తగ్గును. తదాది వత్సరపర్యన్తం 3న రజతమూర్తి. మంచి చెడుల మిశ్రమముగా ఉండును.

**రాహువు** : ఆగష్టు 17 వరకు 11న లోహమూర్తి. అన్ని రంగములలో చికాకులు పెరుగును. తదాది వత్సరపర్యన్తం 10న రజతమూర్తి. శ్రమతో కూడిన లాభము చేకూరగలదు. శ్రమ తక్కువ, ఫలితము ఎక్కువ. శుభకార్యము లకు విఘ్నములు ఎక్కువగును.

**కేతువు** : ఆగష్టు 17 వరకు 5న లోహమూర్తి. అన్ని రంగములలోను మానసిక ఆందోళన, చికాకులు పెరుగును. తదాది వత్సరపర్యన్తం 4న రజతమూర్తి. శ్రమ ఎక్కువ, ఫలితము తక్కువ.

**వేధగోచారం :-** డిశంబరు 16 వరకు **గురు** గ్రహానుకూల్యత లేదు. తదాది సంవత్సరాంతము వరకు ఆనుకూల్యత బాగున్నది. జూన్ 20 వరకు **శని** గ్రహానుకూల్యత బాగున్నది. తదాది అక్టోబరు 26 వరకు ఆనుకూల్యత లేదు. తదాది డిశంబరు 26 వరకు ఆనుకూల్యత బాగున్నది. తదాది సంవత్సరాంతము వరకు ఆనుకూల్యత లేదు. సంవత్సరమంతా **రాహు, కేతు** గ్రహానుకూల్యతలు బాగున్నవి.

మొత్తము మీద ఈ రాశివారికి ఈ సంవత్సరము అంతా స్థితి వేధ గోచారములు శుభాశుభ మిశ్రమముగా ఉన్నవి. వృత్తివ్యవహారాలలో పురోగతి ఉన్నప్పటికిని తరచు ఎదురయ్యే వివాదాస్పద వ్యవహారాలకు దూరంగా ఉండటం చాలా మంచిది. ఆర్థిక వ్యవహారాలలో తగు జాగ్రత్తలు తీసుకోవాలి. మీపై వచ్చే నిరాధార నిందలను గూర్చి పట్టించుకోకుండా మీ కర్తవ్యాన్ని నిర్వహించుకోవడం ద్వారా ఉన్నత ఫలితాలను పొందుతారు. అన్నిరంగాల వారు కూడా కొన్ని వత్తిళ్ళు ఎదుర్కొనవలసి వస్తుంది. వ్యక్తిగత విషయాలను గోప్యంగా ఉంచడం మంచిది. విద్య, ఆరోగ్య, ఆర్థిక, సామాజిక విషయాలలో మరింత జాగ్రత్తగా ఉండవలసిన అవసరం.

**చైత్రం :** ఈ మాసములో రవి, గురు, శుక్ర, శని, రాహువులు శుభులు. ఆధ్యాత్మిక చింతన పెరుగుతుంది. దానధర్మములు చేయుట, స్త్రీ సౌఖ్యం, విదేశీ ప్రయాణము సిద్ధించును. గృహంలో మార్పులకు, చేర్పులకు ఇది తగిన సమయం. సంతానాభివృద్ధికై చేసిన వ్యయము సత్ఫలితమును ఇవ్వగలదు. ఆకస్మిక ధన లాభమునకు అవకాశం ఉన్నది.మాసాంతమున కొద్దిగా భాగస్వాములలో కలహము, ధననష్టం, ఆకస్మిక ప్రయాణములు, శారీరిక ఇబ్బందులు, శక్తికి మించిన కార్యములు చేయవలసి వచ్చును.

**వైశాఖం :** ఈ మాసములో రవి, శని, రాహువులు శుభులు. కుజ, బుధ, శుక్రులు అర్ధశుభులు. వివాహాది శుభకార్యములు నెరవేరుట, వాహన సౌఖ్యం, సంఘంలో పేరు, రాజకీయ నాయకుల పరిచయము, ప్రభుత్వం వారితో సఖ్యత, వ్యాపారమందు సంతృప్తి కలుగును. కోర్టు వ్యవహారాదులలో విజయం సాధిస్తారు. మీ పనితీరులో ఆకస్మికమైన వింత మార్పు జరిగే సూచనలున్నాయి. విద్యా కళా సారస్వత విషయాలలో ప్రోత్సాహం, ఆధ్యాత్మిక, వైజ్ఞానిక విషయాలలో ఆసక్తి పెరుగుతుంది.

**జ్యేష్ఠం :** ఈ మాసములో కుజ, శుక్ర, శని, కేతువులు శుభులు. రవి, బుధులు, అర్ధశుభులు. వివాహాది శుభకార్యములు స్థిరపడగలవు. గత అనుభవాలు గుర్తుకు వస్తాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. కొనుగోళ్ళ విషయంలో శ్రద్ధ అవసరము. సంతానమునకు అభివృద్ధి కలుగును. వైజ్ఞానిక, ఆధ్యాత్మిక చర్చలలో పాల్గొంటారు. భార్యాబిడ్డల వ్యతిరేక భావములను మౌనముతో వీక్షింపవలెను.

**ఆషాఢం :** ఈ మాసములో బుధ, శుక్ర, శని, కేతువులు శుభులు.కుజుడు అర్ధశుభుడు. పాత బకాయిలు వసూళ్ళు అవుతాయి. కొత్త పరిచయాలకు ఈ మాసం అనుకూలం. దైవ సందర్శనము, మిత్రుల సహకారం, దానధర్మములు చేయుట, భార్యాభర్తల మధ్య అవగాహన, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. మీ సమర్థతలకు గుర్తింపు లభిస్తుంది. ఇంజనీర్లకు, కాంట్రాక్టర్లకు బిల్లుల వసూళ్ళు ఆలస్యమగు సూచనలు కలవు. నూతన ప్రయాణములకు అవకాశాలు కలుగును. శాస్త్రవేత్తలకు ప్రోత్సాహం, గుర్తింపు లభిస్తాయి. అధికారులను, ప్రముఖులను సంప్రదిస్తారు.

**శ్రావణం :** ఈ మాసములో శుక్ర,శని,కేతువులు శుభులు. రవి, బుధులు అర్ధశుభులు. పిల్లల వివాహాది శుభకార్యములు నెరవేరుస్తారు. విద్యార్థులకు చదువు మీద శ్రద్ధ తగ్గి, ఇతర విషయముల మీద శ్రద్ధ పెరుగుతుంది. నేత్ర, శిరోరోగ బాధలు కలుగును. వాహన ప్రమాదములు కలుగు సూచనలున్నాయి. కోర్టు వ్యవహారములు స్తంభించును. మాసాంతమున పెద్దలతో ఆంతరంగిక చర్చలు ఫలిస్తాయి. శ్రమకు తగిన ప్రతిఫలం పొందుతారు. చేపట్టిన పనులు ముగింపు దశకు వస్తాయి. మీ నివాసంలో కాని, ఆఫీసులో కాని మార్పులు, చేర్పులు, సట్ల సర్దుబాట్లు, సామగ్రుల ఏర్పాట్లు జరుగవచ్చు.

**భాద్రపదం :** ఈ మాసములో రవి,శుక్ర,శని, కేతువులు శుభులు. బుధుడు అర్ధశుభుడు. శుభకార్యక్రమాలకు ఈమాసం చాలా బాగున్నది. ఒక ప్రముఖ ఆధ్యాత్మిక గురువు దర్శనం కలుగుతుంది. తీర్థయాత్రలు చేయుట, భార్యా భర్తలకు అవగాహన, స్త్రీమూలక ధనం, వ్యాపారాభివృద్ధి, ఋణ విముక్తి, నవవస్త్రాభరణ ప్రాప్తి, కళత్ర సౌఖ్యము, రాజకీయ నాయకులకు పదవీ యోగం, భూ వివాదం పరిష్కారమగుట కలుగును. ఆధ్యాత్మిక సమావేశాలలో పాల్గొంటారు. దూరపు బంధు మిత్రులు దగ్గరవుతారు.

**ఆశ్వయుజం :** ఈ మాసములో శుక్ర,శని,కేతువులు శుభులు. రవి అర్ధ శుభుడు. కొన్ని సౌకర్యాలు అనుభవిస్తారు. ఆకస్మిక ధన లాభమునకు అవకాశం ఉన్నది. విద్యార్థులు అధ్యాపకుల స్థాయిని బట్టి మసులుకోవాలి. సంతానమునకు అభివృద్ధి, శత్రువులపై విజయం, గృహనిర్మాణాలు చేపట్టెదరు. అప్పులు వసూలు చేయటంలో నైపుణ్యాన్ని చూపిస్తారు. కొన్ని సమస్యలు పరిష్కారవుతాయి.

**కార్తికం :** ఈ మాసములో శుక్ర, కేతువులు శుభులు.శని అర్ధశుభుడు. ఉద్యోగులకు బదిలీలు సక్రమంగా ఉండవు. విలాస వస్తువులకై ధనము విరివిగా ఖర్చు చేస్తారు. విద్యార్థులకు అసంతృప్తి పెరుగును. అకాల భోజనములు, ఉద్యోగులకు స్థానచలనములు, మేనమామలతో విరోధం కలుగును. భూ, గృహ సంబంధ విషయాలలో చికాకులు పెరుగుతాయి. ద్వితీయార్ధంలో వ్యవహారాదుల్లో జయం, కుటుంబమున స్త్రీ సహాయ సహకారములు, వంట చేయుట యందు నిపుణత, స్పెక్యులేషన్ ద్వారా ఆకస్మిక ధనప్రాప్తి, ఆధ్యాత్మిక రంగాలలోని వారికి అభివృద్ధి కలుగును.

**మార్గశిరం :** ఈ మాసములో కేతువు శుభుడు. కొన్ని పరిమితులను, నియమ నిబంధనలను అనుసరించవలసి వస్తుంది. భార్యాభర్తల మధ్య సయోధ్య లోపిస్తుంది. కృషి రంగంలో మీ బాధ్యతలు పెరుగుతాయి. మానసిక చింతన ఎక్కువ. ఊహించని సన్నివేశాలు మీ విషయంలో విస్మయాన్ని కలుగచేస్తాయి. గృహనిర్మాణంలో ప్రతిష్ఠంభన, వివాహాది శుభ కార్యములు ఆలస్యమగు సూచనలు, అప్పులు చేయవలసిన పరిస్థితులు ఏర్పడును. మార్కెటింగ్, పర్యాటక రంగాల వారికి పదోన్నతి కలుగుతుంది. బంధువుల సహకారం, గృహంలో శుభకార్యములు సిద్ధించును.

**పుష్యం :** ఈ మాసములో కేతువు శుభుడు. బుధుడు అర్ధశుభుడు. వివాహాది శుభకార్యములు అతిప్రయాసతో నెరవేరును. కళాకారులకు, ఆధ్యాత్మిక రంగాలలోని వారికి అభివృద్ధి కలుగును. నిరుద్యోగులకు ఉపాధి కలుగును. ధనాభివృద్ధి సిద్ధించును. సంతానమునకు స్వల్పముగా ఆరోగ్యభంగములు, కళత్ర విరోధము ఏర్పడును. విద్యార్థులు శ్రమ పడినచో కొన్నింటిలోనైనా విజయమును సాధించగలరు.

**మాఘం :** ఈ మాసములో శుక్ర, కేతువులు శుభులు. బుధుడు అర్ధశుభుడు. కొత్త ఆలోచనలకు, కొత్త పథకాలకు అనుకూలం. పుణ్య కార్యాలు, వైదిక కార్యాలకు విరాళాలు వెచ్చిస్తారు. ఉద్యోగ, వృత్తి, వ్యాపారాలలో ప్రోత్సాహం లభిస్తుంది. పెద్దలతో ఆంతరంగిక చర్చలు ఫలిస్తాయి. స్త్రీల వలన మనోచింతన కలుగును. ఆరోగ్యము మెరుగవును.

**ఫాల్గునం :** ఈ మాసములో కేతువు శుభుడు. బుధుడు అర్ధశుభుడు. కుటుంబ వ్యవహారములు చికాకులు కలిగిస్తాయి. భార్యాభర్తల మధ్య అవగాహన తక్కువగా ఉంటుంది. తల్లి ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చేయటం మంచిది కాదు. అధికారులతో విరోధాలు పెరుగుతాయి. ద్వితీయార్ధంలో పైకి చురుకుగా కనపడక పోయినప్పటికి విద్యార్థులు పరీక్షలలో విజయాలను పొందుతారు. ఉద్యోగ సంబంధ వ్యవహారాలలో కోర్టు వ్యాజ్యాలు ఉన్నవారు ఈ మాసంలో వాయిదా కోరటం మంచిది.

**ఈ రాశివారు ఈ సంవత్సరం ప్రతిరోజు శ్రీ దుర్గాపదుద్ధార స్తోత్ర పారాయణ చేసుకున్న ఉత్తమ ఫలితములను పొందగలరు.**

## వృశ్చిక రాశి



**సౌర గోచారము : వృశ్చిక మాసములో పుట్టిన వారికి**
**చాంద్ర గోచారము : విశాఖ 4; అనూరాధ, జ్యేష్ఠ**
**నామ నక్షత్రము : తో, నా, నీ, నూ, నె, నో, యా, యీ, యు**
**ఆదాయం 8, వ్యయం 14, రాజపూజ్యం 4, అవమానం 5**

**గురువు** : సెప్టెంబరు 11 వరకు 11న సువర్ణమూర్తి. అన్ని రంగములలో శుభాధిక్యత పెరుగును. తదాది వత్సరపర్యన్తం 12న తామ్రమూర్తి. ఖర్చులు బాగా పెరుగును. అభివృద్ధి తక్కువ, శత్రుబాధ ఎక్కువగాను ఉండును.

**శని** : జనవరి 26 వరకు 2న రజతమూర్తి. మంచి చెడులు మిశ్రమముగా ఉండును. ఆర్థిక ఇబ్బందులు కొంత సర్దుకుంటాయి. కుటుంబమునకు కొంత ఆర్థిక వృద్ధి కలుగును. తదాది అక్టోబరు 26 వరకు 1న సువర్ణ మూర్తి. వివాహాది మంగళకార్యములు అతికష్టమున నెరవేరును. తదాది వత్సరపర్యన్తం 2న సువర్ణమూర్తి. విరోధములు ఎర్పడినను, శ్రమ మీద కార్యసిద్ధి యగును.

**రాహువు** : ఆగష్టు 17 వరకు 10న సువర్ణమూర్తి. అంతటా అడ్డంకులు తొలగి జయము కలుగును. తక్కువ శ్రమ, ఎక్కువ లాభం. తదాది వత్సరపర్యన్తం 9న లోహమూర్తి. తరచు రుగ్మత, వ్యవహారములందు వ్యతిరేకత కలుగును. నిదానంగా అన్ని పనులు నెరవేరుతాయి.

**కేతువు** : ఆగష్టు 17 వరకు 4న సువర్ణమూర్తి. అయినవారి సహాయ సహకారములు బాగా లభించును. తదాది వత్సరపర్యన్తం 3న లోహమూర్తి. ఇరుగు పొరుగుతో చికాకులు ఏర్పడును.

**వేధగోచారం :-** సంవత్సరమంతా **గురు** గ్రహానుకూల్యత లేదు. సంవత్సరమంతా **శని, రాహు, కేతు** గ్రహానుకూల్యతలు బాగున్నవి.

మొత్తము మీద ఈ రాశి వారికి ఈ సంవత్సరము వేధ గోచారము, స్థితి గోచారము కొంత అనుకూలముగానే ఉన్నవి. కొద్ది శ్రమతో శుభకార్యములు సకాలంలో నిర్విఘ్నంగా పూర్తిచేస్తారు. ఆర్థిక విషయాలలో తగు జాగ్రత్తలు పాటించవలసిన అవసరం ఏర్పడుతుంది. విద్యార్థుల విద్యా వ్యాసంగము కొంత నత్తనడకగా సాగుతుంది. వృత్తి, వ్యాపార వ్యవహారాలలో కొంత మందకొడితనం ఉన్నప్పటికిని మొత్తం మీద లక్ష్యానికి చేరుకుంటారు. ఆరోగ్యం విషయములో తరచు ఇబ్బందులు ఉంటూంటాయి. భాగస్వామ్య వ్యవహారాలు కొంత లాభిస్తాయి.

**చైత్రం :** ఈ మాసములో కుజ, శుక్ర, కేతువులు శుభులు. రవి అర్ధశుభుడు. వాహన సౌఖ్యం, సంఘంలో పేరు, రాజకీయ నాయకుల పరిచయము, ప్రభుత్వ అధికారులతో సఖ్యత ఈ మాసంలో కలుగును. కుటుంబ సౌఖ్యము పెరుగును. గత మాసము కంటే అప్పుల బాధ తగ్గుతుంది. ఆకస్మిక ప్రయాణములు, ధననష్టం కలుగును. సోదరులతో మైత్రీ ప్రయత్నములు చురుకుగా సాగుతాయి. ఉద్యోగులకు, అధికారులకు సంఘంలో భేదాభిప్రాయములు పెరుగును. నిరుద్యోగులకు ఉపాధి లభించును.

**వైశాఖం :** ఈ మాసములో శుక్ర, కేతువులు శుభులు. విద్యార్థులు వారి భవిష్య కార్యక్రమాలను గోప్యంగా ఉంచటం మంచిది. మీ వ్యక్తిగత విషయాలలో జోక్యం చేసుకుని ఉచిత సలహాలు చెప్పేవారిని సహించక తప్పదు. మాతృవర్గపు బంధువులతో విరోధములు, మానసిక ఇబ్బందులు, ఆర్థిక సమస్యలు, అనారోగ్యం, ధననష్టం, కటువుగా మాట్లాడుట కలుగును. ద్వితీయార్థంలో ఆర్థిక వ్యవహారాలు చక్కబడతాయి. ఆరోగ్యం మెరుగు పడుతుంది. విద్యార్థులకు విదేశీమోజు చాలా వరకు తగ్గుతుంది.

**జ్యేష్ఠం :** ఈ మాసములో శుక్ర, రాహువులు శుభులు. బుధుడు అర్ధ శుభుడు. పిల్లల వివాహాది శుభకార్యములు నెరవేరుస్తారు. విద్యార్థులకు చదువు మీద శ్రద్ధ తగ్గి, ఇతర విషయముల మీద శ్రద్ధ పెరుగుతుంది. శిరోరోగ బాధలు కలుగును. వాహన ప్రమాదములు కలుగు సూచనలు ఉన్నాయి. కోర్టు వ్యవహారములు స్తంభించును. శక్తికి మించిన కార్యములు చేయవలసివచ్చును. మాసాంతమున పెద్దలతో ఆంతరంగిక చర్చలు ఫలిస్తాయి. శ్రమకు తగిన ప్రతిఫలం పొందుతారు.

**ఆషాఢం :** ఈ మాసములో రాహువు శుభుడు. కుజ, బుధులు అర్ధ శుభులు. మీ వ్యక్తిగత విషయాలలో జోక్యం చేసుకుని ఉచిత సలహాలు చెప్పేవారిని సహించక తప్పదు. తోడబుట్టిన వారి ఈర్ష్య, అసూయలకు లోనగుతారు. విద్యార్థులు వారి భవిష్య కార్యక్రమాలను గోప్యంగా ఉంచటం మంచిది. మాతృవర్గపు బంధువులతో మానసిక ఇబ్బందులు, ఆర్థిక సమస్యలు, అనారోగ్యం, ధననష్టం, కటువుగా మాట్లాడుట కలుగును. సాహస ప్రయత్నాలు పనికిరావు. ఋణ ప్రయత్నాలు ఫలించే అవకాశాలు తక్కువగా ఉన్నాయి. విద్యారంగంలో ఉన్నవారు ఆందోళనకు గురవుతారు.

**శ్రావణం :** ఈ మాసములో కుజ, రాహువులు శుభులు. బుధుడు అర్ధశుభుడు. వివాహాది శుభకార్యములు అతిప్రయాసతో నెరవేరును. కళాకారులకు, ఆధ్యాత్మిక రంగాలలోని వారికి అభివృద్ధి కలుగును. నిరుద్యోగులకు ఉపాధి కలుగును. వ్యవసాయదారులకు వాతావరణం అనుకూలించక చికాకుగా ఉంటుంది. మాసాంతములో అనుకూలంగా ఉన్నది. విదేశీప్రయాణము భూ, గృహ సంబంధ ప్రయత్నములు ఫలించును. ప్రయత్న పూర్వకముగా చేసిన పనులలో కొన్నింట విజయమును సాధించగలరు.

**భాద్రపదం :** ఈ మాసములో శుక్ర, రాహువులు శుభులు. కుజ, బుధులు అర్ధశుభులు. మీ శ్రమకు తగిన ప్రతిఫలము దక్కుతుంది. వ్యాపారస్థులకు అనుకూలమైన సమయమే అయినప్పటికి భాగస్వాములతో మెలకువ అవసరం. కోపమును తగ్గించుకోవాలి. ఉద్యోగులకు కోరిన చోట్లకు బదిలీలు పొందగలరు. నిరుద్యోగులకు ప్రభుత్వ ఉద్యోగ అవకాశం తక్కువ. స్నేహితులతో జాగ్రత్తగా ఉండాలి. ఋణబాధలు తగ్గును.

**ఆశ్వయుజం :** ఈ మాసములో రవి, రాహువులు. శుభులు. కుజ బుధులు అర్ధశుభులు. శుభకార్యక్రమాలకు ఈమాసం చాలా బాగున్నది. ఒక ప్రముఖ ఆధ్యాత్మిక గురువు దర్శనం కలుగుతుంది. తీర్థయాత్రలు చేయుట, భార్యా భర్తలకు అవగాహన, స్త్రీమూలక ధనం, వ్యాపారాభివృద్ధి, ఋణ విముక్తి, నవవస్త్రాభరణ ప్రాప్తి, కళత్ర సౌఖ్యము కలుగును. వైజ్ఞానిక, ఆధ్యాత్మిక సమావేశాలలో, సదస్సులలో పాల్గొంటారు. దూరపు బంధు మిత్రులు దగ్గరవుతారు. కోర్టు వ్యాపారములు, వ్యవహారములు అనుకూలముగా ఉండును. ఆశించిన వస్తువులు త్వరలో పొందుతారు.

**కార్తికం :** ఈ మాసములో రవి, బుధ, శుక్ర, రాహువులు శుభులు. ప్రథమార్ధంలో క్రీడలపై, కళలపై ఆసక్తి పెరుగుతుంది. చిన్న తరహా పరిశ్రమల వారికి, చేతిపని వారికి పురోభివృద్ధి. ట్రాన్స్‌పోర్ట్ రంగంలోని వారికి కాస్త ఆందోళన తప్పదు. ద్వితీయార్థం నుండి వృత్తి వ్యాపారములందు మంచి చెడ్డలు సమానంగా ఉండును. నిర్మాణ ప్రయత్నములకు అంతరాయములు ఎక్కువగును. చేతిలో పని ముగింపు దశకు వస్తుంది.

**మార్గశిరం :** ఈ మాసములో బుధ, శుక్ర, రాహువులు శుభులు. రవి అర్ధశుభుడు. అపూర్వ వస్తు సంప్రాప్తి, కీర్తి ప్రతిష్ఠలు, మిత్రుల ప్రోత్సాహం, ఉద్యోగములలో రాణింపు, గుర్రపు పందెములలో ధన నష్టము, గృహ నిర్మాణములు చేపడతారు. పాత బకాయిలు వసూళ్ళు అవుతాయి. కొత్త పరిచయాలకు ఈ మాసం అనుకూలం. దైవ సందర్శనము, మిత్రుల సహకారం, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. మీ సమర్థతలకు గుర్తింపు లభిస్తుంది.

**పుష్యం :** ఈ మాసములో శుక్ర, రాహువులు శుభులు. బుధుడు అర్ధశుభుడు. విద్యార్థుల విద్యా వ్యాసంగానికి అవరోధాలు ఏర్పడును. కుటుంబంలో చికాకుకు ఏర్పడుతాయి. ఫైనాన్సు కంపెనీల పరిస్థితి ఇబ్బందికరముగా మారును. సైన్సు రంగము వారికి ఎక్కువ అభివృద్ధి, గుర్తింపు కలుగును. ద్వితీయార్థంలో కుటుంబ సభ్యుల మధ్య ఏకీభావం కలుస్తుంది. సంతానమునకు అభివృద్ధి కలుగును. కాంట్రాక్టు పనుల వలన లాభములు, భూమి కొనుట, పదవీ లాభము సిద్ధించును.

**మాఘం :** ఈ మాసములో శుక్ర, రాహువులు శుభులు. రవి, బుధుడు అర్ధశుభుడు. వివాహాది శుభకార్యములు నెరవేరుట, వాహన సౌఖ్యం, సంఘంలో పేరు, వ్యాపారమందు సంతృప్తి కలుగును. మీ పనితీరులో ఆకస్మికమైన వింత మార్పు జరిగే సూచనలున్నాయి. విద్యా కళా సారస్వత విషయాలలో ప్రోత్సాహం, ఆధ్యాత్మిక, వైజ్ఞానిక విషయాలలో ఆసక్తి పెరుగుతుంది. మాసాంతమున బంధువులతో చికాకులు, మానసిక ఆందోళనలు, ప్రయాణములు, ధననష్టం, శారీరిక ఇబ్బందులు కలుగును.

**ఫాల్గునం :** ఈ మాసములో రవి, రాహువులు శుభులు. బుధ, శుక్రులు అర్ధశుభులు. ప్రథమార్ధంలో గృహ స్థిరాస్తి విషయాలలో శ్రద్ధ వహిస్తారు. వాహన సౌఖ్యం, సంఘంలో పేరు, రాజకీయ నాయకుల పరిచయము, ప్రభుత్వ అధికారులతో సఖ్యత, వ్యాపార మందు సంతృప్తి కలుగును. ద్వితీయార్థం నుండి అనుకున్న పనులు అనుకున్నట్లు సాగవు. ఆత్మీయులలో కొందరి ధోరణులు, నిర్ణయాలు మీకు నచ్చకపోవచ్చును. ఉద్యోగ పరిశ్రమలలో తీవ్ర సమస్యలు ఎదురయ్యే అవకాశాలు ఉన్నాయి.

**ఈ రాశి వారు ఈ సంవత్సరం ప్రతిరోజు శ్రీ దత్తాత్రేయ వజ్ర కవచము మరియు శ్రీ విష్ణు సహస్ర నామ స్తోత్ర పారాయణ చేసుకున్న ఉత్తమ ఫలితములను పొందగలరు.**

## ధనూ రాశి



**సౌర గోచారము : ధనుర్మాసములో పుట్టిన వారికి**
**చాంద్ర గోచారము : మూల, పూర్వాషాఢ; ఉత్తరాషాఢ 1**
**నామ నక్షత్రము : యే, యో, భా, భి, భూ, ధ, ఫ, ఢ, భే**
**ఆదాయం 11, వ్యయం 5, రాజపూజ్యం 7, అవమానం 2**

**గురువు** : సెప్టెంబరు 11 వరకు 10న లోహమూర్తి. అన్ని రంగములలో అడ్డంకులు ఏర్పడును. తదాది వత్సరపర్యన్తం 11న సువర్ణమూర్తి. అన్ని రంగముల యందు శుభాధిక్యత పెరుగును.

**శని** : జనవరి 26 వరకు 1న సువర్ణమూర్తి. వివాహాది శుభకార్యములు అతి కష్టమున నెరవేరును. తదాది అక్టోబరు 26 వరకు 12న రజతమూర్తి. అంతటా శ్రమతో కూడిన విజయము సిద్ధించును. తదాది వత్సరపర్యన్తం 1న లోహమూర్తి. అనారోగ్యములు, అపకీర్తి పెరుగును.

**రాహువు** : ఆగష్టు 17 వరకు 9న తామ్రమూర్తి. అయిన వారి సహాయ, సహకారాలు లభిస్తాయి. తదాది వత్సరపర్యన్తం 8న తామ్రమూర్తి. అనారోగ్యములు, ఆందోళనలు ఎక్కువగా ఉండును.

**కేతువు** : ఆగష్టు 17 వరకు 3న తామ్రమూర్తి. కార్యసిద్ధిని, అనారోగ్యమును కలుగ చేయును. తదాది వత్సరపర్యన్తం 2న తామ్రమూర్తి. మాట విలువ తగ్గును. ఆర్థిక పురోగతి తగ్గును.

**వేధగోచారం :-** సెప్టెంబరు 11 వరకు **గురు** గ్రహానుకూల్యత బాగున్నది. తదాది సంవత్సరాంతము వరకు ఆనుకూల్యత లేదు. జూన్ 20 వరకు **శని** గ్రహానుకూల్యత బాగున్నది. తదాది అక్టోబరు 26 వరకు ఆనుకూల్యత లేదు. తదాది సంవత్సరాంతము వరకు ఆనుకూల్యత బాగున్నది. సంవత్సరమంతా **రాహు, కేతు** గ్రహానుకూల్యతలు బాగున్నవి.

మొత్తము మీద ఈ రాశి వారికి ఈ సంవత్సరము స్థితి, వేధగోచారాములు కొంత మెరుగుగానే ఉన్నాయి. వివాహాది శుభకార్యముల నిర్వహణలో ఇబ్బందులు ఎదుర్కొన్నప్పటికిని సకాలములో నిర్వహించి గౌరవమును పొందుతారు. వృత్తి వ్యవహారాలలో తగిన ప్రోత్సాహం, గుర్తింపు, సంతృప్తి పొందుతారు. విద్యార్థులు కొంత కష్టపడిన ఉత్తమకక్ష్యలను అందుకోగలుగుతారు. గతంలో వచ్చిన అపనిందలు అన్నీ తొలగిపోతాయి. ఆర్థికంగా తృప్తికరమైన నిలకడ వస్తుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. నూతన భాగస్వామ్య వ్యవహారాలు లాభిస్తాయి.

**చైత్రం :** ఈ మాసములో బుధ, కేతువులు శుభులు. శుక్రుడు అర్ధశుభుడు. వివాహాది శుభకార్యములు స్థిరపడగలవు. గత అనుభవాలు గుర్తుకు వస్తాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. సంతానమునకు అభివృద్ధి కలుగును. వ్యాపారస్థులకు నష్టములు, ధననష్టములు, బంధు, మిత్ర విరోధములు, శారీరిక ఇబ్బందులు, మొదలగునవి కలుగును. త్రిప్పట, అలసట ఎక్కువ. భార్యాబిడ్డల వ్యతిరేక భావములను మౌనముతో వీక్షింపవలెను.

**వైశాఖం :** ఈ మాసములో రవి, గురు, శుక్ర, కేతువులు శుభులు బుధుడు అర్ధశుభుడు. భవిష్య ప్రణాళికలకు అనువైన కాలము. కొత్త పరిచయాలకు ఈ మాసం అనుకూలం. మీ సమర్థతలకు గుర్తింపు లభిస్తుంది. వైద్యులకు, లాయర్లకు పదోన్నతి, గౌరవము కలుగును. పాత బకాయిలు వసూళ్ళు అవుతాయి. నూతన ప్రయాణములకు అవకాశాలు కలుగును. కోర్టు వ్యాపారములు, వ్యవహారములు అనుకూలముగా ఉండును. అధికారులను, ప్రముఖులను సంప్రదిస్తారు. ఆశించిన ద్రవ్యం కాని, కావలసిన వస్తువులు కాని త్వరలో పొందుతారు.

**జ్యేష్ఠం :** ఈ మాసములో రవి, బుధ, గురువులు శుభులు. గత అనుభవాలు గుర్తుకు వస్తాయి. యోగ, ధ్యాన, ఆరాధనలు, ఏకాగ్రత చర్చలు, దర్యాప్తు విచారణలు, విందులు విహార వినోదాలు అనుకూలిస్తాయి. బంధు, మిత్ర విరోధములు, ధననష్టములు, శారీరిక ఇబ్బందులు, వ్యాపారస్థులకు నష్టములు మొదలగునవి జరుగును. ద్వితీయార్థంలో కాంట్రాక్టు పనుల వలన లాభములు, భూమి కొనుట, పదవీ లాభము సిద్ధించును. వైద్య, విద్యా రంగాలలోని వారికి కలిసి వచ్చును.

**ఆషాఢం :** ఈ మాసములో కుజ, గురు, శుక్రులు శుభులు. రవి అర్ధశుభుడు. అవసరమైనప్పుడు సహాయము చేయు స్నేహితులు, ఆటల పోటీల యందు జయం, వంట చేయుటయందు నిపుణత, భూసంపాదన, వ్యవహార వ్యాజ్యములందు జయం కలుగును. ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. ఒక ప్రముఖ ఆధ్యాత్మిక గురువు దర్శనం కలుగుతుంది.

**శ్రావణం :** ఈ మాసములో కుజ, బుధ, గురు, శుక్రులు శుభులు. వాహన సౌఖ్యం, సంఘంలో పేరు, రాజకీయ నాయకుల పరిచయము, ప్రభుత్వ అధికారులతో సఖ్యత, వ్యాపారమందు సంతృప్తి ఈ మాసంలో కలుగును. కుటుంబ సౌఖ్యము పెరుగును. ఆర్థికాభివృద్ధి గత మాసము కంటే మేలు. అప్పుల బాధ తగ్గుతుంది. భాగస్వాములలో కలహము, ఆకస్మిక ప్రయాణములు, ధననష్టం కలుగును. నిరుద్యోగులకు ఉపాధి లభించును. దైవ సందర్శనము, మిత్రుల సహకారం, దానధర్మములు చేయుట, భార్యాభర్తల మధ్య అవగాహన, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. తగాదాలు తీర్చుట యందు పేరొందుదురు.

**భాద్రపదం :** ఈ మాసములో గురు,శుక్రులు శుభులు. రవి, కుజ, బుధ అర్ధశుభులు. అపూర్వ వస్తు సంప్రాప్తి, కీర్తి ప్రతిష్ఠలు, మిత్రుల ప్రోత్సాహం, ఉద్యోగములలో రాణింపు, కళత్ర అనారోగ్యము, గుర్రపు పందెములలో ధననష్టము, గృహ నిర్మాణములు చేపడతారు. ఇంజనీర్లకు, కాంట్రాక్టర్లకు బిల్లుల వసూళ్ళు ఆలస్యమగు సూచనలు కలవు. నూతన ప్రయాణములకు అవకాశాలు కలుగును. శాస్త్రవేత్తలకు ప్రోత్సాహం, గుర్తింపు లభిస్తాయి. అధికారులను, ప్రముఖులను సంప్రదిస్తారు. అన్ని సమస్యలు నిదానంగా తొలగుతాయి.

**ఆశ్వయుజం :** ఈ మాసములో రవి, గురు, శుక్రులు శుభులు. కుజ బుధులు అర్ధశుభులు. విద్యార్థుల విద్యా వ్యాసంగానికి అవరోధాలు ఏర్పడును. ఫైనాన్సు కంపెనీల పరిస్థితి ఇబ్బందికరముగా మారును. సైన్సు రంగము వారికి ఎక్కువ అభివృద్ధి, గుర్తింపు కలుగును. బంధు, మిత్ర విరోధములు, ధననష్టములు, వ్యాపారస్థులకు నష్టములు శారీరిక ఇబ్బందులు మొదలగునవి జరుగును. ద్వితీయార్ధంలో స్నేహితుల సహాయ సహకారములు బాగుగా లభించును. కుటుంబ సభ్యుల మధ్య ఏకీభావం కలుస్తుంది. సంతానమునకు అభివృద్ధి కలుగును.

**కార్తికం :** ఈ మాసములో గురు, శుక్రులు శుభులు. రవి, కుజ, శనులు అర్ధశుభులు. ఏ పని మొదలు పెట్టినను కృతకృత్యులు అగుదురు. మంచి పేరు ప్రతిష్ఠలు వచ్చును. బయట ఎన్ని సమస్యలు ఉన్నను, ఆలుబిడ్డల గౌరవాభిమానములచే హృదయానందమును పొందగలరు. అపూర్వ దేవతా దర్శనము, పుణ్యనదీతీర్థ స్నానము లభించును. ప్రయాణములందు సౌఖ్యముండును. సోదరులు పరస్పరం సహాయము చేసుకుంటారు. నిర్మాణ ప్రయత్నములు నిలిచిపోవును.

**మార్గశిరం :** ఈ మాసములో గురు, శని శుభులు. కుజ, శుక్రులు అర్ధ శుభులు. ఉద్యోగులకు బదిలీలు సక్రమంగా ఉండవు. విలాస వస్తువులకై ధనము విరివిగా ఖర్చు చేస్తారు. విద్యార్థులకు అసంతృప్తి పెరుగును. ద్వితీయార్ధంలో వ్యవహారాదుల్లో జయం, కుటుంబమున స్త్రీ సహాయ సహకారములు, విదేశీ ప్రయాణమునకు ప్రయత్నములు, వంట చేయుట యందు నిపుణత, స్పెక్యులేషన్ ద్వారా ఆకస్మిక ధనప్రాప్తి, కళాకారులకు, ఆధ్యాత్మిక రంగాలలోని వారికి అభివృద్ధి కలుగును.

**పుష్యం :** ఈ మాసములో గురు, శనులు శుభులు. కుజుడు అర్ధశుభుడు. కొన్ని పరిమితులను, నియమ నిబంధనలను అనుసరించవలసి వస్తుంది. భార్యాభర్తల మధ్య సయోధ్య లోపిస్తుంది. ఊహించని సన్నివేశాలు మీ విషయంలో విస్మయాన్ని కలుగచేస్తాయి. పనులు మందకొడిగా సాగును. ఫైనాన్స్ వ్యాపారులు ఆచితూచి వ్యవహరించవలెను. మాసమధ్యంలో కొన్ని సమస్యలు పరిష్కారవుతాయి.

**మాఘం :** ఈ మాసములో గురు, శనులు శుభులు. కుజ, బుధులు అర్ధశుభులు. కుటుంబ సౌఖ్యము పెరుగును. ఆర్థికాభివృద్ధి గత మాసము కంటే మేలు. కోర్టు వ్యవహారములు పునర్విమర్శకై వచ్చును. ఉద్యోగులు బదలీలు కోరకుండుట మేలు. అప్పుల బాధ తగ్గుతుంది. కంపెనీ యజమానులు ఆచితూచి అడుగులు వేయవలయును.

**ఫాల్గుణం :** ఈ మాసములో గురు, శని శుభులు. కుజ, బుధులు అర్ధశుభులు. మీ శ్రమకు తగిన ప్రతిఫలము దక్కుతుంది. వ్యాపారస్థులకు అనుకూలమైన సమయమే అయినప్పటికి భాగస్వాములతో మెలకువ అవసరం. కోర్టు వ్యవహారాదులు అనుకూలంగా ఉంటాయి. ఋణబాధలు తగ్గును. కోపమును తగ్గించుకోవాలి. నూతన వ్యక్తుల పరిచయం ఎంతో సంతృప్తి నిస్తుంది. కొత్త పథకాలకు ఆలోచన చేస్తారు.

**ఈ రాశి వారు ఈ సంవత్సరం ప్రతిరోజు శ్రీ దుర్గా సహస్ర నామ స్తోత్ర పారాయణ చేసుకున్న ఉత్తమ ఫలితములను పొందగలరు.**

## మకర రాశి



**సౌర గోచారము : మకర మాసములో పుట్టిన వారికి**
**చాంద్ర గోచారము : ఉత్తరాషాఢ 2, 3, 4; శ్రవణం; ధనిష్ఠ 1, 2**
**నామ నక్షత్రము : భో, జా, జి, ఖి, ఖు, ఖో, గా, గి**
**ఆదాయం 14, వ్యయం 14, రాజపూజ్యం 3, అవమానం 1**

**గురువు** : సెప్టెంబరు 11 వరకు 9న సువర్ణమూర్తి. అన్ని ప్రయత్నములందు విజయము చేకూరగలదు. తదాది వత్సరపర్యన్తం 10న రజతమూర్తి. శ్రమతో కూడిన లాభము చేకూరగలదు. శ్రమ తక్కువ, ఫలితము ఎక్కువ.

**శని** : జనవరి 26 వరకు 12న లోహమూర్తి. వ్యవహారములందు వ్యతిరేకతలు పెరుగును. తదాది అక్టోబరు 26 వరకు 11న లోహమూర్తి. అన్ని రంగముల యందు చికాకులు పెరుగును. తదాది వత్సరపర్యన్తం 12న సువర్ణమూర్తి. అనారోగ్యం, కొంచెం లాభము కనబడును.

**రాహువు** : ఆగష్టు 17 వరకు 8న రజతమూర్తి. అన్ని రంగములందు విఘ్నములు ఎక్కువగా ఉండును. తదాది వత్సరపర్యన్తం 7న సువర్ణమూర్తి. వివాహాది మంగళకార్యములు అతికష్టమున నెరవేరును. అన్ని రంగముయందు విషమ సమస్యలు తీరును. సౌఖ్యము పెరుగును.

**కేతువు** : ఆగష్టు 17 వరకు 2న రజతమూర్తి. మంచి చెడులు మిశ్రమముగా ఉండును. ఆర్థిక ఇబ్బందులు కొంత సర్దుకుంటాయి. విఘ్నములు ఎక్కువ. తదాది వత్సరపర్యన్తం 1న సువర్ణమూర్తి. వివాహాది శుభ కార్యములు అతికష్టమున పూర్తగును.

**వేధగోచారం :-** సంవత్సరమంతా **గురు** గ్రహానుకూల్యత లేదు. జూన్ 20 వరకు **శని** గ్రహానుకూల్యత లేదు. తదాది అక్టోబరు 26 వరకు ఆనుకూల్యత బాగున్నది. తదాది మార్చి 2 వరకు ఆనుకూల్యత లేదు. తదాది సంవత్సరాంతము వరకు ఆనుకూల్యత బాగున్నది. ఆగష్టు 17 వరకు **రాహు** గ్రహానుకూల్యత లేదు. తదాది సంవత్సరాన్తము వరకు ఆనుకూల్యత బాగున్నది. ఆగష్టు 17 వరకు **కేతు** గ్రహానుకూల్యత లేదు. తదాది డిశంబరు 21 వరకు ఆనుకూల్యత బాగున్నది. తదాది సంవత్సరాంతము వరకు ఆనుకూల్యత లేదు.

మొత్తము మీద ఈ రాశి వారికి ఈ సంవత్సరము స్థితి గోచారము, వేధ గోచారము కూడ చాల సామాన్యముగానే ఉన్నది. వివాహాది శుభకార్యముల నిర్వహణ తలకు మించిన భారముగా తోస్తుంది. వృత్తి వ్యవహారాలలో ప్రతికూలతలు ఉంటున్నప్పటికిని గుర్తింపు, సంతృప్తిని పొందుతారు. విద్యార్థులు మరింత శ్రమతో ఉత్తమకక్ష్యలను గూర్చి పరశ్రమించాలి. ఆరోగ్యం కొంతవరకు సంతృప్తికరంగానే ఉంటుంది. ఆర్థికంగా సంతృప్తికరమైన నిలకడ వస్తుంది. మధ్యమధ్యలో అన్ని రంగాలలోను ప్రోత్సాహకరమైన వాతావరణం ఏర్పడుతుంది.

**చైత్రం :-** ఈ మాసములో గురు,శుక్ర,శనులు శుభులు. వివాహాది శుభకార్యములు నెరవేరుట, వాహన సౌఖ్యం, సంఘంలో పేరు, రాజకీయ నాయకుల పరిచయము, వ్యాపారమందు సంతృప్తి కలుగును. కోర్టు వ్యవహారాదులలో విజయం సాధిస్తారు. ఆర్థికపరిస్థితి మెరుగు పడుతుంది. విద్యా కళా సారస్వత విషయాలలో ప్రోత్సాహం, ఆధ్యాత్మిక, వైజ్ఞానిక విషయాలలో ఆసక్తి పెరుగుతుంది.

**వైశాఖం :** ఈ మాసములో కుజ, శనులు శుభులు. బుధ, శుక్రులు అర్ధ శుభులు. ప్రథమార్ధంలో శారీరిక, మానసిక ఇబ్బందులు, అజీర్తి, ఉష్ణ సంబంధ వ్యాధులు, జీవిత భాగస్వామితో ఘర్షణలు రావచ్చు. బంధు మిత్రుల నిరాదరణకు గురవుతారు. వ్యాపార భాగస్వాములతో సంయమనం పాటించాలి. మధ్య మధ్య ఆర్థిక ఇబ్బందులు ఎదురవుతాయి. ద్వితీయార్ధంలో సద్గురువు దర్శన భాగ్యం కలుగుతుంది. కొత్త పరిచయాలు ఆనందాన్ని కలిగిస్తాయి. ఆర్థికంగా అనుకూలత పెరుగుతుంది.

**జ్యేష్ఠం :** ఈ మాసములో శని శుభుడు. కుజ, బుధ, రాహు, కేతువులు అర్ధశుభులు. ప్రథమార్ధంలో మీ సమర్థతలకు గుర్తింపు లభిస్తుంది. క్రీడలపై, కళలపై ఆసక్తి పెరుగుతుంది. చిన్న తరహా పరిశ్రమల వారికి, చేతిపని వారికి పురోభివృద్ధి. ట్రాన్స్‌పోర్ట్ రంగంలోని వారికి కాస్త ఆందోళన తప్పదు. ప్రయాణాలు కాని మార్పులు కాని సంభవం. ద్వితీయార్ధం నుండి నిర్మాణ ప్రయత్నములకు అంతరాయములు ఎక్కువ అగును. వృత్తి వ్యాపారము లందు మంచి చెడ్డలు సమానంగా ఉండును.

**ఆషాఢం :** ఈ మాసములో శుక్ర, శని శుభులు. బుధ, రాహు, కేతువులు అర్ధశుభులు. ఆరోగ్యం విషయంలో మెలకువ అవసరం. మధ్య మధ్య అనారోగ్యం, తల తిప్పుట ఎక్కువగా ఉండును. కుటుంబ సభ్యుల ధోరణి ఆశ్చర్యం కలిగిస్తుంది. వ్యాపార రంగంలో ఉన్నవారికి సంతృప్తి ఉండదు. స్త్రీలకు గుర్తింపు, రాణింపు ఉంటాయి. కూరలు, పండ్ల వ్యాపారులకు శుభదాయకం. పనులలో చికాకు పెరుగుతుంది. రత్నాలు, బంగారం, వెండి, వస్త్రాల వ్యాపారులకు శత్రుబాధ పెరుగుతుంది. మీ శ్రమకు తగిన ప్రతిఫలము దక్కుట కష్టము. కోపమును తగ్గించుకోవాలి.

**శ్రావణం :** ఈ మాసములో రవి, బుధ, శని శుభులు. శుక్ర, రాహు, కేతువులు అర్ధశుభులు. కొత్త ఆలోచనలకు, కొత్త పథకాలకు ఈ మాసం అనుకూలం. దానధర్మాలు, పుణ్యకార్యాలు, వైదిక కార్యాలకు విరాళాలు వెచ్చిస్తారు. ఉద్యోగ, వృత్తి, వ్యాపారాలలో ప్రోత్సాహం లభిస్తుంది. ఏర్పాట్లు పూర్తి చేస్తారు. పెద్దలతో ఆంతరంగిక చర్చలు ఫలిస్తాయి. శ్రమకు తగిన ప్రతిఫలం పొందుతారు. చేపట్టిన పనులు ముగింపు దశకు వస్తాయి. పిల్లల వివాహాది శుభకార్యములు నెరవేరుస్తారు. ఆర్థిక వ్యవహారాలు సమర్థతతో నిర్వహిస్తారు.

**భాద్రపదం :** ఈ మాసములో రవి, శనులు శుభులు. బుధ, శుక్ర, రాహు, కేతువులు అర్ధశుభులు. ఇతరుల జోక్యం వల్ల పాతసమస్యలు కొలిక్కి వస్తాయి. మీ తెలివితేటలకు, వాక్చాతుర్యానికి మంచి గుర్తింపు లభిస్తుంది. విద్యార్థులకు విద్యా వ్యాసంగము పెరుగును. కానీ సంతృప్తి ఉండదు. మీ శ్రమకు తగిన ప్రతిఫలము దక్కుట కష్టము. ఆర్థికంగా ఇబ్బందులేమీ ఉండవు. ఆరోగ్యం విషయంలో మెలకువ వహించండి. నూతన వ్యాపార ప్రయత్నాలు ఫలిస్తాయి. విశ్రాంతికి చేసే ప్రయత్నాలు అనుకూలించవు.

**ఆశ్వయుజం :** ఈ మాసములో శుక్ర, శనులు శుభులు. రవి, బుధ, రాహు, కేతువులు అర్ధశుభులు. వివాహాది శుభకార్యములు స్థిరపడగలవు. గత అనుభవాలు గుర్తుకు వస్తాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. సంతానమునకు అభివృద్ధి కలుగును. వైజ్ఞానిక, ఆధ్యాత్మికచర్చలలో పాల్గొంటారు. వ్యాపారస్థులకు నష్టములు, ధననష్టములు, బంధు, మిత్ర విరోధములు, శారీరిక ఇబ్బందులు, మొదలగునవి కలుగును.

**కార్తికం :** ఈ మాసములో శుక్రుడు శుభుడు. కుజుడు, బుధ, శని, రాహు, కేతువులు అర్ధశుభులు. అపూర్వ వస్తు సంప్రాప్తి, కీర్తి ప్రతిష్ఠలు, మిత్రుల ప్రోత్సాహం, ఉద్యోగములలో రాణింపు, కళత్ర అనారోగ్యము, గుర్రపు పందెములలో ధననష్టము, గృహనిర్మాణములు చేపడతారు. పాత బకాయిలు వసూళ్ళు అవుతాయి. కొత్త పరిచయాలకు ఈ మాసం అనుకూలం. దైవ సందర్శనము, మిత్రుల సహకారం, దానధర్మములు చేయుట, భార్యాభర్తల మధ్య అవగాహన, కీర్తి ప్రతిష్ఠలు కలుగును.

**మార్గశిరం :** ఈ మాసములో శుక్రుడు శుభుడు. రవి, కుజ, బుధ, రాహు, కేతువులు, అర్ధశుభులు. మీ శ్రమకు తగిన ప్రతిఫలము దక్కుతుంది. వ్యాపారస్థులకు అనుకూలమైన సమయమే అయినప్పటికి మెలకువ అవసరం. కోర్టు వ్యవహారాదులు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగులకు అభివృద్ధి ఉండి, కోరిన చోట్లకు బదిలీలు పొందగలరు. నిరుద్యోగులకు ఉపాధి కలుగును. స్నేహితులతో జాగ్రత్తగా ఉండాలి.

**పుష్యం :** ఈ మాసములో రవి, బుధ, శుక్రులు శుభులు. కుజ, రాహు, కేతువులు అర్ధశుభులు. కొన్ని సౌకర్యాలు అనుభవిస్తారు. ఆకస్మిక ధన లాభమునకు అవకాశం ఉన్నది. విద్యార్థులు అధ్యాపకుల స్థాయిని బట్టి మసులుకోవాలి. గృహనిర్మాణాలు చేపట్టెదరు. అప్పులు వసూలు చేయటంలో నైపుణ్యాన్ని చూపిస్తారు. కొన్ని సమస్యలు పరిష్కారవుతాయి. మాసాంతమున కొద్దిగా అనారోగ్యం, ఆర్థిక ఇబ్బందులు, మనోవ్యాకులత పెరుగును. గృహ, వాహన విషయాలలో చికాకులు పెరుగును.

**మాఘం :** ఈ మాసములో శుక్రుడు శుభుడు. రవి, కుజ, రాహు, కేతువులు అర్ధశుభులు. ఋణము చేయవలసిన అవసరం ఏర్పడును. విద్యార్థులు వారి భవిష్య కార్యక్రమాలను గోప్యంగా ఉంచటం మంచిది. మధ్యవర్తిత్వం పనికిరాదు. వ్యాపారస్థులకు కొన్ని లెక్కలు తేలక పోవటం కలవర పెడుతుంది. కొన్ని చిన్న అప్పులను వదులుకోక తప్పదు. ఉద్యోగాన్ని మార్చుకోవాలన్న నిర్ణయాన్ని వాయిదా వేయటం మంచిది. చురుకుగా కనపడక పోయినప్పటికి విద్యార్థులు పరీక్షలలో విజయాలను పొందుతారు.

**ఫాల్గునం :** ఈ మాసములో కుజ, శుక్ర, రాహు, కేతువులు అర్ధశుభులు. వివాహాది శుభకార్యములు అతిప్రయాసతో నెర వేరును. విద్యార్థులు శ్రమ పడినచో కొన్నింటిలోనైనా విజయమును సాధించగలరు. ఆఫీసర్లు పైవారికి క్రింది వారికి మధ్యన ఇరుకుపడగలరు. మాసాంతములో ప్రయత్న పూర్వకముగా చేసిన పనులలో కొన్నింట విజయమును సాధించగలరు. విదేశీప్రయాణము భూ, గృహ సంబంధ ప్రయత్నములు ఫలించును.

**ఈ రాశి వారు ప్రతిరోజు శ్రీ లక్ష్మీ సహస్ర నామ స్తోత్ర పారాయణ చేసుకున్న ఉత్తమ ఫలితములను పొందగలరు.**

## కుంభ రాశి



**సౌర గోచారము : కుంభ మాసములో పుట్టిన వారికి**
**చాంద్ర గోచారము : ధని 3, 4; శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3**
**నామ నక్షత్రము : గూ, గె, గో, సా, సీ, సు, సే, సో, దా**
**ఆదాయం 14, వ్యయం 14, రాజపూజ్యం 6, అవమానం 1**

**గురువు** : సెప్టెంబరు 11 వరకు 8న తామ్రమూర్తి. అనారోగ్యములు, ఆందోళనలు ఎక్కువగా ఉండును. తదాది వత్సరపర్యన్తం 9న లోహమూర్తి. తరచు వ్యవహారములందు వ్యతిరేకత కలుగును. నిదానంగా అన్ని పనులు నెరవేరుతాయి.

**శని** : జనవరి 26 వరకు 11న సువర్ణమూర్తి. అన్ని రంగముల యందు శుభాధిక్యత పెరుగును. తదాది అక్టోబరు 26 వరకు 10న తామ్రమూర్తి. కొద్దిపాటి నష్టంతో అన్ని పనులు నెరవేరుతాయి. తదాది వత్సరపర్యన్తం 11న తామ్రమూర్తి. శ్రమమీద లాభము సిద్ధించును.

**రాహువు** : ఆగష్టు 17 వరకు 7న లోహమూర్తి. అందరితోను తరచు సౌఖ్యము కొంచెం తగ్గును. అనారోగ్యములు, అపకీర్తి పెరుగును. తదాది వత్సరపర్యన్తం 6న రజతమూర్తి. కొంత అనుకూలత కలుగును. అన్ని రంగాల వారికి నిదానముగా విజయములు సిద్ధించును.

**కేతువు** : ఆగష్టు 17 వరకు 1న లోహమూర్తి. అష్టకష్టములు పెట్టును. అనారోగ్యము, చికాకులు, ధననష్టము కలుగ చేయును. తదాది వత్సరపర్యన్తం 12న రజతమూర్తి. అంతటా శ్రమతో కూడిన విజయము సిద్ధించును.

**వేధగోచారం :-** సంవత్సరమంతా **గురు** గ్రహానుకూల్యత లేదు. సంవత్సరమంతా **శని** గ్రహానుకూల్యత బాగున్నది. ఆగష్టు 17 వరకు **రాహు** గ్రహానుకూల్యత బాగున్నది. తదాది సంవత్సరాంతము వరకు ఆనుకూల్యత లేదు. సంవత్సరమంతా **కేతు** గ్రహానుకూల్యత లేదు.

మొత్తము మీద ఈ రాశి వారికి స్థితిగోచారము, వేధ గోచారములు రెండును అనుకూలము కాకున్నను వ్యతిరేకము కాదు. శుభకార్యములు బంధువుల సహకారంతో పూర్తి చేయగలుగుతారు. ఆర్థికవృద్ధి బాగా ఉన్నప్పటికిని సమయానికి కొన్ని చేతికి అందకపోవటం కలవర పెడుతూ ఉంటుంది. వృత్తి, వ్యాపార వ్యవహారాలలో ఖర్చులు పెరిగినప్పటికిని అనుకున్న లక్ష్యాన్ని సుమారు పొందగలుగుతారు. విద్యా వ్యాసంగానికి తరచు అవాంతరాలు ఏర్పడుతూ ఉంటాయి. ఆరోగ్యం కొద్దిగా నిలకడగానే ఉంటుంది. భాగస్వామ్య వ్యవహారాలు కొంత లాభిస్తాయి.

**చైత్రం :** ఈ మాసములో శుక్ర, శని, రాహు, కేతువులు శుభులు రవి అర్ధశుభుడు. వివాహాది శుభ కార్యములు స్థిరపడతాయి. నూతన వ్యక్తుల పరిచయం ఎంతో సంతృప్తి నిస్తుంది. విద్యార్థులకు కళలపై ఆసక్తి పెరుగుతుంది. ఉద్యోగులు బదలీలు కోరకుండుట మేలు. ఆరోగ్యము, సంతోషము వృద్ధి చెందును. కుటుంబ సభ్యుల మధ్య ఏకీభావం కలుస్తుంది. కోర్టు వ్యాపారములు, వ్యవహారములు అనుకూలముగా ఉండును. నూతన ప్రయాణములకు అవకాశములు కలుగును.

**వైశాఖం :** ఈ మాసములో శుక్ర, శని, రాహు, కేతువులు శుభులు. రవి, కుజ, గురువులు అర్ధశుభులు. శుభకార్యములకు పునాది పడును. ఆరోగ్యమునకై ఔషధ సేవ అవసరమగును. ఉద్యోగులు కోరిన ప్రాంతములకు బదిలీలను పొందగలరు. వ్యవసాయదారులకు ధనలాభము కలుగును. ప్రయాణములు కలసి వచ్చును. భవిష్య ప్రణాళికలకు అనువైన కాలము. వైద్యులకు, పదోన్నతి, గౌరవము కలుగును. కోర్టు వ్యవహారములు అనుకూలముగా ఉండును. విద్యార్థులకు అసంతృప్తి పెరుగును.

**జ్యేష్ఠం :** ఈ మాసములో రవి, శుక్ర, శనులు శుభులు. బుధ, గురువులు అర్ధ శుభులు. వివాహాది శుభకార్యములు స్థిరపడును. పుణ్య నదులలో స్నానము లభించగలదు. ఆర్థిక ఇబ్బందులతో చికాకులు పెరుగును. వర్తక, వ్యాపారములకు మధ్యముగా ఉన్నది. ఉద్యోగస్థులు సస్పెండు అయ్యే సూచనలు ఉన్నాయి. కోర్టు వ్యవహారములలో రాజీ ప్రయత్నము ఉత్తమము.

**ఆషాఢం :** ఈ మాసములో శుక్ర, శనులు శుభులు. రవి, కుజ, గురువులు అర్ధ శుభులు. వివాహాది శుభకార్యములు అతి ప్రయాసతో నెరవేరును. కళాకారులకు, ఆధ్యాత్మిక రంగాలలోని వారికి అభివృద్ధి కలుగును. నిరుద్యోగులకు ఉపాధి కలుగును. ధనాభివృద్ధి సిద్ధించును. శాస్త్రవేత్తలకు ప్రోత్సాహం, గుర్తింపు లభిస్తాయి. కోర్టు వ్యవహారాదులు అనుకూలంగా ఉంటాయి. వ్యాపారస్థులకు అనుకూలమైన సమయమే అయినప్పటికి భాగస్వాములతో మెలకువ అవసరం. ఋణబాధలు తగ్గును.

**శ్రావణం :** ఈ మాసములో కుజుడు, శుక్ర, శనులు శుభులు. బుధ, గురువులు అర్ధశుభులు. ప్రథమార్ధంలో మృష్టాన్న భోజనం, మానసిక సౌఖ్యం, భార్య సహకారం, ధనలాభం, ఆనందము కలుగును. ద్వితీయార్ధం నుండి శత్రువుల వల్ల బాధలు, నీచజన సహవాసం, కుటుంబ వ్యవహారాలలో చిక్కులు, ఉద్యోగ వ్యవహారాలలో అభద్రత, బంధువులతో విరోధములు, వృధా కలహాలు, మలిన వస్త్రాలు ధరించటం, ఉదర సంబంధమైన వ్యాధులు కలుగుతాయి.

**భాద్రపదం :** ఈ మాసములో శని శుభుడు. కుజ, బుధ, గురు, శుక్రులు అర్ధ శుభులు. వివాహాది శుభకార్యములను బంధుమిత్ర సహకారముతో నిశ్చయం చేసికోగలుగుతారు. వ్యాపారస్తులకు ఆదాయ వ్యయములు సమానముగా ఉండును. భూ, గృహ సంబంధ విషయాలు అనుకూలంగా ఉన్నాయి. అప్పుల బాధ తగ్గుతుంది. ఆరోగ్యము మెరుగవును. సోదరులతో మైత్రీ ప్రయత్నము ఫలించును. ప్రైవేటు ఉద్యోగులకు రాబడి, గుర్తింపు లభిస్తాయి. కుటుంబ సౌఖ్యము పెరుగును. కళాకారులకు, సంగీత విద్వాంసులకు గౌరవము వృద్ధి చెందుతుంది.

**ఆశ్వయుజం :** ఈ మాసములో శని శుభుడు. కుజ, బుధ, గురువులు అర్ధ శుభులు. కొన్ని వ్యవహారములు చికాకు అనిపించును. విరోధులు ఎక్కువ అవుతారు. వివాహాది శుభకార్యములకు ఎక్కువ ఆటంకములు ఏర్పడును. కుటుంబంలో చికాకులు, అశాంతి పెరుగుతాయి. ఉద్యోగులు దూరప్రాంతములకు బదిలీ అగుదురు. అప్పు చేయవలసి రావచ్చును. వ్యాపార రంగంలో ఉన్నవారికి పూర్తిగా అనుకూలించక పోయినను కొంత అనుకూలించును. వ్యాపారంలో భాగస్వామ్యం పనికిరాదు.

**కార్తికం :** ఈ మాసములో బుధుడు శుభుడు. గురు, శుక్ర, శనులు అర్ధశుభులు. వివాహాది శుభకార్యములు నిశ్చయమవుతాయి. బంధు మిత్రులతో ఇల్లు సందడిగా, కొంత ఉత్సాహంగా ఉంటుంది. క్రయ, విక్రయములందు లాభములు కలుగును. సంగీత, వాయిద్య కళాకారులకు మంచి ప్రోత్సాహకపు రోజులు. వ్యవసాయదారులకు అనువైన సమయం. కళత్ర సౌఖ్యం పెరుగుతుంది. సంతానాభివృద్ధికై చేసిన వ్యయము సత్ఫలితమును ఇవ్వగలదు. ఆకస్మిక ధన లాభమునకు అవకాశం ఉన్నది. విదేశీప్రయాణమునకు చేయు ప్రయత్నములు ఫలించును.

**మార్గశిరం :** ఈ మాసములో బుధుడు శుభుడు. గురు, శుక్రులు అర్ధ శుభులు. ఏ పని ఆరంభించినా విఘ్నాలు ఎదురవుతూ ఉంటాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. భూ, గృహ విషయాలలో చికాకులు పెరుగును. విద్యార్థులకు విద్యాభ్యాసం కొంత కఠినంగా ఉంటుంది. వ్యాపారస్థులకు అర్ధసంవత్సర ఫలితములు అనుకూలంగా లేనప్పటికి ఈ మాసం నుండి అనుకూలత పెరుగుతుంది. ప్రయాణములు కలసిరావు. ఉద్యోగులకు బదిలీలు సక్రమంగా ఉండవు.

**పుష్యం :** ఈ మాసములో రవి శుభుడు. బుధ, గురు, శుక్రులు అర్ధశుభులు. వివాహాది శుభకార్యములు తలవని తలంపుగా స్థిరపడగలవు. ఏ పని మొదలు పెట్టినను కృతకృత్యులు అగుదురు. మంచి పేరు ప్రతిష్ఠలు వచ్చును. అపూర్వ దేవతా దర్శనము, పుణ్యనదీతీర్థ స్నానము లభించును. ప్రయాణములందు సౌఖ్యము ఉండును. సోదరులు పరస్పరం సహాయము చేసుకుంటారు.

**మాఘం :** ఈ మాసములో రవి, బుధ, శుక్రులు శుభులు. గురువు అర్ధశుభుడు. వివాహాది శుభ కార్యములు స్థిరపడతాయి. నూతన వ్యక్తుల పరిచయం ఎంతో సంతృప్తి నిస్తుంది. విద్యార్థులకు కళలపై ఆసక్తి పెరుగుతుంది. కుటుంబ సభ్యుల మధ్య ఏకీభావం కలుస్తుంది. ఇంజనీర్లకు, కాంట్రాక్టర్లకు బిల్లుల వసూళ్ళు ఆలస్యమగు సూచనలు కలవు. కోర్టు వ్యాపారములు, వ్యవహారములు అనుకూలముగా ఉండును. నూతన ప్రయాణములకు అవకాశములు కలుగును.

**ఫాల్గునం :** ఈ మాసములో రవి, బుధ, గురులు అర్ధశుభులు. వివాహాది శుభకార్యములు, ఆలస్యమగు సూచనలు ఎక్కువగా ఉన్నాయి. అప్పులు చేయవలసిన పరిస్థితులు ఏర్పడును. ఉద్యోగులకు ఆటంకములతో కూడిన వేతన అభివృద్ధి కలుగును. కోర్టు వ్యవహారములు అలస్యము కావు. మాట విలువ తగ్గును. కుటుంబ వ్యవహారములు చికాకును కలిగించును. విద్యార్థుల విద్యా వ్యాసంగానికి అవరోధాలు ఏర్పడును. భూ, గృహ విషయాలలో ఆటంకాలు పెరుగును.

**ఈ రాశి వారు ఈ సంవత్సరం ప్రతిరోజు శ్రీ శివ పంచాక్షరీ స్తోత్ర పారాయణ చేసుకున్న ఉత్తమ ఫలితములను పొందగలరు.**

## మీన రాశి



**సౌర గోచారము : మీన మాసములో పుట్టిన వారికి**
**చాంద్ర గోచారము : పూర్వాభాద్ర 4; ఉత్తరాభాద్ర; రేవతి**
**నామ నక్షత్రము : దీ, దూ, ఝ, ఝ, దా, దే, దో, చా, చి**
**ఆదాయం 11, వ్యయం 5, రాజపూజ్యం 2, అవమానం 4**

**గురువు** : సెప్టెంబరు 11 వరకు 7న రజతమూర్తి. శ్రమకు తగిన ఫలితములు కలుగును. యత్నములు ఎక్కువ, ఫలితములు తక్కువగా ఉండును. తదాది వత్సరపర్యన్తం 8న తామ్రమూర్తి. కార్యసిద్ధిని, అనారోగ్యమును కలుగ చేయును.

**శని** : జనవరి 26 వరకు 10న తామ్రమూర్తి. కొద్దిపాటి నష్టంతో అన్ని పనులు నెరవేరుతాయి. తదాది అక్టోబరు 26 వరకు 9న రజతమూర్తి. అన్ని రంగముల యందు విషమ సమస్యలు తీరును. తదాది వత్సరపర్యన్తం 10న రజతమూర్తి. శ్రమతో కూడిన లాభము చేకూరగలదు.

**రాహువు** : ఆగష్టు 17 వరకు 6న సువర్ణమూర్తి. సంతోషం, లాభం, సౌఖ్యము వృద్ధి చెందును. తదాది వత్సరపర్యన్తం 5న లోహమూర్తి. చికాకులు, సంతాన మూలకంగా ధన నష్టము కలుగును. ఎన్ని ప్రయత్నములు చేసినను కార్యానుకూలత తక్కువ. అన్ని రంగాలలోను చికాకులు పెరుగును.

**కేతువు** : ఆగష్టు 17 వరకు 12న సువర్ణమూర్తి. అనారోగ్యం, కొంచెం లాభము కనబడును. తదాది వత్సరపర్యన్తం 11న లోహమూర్తి. అన్ని రంగముల యందు చికాకులు పెరుగును.

**వేధగోచారం :–** సంవత్సరమంతా **గురు, శని** గ్రహానుకూల్యతలు లేవు. సంవత్సరమంతా **రాహు, కేతు** గ్రహానుకూల్యతలు బాగున్నవి.

మొత్తము మీద ఈ రాశివారికి ఈ సంవత్సరమంతా స్థితి వేధ గోచారములు శుభాశుభ మిశ్రమముగా ఉన్నవి. అపనిందలను వదిలిపెట్టి మీ కర్తవ్యాన్ని నిర్వహించడం ద్వారా ఉత్తమ ఫలితాలను పొందుతారు. వివాహాది శుభకార్యముల నిర్వహణ దగ్గరి వారి సహకారంతో చేసినా కూడా కొద్దిగా పెనుభారంగాను, మానసిక అశాంతిగాను మారుతుంది. విద్యార్థులు కొద్దిగా ఎక్కువ కష్టపడాలి. వృత్తి, వ్యాపార, ఉద్యోగ వ్యవహారాలలో నియమాలను అనుసరించి పై వారితో కొంత ఇబ్బంది పడతారు. ఆర్థికంగా వృద్ధి లేకపోయినా నిరుత్సాహం తక్కువగానే ఉంటుంది.

**చైత్రం :** ఈ మాసములో గురువు అర్ధశుభుడు. శుభ కార్యక్రమాలకు తరచు అవరోధాలు కలుగుతూ ఉంటాయి. ఉద్యోగులకు, అధికారులకు భేదాభిప్రాయములు పెరుగును. మానసిక చింతన ఎక్కువ. ఊహించని సన్నివేశాలు మీ విషయంలో విస్మయాన్ని కలుగచేస్తాయి. పనులలో చికాకు పెరుగుతుంది. మాసాంతంలో కొంత ఊరట కలుగుతుంది. కొన్ని సౌకర్యాలు అనుభవిస్తారు.

**వైశాఖం :** ఈ మాసములో బుధుడు అర్ధశుభుడు. కొన్ని పరిమితులను, నియమ నిబంధనలను అనుసరించవలసి వస్తుంది. ఆర్థిక ఇబ్బందులతో చికాకులు పెరుగుతాయి. పనులు మందకొడిగా సాగును. ఫైనాన్స్ వ్యాపారులు ఆచితూచి వ్యవహరించవలెను. గృహనిర్మాణంలో ప్రతిష్టంభన, వివాహాది శుభకార్యములు ఆలస్యమగు సూచనలు, అప్పులు చేయవలసిన పరిస్థితులు ఏర్పడును. బంధువుల సహకారం, గృహంలో శుభకార్యములు, తీర్థయాత్రలు సిద్ధించును.

**జ్యేష్ఠం :** ఈ మాసములో శుక్ర, రాహువులు శుభులు. రవి, బుధులు అర్ధశుభులు. ఉద్యోగులకు బదిలీలు సక్రమంగా ఉండవు. వర్తకులకు వ్యాపారం కొంత మందకొడిగా సాగును. విలాస వస్తువులకై ధనము ఖర్చు చేస్తారు. విద్యార్థులకు అకాల భోజనములు, ఉద్యోగులకు స్థాన చలనములు, మేనమామలతో విరోధం, ధననష్టము కలుగును. భూ, గృహ సంబంధ విషయాలలో చికాకులు పెరుగుతాయి. ద్వితీయార్ధంలో వ్యవహారాదుల్లో జయం, కుటుంబమున స్త్రీ సహాయ సహకారములు, స్పెక్యులేషన్ ద్వారా ఆకస్మిక ధనప్రాప్తి, కళాకారులకు కలుగును.

**ఆషాఢం :** ఈ మాసములో రవి, రాహువులు శుభులు. బుధ, శుక్రులు అర్ధశుభులు. విద్యార్థులు వారి భవిష్య కార్యక్రమాలను గోప్యంగా ఉంచటం మంచిది. మీ వ్యక్తిగత విషయాలలో జోక్యం చేసుకుని ఉచిత సలహాలు చెప్పేవారిని సహించక తప్పదు. ద్వితీయార్ధంలో ఆర్థిక వ్యవహారాలు చక్కబడతాయి. ఆరోగ్యం మెరుగుపడుతుంది. విద్యార్థులకు విదేశీమోజు చాలా వరకు తగ్గుతుంది. ఆధ్యాత్మిక సాహిత్యాన్ని అధ్యయనం చేస్తారు. శుభకార్యములు, తీర్థయాత్రలు, కాంట్రాక్టు పనుల వలన లాభములు సిద్ధిస్తాయి. ఇంజనీరింగ్ విద్యార్థులు పరీక్షలలో బాగా రాణిస్తారు.

**శ్రావణం :** ఈ మాసములో శుక్ర, రాహువులు శుభులు. రవి, కుజులు అర్ధశుభులు. పెట్టుబడి కార్యాలు సానుకూలమగుటకు ఇవి మంచి రోజులు. ఆధ్యాత్మిక చింతన పెరుగుతుంది. వివాహాది శుభ కార్యములు నిర్విఘ్నంగా సాగుతాయి. ఉద్యోగులకు అభివృద్ధికరంగా ఉంటుంది. గృహంలో మార్పులకు, చేర్పులకు ఇది తగిన సమయం. విద్యార్థులు అనవసర విషయాలపై దృష్టి పెట్టరాదు. ప్రయాణాలలో దొంగతనం జరుగకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. చిట్‌ఫండ్ బీమాలు, ఋణ ప్రయత్నాలకు అనుకూలం. ఉమ్మడి వ్యాపారులకు అనుకూలమైన సమయం.

**భాద్రపదం :** ఈ మాసములో కుజ, శుక్ర, రాహువులు శుభులు. బుధుడు అర్ధశుభుడు. వాహన సౌఖ్యం, సంఘంలో పేరు, రాజకీయ నాయకుల పరిచయము, ప్రభుత్వ అధికారులతో సఖ్యత, వ్యాపారమందు సంతృప్తి ఈ మాసంలో కలుగును. ఆర్థికాభివృద్ధి గత మాసము కంటే మేలు. అప్పుల బాధ తగ్గుతుంది. సోదరులతో మైత్రీ ప్రయత్నము ఫలించును. సంఘంలో మంచి కీర్తిని గడించ గలరు. దైవ సందర్శనము, మిత్రుల సహకారం, దానధర్మములు చేయుట, కీర్తి ప్రతిష్ఠలు కలుగును. తగాదాలు తీర్చుట యందు పేరొందుదురు. నిరుద్యోగులకు ఉపాధి లభించును.

**ఆశ్వయుజం :** ఈ మాసములో కుజ, బుధ, శుక్ర, రాహువులు శుభులు. రవి అర్ధశుభుడు. ఉమ్మడి కార్యక్రమాలు, కొత్త పరిచయాలు మొదలగు వాటికి ఈ మాసం అనుకూలం. వివాహాది శుభకార్యములు స్థిరపడును. పుణ్య నదులలో స్నానము లభించగలదు. ఉద్యోగస్థులు పై అధికారులతో జాగ్రత్తగా మెలగాలి. వర్తక, వ్యాపారములకు మధ్యమంగా ఉన్నది. విలువైన వస్తు సేకరణకు, పొదుపు పథకాలకు ఆలోచన చేస్తారు. విద్యార్థులు విద్యావిషయాలపై, క్రీడలపై ఎక్కువ శ్రద్ధ చూపుతారు.

**కార్తికం :** ఈ మాసములో రవి, శుక్ర, రాహువులు శుభులు. సత్కాలం ఆసన్నమైనది. ఆత్మీయుల నుండి శుభవార్తలు వింటారు. మీ ఆలోచనలు, తలచిన కార్యాలు నిర్విఘ్నంగా నెరవేరుతాయి. రావలసిన ధనం సకాలంలో అందటం వలన ఆర్థిక ఇబ్బందులు తొలగి పోతాయి. ఉద్యోగ ప్రయత్నాలు కొలిక్కి వస్తాయి. విదేశీప్రయాణ ప్రయత్నాలు అనుకూలిస్తాయి.

**మార్గశిరం :** ఈ మాసములో శుక్ర,రాహువులు శుభులు. రవి అర్ధశుభుడు. విద్యార్థుల విద్యావ్యాసంగానికి అవరోధాలు ఏర్పడును. కుటుంబంలో చికాకు ఏర్పడుతాయి. ఫైనాన్సు కంపెనీల పరిస్థితి ఇబ్బందికరముగా మారును. సైన్సు రంగము వారికి ఎక్కువ అభివృద్ధి, గుర్తింపు కలుగును. బంధు, మిత్ర విరోధములు, ధననష్టములు, వ్యాపారస్థులకు నష్టములు శారీరిక ఇబ్బందులు మొదలగునవి జరుగును. ద్వితీయార్ధంలో స్నేహితుల సహాయము లభించును. కుటుంబ సభ్యుల మధ్య ఏకీభావం కలుస్తుంది.

**పుష్యం :** ఈ మాసములో రాహువు శుభుడు. శుక్రుడు అర్ధశుభుడు. ప్రథమార్ధంలో మానసికమైన చికాకులు పెరుగుతాయి. చేయదలచిన పనులలో ఒత్తిడి, శ్రమ కలుగుతుంది. ఆర్థికంగా, వ్యావహారికంగా దాపరికం అవసరం. ఆంతరంగిక సమస్యల వల నిందలు, అవమానాలు ఎదురవుతాయి. ద్వితీయార్ధం నుండి తీర్థయాత్రలు, క్షేత్రదర్శనం వలన కాస్త ఊరట కలుగుతుంది. మీ శ్రమకు తగిన ఫలితం, గుర్తింపు లభిస్తాయి. గృహాలంకరణ విషయాలలో ఎక్కువ శ్రద్ధ చూపిస్తారు.

**మాఘం :** ఈ మాసములో రాహువు శుభుడు. బుధుడు అర్ధశుభుడు. ఇతరుల వ్యవహారాలలో తలదూర్చటం వలన మాట పడక తప్పదు. జీవిత భాగస్వామితో ఘర్షణ రావచ్చు. ఆరోగ్యం విషయంలో ఎక్కువ శ్రద్ధ పట్టాలి.హామీలు ఇవ్వటం మంచిది కాదు. కోర్టు వ్యవహారాలు అనుకూలించవు. వ్యాపారవిషయాలలో భాగస్వాముల మధ్య విభేదాలు తలెత్తుతాయి. మాసాంతంలో కొంత అనుకూల పరిస్థితి ఏర్పడుతుంది.

**ఫాల్గుణం :** ఈ మాసములో రాహువు శుభుడు. బుధుడు అర్ధశుభుడు. మతపరమైన విషయాలపై ఆసక్తి పెరుగుతుంది. ఇచ్చి పుచ్చుకునే వ్యవహారాలలో మెలకువ వహించాలి. విద్యార్థులు అనవసరపు ఆందోళనకు గురవుతారు. మాసాంతంలో విశ్రాంతి లోపం, పరిమితులు తప్పిన ఆహారపానీయాల వల్ల ఆరోగ్య ఇబ్బందులు పెడుతుంది. స్పెక్యులేషన్ చేసేవారు ఆందోళనకు గురవుతారు. మాట పట్టింపులకు పోరాదు.

**ఈ రాశి వారు ఈ సంవత్సరం శ్రీ శివ నామావళ్యష్టక స్తోత్ర పారాయణ చేసుకున్న ఉత్తమ ఫలితములను పొందగలరు.**

**అథ జ్యోతిశ్శాస్త్ర ప్రశంసా**

స్వయం స్వయంభువా సృష్టం చక్షుర్భూతం ద్విజన్మనామ్ ।
వేదాంగం జ్యౌతిషం బ్రహ్మ సమం వేదై ర్వినిశ్చితమ్ ॥
జ్యోతిశ్శాస్త్రం మహాపుణ్యం ప్రత్యక్షమపి గోపితమ్ ।
చంద్రార్కౌ సాక్షిణౌ తత్ర శ్రౌతస్మార్తాది సాధనమ్ ॥

**అథ దైవజ్ఞ లక్షణం**

అద్వేషీ నిత్య సంతోషీ గణితాగమ పారగః ।
ముహూర్త గుణ దోషజ్ఞో వాగ్మీ కుశల బుద్ధిమాన్ ॥
శాంత శ్చామృత వాక్సౌమ్య స్త్రికాలజ్ఞో జితేన్ద్రియః ।
నిత్యకర్మరతో యో వై స దైవజ్ఞః పరికీర్తితః ॥

**అథాబ్దాది కృత్యం**

బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ దంతధావన పూర్వకమ్ ।
స్నానాది విధివత్కుర్యా ద్వర్ణాచారానుసారతః ॥
అబ్దాదౌ బంధు సంయుక్తో మంగళస్నాన మాచరేత్ ।
వస్త్రైరాభరణై ర్దేహ మలంకృత్య తత శ్శుచిః ॥
ఉదఙ్ముఖః ప్రాఙ్ముఖో వా దైవజ్ఞస్య తు సన్నిధౌ ।
విఘ్నేశం భారతీం ఖేటాన్ దైవజ్ఞం బ్రాహ్మణా న్గురూన్ ॥
సంపూజ్య వత్సర ఫలం సాంగోపాంగం యథాక్రమమ్ ।
వికాస వదనో ధీమాన్ సమ్యజ్జ్ఞాత్వా ఫలం లభేత్ ॥
అబ్దాదౌ నిమ్బకుసుమం శర్కరామ్ల ఘృతై ర్యుతమ్ ।
మరీచ గుడ సంయుక్తం భక్షయేత్పూర్వ యామకే ॥
ఆయుశ్శ్రీ ర్లభ్యతే వర్షే మనోవ్యాధిశ్చ నశ్యతి ॥
సాంగోపాంగం వత్సరస్య బ్రహ్మణో జన్మతః ఫలమ్ ।
యే శృణ్వంతి క్రతుఫలం తే లభన్తి న సంశయః ॥

**ముహూర్తాలు చూసుకునే విధానము**

**ఔషధ ప్రారంభము :** అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్ర, స్వాతి, అనూరాధ, మూల, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, రేవతి ఈ నక్షత్రములు మంచివి. ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములు, 4, 9, 14, 30 గాక మిగిలిన తిథులు మంచివి. చంద్ర, బుధ, గురు, శుక్రులు మిథున, కన్య, ధనుః, మీన రాశుల యందు బలవంతులై ఉన్నప్పుడును, లగ్నము నుండి 6, 7, 8, 12 స్థానములు శుద్ధముగా ఉన్నప్పుడును, ఆయుర్దాయకార యోగము లందును ఔషధక్రియ ప్రారంభించటం మంచిది. **జన్మ నక్షత్రములో ప్రారంభించటం మంచిది కాదు.**

**శస్త్ర చికిత్సలు (ఆపరేషన్లు) :** శుభ నక్షత్రములు, 7,8,9,10, 11,12,13, తిథులు, శుభలగ్నములు మంచివి. **కుజశనుల సమసప్తక స్థితి ఉత్తమం కాదు.** లగ్నము నుండి 6,7,8,12 స్థానములు శుద్ధముగా ఉన్నప్పుడును, లగ్న చంద్రుడు కాని సమయములోను, ఆయుర్దాయకార యోగములందును మంచిది.

**సిజేరియన్ ఆపరేషన్లు :** పంచమశుద్ధి మరియు శస్త్ర చికిత్సకు చెప్పబడినవి ముఖ్యమైనది.

**రోగనిర్ముక్త స్నానముహూర్తం :** రోహిణి, పునర్వసు, పుష్యమి, ఆశ్రేష, మఘ, ఉత్తరఫల్గుని, స్వాతి, ఉత్తరాషాఢ, శతభిషం, ఉత్తరాభాద్ర రేవతులు నిషిద్ధ నక్షత్రములు. సోమ, శుక్ర వారములు నిషిద్ధము. త్రయోదశి తిథి నిషిద్ధము. మేష, కర్కట, తుల, మకర లగ్నములు మంచివి. 4, 9, 14 తిథులు ప్రశస్తములు. జన్మరాశి నుండి చంద్రుడు 2,4,5,8,9,12 స్థానముల యందున్నప్పుడు పాపులు 1,4,5,7,9,10,11 స్థానము లందు ఉన్నప్పుడు మంచిది.

**ఆరోగ్య భంగ యోగములు :** భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్రేష, పూర్వఫల్గుని, స్వాతి, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర నక్షత్రములు. ఆది, మంగళ, శని వారములు, 4, 6, 9, 12, 14 తిథులును గూడిన దినమందు రోగము ప్రారంభమైన అనారోగ్యము పెరుగును.

**ఉద్యోగములో చేరుటకు :** అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, చిత్ర, అనూరాధ, శ్రవణం, ధనిష్ఠ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు మంచివి. శుభతిథులు, సోమ, బుధ, గురు, శుక్ర వారములు, శుభలగ్నములు గాని, లగ్నాత్ 10, 11 స్థానాలలో రవి కుజులు ఉన్నప్పుడు ఎక్కువ మంచిది.

**క్రయ విక్రయాదులు :** క్రయమనగా ధనమునిచ్చి వస్తువును కొనుట. విక్రయమనగా ధనమును గ్రహించి వస్తువును అమ్ముట. విక్రయమునకు పనికి వచ్చు నక్షత్రములు క్రయమునకును, క్రయమునకు పనికి వచ్చు నక్షత్రములు విక్రయమునకును పనికి రావు. భరణి, కృత్తిక, ఆశ్రేష, విశాఖ విక్రయమునకును, అశ్విని, చిత్ర, స్వాతి, శ్రవణం, శతభిషం, రేవతి క్రయమునకు శుభం. మిగిలిన నక్షత్రములు క్రయ విక్రయములు రెంటికిని పనికి వచ్చును. కేంద్ర కోణములయందు శుభులును, 3,6,11 స్థానములలో పాపులును, కుంభలగ్నం కాకుండా ఇతర లగ్నముల యందు, శుభ తిథుల యందు విక్రయములు జరుపుట మంచిది.

**విపణి (Market) :** 4, 9, 14 తిథులు, మంగళవారము, కుంభ లగ్నము మంచిది కాదు. అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తరఫల్గుని, హస్త, చిత్ర, అనూరాధ, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర నక్షత్రములు మంచివి. చంద్ర శుక్రులు లగ్నమందును, శుభులు 2,10,11 స్థానములలో ఉన్నప్పుడును, 8,12 స్థానములందు పాపులు లేకున్నప్పుడును మంచిది.

**భూషణధారణము :** త్రిపుష్కర దినమందును, అశ్విని, రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తరఫల్గుని, హస్త, స్వాతి, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర నక్షత్రముల యందును శుభము.

**రత్నములు పొదిగిన ఆభరణములను ధరించుటకు :** అశ్విని, కృత్తిక, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తరఫల్గుని, హస్త, చిత్ర, స్వాతి, విశాఖ, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి మంచివి. ఆది, మంగళ వారములు, మేష, సింహ, వృశ్చిక లగ్నములు శుభప్రదములు.

**ముత్యాలతో గూడిన ఆభరణములను ధరించుటకు :** సోమ, శుక్రవారాలు, వృషభ, కర్కట, తులా లగ్నములు, అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తరఫల్గుని, హస్త, చిత్ర, స్వాతి, ఉత్తరాషాఢ, శ్రవణం, అనూరాధ, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి ఈ నక్షత్రములు మంచివి.

**వెండి బంగారు పాత్రల యందు భోజనమునకు :** సోమ, బుధ, గురు, శుక్రవారములు, అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తరఫల్గుని, హస్త, చిత్ర, అనూరాధ, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు, అమృత యోగములు ఆరోగ్యప్రదములు.

**నాణెములు ముద్రించుటకు :** అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తరఫల్గుని, హస్త, చిత్ర, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి ఈ నక్షత్రములు, ఆది, మంగళ, బుధ, గురు, శుక్రవారములు, 3, 5, 8, 10, 13, 15 తిథులును శుభము. మేష, సింహ, వృశ్చిక, మకర, కుంభ లగ్నములు, అంశలును మంచివి. గురు, శుక్రులు సప్తమమందు శ్రేష్ఠం కాదు.

**నూతన వస్త్రములను శుద్ధి చేయుటకు :** శుక్లపక్షములో 4, 6, 9, 12, 14, 15 తిథుల యందు, కృష్ణ పక్షములో 8, 14, 15 తిథుల యందును, మాస సంక్రాంతులు, శ్రాద్ధ దినములు, బుధ శని వారములు నిషిద్ధములు. అశ్విని, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్ర, స్వాతి, విశాఖ, అనూరాధ, ధనిష్ఠ ఉత్తరాభాద్ర నక్షత్రములు మంచివి.

**నూతన శయ్యా, ఆసన, పాదుకలను ఉపయోగించుటకు :** అశ్విని, భరణి, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తరఫల్గుని, హస్త, చిత్ర, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు మంచివి.

**ఋణమును ఇచ్చుటకు :** అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, చిత్ర, స్వాతి, విశాఖ, అనూరాధ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, రేవతులు ప్రశస్తము. మేష, కర్కాటక, తులా, మకర లగ్నములు శుభము. బుధవారము నిషిద్ధము. అష్టమశుద్ధి, కోణముల యందు శుభస్థితి ఉండవలెను. ఋణమును మంగళవారమున తీసికొనగూడదు. బుధవార మందు ఋణమును తీసికొనవలెను. మంగళవారమున ఋణమును తీర్చివేయ వలెను. రవి, కుజ సంక్రాంతుల యందు, వృద్ధి యోగమందును, హస్త నక్షత్రముతో గూడిన ఆదివారమందును ఋణము తీసికొనరాదు.

**సంగీత నృత్యారంభమునకు :** రోహిణి,మృగశిర, పుష్యమి, ఉత్తరఫల్గుని, హస్త, అనూరాధ, జ్యేష్ఠ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు, ఆది, సోమ, బుధ, గురు, శుక్ర వారములు మంచివి. చంద్రుడు మిథున, కన్యల యందున గాని, లగ్నమందు బుధుడును, చతుర్థమునకు శుభ గ్రహస్థితి గాని, వీక్షణ గాని మంచిది.

**సేవకులను నియమించుకొనుటకు :** అశ్విని, మృగశిర, పుష్యమి, హస్త, చిత్ర, అనూరాధ, రేవతి నక్షత్రములు రవి, బుధ, గురు, శుక్రవారములు శుభము. శుభ గ్రహములు లగ్నమందును, రవి, కుజులు దశమ, ఏకాదశముల యందు శ్రేష్ఠము. స్వామి, సేవకులకు యోని మైత్రి యుండవలెను. గ్రహమైత్రి ఉండవలెను.

**సిరామోక్షణము** (Blood-Letting; Operation) **:** అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, హస్త, చిత్ర, స్వాతి, అనూరాధ, జ్యేష్ఠ, శ్రవణం, శతభిషం నక్షత్రములు, ఆది, మంగళ, గురు వారములు మంచివి.

**పంటల కోతలకు :** భరణి, కృత్తిక, మృగశిర, ఆర్ద్ర, పుష్యమి, ఆశ్రేష, మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని, హస్త, చిత్ర, స్వాతి, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, నక్షత్రములందును, ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారము లందును, 4,9,14 తిథులు కాకుండ మిగిలిన తిథుల యందును, వృషభ, సింహ, వృశ్చిక, కుంభ లగ్నములందును శ్రేష్ఠము.

**ధాన్యమర్దనము (మహసూలు) :** రోహిణి, మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని, జ్యేష్ఠ, అనూరాధ, మూల, శ్రవణం, రేవతి నక్షత్రములు, సింహలగ్నము కాని గురు శుక్రులున్న లగ్నము గాని శుభప్రదము. రోహిణి యందు ధాన్యమర్దనము, హస్త యందు బీజావాపము, ఉత్తరాషాఢ యందు ధాన్యసంగ్రహము ఎక్కువ ప్రశస్తమైనవి.

**ధాన్యమును నిల్వచేయుట :** అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తరఫల్గుని, హస్త, చిత్ర, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతులు, వృషభ, మిథున, సింహ, కన్యా, వృశ్చిక, ధనుస్సు, మకర, కుంభ, మీన లగ్నములు, సోమ, బుధ, గురు, శుక్ర వారములు మంచివి.

**ధాన్యవృద్ధి (వ్యాపారము) :** అశ్విని, రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తరఫల్గుని, హస్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి ఈ నక్షత్రములయందును, రిక్త తిథులు, పర్వములను విడిచి మిగిలిన తిథుల యందును, సౌమ్య వారములందును, గురు శుక్ర మౌఢ్యములు లేని కాలమందును, సూర్యుడు దశమమందును, చంద్రుడు నాల్గింటను, గురువు లగ్నమందును ఉన్నప్పుడును, శుభ శకునములు కలుగుచున్నపుడును ఆరంభించవలెను.

**కొత్త ధాన్యపు పంట :** అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్ర, స్వాతి, అనూరాధ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, రేవతి నక్షత్రములు, శుభగ్రహయుత, దృష్ట లగ్నములు శ్రేష్ఠము. 1, 6, 11 తిథులు, వర్జ్య దుర్ముహూర్తములు, శని మంగళ వారములు, పుష్య చైత్ర మాసములు నిషిద్ధము.

**రాజదర్శనము :** అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తరఫల్గుని, హస్త, చిత్ర, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, ఉత్తరాభాద్ర, రేవతి శుభప్రదములు.

**శిల్పవిద్యా ముహూర్తము :** అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర ఫల్గుని, హస్త, చిత్ర, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములు మంచివి. బుధ గురువులు లగ్నమునుండి 1 లేక 10 స్థానములలో యున్నపుడును, చంద్రుడు బుధ గురు వర్గుల యందున్నప్పుడును చాలా మంచిది.

**అద్దె ఇంటి ప్రవేశము :** శుభతిథులు, శుభనక్షత్రములు, శుభవారములు, శుభలగ్నములు మంచివి.

**మైత్రీ సంధాన ముహూర్తము :** పుష్యమి, పూర్వఫల్గుని, అనూరాధా నక్షత్రములు, అష్టమీ ద్వాదశులు, తైతుల కరణము, శుక్ర యుత దృష్టమైన లగ్నము ప్రశస్తము.

**విదేశీ ప్రయాణములు :** అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, అనూరాధ, మూల, శ్రవణం, ధనిష్ఠ, రేవతి నక్షత్రములు, 2,3,5,7,10,11,13 తిథులు, మేష, వృషభ, కర్కాటక, కన్య, తుల, ధనుస్సు, మీన లగ్నములు, శుభ చంద్ర స్థితి, 7, 8 స్థానముల శుద్ధి, లగ్నమునకు పాపగ్రహదృష్టి లేకుండుట, చంద్ర రాహువుల కలయిక లేని సమయములోను, లగ్నములో గురువు కాని, శుక్రుడు కాని ఉన్న చాలా మంచిది.

**యాత్రా ప్రయాణములు :** గురు, శుక్ర మౌఢ్యములు లేని సమయములలోను, సంక్రమణము కాని దినములు, అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, అనూరాధ, మూల, శ్రవణం, ధనిష్ఠ, రేవతి నక్షత్రములు, 2,3,5,7,10,11,13 తిథులు, మేష, వృషభ, కర్కాటక, కన్య, తుల, ధనుస్సు, మీన లగ్నములు, శుభ చంద్ర స్థితి, సప్తమ, అష్టమ స్థానముల శుద్ధి, లగ్నమునకు పాపగ్రహదృష్టి లేకుండుట. లగ్నములో కాని, భాగ్యములో కాని గురువు ఉన్న చాలా మంచిది.

**దేవతా ప్రతిష్ఠ :** సింహ లగ్నమందు సూర్యుని, కుంభమందు బ్రహ్మను, కన్యయందు విష్ణువును, మిథునమందు శివుని, మిథున కన్యా ధనుర్మీనముల యందు దుర్గా దక్షిణామూర్త్యాది దేవతలను, మేష, కర్కట, తులా, మకరములయందు చతుష్షష్టి యోగినీ ప్రభృతులగు క్షుద్ర దేవతలను, స్థిర లగ్నములందు నిఖిల దేవతలను ప్రతిష్ఠించుట ప్రశస్తము.

సూర్యుని హస్త నక్షత్రమందును, చంద్రాద్యష్ట గ్రహములను పుష్యమి నక్షత్రమందును, మహాదేవ బ్రహ్మలను పుష్యమి శ్రవణం అభిజిత్తుల యందును, కుబేరుని, స్కందుని అనూరాధ యందును, దుర్గా ప్రభృతి దేవతలను మూలా నక్షత్ర మందును, లక్ష్మీ వ్యాస వాల్మీక్యగస్త్యులను సప్తర్ష్యధిష్ఠిత నక్షత్ర మందును, గణేశ యక్ష సర్ప (వాసుక్యాదులు) భూతాదులను (దేవయోనులు) రేవతి యందును, ఇంద్రుని, కుబేరుని, విడిచి మిగిలిన లోకపాలురను ధనిష్ఠ యందును, ఇంకను మిగిలిన దేవతలను రోహిణి, ఉత్తరా త్రయముల యందును ప్రతిష్ఠించుట శుభప్రదము.

**బీజావాపనము – ఫణి చక్రము :** రాహ్వధిష్ఠిత నక్షత్రము నుండి మొదటి 8 నక్షత్రములు మంచివి; 9,10,11 శుభము; 12 అశుభము; 13,14,15 శుభము; 16 అశుభము. 17,18,19 శుభము;20 అశుభము; 21,22,23 శుభము; 24,25,26,27 అశుభము.

**గల గ్రహః :** 1,4,7,8,9,13,14, పౌర్ణమి (అమావాస్య) ఈ 8 తిథులును రెండు పక్షములయందును గలగ్రహములని వ్యవహరింపబడును. ఈ తిథులయందు క్షౌర, విద్యారంభ, వ్రతోద్దేశ, చూడావ్రత, వివాహ, కర్ణవేధలను ఆచరింపదగదు. **గలగ్రహే న కర్తవ్యం యదీచ్ఛేత్పుత్ర జీవితం.** గలగ్రహ దోషము వసన్త ఋతువులో ఉండదు.

### ముహూర్త దోషములు – వాటి మినహాయింపులు

### ఏకవింశతి మహాదోషములు

**1. పంచాంగ శుద్ధిరాహిత్యము :** ముహూర్త లగ్నమునకు శుభతిథి, శుభవార, శుభ నక్షత్ర, శుభయోగ, శుభకరణములు లేకుండుటను పంచాంగ శుద్ధిరాహిత్యమంటారు.

**2. సూర్యసంక్రమణము :** సూర్యసంక్రమణమున ఉపనయన వివాహాది శుభకార్యములు చేయకూడదు. మేషాదిరాశులలోనికి సూర్యుడు ప్రవేశించిన సమయమునకు పూర్వము 6 గం. 24 ని.లు, తరువాత 6 గం. 24 ని.లు తప్పక విడువవలెను.

**3. పాపషడ్వర్గము :** లగ్నము, హోరా, ద్రేక్కాణ, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశమను వర్గషట్కమునకు షడ్వర్గమని పేరు. షడ్వర్గాధిపతులు పాపగ్రహములయినచో, పాపషడ్వర్గమంటారు. శుభగ్రహములయినచో శుభషడ్వర్గమంటారు. పాప షడ్వర్గము దోషము, శుభ షడ్వర్గము ప్రశస్తము. **'షడ్వర్గః శుభదః శ్రేష్ఠః వివాహ స్థాపనాదిషు'** షడ్వర్గాధిపతులలో నలుగురు శుభులు అయినను మంచిదే. **'ముహూర్త లగ్న షడ్వర్గ కునవాంశ గ్రహోద్భవాః । యే దోషా స్తాన్నిహంత్యేవ యత్రైకాదశగః శశీ'** అనునది కశ్యప వచనము. కావున చంద్రుడు 11లో ఉన్నచో పాపషడ్వర్గ దోషము హరించును.

**4. కునవాంశము :** కాలామృతకారుని వచనం బట్టి లగ్నం కంటే శుభనవాంశ బలమైనదని తెలియవలెను (**లగ్నాన్నవాంశో బలీ**). మిథున, కన్య, తులా, వృషభ నవాంశలు శుభప్రదములు. తక్కిన నవాంశలు కునవాంశలు. అంత్య నవాంశము పనికిరాదు. కాని, అంత్యనవాంశము వర్గోత్తమాంశమయిన దోషము లేదు. చరరాశి యొక్క ప్రథమ నవాంశము వర్గోత్తమాంశమయినను గ్రాహ్యము గాదు.

**కునవాంశ దోషాపవాదము :**

(1) లగ్నమందు గురువు ఉంటే లగ్న, నవాంశ, పాపషడ్వర్గ దోషములు హరింపబడును. ఇందుకు జ్యోతిర్నిబంధము – **లగ్న దోషాంశదోషాః యే దోషాః షడ్వర్గజాశ్చయే । హన్తి తాన్ లగ్నగో జీవో మేఘసంఘ మివానిలః ॥**

(2) నవాంశ, గ్రహ, షడ్వర్గ, లగ్నజనిత దోషములను ఏకాదశ మందున్న చంద్రుడు నశింపచేయును. **కునవాంశ గ్రహోద్భూతాః షడ్వర్గ క్షణలగ్నజాః। శశిన్యేకాదశే సర్వే దోషా నశ్యన్తి వై ధ్రువమ్ ॥**

**5. ఉదయాస్త శుద్ధిరాహిత్యము :** ఉదయ అనగా లగ్నము. అస్త అనగా సప్తమము. ఈ రెండింటి శుద్ధి లేకపోవుట వలన ఉదయాస్త శుద్ధిరాహిత్యమనెడు దోషము కలుగుతుంది. ఉదయాస్త శుద్ధి ఈ దిగువ చెప్పబడిన అంశముల వలన కలుగును.

1. లగ్నాధిపతి లగ్నమందు ఉన్నను/చూచినను, నవాంశ లగ్నాధిపతి నవాంశ లగ్నమందు ఉన్నను/చూచినను, ఉదయశుద్ధి అగును. ఇది వరునకు ప్రశస్తము.
2. లగ్నమందు నవాంశాధిపతి ఉన్నను/చూచినను, లగ్నాధిపతి నవాంశ లగ్నమందు ఉన్నను/చూచినను, ఉదయశుద్ధి అగును. ఇది వరునకు ప్రశస్తము.
3. సప్తమ భావాధిపతి సప్తమందు ఉన్నను/చూచినను, సప్తమ నవాంశాధిపతి సప్తమ భావమందు ఉన్నను/చూచినను సప్తమశుద్ధి. ఇది కన్యకు శుభప్రదము.
4. నవాంశలగ్నాధిపతి యొక్క శుభమిత్రగ్రహము నవాంశ లగ్నమును కాని, లగ్నమును కాని చూచిన యెడల వరునకు శుభప్రదము. సప్తమ నవాంశాధిపతి యొక్క శుభ మిత్ర గ్రహము సప్తమాంశను గాని, లగ్నము యొక్క సప్తమ రాశిని గాని చూచిన యెడల వధువునకు శుభప్రదము.

**6. కర్తరి :** లగ్నమునకు ద్వితీయమునందు వక్రగ్రహ పాపగ్రహము, ద్వాదశమందు ఋజు పాపగ్రహము ఉన్నచో కర్తరీ దోషమేర్పడును. అనగా రెండు పాప గ్రహములు పరస్పరము అభిముఖముగా సంచరించుచు కత్తెర చేయునట్లు లగ్నమును ఛేదించును.

**కర్తరీ దోష పరిహారము :**

1. ద్వితీయమందు శుభగ్రహము లేక ద్వాదశమందు గురువు ఉన్నట్లయితే కర్తరీ దోషము ఉండదు. **శుభైః ధనస్థై రథ వాన్యగే గురౌ న కర్తరీ స్యాదిహ భార్గవో విదుః.**
2. ద్వితీయమందు ఋజుగ్రహము, ద్వాదశమందు వక్రగ్రహమున్నను కర్తరి యుండదు.
3. లగ్నమందు శుభగ్రహమున్నను కర్తరీ దోషము నివారింప బడును. **శుభగ్రహయుతం లగ్నం క్రూరయో ర్నాస్తి కర్తరీ.**
4. కర్తరి చేయు గ్రహము నీచయందున్నను, శత్రుక్షేత్ర మందున్నను, అస్తంగతుడైనను కర్తరీ దోషముండదు. **పాపయోః కర్తరీ కర్త్రోః శత్రు నీచ గృహస్థయోః। యదా చాస్తగతయో ర్వాపి కర్తరీ నైవ దోషదా ॥**
5. బలోపపన్నమయిన సూర్యుడు గాని, చంద్రుడు గాని లగ్న మందున్నచో కర్తరీ దోషము పోవును.
6. బుధ, గురు, శుక్రులలో ఎవరైనను కేంద్ర, త్రికోణములలో ఉన్నచో కర్తరీ దోషము పోవును. **క్రూర కర్తరి సంయుక్తం లగ్నం చంద్రం చ న త్యజేత్। కేంద్ర త్రికోణ సంస్థేషు గురు భార్గవ విత్సుచేత్ ॥**

**7. భృగుషట్కము :** లగ్నమునకు శుక్రుడు షష్ఠ స్థానమందుండుట దోషము. షష్ఠ మందున్నప్పటికిని ఆ షష్ఠస్థానము శుక్రునకు నీచరాశి యగు కన్య అయినను శత్రుక్షేత్ర ములగు కర్కాటక సింహ ధనుస్సులైనను దోషము గాదు. **శత్రు నీచర్షగః శుక్రో న దూష్యోహ్యారి సంస్థితః.**

**8. కుజాష్టమము :** లగ్నమునకు అష్టమస్థానమందు కుజుడుంటే దోషము. కుజుడు అస్తంగతుడయినను, నీచరాశియగు కర్కాటక మందున్నను, శత్రు క్షేత్రములగు మిథున, కన్యల యందున్నను కుజాష్టమ దోషముండదు. **అస్తగే నీచే భౌమే శత్రు క్షేత్ర గతేపి వా । కుజాష్టమోద్భవో దోషో న కించిదపి విద్యతే ॥** కాని కాలామృతకారునకు భృగుషట్క, కుజాష్టమ దోషాపవాదములు సమ్మతము కాదు.

**9. షష్ఠాష్ట రిఃఫ చంద్రుడు :** లగ్నమునకు షష్ఠమందుగాని అష్టమ మందుగాని, ద్వాదశమందుగాని చంద్రుడున్నచో, షష్ఠాష్ట రిఃఫ చంద్ర దోషమనబడును. అయితే చంద్రుడు పై స్థానాలలో ఉన్న అన్నప్రాశనము శుభమని నారదవచనము.

**దోషాపవాదము :** 1. ఆ రాశి వృశ్చికమయినను, నీచ నవాంశ యైనను అయిన యెడల దోషము ఉండదు. **నీచే నీచనవాంశకే శశిని రిఃఫాష్టారి దోషోపి న ॥**

2. లగ్నమందు గురువు గాని, శుక్రుడు గాని బలముగా నుండినను, శుభవర్గములను పొందిన చంద్రుడు శుభగ్రహముచే చూడబడినను, వృద్ధి చంద్రుడు శుభదృష్టి పొందినను దోషము ఉండదు.

**10. అష్టమ లగ్నము :** వధూవరుల జన్మలగ్నములకు గాని, జన్మ రాశులకు గాని అష్టమ రాశి వివాహ ముహూర్త లగ్నమగుట దోషము. **దోష పరిహారము** (1) జన్మ లగ్నాధిపతి లేక జన్మ రాశ్యధిపతి మరియు వివాహ ముహూర్త లగ్నాధిపతి ఒకే గ్రహమైనను లేక పరస్పర మైత్రి యున్నను అష్టమ లగ్న దోషపరిహారమగును. ఇందుకు ముహూర్త చింతామణి – **ఏకాధిపత్యే రాశీశే మైత్రే వా నైవ దోషకృత్** మరియు ముహూర్త గణపతి – **వృషభో వృశ్చికో మీనః కన్యా మకర కర్కటాః । లగ్నేష్వేతేషు నో దోషో జన్మత హ్యష్టమేష్వపి** (2) అష్టమలగ్నాధిపతి కేంద్రమందుండి శుభ గ్రహములచే చూడబడినను, అష్టమ లగ్న దోషము పరిహారమగును. **లగ్నాదష్టమ రాశీశః కేంద్రగః శుభవీక్షితః । యద్యష్టమ గతస్యోక్త దోష మాశు వ్యపోహతి ॥** (3) అష్టమ లగ్నాధిపతి శుభ నవాంశ యందున్నను, స్వక్షేత్ర మందున్నను, మిత్రక్షేత్ర మందున్నను అష్టమలగ్న దోషము ఉండదు.

**11. విషఘటీ దోషము :** విషఘటికలు మూడు విధములు. (1) తిథి విషఘటికలు, (2) వార విషఘటికలు, (3) నక్షత్ర విష ఘటికలు. (వర్జ్యము లేక త్యాజ్యము).

**12. దుర్ముహూర్తము :** దీనిని వార దుర్ముహూర్తమంటారు.

**13. సగ్రహ చంద్రుడు:** చంద్రుడు మరియొక గ్రహముతో కలిసినచో సగ్రహచంద్ర దోషము అనబడుతుంది. కాలామృతము ప్రకారము చంద్రుడు రవితో కలిస్తే దారిద్ర్యము, కుజునితో కలిస్తే మరణము, శుక్రునితో కలిస్తే సవతి, బుధునితో కలిస్తే వైరాగ్యము, రాహువుతో కలిస్తే కలహము, కేతువుతో కలిస్తే దుఃఖము. కాని, చంద్రుడు బుధునితో కలిసిన శుభము, గురువుతో కలిసిన సౌఖ్యము అని కొందరి అభిప్రాయము.

**చంద్రే సూర్యాది సంయుక్తే దారిద్ర్యం మరణం శుభమ్ ।**
**సౌఖ్యం సాపత్న్యం వైరాగ్యం పాపద్వయయుతే మృతిః ॥**

మరియు చంద్రుడు రెండు పాపగ్రహములతో కలిసినచో దంపతులకు మరణము కలుగును. ఇందుకు **పాపద్వయయుతే చంద్రే దంపత్యో ర్మరణం ధ్రువమ్** అనునది నారద పురాణోక్తి. చంద్రుడు రెండు లేక అంతకంటే ఎక్కువ శుభగ్రహములతో కలసిన యెడల భర్త విదేశములకు పోవును. **శశియుతైః దీర్ఘప్రవాసః శుభైః** అనునది వశిష్ఠ వచనము. చంద్రుడు సూర్యాది గ్రహములతో కలసినను, నక్షత్రాంతర్గతుడైనను సగ్రహచంద్ర దోషము ఉండదని కొందరి అభిప్రాయము.

**సగ్రహ చంద్ర దోష పరిహారము :** (1) స్వకీయవర్గములోను, కేంద్ర మందును ఉన్న గురువు చంద్రుని చూచిన యెడల సగ్రహ దోషము నివారింపబడును. (2) చంద్రుడు స్వక్షేత్రమగు కర్కాటకమందున్నను, స్వోచ్చయగు వృషభమందున్నను, మిత్ర క్షేత్రములగు సింహ, మిథున, కన్యల యందు ఉన్నను, వర్గోత్తమగతుడైనను, సగ్రహచంద్ర దోషము ఉండదు. దంపతులకు శ్రేయము కలుగును. **వర్గోత్తమ గతే చంద్రే స్వోచ్చే మిత్రర్షగే తథా । యుతిదోషశ్చ న భవేత్ దంపత్యోః శ్రేయసే సదా ॥**

**14. గండాంతము :** గండాంతము 3 విధములు. (1) తిథి గండాంతము, (2) నక్షత్ర గండాంతము, (3) లగ్న గండాంతము.

**తిథి గండాంతము :** పంచమి తిథి యొక్క చివరి 24ని.లు మరియు షష్ఠి తిథి యొక్క మొదటి 24 ని.లు కలిసి 48 ని.ల కాలమును, దశమి యొక్క చివరి 24 ని.లు ఏకాదశి యొక్క మొదటి 24 ని.లు కలిసి 48 ని.ల కాలము, పౌర్ణమి యొక్క చివరి 24 ని.లు పాడ్యమి యొక్క 24 ని.లు కలసి 48 ని.ల కాలము తిథి గండాంతములు అగును. **తద్దైవ తిథి గండాంతం నాస్తీందౌ బలశాలినీ** అను శాకల్యసంహిత వచనము ప్రకారము, ముహూర్త లగ్నమునకు చంద్రుడు బలముగా నున్నట్లయితే తిథి గండాంతదోషము పోవును.

**నక్షత్ర గండాంతము :** రేవతి యొక్క చివరి 48 ని.లు అశ్విని యొక్క మొదటి48 ని.లు కలిసిన కాలము, ఆశ్రేష చివరి48 ని.లు మఘ యొక్క మొదటి48 ని.లు కలిసిన కాలము, జ్యేష్ఠ చివరి 48 ని.లు మూల మొదటి 48 ని.లు కలిసిన కాలము నక్షత్ర గండాంతములు అగును. నక్షత్రగండాంతదోషము నక్షత్రశాంతిచే పరిహరింప బడును.

**లగ్న గండాంతము :** మీనము యొక్క చివరి 12 ని.లు మేషము యొక్క మొదటి 12 ని.ల మొత్తము 24 ని.లు, కర్కాటకము యొక్క చివరి 12 ని.లు సింహము యొక్క మొదటి 12 ని.ల మొత్తము 24 ని.లు, ఇట్లే వృశ్చికము యొక్క చివరి 12 ని.లు ధనుస్సు యొక్క మొదటి 12 ని.ల మొత్తము కలిసి 24 ని.లు. ఈ మూడును లగ్న గండాంతములు అంటారు. **తథైవ లగ్నగండాంతం నాస్తి జీవే బలాన్వితే** అనునది శాకల్య సంహితా వచనము. కావున, గురువు బలముగా ఉన్నట్లయితే, లగ్న గండాంత దోషము పరిహరింపబడుతుంది. తిథి, నక్షత్ర, లగ్న, గండాంత దోషములు అభిజిన్ముహూర్తమందు నివారింపబడును. ఇందుకు వశిష్ఠ వచనము **గండాంత దోష మఖిలం ముహూర్తోభి జిదాహ్వయః । హన్తి యద్వన్మృగం వ్యాధః పక్షి సంఘ మివాఖిలమ్ ॥** మరియు ఈ త్రివిధ గండాంత దోషములు, కేంద్రమందున్న శుభగ్రహము వలన గాని, 11వ స్థానమందున్న చంద్రుని వలన గాని పరిహరింప బడును. **తిథ్యాదీనాం సంధిదోషం తథా గండాంతసంజ్ఞితమ్ । హన్తి లాభగతశ్చంద్రః కేంద్రగో వా శుభగ్రహః ॥** అలాగే సౌర, చాంద్ర, బార్హస్పత్యాబ్దముల ఆద్యంతముల యందు శుభకర్మల విషయమై మూడు దినములు వర్జింప వలెను.

**15. ఖర్జూర లేక ఏకార్గళము :** 27 నైసర్గిక యోగములలో విష్కంభ, అతిగండ, శూల, గండ, వ్యాఘాత, వజ్ర, వ్యతీపాత, పరిఘ, వైధృతి అనునవి 9 దుష్టయోగములు. ఈ 9 దుష్ట యోగములలో ఏదైన ఒక దుష్ట యోగమున్నప్పుడు, సూర్యుడున్న నక్షత్రము నుండి చంద్రుడున్న నక్షత్రము వరకు లెక్కించగా విషమ సంఖ్య వచ్చిన యెడల ఖర్జూరికా లేక ఏకార్గళ దోషము కలుగును. ఈ గణనయందు అభిజిన్నక్షత్రమును కూడ తీసుకొనవలయును.

**దోషాపవాదము :** కాలామృతములో - **స్యాతాం శీతగుభాస్కరౌ యది తయోః దృష్టి ర్మిథో మృత్యుకృత్** - అని చెప్పబడుట వలన, ఏకరేఖాంగత నక్షత్రములందు సూర్య చంద్రులు ఉన్నప్పటికిని, పరస్పర దృష్టి కలిగినప్పుడు మాత్రమే ఏకార్గళదోషము గలుగును. లేని యెడల ఏకార్గళదోషమని చెప్పరాదు. వీరిలో 4వ పాదమున నొకగ్రహము, 1వ పాదమున నొక గ్రహము, నుండగాను లేక 2వ పాదమున నొక గ్రహము, 3వ పాదమున నొక గ్రహము నుండగాను పరస్పర దృష్టి కలుగుతుంది. సమాన పాదములో నున్నను దృష్టియుంటుంది. (**ఖర్జూరిక సమాంఘ్రిభం**) అటువంటప్పుడు ఏకార్గళ దోషము కలుగుతుంది. కాని, ఇతర పాదములలో నున్నప్పుడు మాత్రము ఏకార్గళ దోషముండదు. ఇందుకు దైవజ్ఞ విలాసము -
**చతుర్థగస్త్వాద్యపాద మాద్యగస్తు చతుర్థగమ్ । ద్వితీయగ స్తృతీయస్థం తృతీయస్థో ద్వితీయగమ్ ॥ సమాంఘ్రి వేధ స్సర్వత్ర విజ్ఞేయం దిష్ణ్యమండలమ్ ॥**

**దోషపరిహారము :** రవి చంద్రులు బలముగా నుండినచో ఏకార్గళ దోషముండదని ముహూర్త చింతామణిలో చెప్పబడినది.

**16. వేధ :** 1. పంచశలాక వేధ. 2. సప్తశలాక వేధ అని వేధ రెండు రకములు. వధూప్రవేశమునకు, కన్యాదానాది మహా దానములకు, కన్యావరణము, వివాహమునకు పంచశలాకవేధ అవశ్యము విచారణ చేయవలెను. మరియు **వేధోయం కరపీడనే నిగదితో నాన్యేషు తేషు స్మృతాః** అనుటవలన పంచశలాకవేధ వివాహమందు అవశ్యము విచారణ చేయవలెను. ఇతర శుభకర్మ లందు సప్తశలాక వేధ విచారణ చేయవచ్చును.

**పంచశలాక వేధ :** (1) కృత్తిక - విశాఖ, (2) రోహిణి - అభిజిత్, (3) మృగశిర - ఉత్తరాషాఢ, (4) ఆర్ద్ర - పూర్వాషాఢ, (5) పునర్వసు - మూల, (6) పుష్యమి - జ్యేష్ఠ, (7) ఆశ్రేష - ధనిష్ఠ, (8) మఘ - శ్రవణము, (9) పూర్వఫల్గుని - అశ్విని, (10) ఉత్తరఫల్గుని - రేవతి, (11) హస్త - ఉత్తరాభాద్ర, (12) చిత్ర - పూర్వాభాద్ర, (13) స్వాతి - శతభిషం, (14) అనూరాధ - భరణి. ఈ 14 జంట నక్షత్రములును పరస్పరము వేధ కలిగియుండును. అంటే ఈ జంట నక్షత్రములలో నేదైనయొక నక్షత్ర మందు గ్రహము ఉన్నచో రెండవ నక్షత్రమునకు ఆ గ్రహము యొక్క వేధ గలుగును. ఇది దోషము. ఈ విధముగ గ్రహవేధయున్నపుడు వివాహము జరిగినచో రవివేధ వలన వైధవ్యము, కుజవేధ వలన పుత్ర శోకము. బుధవేధ వలన వంధ్యా యోగము, గురువేధ వలన సంన్యాసము, శుక్రవేధ వలన కేవలము స్త్రీ సంతానము, చంద్ర, శని, రాహు వేధల వలన దాస్యము గలుగును. **రవివేధే చ వైధవ్యం పుత్రశోకో భవేత్ కుజే । వంధ్యా పండితవేధే దీక్షాకరణం కరోతి గురువేధే । భృగుసుత వేధే పుత్రీ దాసీ రవిజేందు రాహు సంభూతే ॥**

**పాదవేధ విచారణ :** జంట నక్షత్రములలో గ్రహము ఏదైన నక్షత్రము యొక్క ప్రథమ పాదమందుండెనేని, ద్వితీయ నక్షత్రము యొక్క చతుర్థ పాదమును, చతుర్థ పాదమునందున్న గ్రహము ప్రథమ పాదమును వేధచేయును. ద్వితీయ పాదమందున్న గ్రహము తృతీయ పాదమును, తృతీయ పాదమందున్న గ్రహము ద్వితీయ పాదమును వేధ చేయును. **ఆద్యాంశేన చతుర్థాంశః చతుర్థాంశేన చాదిమమ్ । ద్వితీయేన తృతీయం తు తృతీయేన ద్వితీయకమ్ ॥** కావున, ఏ నక్షత్ర పాదములో గ్రహముందో, తద్విద్ధ నక్షత్ర పాదమును విడిచిన తక్కిన పాదములు గ్రాహ్యములని చెప్పబడినది. ఇందుకు రాజమార్తాండము **యస్మిన్ పాదే గ్రహ స్తిష్ఠేత్ శుభో వా యది వా శుభః । తేనాంఘ్రిణాభ పాదోయో విద్ధోనేష్టః పరే శుభాః ॥** కాని, శుభగ్రహము విద్ధనక్షత్రముచే వేధపొందిన పాదము మాత్రమే నింద్యము. కాని, పాపగ్రహముచే విద్ధ నక్షత్రమును పూర్తిగా విడువవలెను. **ధిష్ణ్యం సౌమ్యగ్రహై ర్విద్ధం పాదమాత్రం పరిత్యజేత్ । క్రూరైస్తు సకలం త్యాజ్యమితి వేధ వినిశ్చయః ॥**

పాపగ్రహముచే గాని శుభగ్రహముచే గాని, విద్ధ నక్షత్రమును పూర్తిగా విసర్జించవలెను, అనెనిడిది మతాంతరము.

**సప్తశలాక వేధ :** (1) జ్యేష్ఠ - పుష్యమి, (2) శతభిషం - స్వాతి, (3) పూర్వాషాఢ - ఆర్ద్ర, (4) రేవతి - ఉత్తరఫల్గుని, (5) ధనిష్ఠ- విశాఖ, (6) ఉత్తరాషాఢ-మృగశిర, (7) అశ్విని-పూర్వఫల్గుని, (8) ఆశ్రేష - అనూరాధ, (9) హస్త-ఉత్తరాభాద్ర, (10. రోహిణి-అభిజిత్, (11) మూల-పునర్వసు, (12) చిత్ర -పూర్వాభాద్ర, (13) భరణి-మఘ, (14) కృత్తిక-శ్రవణం ఈ జంట నక్షత్రములు సప్తశలాక వేధ గలవి యగును. దీనిని గూడా పంచశలాక వలె విచారణ చేయవలెను. వివాహమందు కూడా సప్తశలాకవేధ విచారణ చేయవలెను.

**వేధదోష పరిహారము :**

1. వేధదోష కేవలము వింధ్య పర్వత సమీప ప్రాంతములందు చేయవలెను.
   **వేధ దోషస్తు వింధ్యాఖ్యే దేశే నాన్యేషు కేషు చ.**
2. లగ్నమందు శుభగ్రహములచే వేధదోషము ఉండదు.
3. లగ్నాధిపతి లాభమందున్న వేధదోషము ఉండదు.
4. శుభగ్రహము యొక్క కాలహోరలో వివాహము చేసిన వేధ దోషము ఉండదు.
5. చంద్రుడు బలముగా నున్నను వేధదోషము ఉండదు.

**17. గ్రహణోత్పాతభము :** భూకంపము, ధూమ కేతువు మొదలగు ఉత్పాతములును, సూర్య చంద్ర గ్రహణములు గలిగెనేని 7 రోజుల వరకు శుభకర్మలు చేయకూడదు. ఏ నక్షత్ర మందు భూకంపనాది ఉత్పాతములు కలుగునో ఆ నక్షత్రమును 6 నెలల పర్యంతము వివాహాది శుభకర్మలు చేయకూడదు. అర్ధ గ్రహణమైన యెడల గ్రస్తాస్తమైన సమయమునకు 3 దినములు, గ్రస్తోదయమునకు 3 రోజులు గ్రహణానంతరము వదలవలెను. సంపూర్ణ గ్రహణమైన నక్షత్రము 6 నెలలు, అర్ధ గ్రహణమైన నక్షత్రమును 3 నెలలు విడువవలెను.

**18. క్రూరసంయుత దోషము :** పాపగ్రహముతో కూడిన నక్షత్రము **జ్వలిత** మనియు, పాపగ్రహము అధిష్ఠించిన నక్షత్రమునకు ముందున్న నక్షత్రము **ధూమిత** మనియు, పాపగ్రహము అధిష్ఠించిన నక్షత్రమునకు తరువాత నక్షత్రము **దగ్ధ** మనియు కాలామృతాది గ్రంథములలో చెప్పబడినది. ఈ నక్షత్రములు వివాహాది శుభకర్మలకు నింద్యములు.

**19. అకాలగర్జిత వృష్టి :** అకాలమున వర్షములు, ఉరుములు, మెరుపులు సంభవించిన దినమున శుభకర్మలు నింద్యములు.

**20. మహాపాత :** మహాపాత 2 విధములు. (1) వ్యతీపాత మహాపాత, (2) వైధృతి మహాపాత. క్రాంతిసామ్యమును బట్టి మహాపాత సంభవిస్తుంది. రవిచంద్రుల యొక్క స్పష్టక్రాంతులు సమముగా ప్రాప్తించునపుడు క్రాంతి సామ్యముగా పిలువబడుతుంది. రవిచంద్రులు ఒకే అయనములో నున్నప్పుడు, రవి చంద్రులున్న రాశుల మొత్తము సంఖ్య 12 అయితే, వైధృతి మహాపాత. రవిచంద్రులు భిన్న అయనములలో నున్నప్పుడు

రాశుల మొత్తము సంఖ్య 6 అయితే వ్యతీపాత మహాపాత. **క్రాంతే స్సామ్యం నో శుభం మంగళేషు। యస్మిన్ దినే మహాపాతం తద్దినం వర్జయేత్ శుభే ॥** అనుటవలన, మహాపాత దోషము వివాహాది శుభకార్యములకు నింద్యము. గణితాగత క్రాంతి సామ్యము నింద్యము. సామాన్య క్రాంతి సామ్యము మధ్యమ ఫలము. ఇందుకు ముహూర్త గణపతి –

**ప్రాగుక్త సంభవస్త్వేత్థం యదిస్యాత్ గణితాగతమ్ ।**
**క్రాంతిసామ్యం తదానేష్టం మధ్య మన్యత్ర సంభవే ।**
**వైధృతివ్యతీపాతౌ యౌ క్రాంతిసామేర్క చంద్రయోః ।**
**సత్కర్మారంభణం తత్ర మరణం వ్యసనం విదుః ॥**

**21. వైధృతి :** 27 నైసర్గిక యోగములలో వైధృతి యోగము అతిదుష్టమైనది. పూర్వోక్త ఏకవింశతి మహాదోషములను వివాహాది శుభకర్మలకు అవశ్యము విచారణ చేయవలెను.

**పంచ పర్వములు :** కృష్ణ పక్షమందలి అష్టమి, చతుర్దశి, అమావాస్య, పూర్ణిమ, మాస సంక్రాంతులు – ఈ ఐదును పంచ పర్వములు.

**పక్షచ్ఛిద్రములు :** చవితి, షష్ఠి, అష్టమి, నవమి, ద్వాదశి, చతుర్దశి తిథులు పక్షచ్ఛిద్రములు. ఈ తిథుల ప్రారంభ సమయము నుండి చవితికి గం॥03:12 ని॥లు, షష్ఠికి గం॥03:36 ని॥లు, అష్టమికి గం॥05:36 ని॥లు, నవమికి గం॥09:36 ని॥లు, ద్వాదశికి గం॥04:00 ని॥లు, చతుర్దశికి గం॥02:00 ని॥లు విడువగా మిగిలిన సమయములు మంచివి. ఈ దోష సమయముల యందు చేసిన కార్యము నశించును. వివాహమైన స్త్రీ వైధవ్యము బొందును. ఉపవీతుడైన వటువు వ్రాత్యుడగును. సీమంత మొనర్చిన గర్భము నశించును. ప్రాశనము చేసిన మరణము సంభవించును. గృహారంభ మొనర్చిన గృహము తొందరలో అగ్నిచే దహించబడును. ప్రతిష్ఠాదులొనర్చిన రాజ రాష్ట్రాది నాశము సంభవించును. సర్వసాధారణముగా పక్షచ్ఛిద్ర తిథులకు మొదటి గం॥04:00 ని॥లు విష సమయములని కశ్యపుని మతము.

**అవమా** : ఒకే రోజున 3 తిథులు కూడియున్న ఆ రోజు అవమా అను సంజ్ఞచే వ్యవహరింపబడును. ఉదయమున ఏ తిథి యుండునో ఆ తిథిని ఉదయమున మాత్రమే గ్రహించవలెను. తదనంతరము సర్వ నిత్య కర్మల యందును మధ్యమ తిథిని గ్రహించవలెను. అవమా శుభకర్మల యందు అతినింద్యము. కేంద్రమున గురువు ఉన్న అవమా దోషము నివృత్తమగును.

**త్రిద్యుస్పృక్** : మూడు దినములు ఒకే తిథి వ్యాపించిన అది త్రిద్యుస్పృక్. శుభకర్మల యందు అతినింద్యము. బుధుడు కేంద్ర గతుడైన ఈ దోషము నివారింపబడును.

**ప్రదోషకాలము:** సూర్యాస్తమయమునుండి చవితి తిథియందు మొదటి 3 గంటలు, సప్తమి తిథియందు మొదటి 4 1/2 గంటలు, త్రయోదశి తిథియందు మొదటి 6 గంటలు ప్రదోష సమయములని చెప్పబడినవి.

**చతుర్థే ప్రథమే యామే సార్ధయామే చ సప్తమీ ।**
**యామద్వయే త్రయోదస్యాం ప్రదోషః సర్వఘాతకః ॥**

ప్రదోష విషయములో మతాంతరములు :

1. రాత్రి యొక్క మూడు యామముల లోపున సప్తమి గాని త్రయోదశి గాని ఉంటే ఆ సమయమును ప్రదోషకాలమంటారు.

**రాత్రౌ యామత్రయా దర్వాక్ సప్తమీ వా త్రయోదశీ ।**
**ప్రదోషః స తు విజ్ఞేయః సర్వవిద్యా విగర్హితః ॥**

2. సూర్యాస్తమయమునుండి 2 గం. 24 ని.లు ప్రదోష సమయము.

**త్రిముహూర్తః ప్రదోషః స్యాత్ రవావస్తంగతే సతి.**

3. సూర్యాస్తమయమునుండి 1 గం. 12 ని.లు ప్రదోషకాలము.

**ప్రదోషోస్తమయా దూర్ధ్వం ఘటికా త్రయమిష్యతే.**

**వాస్తు కర్తరీ దోషము – అపవాదము** : సూర్యుడు భరణి 3,4 పాదము లందు, కృత్తికా నక్షత్రమందు, రోహిణి ప్రథమ పాదమందును సంచరించు కాలము కర్తరి అని వ్యవహరింపబడును. సూర్యుడు కృత్తిక యందు సంచరించు కాలమున శంకుస్థాపన, గృహప్రవేశము, గుడి, గోపుర నిర్మాణములు, వృక్షములు, తృణము ఛేదించుట, భూమిని త్రవ్వుట, వ్యవసాయపు పనులు, వస్త్రములు నేయుట, దారుకర్మ, గ్రామారంభము, ఆరామ, తటాక కూపాదుల నిర్మాణము, క్షౌరము, శయ్య, ఆసనము, వనితా సంభోగము, శకటాశ్వారోహణాదులను త్యజించవలెను. ఉపనయన, వివాహ, యజ్ఞకర్మ, మంటపాది కర్మలకు సూర్యుడు భరణీ, కృత్తికల యందు సంచరించు కాలము దోషము కాదు.

**లగ్న చంద్ర దోషము – తదపవాదము :** ఆగ్నేయ, ప్రాజాపత్య, సౌమ్య, వైశ్వదేవాఖ్య వేద వ్రతములయందు ఉచ్చంగతుడైనను లగ్న చంద్రుడు దోషకరుడగును. ప్రతిని ధనరహితుని గను సతతము క్షయ రోగిగను చేయును. వివాహమునందు లగ్న చంద్రుని పరిహరించవలెను. చౌలవ్రత, ప్రయాణ, ప్రవేశ, రాజ దర్శనములందు లగ్నచంద్రుడు శుభుడు. పూర్ణచంద్రుడైనను, క్షీణచంద్రుడైనను లగ్నచంద్రుడు సర్వత్ర గర్హితుడని కాశ్యప వచనము.

**అభిజిత్ :** పగటికాలమందు 15 ముహూర్తములలో 8వ ముహూర్తము అభిజిత్ సంజ్ఞికము. అఖిల దోషములను నశింప జేయును. సూర్యుని నుండి 4వ లగ్నము అభిజిత్ అనబడును. సర్వదేశములందును సర్వ వర్ణముల వారికిని ముఖ్యమైనది. అశేష దోషావహరము శుభప్రదము. వివాహాది సర్వకార్యము లందును ప్రశస్తము.

**గండాంత దోషమఖిలం ముహూర్తోభిజిదాహ్వయః ।**
**హన్తి యద్వన్మృగం వ్యాధః పక్షి సంఘమివాఖిలమ్ ॥**

అభిజిన్ముహూర్తమున ఉపనయనము నిషిద్ధము. సర్వ దేశములలోను ఉపనయనము పూర్వాహ్ణమందు అతిముఖ్యము. మధ్యాహ్నకాల మందు మధ్యమము. అపరాహ్ణమందు గర్హితము. ఉత్తరాషాఢా చతుర్థ చరణము, శ్రవణము నందు పదిహేనవ భాగము కలిసి అభిజిన్నక్షత్రముగా వ్యవహరింపబడుచున్నది.

**గోధూళి ముహూర్తము :** సూర్యోదయమునకు సప్తమ లగ్నము గోధూళి అనబడుతుంది.

**చతుర్ధమభిజిల్లగ్న ముదయర్షాత్తు సప్తమమ్ ।**
**గోధూళికం హి భవతి సంపత్పుత్రాది సౌఖ్యదమ్ ॥**

సాయంకాలము పశువులు మేతమేసి తిరిగి ఇళ్ళకు వస్తుండగా పాదధూళి ఎగురుతూ ఉంటుంది. కాబట్టి ఆ సమయాన్ని గోధూళి కాలమంటారు. గోధూళి లగ్న కాల పరిమితి గురించి భిన్నాభిప్రాయాలు.

1. సూర్యుని అర్ధబింబము అస్తమించుటకు పూర్వము 12 నిముషములు తరువాత 12 నిముషములు కలిపి గోధూళి సమయమంటారు.

**అర్ధాస్తా త్పూర్వమపూర్ధ్వం ఘటికార్ధం తు గోరజః**

2. సూర్యుని అర్ధాస్తమయానంతరము 2 ఘటికలు అనగా 48 నిముషముల కాలము.

**తస్మాత్పరం నాడికయుగ్మమేకే గోధూళి కాలం మునయో వదన్తి**

3. మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గున మాసములందు, హేమంత శిశిరములందు సూర్యబింబము గోళాకారములో అస్తమించు నపుడును, గ్రీష్మమందు జ్యేష్ఠ ఆషాఢ మాసములలో సూర్య బింబము అర్ధాస్తమయి నపుడును, వసంతములో చైత్ర వైశాఖము లందును శ్రావణ భాద్రపద ఆశ్వయుజ కార్తిక మాసములందు వర్ష శరదృతువులలోను సూర్యబింబము సంపూర్ణముగ నస్తమించునపుడును గోధూళికాలముగా కూడా తెలియదగును. (రాజమార్తాండము).

**గోధూళి ముహూర్త ప్రశంశ :** అశుభ తిథి వార నక్షత్ర యోగ కరణాదులు, లగ్నదోషములు, నవాంశ దోషము, జామిత్ర దోషము, లత్తా దోషము, పాత దోషము, లగ్నాష్టమదోషము, ముహూర్త దోషములను వర్గాష్టమమును విచారణ చేయనవసరము లేదని సమస్త శుభకార్యములకు గోధూళి సమయం ప్రశస్తమని రామ దైవజ్ఞుని అభిప్రాయము. ఇట్టే ముహూర్తగణపతి యందు గూడా చెప్పబడింది. **దోషాః పంచాంగజాః లగ్న గ్రహ జామిత్ర సంభవాః । లత్తా పాతాష్టమస్థాన నవాంశ క్షణజా స్తథా ॥ ఏతేన్యేప్యఖిలానైవ హేయా గోధూళికే సదా ॥** కాని, **ఘటీలగ్నం యదా నాస్తి తదా గోధూళికం శుభమ్। శూద్రాదీనాం బుధాః ప్రాహు ర్న ద్విజానాం కదాచన ॥** అని జ్యోతిర్నిబంధములో చెప్పబడింది. అంటే దోషరహిత ముహూర్త లగ్నము లభించినట్లయితే, శూద్రాదులకు మాత్రము గోధూళి ముహూర్తము వివాహాది శుభకార్యములు చేయుట సమ్మత మయినది కాని బ్రాహ్మణులకు మాత్రము ఏ పరిస్థితిలోనూ గోధూళి ముహూర్తము శుభప్రదము కాదు.

మరియు **లగ్న శుద్ధి ర్యదా నాస్తి కన్యా యౌవనశాలినీ। తదా వై సర్వవర్ణానాం లగ్నం గోధూళికం శుభం** (దైవజ్ఞమనోహర) అని చెప్పబడుట వలన దోష రహితమగు

ముహూర్తము లభించనట్లయితే కన్య యౌవనవతి అయినపుడు గోధూళి ముహూర్తము చెప్పబడినది. ఇక్కడ సర్వవర్ణానాం అనుట వలన ద్విజులకు తప్ప (**న ద్విజానాం కదాచన**) ఇతర సర్వవర్ణముల వారికని అన్వయించుకొనవలెను. మరియు **ప్రాచ్యానాం చ కళింగానాం ముఖ్యం గోధూళికం స్మృతం । గాంధర్వాది వివాహేషు వైశ్యోద్వాహేషు యోజయేత్ ॥** అనునది నారద పురాణోక్తి. తూర్పు ప్రాంతీయులకు కళింగ (ఒరిస్సా), వైశ్యులకు, ప్రేమ వివాహములకును మంచి ముహూర్తము దొరకని పక్షమున, గోధూళి ముహూర్తం చెప్పబడింది. కావున, గత్యంతరము లేనపుడు మాత్రమే గోధూళి ముహూర్తము స్వీకరింపదగినది.

**గోధూళి ముహూర్త దోషాంశములు : కుళిక క్రాంతి సామ్యం చ మూర్తౌ షష్ఠాష్టమ శ్శశీ । పంచగోధూళికే త్యాజ్యా అన్యే దోషాః శుభావహాః ॥** కుళిక, క్రాంతి, సామ్యం, లగ్నమందును, షష్ఠాష్టములందు చంద్రస్థితి అను ఈ 5 దోషములు గోధూళి ముహూర్తమునకు నింద్యములు. ముహూర్తచింతామణి ప్రకారము కుళిక ఆదివారము 14వ ముహూర్తము కావున గోధూళి ముహూర్తమున సంభవించ వచ్చును. ఇతర వారములలో సంభవించదు. రవిచంద్రుల స్పష్టక్రాంతులు సమముగా నున్న యోగమును క్రాంతి సామ్యము అంటారు.

2. క్రూరాక్రాంత నక్షత్రమున లేక శని వారమున గోధూళి ముహూర్తము నింద్యము. శనివారమున సూర్యాస్తమయిన తరువాత మొదటి ముహూర్తము కుళిక.

**ధిష్ణ్యం క్రూరయుతం త్యాజ్యం మూర్తే షష్ఠాష్టమః శశీ ।**
**గోరజ స్తతో ప్రశంసన్తి సన్తః శనిదినం వినా ॥**

3. గోధూళి లగ్నమందు సప్తమ అష్టమములందు కుజుదున్న ఆ ముహూర్తమును వదలి వేయవలెను.
4. అష్టమమందు గురు కుజులు కాని, బుధుడు కాని, శుక్రుడు కాని, ఉన్నపుడు గోధూళి ముహూర్తమును విడువవలెను.
5. గురువారమున సూర్యాస్తమయమునకు పూర్వము 12 ని.లకు నింద్యము.
6. షష్ఠ మందు కుజ బుధ గురు శుక్రులలో నెవరున్నను దోషమే.

**దోషాపవాదములు :**

1. గురువారమున సూర్యాస్తమయము తరువాత, శనివారమున సూర్యాస్తమయమునకు పూర్వము గోధూళి ముహూర్తము గ్రాహ్యము. **అస్తంయాతే గురుదివసే సౌరే సార్కే.**
2. చంద్రుడు 2,3,11వ స్థానములలో నున్నపుడు గోధూళి లగ్నము శుభప్రదము. చంద్రుడు పైన చెప్పబడిన స్థానములలో లేనట్లయితే అది గోధూళి ముహూర్తము గాదు. కేవలము ధూళే. **యత్రైకాదశగ శ్చంద్రః ద్వితీయో వా తృతీయగః । గోధూళికా తు విజ్ఞేయా శేషాధూళి రితి స్మృతాః ॥** కావున పూర్వోక్త అంశములను విచారణ చేయగా, ముహూర్త చింతామణ్యాదులందున్న స్తుతివాక్యములు కేవలము అర్థ వాక్యములని స్పష్టమయినది. ఇందుకు రాజమార్తాండము **శుభాశుభయుతం నూనం రవే ర్దోషం చ నిందితమ్ । వివాహలగ్నవచ్ఛేషం గోధూళి మాహ భార్గవః ॥** కావున వివాహ లగ్నానికి చెప్పబడిన విచారణీయ అంశములు గోధూళి ముహూర్తమునకు కూడా చూడవలసియున్నది.

**గురు శుక్రుల సమ సప్తక దోషము – అపవాదము :** గురు శుక్రులు పరస్పరము సమ సప్తకమందున్నపుడు మూఢసమమగు దోషము కలుగును. అది శుభ కార్యములను నశింపజేయును. ఈ దోషము నర్మదా నదికి ఉత్తర ప్రాంతముల వారికి మాత్రమే వర్తించును. దక్షిణ ప్రాంతముల వారికి లేదు.

**చంద్రాత్ జామిత్రస్థిత గ్రహదోషము – తదపవాదము : సర్వే జామిత్రజా విదధతి మరణమ్ –** ఇతి వశిష్ఠః. పాపుల నుండి సప్తమమున చంద్రుడున్నను, పాతతోకూడి యున్నను దోషావహము గనుక అట్టి ముహూర్తమును ప్రయత్న పూర్వకముగా విడువ వలెను. అట్టి దోష సమయము నందు వివాహితయైన స్త్రీ వైధవ్యమును బొందును. వ్రతాదులు ఒనర్చిన మరణము సంభవించును. యాత్ర వలన విపత్తు సంభవించును. గృహారంభ ప్రవేశాదుల వలన అగ్నిభయము, క్షౌరము వల్ల రోగము తటస్థించును. కన్యా వివాహ సమయమున శుక్ల పక్షమున గురు, బుధ, శుక్రులలో ఒకరు జామిత్రమున ఉన్న దోషములు పరిహృతములగును. ఆ కన్య సౌభాగ్యవతి, పుత్రవతి యగునని అత్రి వచనము. వివాహ యాత్రా చూడాకర్మల యందు గృహప్రవేశము లందును చంద్రుని నుండి సప్తమమున రవి కుజ శనులను పరిహరింపవలెను.

**గురు, శుక్ర, చంద్రుల బాలవృద్ధత్వములు :** గురువు ఉదయించిన పిదప 15 రోజులు బాలుడు. అస్తమించుటకు పూర్వము 15 రోజులు వృద్ధుడు. శుక్రుడు తూర్పున ఉదయించిన పిదప 3 రోజులు బాలుడు. తూర్పున అస్తమించుటకు పూర్వము 15 రోజులు వృద్ధుడు. పశ్చిమమున అస్తమించుటకు పూర్వము 5 రోజులు వృద్ధుడు. పశ్చిమమున ఉదయించిన పిదప 10 రోజులు బాలుడు. గురు శుక్రుల ఉదయాస్తము లందు 5 రోజులు బాల వృద్ధత్వములని కొందఱి అభిప్రాయము. **వింధ్యస్య దక్షిణే దేశే వృద్ధబాల్యే సితేజ్యయోః । త్రిదినం వర్జయిత్వా తు తత స్తస్యాం చ శోభనమ్ ॥** వింధ్యపర్వతమునకు దక్షిణ ప్రాంతమంతటా గురు శుక్రుల బాల వృద్ధత్వముల యందు 3 రోజులు విడిచి సర్వశుభ కర్మలను చేసుకొనవచ్చును. చంద్రుడు కృష్ణద్వాదశి మొదటి 24 నిముషములు మొదలు చతుర్దశ్యంత్య సమయము వరకు వృద్ధుడు. శుద్ధ పాడ్యమి తుది 24 ని॥లు మొదలు విదియలో సగభాగము వరకు బాలుడు.

**మాసఫలమును చూచుక్రమము :** శుద్ధ పాడ్యమి ప్రవేశమునందే నక్షత్రము గలదో ఆ నక్షత్రము మొదలుకొని తన నక్షత్రము వరకు లెక్కించి ఆ సంఖ్యను 9 చే భాగింపగా మిగిలిన శేషమును బట్టి (1) ప్రయాణము, (2) మృష్టాన్నభోజనము, (3) తను తాపము, (4) శౌర్యము, (5) విద్య, (6) వస్త్ర లాభము, (7) శోకము, (8) అనంతపుణ్యము, (9) మహాఫలము.

**గ్రహములకు మూర్తి నిర్ణయము :** రవ్యాది గ్రహములు ఒక రాశినుండి మరొక రాశికి మారునప్పుడు తన రాశినుండి ప్రవేశ కాలమున గల నిత్య నక్షత్రరాశి వరకు లెక్కింపగా 1,6,11 సువర్ణమూర్తి, 2,5,9 రజత మూర్తి, 3,7,10 తామ్రమూర్తి, 4,8,12 లోహమూర్తి యగును. గోచార రీత్యా గ్రహములు దుష్టస్థానములందు ఉన్నను సువర్ణ రజతమూర్తులైన శుభ ఫలితమునే యిత్తురు. తామ్ర, లోహ మూర్తులైన శుభ స్థానము లందున్నను దుష్టఫలితమునే యిత్తురు. శుభ గ్రహములకు సువర్ణ, రజతమూర్తులును పాప గ్రహములకు తామ్ర, లోహ మూర్తులును బలము గలిగియుండును.

**గ్రహదోషశాంతి కొఱకు రత్నములను ధరించు శక్తిలేనివారు ధరింపదగిన ఓషధుల వేళ్ళు : –** రవికి బిల్వ మూలము; చంద్రునకు క్షీరికా మూలము; కుజునకు నాగజిహ్వా మూలము; బుధునకు విధారమూలము; గురువునకు భాంగీమూలము; శుక్రునకు సింహపుచ్ఛమూలము; శనికి విచ్ఛోలమూలము; రాహువునకు చందనపుమూలము; కేతువునకు అశ్వగంధ మూలము.

## వివాహ ప్రకరణము

**వివాహ యోగ్యా యోగ్య సంబంధములు :** కూటస్థ పురుషుని నుండి నాల్గవ పురుషుడు నాల్గవ స్త్రీని, అయిదవ స్త్రీని వివాహము చేసికొనవచ్చును. చతుర్థ పురుషుడు షష్ఠ స్త్రీని పరిణయ మాడరాదు. పంచమ పురుషుడు పంచమ స్త్రీని వివాహమాడరాదు. ఈ పంచమ స్త్రీ పంచమ పురుష వివాహము తండ్రి వరస కూడదనియు, తల్లి వరస ఉత్తమమని కొందరి మతము. **పంచమః పంచమీం కన్యాం నోద్వహేదితి యద్వచః । పితృపక్షే నిషేధోయం మాతృపక్షే న తద్భవేత్** తృతీయ పురుషునికి తృతీయ స్త్రీని వివాహము చేయవచ్చునని, చేయకూడదని రెండు మతములు ఉన్నవి. సప్త పురుషానంతరము సామాన్య బంధు సంబంధము వలెనే వివాహము చేయవచ్చును. **సప్తజనా దూర్ధ్వం పరేషా మివ.**

**వివాహమునకు త్రిజ్యేష్ఠా విచారము :** జ్యేష్ఠులైన స్త్రీ పురుషులకు జ్యేష్ఠ మాసమందు వివాహము చేయకూడదు. జ్యేష్ఠ మాస మందైనను, జ్యేష్ఠా నక్షత్రమందైనను పుట్టిన వధూవరులకును జ్యేష్ఠ మాసమందు వివాహము అశుభము. జ్యేష్ఠులైన స్త్రీ పురుషులకు రాశి మిత్రత్వము గాని, మాసాధిపతుల మిత్రత్వము గాని యున్న యెడల వారికి వివాహము శుభావహమని మన్వాదుల యభిప్రాయము.

**గండ నక్షత్రమున పుట్టిన కన్యాఫలము :** మూలా నక్షత్రమున పుట్టిన స్త్రీ మామకు కూడదనియు, ఆశ్లేష యందు బుట్టిన స్త్రీ అత్తకు గూడదనియు సామాన్యముగ చెప్పినను మూల 4 వ పాదమందు బుట్టిన స్త్రీ మామకు మారకురాలనియు, ఆశ్లేష 1 వ పాద మందు బుట్టిన స్త్రీ అత్తకు మారకురాలనియు కాలామృతకారుని యభిప్రాయము.

చిన్తామణి గ్రంథకర్త అభిప్రాయమిందుకు విరుద్ధముగా నున్నది. మూల 4 వ పాదమందు పుట్టిన స్త్రీ మామకు, ఆశ్లేష 1 వ పాదమందు పుట్టిన స్త్రీ అత్తకు శుభకరమని చింతామణికర్త యభిప్రాయము. నారద వచనము గూడ నిట్లే చెప్పుచున్నది. "**సుత స్సుతా వా నియతం శ్వశురం హంతి మూలజా । తదన్త్య పాదజో నైవ తథాశ్లేషాద్య పాదజః** " విశాఖ 4వ పాదమున జన్మించిన స్త్రీ మరిది నాశకర్త్రియని చింతామణికారుని ఆశయము. కాలామృతకారుడు పాదవివక్ష చేయక '**ఇంద్రాగ్ని ప్రభవా వివాహ సమయే హన్త్యేవ సా దేవరం**' అని చెప్పియున్నాడు. జ్యేష్ఠా నక్షత్రమున బుట్టిన స్త్రీ భర్త జ్యేష్ఠ సోదరునికి మారకురాలు. '**జ్యేష్ఠరజా శ్రేష్ఠజం**'. ఈ గండర్ష దోషము స్త్రీ, పురుషులకు సమానమని కొందరి మతము. '**ఏతేష్వపి భేషు జాత పురుషో హన్తీతి కేచిజ్జగుః**' కొందరీ దోషము పురుష పర్యాయము గాదని చెప్పుచున్నారు.

**మూలా సార్ప విశాఖాసు జ్యేష్ఠభే చోద్భవః పుమాన్ ।**
**న దోష కృద్వివాహేషు స్త్రియ స్సర్వత్ర వర్జయేత్ ॥**

**వివాహమునకు :** బ్రాహ్మణులకు గ్రహమైత్రి, క్షత్రియులకు గణకూటము, వైశ్యులకు స్త్రీ దీర్ఘము, శూద్రాదులకు యోని పొంతన ముఖ్యము. వివాహానంతరమున స్త్రీ మొదటి జ్యేష్ఠ మాసమున భర్తృ గృహముననున్న భర్తయొక్క జ్యేష్ఠ సోదరునకు హాని. మొదటి ఆషాఢమందు భర్త తల్లికి, మొదటి పుష్యమాసమున భర్తయొక్క తండ్రికిని, మొదటి క్షయమాసమున భర్తృ గృహముననున్న ఆమెకును, మొదటి చైత్ర మాసమున తన పితృగృహమున నున్న ఆమె తండ్రికిని హాని కలుగును. పిత్రాదుల అభావమందు కన్యక ఆయా మాసములందు ఆయా గృహముల యందున్నప్పటికిని దోషమేమియు నుండదు.

**గ్రహముల మిత్రత్వ, సమత్వ, శత్రుత్వ నిర్ణయ చక్రము**

| గ్రహములు | మిత్రులు | సములు | శత్రువులు |
|---|---|---|---|
| రవి | చం, కు, గు | బు | శు, శ |
| చంద్ర | ర, బు | కు, గు, శు, శ | – |
| కుజ | ర, చం, గు | శు, శ | బు |
| బుధ | ర, శు | కు, గు, శ | చం |
| గురు | ర, చం, కు | శ | బు, శు |
| శుక్ర | బు, శ | కు, గు | ర, చం |
| శని | బు, శు | గు | ర, చం, కు |

**మృత్యు షడష్టకములు :** మేష కన్యలు; వృషభ ధనుస్సులు; మిథున వృశ్చికములు; కర్కాటక కుంభములు; సింహ మకరములు; తుల మీనములు.

**ప్రీతి షడష్టకములు :** మేష వృశ్చికములు; వృషభ తులలు; మిథున మకరములు; కర్కాటక ధనుస్సులు; సింహ మీనములు; కన్య కుంభములు.

**ప్రీతి ద్విర్ద్వాదశములు :** మేష మీనములు; కర్కాటక సింహములు; సింహ కన్యలు; కన్యా తులలు; వృశ్చిక ధనుస్సులు; మకర కుంభములు.

**దుఃఖ ద్విర్ద్వాదశములు :** మేష వృషభములు; మిథున కర్కాటకములు; తుల వృశ్చికములు; ధనుస్సు మకరములు; కుంభ మీనములు.

**శుభ నవపంచకములు :** మేష సింహములు; వృషభ కన్యలు; మిథున కుంభములు; కర్కాటక మీనములు; కన్యా మకరములు; వృశ్చిక కర్కాటకములు.

**అశుభ నవపంచకములు :** మేష ధనుస్సులు; వృషభ మకరములు; మిథున తులలు; సింహ ధనుస్సులు; తులా కుంభములు; వృశ్చిక మీనములు.

**యోనిమైత్రి :** ముంగిస–పాములు; కుక్క–లేడి;గజము–సింహము; గుఱ్ఱము–మహిషము; మేక–కోతి; గోవు–వ్యాఘ్రము; పిల్లి–ఎలుకలు పరస్పర విరోధయోనులు.

**ఏకనాడీ దోష పరిహారము : శ్లో॥** ఉత్తరా శతతారా చ పూర్వాభాద్రా పునర్వసూ । రౌద్రీ మూలాశ్వినీ సప్త ఏకనాడీ న దోషభాక్ ॥తా॥ ఉత్తర, శతభిషం, పూర్వాభాద్ర, పునర్వసు, ఆర్ద్ర, మూల, అశ్విని ఈ నక్షత్రములకు ఏకనాడీ దోషము లేదు.

**మధ్యైకనాడీ దోష పరిహారము : శ్లో॥** తోయానురాధా వసు పుష్య చిత్రాః భగేందుభే యస్య నరస్య సప్త । మధ్యైకనాడీ న హి నాడిదోషా అరుంధతీ మేవ యథా వశిష్ఠః ॥తా॥ పూర్వాషాఢ, అనూరాధ, ధనిష్ఠ, పుష్యమి, చిత్ర, పూర్వఫల్గుని, మృగశిర ఈ నక్షత్రములకు మధ్యైకనాడీ దోషము లేదు.

**పార్శ్వనాడీ దోష పరిహారము :** వహ్ని ర్విశాఖ సార్పా చ శ్రవణే చ మఘా తథా । ఉత్తరాషాఢ రోహిణ్యాం పార్శ్వనాడీ న దోషభాక్ ॥తా॥ కృత్తిక, విశాఖ, ఆశ్లేష, శ్రవణం, మఘ, ఉత్తరాషాఢ, రోహిణి ఈ నక్షత్రములకు పార్శ్వనాడీ దోషము లేదు.

**జన్మరాశి, నామరాశి విచారము :** వరుని జన్మనక్షత్రమును, కన్య జన్మ నక్షత్రమును చూచుట శ్రేష్ఠము. కన్యకు జన్మనక్షత్రము లేనిచో వరుని జన్మనక్షత్రమును, కన్య నామ నక్షత్రమును బట్టి చూడాలి. వరునకును జన్మనక్షత్రము లేనిచో ఇరువురకు నామ నక్షత్రములను చూడాలి. ఇదియును కుదరని పక్షమున కన్యకకు పేరు మార్చవలెను.

**కన్యకకు పేరుమార్చుట:** పెండ్లివేళ వధువు పేరు మార్పు చేయదలచినచో తెల్ల ఆవాలను నీటితో ఒక నూతన కలశమున నింపి దూర్వాశ్వత్థ దళములచే దానిని మూసి అందలి శుద్ధోదకమును ఒక ముత్తైదువచే కన్యపై సంప్రోక్షింపజేసి పిమ్మట పాత పేరును పరిహరించి శుభకరమగు నామాంతరమును పెట్ట వలయును.

**ధర్మశాస్త్ర విశేషములు**

**అభ్యంగ విధి నిషేధములు :** అశ్విని, ఆర్ద్ర, జ్యేష్ఠ, శ్రవణ నక్షత్రములు, రాత్రికాలము, వ్యతీపాత మహాపాత దినములు, వైధృతి యోగము, 1, 6, 8, 11, 12, 14, 15, 30 తిథులు, మాస సంక్రమణములు, వ్రత దినములు, స్వకర్తృక శ్రాద్ధదినములు, దీక్షా దినములు, యాత్రా దినములు, మృతాశౌచ మధ్యకాలము, ఆది, మంగళ, గురు, శుక్రవారములు నిషిద్ధములు. శిశు వృద్ధ రోగుల విషయమున దూర్వాది ద్రవ్యాంతర యుతమైన తైలముతో అభ్యంగము శుభప్రదము. ఆదివారము గరికె, గురువారము పుష్పము, శుక్రవారము గోమయము, మంగళవారము మృత్తికయు తైలముతో చేర్చి యభ్యంగము చేయవచ్చును. ఆదివారమున అభ్యంగము దుఃఖప్రదము; సోమవారమున కాంతిదము; మంగళవారమున మరణము నిచ్చును; బుధవారమున కీర్తి సంపదలనిచ్చును; గురువారమున శత్రువృద్ధి; శుక్రవారమున రోగప్రదము; శనివారమున భోగారోగ్య వృద్ధిని, సిరిసంపదలను యశస్సును నొసగును. వివాహాది శుభకార్యముల ఆద్యంత దినములలో, ఆశ్వయుజ బహుళ చతుర్దశి, అమావాస్య, కార్తిక శుద్ధ పాడ్యముల యందును, మకర సంక్రమణమునకు పూర్వ దినమందును, ఆశౌచము పూర్తియైన దినమందును, చైత్ర శుద్ధ పాడ్యమి (చాంద్ర సంవత్సరాది) నాడును, దుష్ట సమయ తిథి వార నక్షత్రాదుల యందైనను అభ్యంగము విధిగా ఆచరింపవలెను. ధనకాముడు అగువాడు శుక్రవారమున మధ్యాహ్నము అభ్యంగము చేయవలయును.

**దంతధావనము :** ఆది, మంగళ, శుక్ర, శనివారములయందు దంతకాష్ఠములను, నవమి, ద్వాదశి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య తిథుల యందును, శ్రాద్ధ దినమందును దంత ధావనము చేయరాదు. వివాహము, ఆశౌచములందు, సంక్రాంతి వ్యతీపాత లందు, జన్మదినమందు దంతధావనము వర్జింపవలెను. నీటిని 12 పర్యాయములు పుక్కిలించవలెను.

**శ్రాద్ధకర్త, శ్రాద్ధభోక్తలు వర్జింపవలసినవి :**

**దంతధావన తాంబూలే తైలాభ్యంగ మభోజనమ్ ।**
**రత్యౌషధ పరాన్నం చ శ్రాద్ధకృత్సప్త వర్జయేత్ ॥**
**పునర్భోజన మధ్వానం యాన మాయాస మైథునమ్ ।**
**దానం ప్రతిగ్రహో హోమం శ్రాద్ధభుక్త్వష్ట వర్జయేత్ ॥**

**గర్భిణీపతి నియమములు :** భార్య గర్భిణియై ఆరుమాసములు నిండిన తరువాత భర్త వపనము, మైథునము, శ్రాద్ధభోజనము, తీర్థ సేవనము, గృహ నిర్మాణము, సముద్ర స్నానము, పుత్రుని చౌలము, వృక్షములను ఛేదించుట, ప్రేతవాహనము, విదేశ గమనము, గోళ్ళు తీయుట, ముఖ క్షౌరాదులను విసర్జించ వలెను.

**పంచాయతన విషయము :** గృహమందు లింగద్వయమును, సాలగ్రామ ద్వయమును, సూర్యద్వయమును, శంఖద్వయమును, శక్తిత్రయమును, గణేశ త్రయమును, భగ్నమైన ప్రతిమను అర్చించరాదు. మత్స్యకూర్మాది దశకము అర్చింపరాదు. సాలగ్రామములను 4,6,8,... ఇట్లు సమసంఖ్యగ పూజింప వచ్చును. 3,5,... ఇట్లు విషమ సంఖ్యగ సాలగ్రామములను అర్చించరాదు. విషమ సంఖ్యయైనను ఒక సాల గ్రామము అర్చింపవచ్చును. సాలగ్రామ శిల భగ్నమైనను సచక్రకమైన పూజనీయము.

**తులసీ గ్రహణమునకు కూడని దినములు, సమయములు :** రాత్రులందు, ద్వాదశి యందును, శ్రవణా నక్షత్రమందును, వైధృతి వ్యతీపాతల యందును, సంధ్యా సమయము లందును, పర్వ ద్వయమందును, సంక్రాంతులందును, ఆది, మంగళ, శుక్రవారము లందును తులసీ దళమును త్రుంచరాదు. తులసీ గ్రహణ మంత్రము.

**తులస్యమృత జన్మాసి సదా త్వం కేశవప్రియే ।**
**కేశవార్థం విచిన్వామి వరదా భవ శోభనే ॥**

**ఉసిరికాయలను వాడుట యందు నిషేధములు :** 8, 9, 14 తిథులలోను, పర్వములు, ఆదివారములు, రాత్రికాలము నిషేధము. కార్తిక పౌర్ణమినాడే క్రొత్త ఉసిరికాయలను గ్రహించవలెను. అంతకు పూర్వమందు పనికిరాదు.

**సంధ్యావందనాది నిత్య కర్మల యందు సంకల్పము :** స్నాన సంధ్యా జప హోమ బ్రహ్మ యజ్ఞ పితృతర్పణ వైశ్వదేవ దేవతార్చనాది నిత్య కర్మలయందు సూర్యోదయ కాలిక తిథినే ఆ దినమంతయు సంకల్పమున చెప్పుకొనవలెను. వృద్ధియందు ఒక తిథి రెండు దినముల సూర్యోదయ కాలములకు వ్యాపించి యుండును. అపుడా రెండు దినముల యందును నిత్యకర్మలకు ఆ తిథినే సంకల్పమున జెప్పుకొనవలెను.

జనన మరణ అభ్యంగన యాన సముద్రస్నానముల యందును, వివాహాది నైమిత్తిక కర్మలందును తాత్కాలిక తిథిని సంకల్పమున జెప్పుకొనవలెను.

**శూన్యతిథులయందు చేయదగినవి – వర్జింపవలసినవి :** శూన్య తిథిలో చేయదగిన పైతృకాదులను, జాతాశౌచ మృతాశౌచాదుల వలన ఆగిపోయిన ప్రత్యాబ్దికాదులను, ఊనత్రయాదులను శూన్య తిథియందైనను జరుపకొనవలెను. అట్లు జరుపునపుడు సంకల్పమున మరునాటి తిథినే చెప్పుకొన వలెను. శూన్యతిథి యందు సీమంత వ్రత చౌల నామకరణ యాత్రా వివాహ విద్యాస్వీకరణ ఆధాన యజ్ఞములను, వాపీకూప తటాక నిర్మాణములను, మంత్రానుష్ఠానారంభమును, దర్శాబ్దిక మాసికములను జరుపరాదు.

**ద్విపుష్కర యోగః :** ఆది మంగళ శనివారాలు, విదియ సప్తమి ద్వాదశి తిథులు, మృగశిర చిత్త ధనిష్ఠ (ద్విపాద) నక్షత్రాలు కలసినపుడు ద్విపుష్కర యోగం అనబడును. ఈ రోజుల్లో వస్తువు పోయినా, లాభించినా ఆ క్రియలు మరల జరుగుతాయి.

**త్రిపుష్కర యోగః :** ఆది మంగళ శనివారాలు, విదియ సప్తమి ద్వాదశి తిథులు, కృత్తిక పునర్వసు ఉత్తర విశాఖ ఉత్తరాషాఢ పూర్వాభాద్ర (త్రిపాద) నక్షత్రాలు కలిస్తే త్రిపుష్కర యోగం. ఈ రోజుల్లో కలిగిన మృతి, వస్తు లాభనష్టాలు మొదలగు క్రియలు మరల మరల జరుగుతాయి.

**గురు శుక్ర మౌఢ్యములందు చేయతగనివి :** ఉపనయనము, వివాహము, చేలము, కర్ణవేధ, మంత్ర దీక్ష, దేవతా ప్రతిష్ఠ, నూతన గృహప్రవేశము, నూతన గృహారంభము, షోడశ మహా దానము, సోమయాగం, చాతుర్మాస్య వ్రతం, సమావర్తనము, ప్రప్రథమ తీర్థయాత్ర, దేవ దర్శనములు, సంన్యాస స్వీకారము.

**గురు శుక్ర మౌఢ్యములందు చేయతగినవి :** గర్భాధానము, పుంసవనం, జాతకర్మ, నామకరణం, అన్నప్రాశనము, నిష్క్రమణము, జీర్ణ గృహప్రవేశము, నూతన వధూ ప్రవేశము, నిత్యయానము, గంగా గోదావరీ తీర్థయాత్రలు.

**నామ నక్షత్రములయందు చేయదగినవి :** యుద్ధము, క్రయ విక్రయాది వ్యవహారము, క్షేత్రార్వణము, నగరార్వణము, గ్రామార్వణము చూచునపుడు జన్మ నక్షత్రము తెలిసి యున్నను నామనక్షత్రమే ఫలదమగును.

**జన్మ నక్షత్రమందు జేయదగిన, చేయదగని కార్యములు :** జన్మ నక్షత్రము నిషేకము, యాగము, చౌలకర్మ, అన్నప్రాశన, వ్యవసాయ, ఉపనయన, పట్టాభిషేక, భూసంపాదన, అక్షరాభ్యాసముల యందు శుభకరము. స్త్రీలకు వివాహ విషయమై జన్మ నక్షత్రము శ్రేష్ఠము. పుంసవనము, యుద్ధము, సీమంతము, గర్భాధానము, శ్రాద్ధము, క్షౌరకర్మ, ఔషధసేవ, ప్రయాణము, వివాహము (పురుషులకు) లందు అశుభప్రదము.

**పురశ్శుక్రదోషము – అపవాదము :** నూతనవధువు, గర్భిణీస్త్రీ, శిశుసహితయగు స్త్రీయును, శుక్రుడు తూర్పున నున్నప్పుడు పశ్చిమము నుండి వాయవ్యమునకు, ఉత్తరమునకు, ఈశాన్యమునకు, తూర్పునకు ప్రయాణము చేయకూడదు. శుక్రుడు పశ్చిమమున నున్నపుడు తూర్పునుండి ఆగ్నేయమునకు, దక్షిణమునకు, నైరృతికి, పశ్చిమమునకు ప్రయాణము చేయగూడదు. ఈ దోషము భారద్వాజ, వశిష్ఠ, వాత్స్య, భృగు, అత్రి, ఆంగిర, కాశ్యప, గార్గ్య, గౌతమ గోత్రజులకును, యాచకులకును, నొక గ్రామమందొక గృహము నుండి మరియొక గృహమునకు పోవువారికిని, వివాహమునకు పోవువారలకు, దేశోపద్రవ సమయమునను, దుర్భిక్ష సమయమునను, మహాయోగులకును, ఆర్తులగు వారికిని వర్తించదు.

**అధికమాసమున చేయదగినవి – తగనివి :** అధిక మాసమందు నిత్య నైమిత్తిక కర్మములు చేయదగినవి. ఉపవాస, ఏకభుక్త, నక్త, యాచిత, దాన వ్రతములనెడు దేవకార్యములు ఆరును, ఆధానమును, అపూర్వ తీర్థ గమనమును, నామకరణ, అన్నప్రాశన, చౌల, అక్షరాభ్యాస, ఉపనయన, వివాహాదులును, రాజాభిషేకమును, నూతనానుష్ఠానమును, సర్వప్రతిష్ఠ ఉత్సవాదులును, సర్వ ప్రాయశ్చిత్తమును, ఆశ్రమ స్వీకారమును, కాల సహజమైన కామ్య కర్మలును విడువదగినవి.

**స్వప్న విషయములు**

పగటి నిద్రయందును, వాత ప్రకోపములందును వచ్చు కలలను పట్టించుకొన నవసరము లేదు. రాత్రి 1 ఝామయినచో 1 సంవత్సరము లోపున ఫలము, 2వ ఝామునందయిన 3 నెలల లోపున, 3వ ఝామునందయిన 1 నెలలోను, అరుణోదయ మందైన 10 రోజులలోను, వేకువ వేళయందైన ఆ రోజే ఫలము నిచ్చును. సుస్వప్నము వచ్చిన తర్వాత నిద్రింపగూడదు. దుస్స్వప్నమైనచో కాళ్ళుచేతులు ప్రోక్షించుకొని పరమేశ్వరుని ధ్యానించి నిద్రింపవలెను.

**సుస్వప్నములు :** మేడలు, పర్వతములు, పుష్ప వృక్షములు, రథములు, ఏనుగులు, గుఱ్ఱములు... వీనిని ఎక్కినట్లును, అద్దము చూచినట్లును, ప్రభువుతో మాట్లాడినను, చంద్ర సూర్యులను చూచినట్లును, అమేధ్యంలో పడినట్లును, తెల్లని వస్తువులను చూచినట్లును, దేవతా స్త్రీలతో సంభోగించినట్లును, తనకు కల్యాణమైనట్లును, పసుపు కుంకుమాదులచే అలంకారములు ధరించినట్లును, తాను మృతి చెందినట్లును, వేదాధ్యయనము చేసినట్లును, గంగాస్నానము చేసినట్లును, దేవతలు, గోవులను చూసినట్లును, రక్తము చూసినట్లును, పరుల గృహము కాలినట్టును, నరమాంసం భుజించినట్లును, క్షీర పానము చేసినట్లును, తానేడ్చినట్టును, సురాపానము చేసినట్లును ఇత్యాది శుభ స్వప్నములు, ద్రవ్యలాభము, శుభమును కలుగజేయును.

**దుస్స్వప్నములు :** సర్పము, నక్క, పంది, గాడిద మొదలైన క్రూర జంతువులు, నువ్వులు, నూనె, ఆముదము, ఎముక, ప్రత్తి, నిప్పు, ఇనుము, మురికినీళ్ళు పడిన ఇల్లు, వీటిని చూచినను, సముద్రమందుండుట, బురదయందు మునుగుట, ఖైదగుట, రైలు నుండి పడుట, తుపాకి దెబ్బ తగులుట, మృతవార్త వినుట, క్షుర కర్మ చేసుకొనుట, విధవను, వైద్యుని చూచుట, మృగముతో రమించుట, పక్వమాంస భోజనము ఇత్యాది దుస్స్వప్నములు ధనహాని, దరిద్రమును, రోగమును, ఆపదలను కలుగజేయును.

**బల్లి పాటునకు ఫలములు**

శిరస్సు – కలహము, ముఖము – బంధుత్వము, కనుబొమ్మల నడుమ – రాజానుగ్రహము, పైపెదవి – ధన వ్యయము, క్రింద పెదవి – ధనలాభము, ముక్కు చివర – రోగము, కుడిచెవి – దీర్ఘాయువు, ఎడమ చెవి – వర్తక లాభము, నేత్రములు – ఖైదు, గడ్డము – రాజదండనము, నోరు – భయము, కంఠము – శత్రుహాని, కుడిభుజము – ఆరోగ్యము, ఎడమభుజము – స్త్రీ సంగమము, కుడిముంజేయి – కీర్తి, ఎడమ ముంజేయి – రోగము, స్తనయుగ్మము – ధాన్యలాభం, రొమ్మునను, నాభి – ధనలాభం, గోళ్ళు – ధనవ్యయము, లింగములు – దారిద్ర్యము, జుట్టుకొన – మృత్యువు. ఈ ప్రదేశములలో తొండ పాకినను ఫలమిటులనే ఉండునని తెలిసి కొనవలయును.

**అవయవములు అదరుట వలన ఫలము :** కుడిపక్క అదిరిన మేలు. ఎడమ పక్కన మధ్యన ఫలము. నడి నెత్తిన మృష్టాన్నము, నొసలు మేలు, కుండిచంప రాజభయం, ఎడమ చేయి ఉద్యోగం, స్త్రీలకు కుడికన్ను కీడు, ఎడమ కన్ను మేలు. రెండు కన్నులు అదిరిన మేలు. ముక్కు రోగం. పై పెదవి కలహము. కింది పెదవి భోజన సౌఖ్యము. గడ్డము లాభము. కుడిచెక్కిలి ధనము. ఎడమ చెక్కిలి దొంగల భయం. కుడి భుజము సంభోగం. ఎడమ భుజము కీడు. రొమ్ము ధనము. చేతులు వాహన బలం, అరచేయి సంతానం. కుడి తొడ రాజ విజయము. మోకాళ్ళు ధాన్యలాభము. అరికాళ్ళు సౌఖ్యము. ప్రక్క ఆభరణ ప్రాప్తి.

**శకున రత్న పంచము :** నల్లమచ్చల పిచ్చుక, కుక్క, కాకి, గువ్వ, ఆడనక్క. వీటికి సాధ్యపడినపుడు ఆహారము పెట్టవలెను. ఎన్నడు కొట్టరాదు

**కార్యసిద్ధికి సూచనలు :**

1. ఏ పని మీదనైన బయలుదేరినపుడు కన్పించు పక్షులు, జంతువులు తన ఎడమ నుండి కుడివైపునకు పోవుట.
2. ఏ జంతువయిన ఆహారమందుకొనుచుండగా గమనించుట. (గడ్డి, గింజలు తినుచున్నచో కార్యము సుగమము)
3. పెరుగు, నెయ్యి, పచ్చగడ్డి, అక్షతలు, నిండుకుండ, పండ్లబుట్ట, గంధం, అద్దము, మాంసము, చేపలు. ఆవుపేడ, తేనె, వీణ, పూలు, గొడుగు, క్రొత్త బట్టలు, ఏనుగు, గొఱ్ఱె, పట్టుబట్టలు, ధాన్యము, కూరగాయలు, వీనిపేర్లు వినిపించుట, ఇవి కనిపించుట.
4. మద్దెల, డోలు, భేరి, సంగీతము, వేద ధ్వని, చెవులకు ఇంపుగా విన్పించుట.
5. ఎడమ వైపు నుండి ఏడుపు వినిపించుట.
6. వెనుక నుండి వెళ్ళు అను మాట, ముందు నుండి (రా) అను మాట వినిపించుట.
7. పసిపిల్లలు తుమ్ముట.
8. ఎడమ చెవి ప్రక్కన తుమ్ముట.
9. ఎడమ కంటి కెదురుగా తుమ్ముట.

**కార్య భంగ సూచనలు :**

1. జంతువులు కుడివైపు నుండి ఎడమ వైపునకు పోవుట.
2. బొగ్గులు, బూడిద, కట్టెలు, మినుప సున్ని, దూది, తవుడు, ఊక, త్రుప్పు పట్టిన వస్తువులు, కంకర రాళ్ళు, నూనె, ఉప్పు, ఎండుగడ్డి, సంకెళ్ళు.
3. కాలు జారుట, మోకాలు మడత పడుట, ఏదియో తగులబోయి వెనుకకు జంకుట, దేహముపై బట్టలు జారుట.
4. పిల్లలు పోట్లాడుకొనుచు కన్పించుట, వారి పోట్లాట సవ్వడి విన్పించుట
5. దిగంబరులు, అవయవ లోపమున్నవారు, రజస్వల, గర్భవతి, రోగి, పిచ్చి వాళ్ళు, జుట్టు విరబోసిన వారు, ఏడ్చుచున్నవారు.
6. వెనుక నుండి (రా) అను మాట, ముందు నుండి (పో) అను మాట వినిపించుట.
7. తుమ్ము వినిపించుట. (జంతువుల తుమ్ము ప్రాణ ప్రమాదము)
8. కుడి కంటికి ఎదురుగా తుమ్ముట.
9. కుడిచెవి ప్రక్కన తుమ్ముట.(వరుస తుమ్ములు, క్షుముతోడి తుమ్ములు ఫలితము నీయవు)

**పుట్టుమచ్చల ఫలితాలు**

పుట్టుమచ్చ నుదుటి కుడి భాగంపైనా, కుడి కణతమీదైనా వున్న ధనము, సంపదలు కలుగును. కుడి చెవి చివరనున్న నీటి గండము. కుడి చెవి మీద గాని, ఎడమ చెవి మీద గాని వున్న వారు ధనవంతులు, గౌరవనీయులు; కండ్ల ఎడమ కొలకులయందున్న మనస్తాపం కలవారు అవుతారు. కను బొమ్మల పైన వున్న వివాహం త్వరగా అవుతుంది. ముక్కు రంధ్రముల కింద భాగంలో వుంటే అదృష్టవంతులవుతారు. ముక్కుపైన వుంటే ప్రయాణాలు బాగా చేస్తారు. కుడి బుగ్గపైన వుంటే యుక్త వయస్సులో వివాహం అవుతుంది. గడ్డంపైన వుంటే గొప్పవారు అవుతారు. పెదవులపైన వుంటే తిండిపోతులు అవుతారు. మెడపైన వుంటే భాగ్యవతి అయిన భార్య దొరుకుతుంది. మెడ కుడి పక్కన వుంటే చాలా గొప్పవారవుతారు. భుజము పైన వుంటే బాధ పొందుతారు. ఎడమ భుజముపైన వున్న జగడములాడుతారు. కుడిచేతి పైన లేదా కుడి భుజముపైన వున్న బుద్ధిమంతులు, దూరదృష్టి ఉన్నవారు అవుతారు. చంకకు, గుండెకు దగ్గర వుంటే ధనవంతులు, గౌరవనీయులవుతారు. చేతి మీద ఉన్నవారు. ఐశ్వర్యము కలిగి, పిల్లల వల్ల సుఖ సంతోషాదులు పొందుతారు. కుడి రొమ్ముపైన ఉన్నవారు మంచి తెలివి తేటలున్నవారై కష్టపడి పనిచేయువారై వుంటారు. రొమ్ము ఎడమ భాగంలో వుంటే దారిద్ర్యంచే బాధలు పొందుతారు. గుండెకు ఎడమ భాగమున వున్న దుర్మార్గులు, మోటుగా మాట్లాడతారు. తొందర స్వభావం గలవారు అవుతారు. కడుపు పైన వున్న తిండిపోతులవుతారు. కడుపు కింద భాగమున వున్న జబ్బుతో బాధపడుతారు. కడుపునకు ఎడమ పక్కన వుంటే సంతోషమును, మితిమీరిన సౌఖ్యాన్ని కోరతారు. కడుపు మధ్యభాగమున వున్న జబ్బుతో బాధపడతారు. మొలమీద వున్న వారు దరిద్రులవుతారు. ఎడమతొడ మీద వున్న సుఖ సంబంధమైన జబ్బుతో బాధపడతారు. కుడితొడపైగాని, అండాశయం మీద గాని వున్న చాలా ధనాన్ని కలిగి వుంటారు. లేదా వివాహం మూలంగా కాని వివాహానంతరం గాని గొప్ప ధనవంతులవుతారు. మోకాలిపై వున్న స్త్రీ మంచి నడవడి కలిగి, ప్రేమ గల భర్తను కలిగి వుంటుంది. కుడి పాదం మీద కలవారు మంచి తెలివితేటలు గలవారును, మంచి వాక్చాతుర్యం, ఎడమ మోకాలిపై వున్న స్త్రీ మంచి సంతానవతి అవుతుంది. కాళ్ళ గుత్తుల మీదను, పాదాల మీదను వున్న పురుషులు, స్త్రీ స్వభావులుగాను, స్త్రీలు పురుష స్వభావులుగాను వుంటారు.

**రజస్వలాశాంతి నక్షత్రాదులు**

చైత్ర, జ్యేష్ఠ, ఆషాఢ, భాద్రపద, పుష్యమాసము లందును; శుక్ల కృష్ణ పక్షములలో పాడ్యమి, చవితి, నవమి, ద్వాదశి, చతుర్దశులయందును, అమావాస్య యందును; ఆది, మంగళ, శనివారముల యందును; మేష, వృషభ, కర్కాటక, మకరముల యందును, ధనుర్లగ్నాది యందును; భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్రేష, మఘ, పూర్వఫల్గుని, పునర్వసు, జ్యేష్ఠ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర నక్షత్రములయందును; సంక్రమణము, గ్రహణము, వైధృతి, వ్యతీపాత, భద్రకరణము, సంధ్యాకాలము, నిద్ర యందును రజస్వల యగునేని యథావిధిగ శాంతి చేసికొన వలెను. అట్లు చేసికొని తిరుగ మంచికాలమందు రజస్వల యగు వరకు గర్భాధానము చేయరాదు. భరణి, ఆశ్రేష, పూర్వఫల్గుని, పూర్వాషాఢ, పూర్వాభాద్ర నక్షత్రముల ప్రథమ పాదమందు భర్తృనాశము, ద్వితీయ పాదము పుత్రనాశము, తృతీయ పాదము ధననాశము, చతుర్థ పాదమందు అశుభము కలుగును.

కృత్తిక, ఆర్ద్ర, పునర్వసు, మఘ, జ్యేష్ఠ నక్షత్రముల ప్రథమ పాదమందు శుభము, ద్వితీయ పాదమందు 25 మందికి భోజనము పెట్టవలయును. 3,4 పాదములందు యథావిధిగా శాంతి చేసికొనవలెను. నక్షత్రము దుష్టమైనచో హోమ విధానముగా శాంతి చేయవలెను. నక్షత్రము మంచిదై తక్కినవి చెడువైనచో సామాన్య శాంతి చేయవలెను. పరిఘా యోగ పూర్వార్ధమున, దిగంబరురాలైయుండగను, తటాకాది జలమధ్యమున నున్నపుడును, ఉన్నత స్థలమందుండగను, గ్రామాంతరమందు ఉండగను, ఊరికి వెలుపలిప్రదేశముననను, అర్ధరాత్రి యందును, ఉషఃకాలమందును, రజస్వల యగునేని సామాన్యశాంతి చేయవలెను. తిథికి తండులములు, వారమునకు శాకము, నక్షత్రమునకు ఆజ్యము, యోగమునకు ఫలము, కరణమునకు వస్త్రయుగ్మము దోషపరిహారార్థము ఋతుస్నానమైన పిమ్మట దానమొసగ వలెను. దుష్టనక్షత్రాదుల యందు రజస్వలయగు కన్యక తాంబూల చర్వణము చేయగూడదు. పుష్పాదులను ధరింపరాదు. దుష్ట తిథ్యాదుల యందు రజస్వలయైన కన్యక ముఖమును భర్తయు, భర్త ముఖమును కన్యకయు చూడరాదు. అజ్ఞానవశమున చూచిరేని తిరిగి రజస్వల నక్షత్రము రాకమునుపే శాంతి చేసికొనవలెను. నేయి, దూర్వా తిలాక్షలతో ప్రత్యేకముగా ఎనిమిది వందల పర్యాయములు హోమము చేయవలెను.

**జననకాల నక్షత్రములు - శాంతులు**

**అశ్విని :** మొదటి పాదమందు శిశుజననమైన ఆ శిశువునకు తండ్రికి దోషము. ఈ దోషము మూడు మాసము లుండును. హోమ శాంతి, మహాన్యాస పూర్వక ఏకాదశవార రుద్రాభిషేకము, నక్షత్ర నవగ్రహ జపములు, హోమములు, తర్పణములు, దానములు చేయవలయును. సువర్ణదాన మొనర్పవలెను. 2, 3, 4 పాదములకు దోషము లేదు. అయినను తండ్రి శిశు ముఖమును ఆజ్యములో చూడవలెను.

**భరణి :** 1, 2, 4 పాదములలో జన్మించిన వారికి దోషము లేదు. అయినను తండ్రిచే ఆజ్యా వేక్షణము చేయించవలెను. 3వ పాదములో పుత్రజననమైన ఆ శిశువునకు, తండ్రికిని - పుత్రికా జననమైన శిశువునకు, తల్లికిని దోషము. ఈ దోషము 27 రోజులుండును. హోమ శాంతి, రుద్రాభిషేక, నక్షత్ర, నవగ్రహ జప, హోమ, తర్పణ దానములు చేయవలయును.

**కృత్తిక :** మూడవ పాదములో పురుష జననమైన శిశువునకు, తండ్రికి, స్త్రీ జననమైన శిశువునకు, తల్లికి దోషము. హోమ శాంత్యాదులు జరుపవలెను. 1,2,4 పాదములలో జననమైన దోషము లేనప్పటికిని తండ్రిచే ఆజ్యావేక్షణము చేయించవలెను.

**రోహిణి :** 1వ పాదము తల్లికి మేనమామలకు, 2వ పాదము తల్లికి, తండ్రికి, మేనమామలకు, 3వ పాదము తల్లికి, మేనమామలకు దోషము. 4వ పాదము మేనమామలకు దోషము. ఈ నక్షత్రములో ఏ పాదమున జననమైనను హోమ శాంత్యాదులు జరుపవలెను.

**పుష్యమి :** 1వ పాదము మేనమామలకు, 2,3 పాదములు తల్లి దండ్రులకు దోషము. యథావిధిగా హోమ శాంత్యాదికములు నిర్వర్తించవలెను. గంధపు చెక్కను దానమొనర్పవలెను. 4వ పాదము దోషము గాదు. అయినను తండ్రి శిశు ముఖమును ఆజ్యములో చూడవలెను.

**ఆశ్రేష :** 1వ పాదము దోషము లేదు. తండ్రి శిశుముఖమును ఆజ్యములో చూడ వలెను. 2వ పాదము తండ్రికిని, ధనమునకు దోషము. 3వ పాదము తల్లికి దోషము. 4వ పాదము శిశువునకు తండ్రికి దోషము. యథావిధి హోమ శాంత్యాదికములు చేయవలెను. సువర్ణదాన మొనర్పవలెను.

**మఘ :** 1వ పాదము తండ్రికి, శిశువునకు దోషము. 2వ పాదము దోషము గాదు. 3వ పాదమున పురుష జననము తండ్రికి, స్త్రీ జననము తల్లికి దోషావహము. యథావిధి హోమశాంత్యాదు లొనర్పవలెను. సువర్ణ దానము చేయవలెను.

**పూ.ఫల్గుని:** అన్ని పాదములు సామాన్య దోషము. తండ్రి శిశు ముఖమును ఆజ్యము నందు చూడవలెను.

**ఉత్తర :** 1వపాదము తల్లితండ్రులకు, 4వ పాదము సోదరులకు దోషము. యథావిధి హోమ శాంత్యాదులు, తిలపాత్ర దానము చేయవలెను. రెండు, మూడు పాదములు సామాన్యశాంతి. తండ్రిచే ఆజ్యా వేక్షణము చేయించవలెను.

**హస్త :** 3 వ పాదమున పురుష జననమున తండ్రికి, స్త్రీ జననమైన తల్లికి సామాన్య దోషము. ఆజ్యావేక్షణము చేయించవలెను.

**చిత్ర :** 1వ పాదము తండ్రికి, 2వ పాదము తల్లికి, 3వ పాదము సోదరులకు దోషము. యథావిధి హోమ శాంత్యాదికము లొనర్పవలెను. సువర్ణముతో మేక రూపమును చేయించి దానమొసగ వలెను. 4వ పాదములో జననమైన సామాన్యశాంతి చేసికొన వలయును.

**విశాఖ :** సామాన్య దోషము. ఆజ్యావేక్షణము చేయించవలెను.

**జ్యేష్ఠ :** ప్రబలమైన దోషము హోమశాంత్యాదికములు జరుపవలెను. జ్యేష్ఠా నక్షత్ర గండములు : 1వ భాగము తల్లితల్లికి, 2వ భాగము తల్లితండ్రికి, 3వ భాగము మేనమామలకు, 4వ భాగము తల్లికి, 5వ భాగము శిశువునకు, 6వ భాగము పశువులకు, ధనమునకు 7వ భాగము ఉభయవంశములకు, 8వ భాగము వంశనాశము, 9వ భాగము శ్వశురునకు, 10వ భాగము సర్వమునకు దోషము. మంగళవారముతో గూడిన జ్యేష్ఠయందు జననమైన జ్యేష్ఠ సోదరునకు హాని.

**మూల :** 1వ పాదము పుత్రజననమున తండ్రికి, పుత్రికా జననమున పశువులకు దోషము. 2వ పాదము పుత్ర జననమున తల్లికి దోషము. పుత్రికా జననమున సామాన్య సౌఖ్యము. 3వ పాదమున పురుష జననమున ధననష్టము. పుత్రికా జననమున పితృ పక్షమునకు హాని. 4వ పాదము పురుషజన్మమున సామాన్య దోషము. స్త్రీ జన్మమున మాతృపక్షమునకు చేటు. కాన ఏ పాదమున జననమైనను యథావిధిగా హోమ శాంతి, సువర్ణ మహిష ప్రతిమాదానము చేయవలెను.

**మూలా నక్షత్ర గండములు :** నక్షత్రాద్యంత ఘడియలు పన్నెండు భాగములు చేయగా 1. తండ్రికి, 2. తల్లికి, 3. సోదరులకు, 4. ఆడతోబుట్టువులకు, 5. మామకు, 6. మేనత్తకు, 7. పినతల్లికి, పెత్తల్లులకు, 8. మామకు, 9. శిశువునకు హాని, 10. దారిద్ర్యము, 11. రాజ్యలాభము, 12. భాగ్యము.

**పూర్వాషాఢ :** మొదటిపాదము, రెండు నాల్గు పాదములలో శిశు జననమున సామాన్య దోషము. ఆజ్యావేక్షణము కర్తవ్యము. మూడవపాదము పురుష జననమున తండ్రికి, స్త్రీజననమున తల్లికి దోషము. హోమ శాంత్యాదులు చేయవలెను.

**పూర్వాభాద్ర :** సామాన్య దోషము. ఆజ్యావేక్షణము చేయవలెను.

**రేవతి :** మొదటి మూడు పాదములు దోషము లేదు. ఆజ్యా వేక్షణము మాత్రము చేయవలెను. నాల్గవ పాదమున పురుష జననమున తండ్రికి, స్త్రీ జననమున తల్లికి దోషము. కావున యథావిధిగ హోమ శాంత్యాదులు నిర్వర్తించవలెను.

**దోషములేని నక్షత్రములు :** మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర.

జనన కాలమందు దోషయుక్తమైన గ్రహములకు గ్రహ జప సంఖ్యలో 1/100 (ఉదా :- రవి గ్రహమునకు జపసంఖ్య 6000. కావున హోమసంఖ్య 60) హోమము చేయవలెను. ఇతర గ్రహములకు కూడ 11 చొప్పున చేయుట మంచిది. ఆశ్రేష నక్షత్రము అత్తగారి గండ మనియు, మఘ, మూల నక్షత్రములు మామగారి గండమనియు, విశాఖ నక్షత్రములో జన్మించినవారికి మరుదులు ఉండరని, జ్యేష్ఠా నక్షత్రములో జన్మించినవారికి బావగార్లు ఉండరని దోషములు చెప్పబడినను జననకాలము నందు శాంతి చేయించుకొన్న వారికి ఆ దోషములు పోవునని పెద్దల అభిప్రాయము.

అమావాస్య నాడు, గ్రహణము నందు జన్మించిన వేదోక్తమైన మంత్రములతో శాంతి చేయించుకొనవలెను. శిశువు నక్షత్రము (శుభ నక్షత్రమైనను) తండ్రి, తల్లి, అన్నదమ్ముల, అక్కచెల్లెళ్ళ యొక్క నక్షత్రమదే అయినచో గూడ నక్షత్రమునకు 1000 జపము, 108 నక్షత్ర హోమము చేయించుకొనవలెను.

**రాశి గండములు :** మీన మేషములు, కర్కాటక సింహములు, వృశ్చిక ధనుస్సుల సంధి అర్ధ ఘడియ. ఈ సమయమున జననమయిన నవగ్రహ జపము, నక్షత్ర జపము, అపమృత్యు జపము, హోమము, రుద్రాభిషేకము, అశ్వత్థ ప్రదక్షిణము, అన్నదానము యథావిగా జేసినచో శాంతి యగును. తిథి గండమునకు వృషభ ప్రతిమను, నక్షత్ర గండమునకు గోవు ప్రతిమ, లగ్న గండమునకు బంగారమును దానము ఈయవలయును.

**బాలారిష్ట దోషములు :** జనన కాల లగ్నమునకు చంద్రుడు 8టను, కుజుడు 7టను, రాహువు 9టను, శని 1టను, గురుడు 3టను, సూర్యుడు 5టను, శుక్రుడు 6టను, బుధుడు 4టను, కేతువు 12టను యున్న బాలారిష్ట దోషములు ఉండును. శిశువు జన్మ లగ్నమునకు 1-5-6-7-8-12 భావములలో పాప గ్రహములు ఉన్నను, లేక పాపగ్రహములచే చూడబడినను మరియు క్షీణ చంద్రుడు 12వ రాశి యందుండగా 1-8 భావములలో పాప గ్రహములుండినను బాలారిష్టములు అగును.

**బాలారిష్ట దోష భంగం :** శిశువు జన్మ లగ్నమునకు పై చెప్పిన భావములలో ఆయా గ్రహములుండినను, ఆయా రాశులను బలవంతులగు శుభ గ్రహములు చూచినను, అలాగే కేంద్రము లందు అనగా 1-4-7-10 రాశులందు కనీసం ఒక శుభ గ్రహమైనను ఉన్నచో బాలారిష్ట దోషము తొలగి దీర్ఘాయుష్యము కలుగును.

**త్రిక ప్రసవము :** ముగ్గురు పుత్రుల పైన కన్య పుట్టినను, ముగ్గురు కన్యలపై పుత్రుడు పుట్టినను తల్లిదండ్రులకు, కులమునకును గొప్ప అరిష్టము, జ్యేష్ఠునకు ధన హానియు, దుఃఖమును సంభవించును. ఈ దోషము శాంతికై విధివిధానముగా హోమ శాంత్యాదులను చేయవలెను.

**నామ నక్షత్రములు**

| | | | |
|---|---|---|---|
| చూ,చే,చో,లా | అశ్విని | రూ,రె,రో,తా | స్వాతి |
| లీ, లూ, లే, లో | భరణి | తీ, తూ, తే, తో | విశాఖ |
| అ, ఈ, ఉ, ఏ | కృత్తిక | నా, నీ, నూ, నే | అనూరాధ |
| ఓ, వా, వీ, వు | రోహిణి | నో,యా,యీ,యు | జ్యేష్ఠ |
| వే, వో, కా, కి | మృగశిర | యే,యో,భా,భీ | మూల |
| కూ, ఖం,ఙ, ఛ | ఆర్ద్ర | భూ, ధ, ప, ఢా | పూ.షాఢ |
| కే, కో, హ, హి | పునర్వసు | భే, భో, జా, జీ | ఉ.షాఢ |
| హూ,హే,హో,డా | పుష్యమి | జూ, జె, జో, ఖ | అభిజిత్ |
| డి, డూ, డే, డో | ఆశ్రేష | ఖి, ఖూ, ఖె, ఖో | శ్రవణం |
| మా,మి,మూ,మే | మఘ | గా, గీ, గూ, గే | ధనిష్ఠ |
| మో, టా, టి, టు | పుబ్బ | గో, సా, సి, సు | శతభిషం |
| టే, టో, పా, పి | ఉత్తర | సే, సో, దా, ది | పూ.భాద్ర |
| పూ, ష, ణ, ఠ | హస్త | దూ,ఇ,ఝ,థా | ఉ.భాద్ర |
| పే, పో, రా, రి | చిత్ర | దే, దో, చా, చీ | రేవతి |

పైన పేర్కొనబడిన చూ,చే,చో,ల మొదలగు అక్షరములు క్రమముగా ఆయా నక్షత్రములకు 1,2,3,4 పాదములకు సంబంధించిన నామ ప్రథమ అక్షరములని తెలిసికొనవలెను. ఉదా ॥ చెన్నయ్య అనే పేరుకు అశ్విని 2వ పాదము అగును. ఇట్లే అన్ని పేర్లకు తెలిసికొనవలెను. బ్రహ్మయామిళములో కొన్ని నక్షత్రములకు నామములు చెప్పబడినవి. ఆర్ద్ర 3 – జ్ఞానేశ్వర; పునర్వసు 1 – క్షేమ; ఉత్తర 3 – ఫణి; హస్త 2 – క్షేత్రపాల; చిత్త 4 – శ్రీధర; స్వాతి 1 – కృష్ణ; స్వాతి 3 – ద్రౌపది; మూల 3 – భీమ; పూర్వాషాఢ 3 – భైరవ. నామరాశి గృహారంభ ప్రవేశములకును, వ్యాపారమునకును, మంత్రదీక్షకును, పునర్వివాహమునకును ఉపయోగించవచ్చును.

**మాసనామములు**

| మాసం | పురుష నామ | స్త్రీ నామ | మాసం | పురుష నామ | స్త్రీ నామ |
|---|---|---|---|---|---|
| చైత్ర | కృష్ణః | భూదేవీ | ఆశ్వయుజ | ఉపేంద్రః | చంద్రావతీ |
| వైశాఖ | అనంతః | కల్యాణీ | కార్తిక | యజ్ఞపురుషః | లక్ష్మీ |
| జ్యేష్ఠ | అచ్యుతః | సత్యభామా | మార్గశిర | వాసుదేవః | వాగ్దేవీ |
| ఆషాఢ | చక్రీ | పుణ్యవతీ | పుష్య | హరిః | పద్మావతీ |
| శ్రావణ | వైకుంఠః | రూపిణీ | మాఘ | గోవిందః | శ్రీదేవీ |
| భాద్రపద | జనార్దనః | ఇందుమతీ | ఫాల్గున | పుండరీకాక్షః | సావిత్రీ |

**ఆశౌచ ప్రకరణము**

శిశువు ప్రాణములతో పుట్టి నాభిచ్ఛేదనకు పూర్వమున మరణించెనేని తల్లికి 10 దినములు మృతశౌచము. తండ్రికి, సోదరులకు, జ్ఞాతులకు 3 దినములు జాతాశౌచము. మృతా శౌచము స్నాన మాత్రముననే శుద్ధి. మృత ప్రసవమైనను, నాభిచ్ఛేదనమైన తరువాత శిశువు మరణించినను తండ్రికి, సోదరులకు, జ్ఞాతులకు సంపూర్ణ జాతాశౌచం. మృతాశౌచం స్నానమాత్రం. తల్లికి దశరాత్ర మృతాశౌచము. 10 దినముల లోపుల శిశువు మరణించినచో జ్ఞాతులకు, తల్లి తండ్రి సోదరులకు జాతాశౌచము. జననాది శేషముతో శుద్ధి. మృతా శౌచము స్నాన మాత్రం. దంత జనన పర్యంతము జ్ఞాతులకు స్నానమాత్రం. చూడాకర్మ పర్యంతం ఒక దినం, ఉపనయన పర్యంతం 3 దినములు ఆశౌచము. వివాహమైన స్త్రీ తండ్రి యింటిలో మరణించిన తల్లి, తండ్రి, సోదరులు, పెండ్లికాని పడుచులకు మూడు దినములు ఆశౌచము. పెండ్లియైన పడుచులకు స్నాన మాత్రం. పెండ్లియైన స్త్రీకి తల్లిదండ్రుల మరణమును దశరాత్రములోగా వినిన త్రిరాత్రాశౌచం. సోదరీ సోదరులకు సన్నిధానాసన్నిధానముల యందు త్రిరాత్రం. మాతామహ, మాతామహిలు, పినతల్లి, పెత్తల్లులు, మేనమామ, మేనత్త, దౌహిత్రుడు, మేనల్లుడు, పినతల్లి పెత్తల్లుల బిడ్డలకు, మేనమామ మేనత్త బిడ్డలకు పురుష పర్యాయములో సన్నిధాన మందు త్రిరాత్రం, గ్రామాంతరమందు పక్షిణి. పక్షిణి కాలాతిక్రమణ మందు గ్రామాంతరముల నుండి వినిన పగలయితే ఆ పగలు, రాత్రి అయితే ఆ రాత్రి ఉండి స్నానం. మేనమామ భార్యకు సన్నిధానములో పక్షిణీ. అసన్నిధానమున స్నానమాత్రము. భార్యా, సంతానం వుండగా అత్తమామల మృతి యందు అల్లునకు సన్నిధానములో త్రిదినం. అసన్నిధానమున ఏకరాత్రి. అసన్నిధానమున స్నానమాత్రం. సవతి తల్లి సోదరీ సోదరులు మరణించినపుడు స్త్రీకి సన్నిధానమునందొక దినం. అసన్నిధానమున స్నానమాత్రం. సవతి కూతురు మృతియందు సవతి తల్లికి ఒక దినం. సవతి తల్లి పోయినప్పుడు సవతి కూతురునకొక దినం. అసన్నిధానమున స్నానమాత్రం. అల్లుని మరణము సన్నిధానమందైన అత్తమామలకు త్రిదినం. అసన్నిధానమందైన పక్షిణి. జ్ఞాతులకు దశాహానంతరమందు వినినపుడు త్రిదినం. ఆరుమాసముల పర్యంతం పక్షిణి, సంవత్సర పర్యంతం ఒక రాత్రి. మహానది అడ్డమున్నచో అతిక్రాంతాశౌచం లేదు. త్రిరాత్ర జ్ఞాతులకు త్రిరాత్రాతిక్రమణ మందు స్నాన మాత్రమే. తల్లిదండ్రులు చనిపోయినపుడు ప్రేత క్రియలు జరగనిచో తాము బ్రతికియుండు కాలములో ఎప్పుడు విన్నను దశదినాశౌచం. ప్రేత కృత్యములైనచో 20 సం॥లలో నెప్పుడు విన్నను దశదినాశౌచం. అనేకాశౌచ సన్నిపాతమందు దశరాత్ర మృతాశౌచమును పట్టుచుండగా దశరాత్ర మృతము గాని త్రిరాత్ర మృతముగాని సంభవించినప్పుడు ప్రథమ ఆశౌచముచే నివృత్తి. దశరాత్ర జాతాశౌచమును పట్టుచుండగా త్రిరాత్ర మృతాశౌచము వచ్చినప్పుడు జాతాశౌచముచే నివృత్తి. మృతాశౌచముచే అధిక జాతాశౌచము పోదు. దశరాత్ర మృతాశౌచం మధ్య దశరాత్ర జాతాశౌచం వచ్చినను, దశరాత్ర జాతాశౌచము మధ్య దశరాత్ర మృతాశౌచము వచ్చినను మృతాశౌచముచే నివృత్తి. దశరాత్ర మృతాశౌచం పట్టుచుండగా దశమ దినమున రాత్రి వేఱొక మృతాశౌచము వచ్చినచో మొదటి దానితో పూర్తి. 10వ రాత్రి 3వ జామున వినిన 2 దినములు, 4వ జామున అనగా సూర్యోదయాత్పూర్వమున వేరొక పూర్వ మృతిని వినిన 3 దినములు. పుత్ర పుత్రికా జనన సంబంధమగు జాతాశౌచ మవలంబించి యుండగా వేఱొక మృతాశౌచము వచ్చినప్పుడు తండ్రికి జాతాశౌచమే గాని మృతాశౌచము లేదు.

**మృతి విషయకమైన దుష్ట తిథివార నక్షత్రములు :** భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, పునర్వసు, మఘ, ఉత్తర, చిత్ర, విశాఖ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి ఈ నక్షత్రముల యందును, 1,2,6,7,11,12,13, 14,30 ఈ తిథుల యందును, ఆది, మంగళ, శుక్ర, శని వారముల యందును మృతి సంభవించిన గృహమునకు దోషము. కేవలం తిథి వలన దోషము లేదు. తిథివారముల వలన స్వల్పదోషము. తిథి, నక్షత్రముల వలన అర్ధదోషము, వార, నక్షత్రముల వలన సంపూర్ణ దోషము. ద్విపాద నక్షత్రములగు మృగశిర, చిత్రల యందును, రోహిణి, మఘలలో మరణము కలిగెనేని మూడు మాసములు, త్రిపాద నక్షత్రములగు కృత్తిక, పునర్వసు, ఉత్తరఫల్గుని, విశాఖ, ఉత్తరాషాఢలయందు మరణము కలిగెనేని 4 మాసములు, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, రేవతుల యందు మరణ మొందెనేని ఆ గృహమును 6 మాసములు విడువవలెను.

**సర్పదంశమృతి :** భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్రేష, మఘ, విశాఖ, మూల నక్షత్రములందు పాముకాటు వేసిన మరణము జరుగును.

**ఇక్కడినుండి ఈ ప్రకరణం చివరిలోని ఉపనయన కర్తలు వరకు బ్రహ్మశ్రీ మధుర కృష్ణమూర్తి శాస్త్రి గారి ఖర నామ సంవత్సర పంచాగము నుండి కృతజ్ఞతాపూర్వకముగా స్వీకరించబడినది.**

**అశౌచాంతరిత ప్రత్యాబ్దికమునకు కాలము :–** ప్రత్యాబ్దికాలకు జాతాశౌచము గాని, మృతాశౌచము గాని అడ్డువచ్చినచో స్నాన దినమున జరిపించవలెను. ఆ స్నాన దినము నాడు శూన్యతిథి అయినచో, ఆ దినమున ఆబ్దికమును మానివేసి మరునాడు ప్రత్యాబ్దికాదులను జరిపించవలెను. ఇట్లే సంవత్సర విమోచనమునకు, ప్రథమ ఆబ్దికములకును గూడ జాతాశౌచ, మృతాశౌచములు అడ్డువచ్చినచో స్నాన దినమున ముందుగా సంవత్సర విమోకమును, తరువాత ప్రథమ ఆబ్దికమును జరిపించవలెను. సంవత్సర విమోకమునకు శూన్యతిథి దోషము లేదు. ఆశౌచాంతరితము కానపుడు మృతతిథి నాడు ప్రథమ ఆబ్దికమును జరిపించవలెను. సంవత్సర విమోకమునకు తిథి ప్రధానము కాదు.

**పితామహశ్రాద్ధం :–** పితామహి, పితామహులకు కర్మ చేయవలసి వచ్చునపుడు దహనాది సపిండీకరణాంతము ద్వాదశ మాసికములను, సంవత్సర విమోకమును, ప్రథమ ఆబ్దికమును మాత్రం చేయవలెను. ద్వితీయాబ్దికము మొదలు ఆబ్దికములు పెట్టనక్కరలేదు.

**కర్పునష్ట శ్రాద్ధం :–** అపుత్రకులగు పినతండ్రి, పెదతండ్రులకు, అన్నదమ్ములకు, వీరి భార్యలకును తాను ఆబ్దికములు జరిపించ వలెను. తన తరువాత తన కుమారులు జరిపించవలెను. అయితే తన కుమారులు, తన పినతండ్రి, పెదతండ్రులకు జరిపించ నక్కర లేదు. అనగా మూడవతరం వారి ఆబ్దికాదులు జరిపించనక్కర లేదు.

**అధికమాస మృతునకు ఆద్య శ్రాద్ధ నిర్ణయము :–** అధికమాస మృతునకు అధికమాసమందే దహనాది దశాహాంతము వరకు జరిపించి ఏకాదశాహస్సునందు ఆద్యశ్రాద్ధమును షోడశ శ్రాద్ధమును ప్రకృతిగా జరిపించి, ద్వాదశాహస్సునందు సాపిండ్యము జరిపించవలెను. నిజమాసమృత తిథియందు అన్వాద్య మాసికమును

పార్వణవిధిగ జరిపించి, నిజమాసము నందే ఊనమాసికమును జరిపించవలెను. ద్వితీయ మాసికమును నిజమాసమునకు రెండవమాసమందు జరిపించవలెను.

**అధికమాస త్రైపక్షికాది నిర్ణయము :–** మృతమాసమునకు ద్వితీయ మాసము అధిక మాసమయితే అధికమాసములో త్రైపక్షికమును జరిపించవలెను. ఆరవమాసము అధికమాసము అయితే అధిక మాసమందే ఊనషాణ్మాసికమును జరిపించవలెను. ద్వాదశ మధికమయితే అధికమాసమునందే ఊనాబ్ధికమును జరిపించవలెను. నిజమాసమందు త్రైపక్షిక, ఊన షాణ్మాసిక, ఊనాబ్దికములు జరిపించకూడదు.

**అధిక మాసమందు ప్రథమాబ్దిక నిర్ణయములు :–** అధిక మాసము లేని సంవత్సరములో ఒకానొక మాసమునందు మృతి పొందిన వారికి ఆ పై సంవత్సరమందు ఆ మృత మాసము అధికమైనచో ఆ అధికమాసమునందే ప్రథమాబ్దికమును జరిపించ వలెను. నిజ మాసమునందు మరల జరిపించకూడదు.

**అధికమాస మృతునకు ఆబ్దిక నిర్ణయము :–** అధికమాసమున మృతిపొందినవారికి ఎప్పుడైనను ఆ మృతమాసము అధిక మయినచో ఆ అధికమాసమునందే ఆబ్దికము జరిపించవలెను. నిజమాసమునందు జరిపించకూడదు.

**కర్మ చేయునపుడు :–** 11వ దినమున కర్త భార్య గాని, ప్రేత భార్య గాని బహిష్టు అయినచో ఆద్యశ్రాద్ధమునకు వృషోత్సర్జనము, రుద్రగణాఖ్యశ్రాద్ధము, ఆద్యమాసికము వీనిని మాత్రము జరిపించ వలెను. ఊనాది పంచదశైకోద్దిష్ట శ్రాద్ధములు శుద్ధి దినమున (స్నానదినమున) జరిపించవలెను. సపిండీకరణము స్నాన దినమునగాని, మరునాడు గాని చేయవలెను. 12వ దినమున స్నానమయిన యెడల, ఆనాటి మధ్యాహ్నమున రెండవ స్నానము చేయించి, అద్యమాసికాదులను, షోడశ శ్రాద్ధములను, సపిండీకరణమును చేయవలెను. 13వ రోజు స్నానమయితే 12వ దినమునందే ఆద్యమాసికాది షోడశ శ్రాద్ధములు జరిపించి 13వ దినమున సపిండీకరణమును, ఊన మాసికమును చేయవలెను.

**సంవత్సర సూతకములో చేయకూడని పనులు :–** తన తల్లి దండ్రులు మరణించిన సంవత్సరములో తన పుత్రులకు, పుత్రికలకు వివాహమును చేయరాదు. తన కుమారులలో ఎవరి కైనను భార్య పోయినచో రెండవ వివాహము చేయవచ్చును. తనకు గాని, తన సోదరులలో నెవరికి గాని ప్రథమ వివాహము చేయకూడదు. (కొందరు కన్యాదానము చేయవచ్చునని చెప్పుచున్నారు కాని ఇది షోడశ మహాదానాదుల లోని కన్యాదానమే గాని, మనము మాములుగా చేయుచున్న బ్రాహ్మ వివాహమునకు సంబంధించినది కాదు.) యజ్ఞాది క్రతువులను చేయుట, చేయించుట, పౌరోహిత్యము, లక్షహోమము, మహాదానాది కామ్యకర్మలు, తీర్థయాత్ర, శివారాధన, ఉపవాస వ్రతములు, నూతన వ్రతారంభములు, తీర్థశ్రాద్ధము, గయా శ్రాద్ధము చేయకూడదు. తన కుమార్తెకు గాని, కుమారునకు గాని వివాహము చేయవలసినంత సంకట పరిస్థితి ఏర్పడినచో శాస్త్రవిధి ననుసరించి మాసికాదులను అపకర్ష చేసి ఆచరించి, వినాయక శాంతి జరిపించి, తరువాత వివాహములను చేయవచ్చును.

**కన్యాదానము చేయుటకు అధికారులు :–** 1. తండ్రి 2. పితామహుడు (తండ్రి తండ్రి) 3. సోదరుడు 4. పితృ కులములో ముఖ్యులు (పెదతండ్రి, పినతండ్రి మొ॥వారు) మేనమామ కులములో మాతామహుడు (తల్లి తండ్రి), మేనమామ పైన క్రమముగ తండ్రినుంచి ఒక్కొక్కరు లేనిచో తరువాత వారు అధికారులగుదురు. పైన తెలిపినవారెవ్వరు లేనియెడల తల్లికూడ చేయవచ్చును. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులలో ఉపనయనమైన సోదరులకు మాత్రమే అధికారముండును. ఉపనయనము కాని సోదరులు చేయకూడదు. ఉపనయనము కాని సోదరులు తల్లి మాత్రమే ఉన్న యెడల తల్లి కన్యాదానమును చేయవచ్చునని యు కలదు. తల్లి లేకుండ ఉపనయనముకాని సోదరులు మాత్రమే యుండి, పైన చెప్పిన అధికారులెవ్వరు కూడ లేనియెడల తమ బంధువులలో నెవరైన గాని, తమ కులములోని వారెవ్వరైనను కూడ కన్యాదానము చేయవచ్చును.

**విశేషము :–** ఇతరుల కన్యకు కన్యాదానమును చేసే యెడల కన్య యొక్క తల్లిదండ్రులకు సువర్ణాదులనిచ్చి, కన్యను తన కన్యగా చేసుకొని ధర్మపద్ధతిన వివాహమును చేయవచ్చును. సగోత్రులు కాకపోయినను కూడ కన్యాదానమును చేయవచ్చును గాని అప్పుడు కన్య జనక గోత్రమునకు – తమ గోత్రమునకు తగిన గోత్రునకే దానమీయవలెను.

**వివాహమునకు ప్రతికూల విషయము :–** వివాహము నిశ్చయించిన పిమ్మట వరుని యొక్క లేక కన్యయొక్క గాని సగోత్ర త్రిపూరుషరూపమైన తన కులమందు ఎవరైనా మరణించినచో ప్రతికూల దోషమందురు. అనగా వివాహమును చేయకూడదు అనుట. వివాహ నిశ్చయము వాగ్దానము అని ఒకటి, లగ్నాదులు నిశ్చయమై, కట్నకానుకలను నిశ్చయించి తాంబూలములను తీసుకొనుట యనునది రెండవది.

**సగోత్ర త్రిపూరుషమనగా :–**

**1.** వరునియొక్క ప్రథమ భార్య, వరుని తల్లిదండ్రులు, పితా మహుడు, పితామహి, వివాహము కాని తండ్రి సోదరి (మేనత్త) వీరు త్రిపూరుషమనబడును.

**2.** వరుని సోదరుడు (భార్య, పుత్రులు, వివాహము కాని కన్య కలవాడు) వరుని వివాహముకాని సోదరి, వరుని కోడలు, పుత్రులు, వివాహము కాని కుమార్తె, పౌత్రుడు (కొడుకునకు కొడుకు), పౌత్రుని భార్య, వివాహము కాని పౌత్రి ఇది పర త్రిపూరుష మనబడును.

**3.** పినతండ్రి, పెదతండ్రులు, వారి భార్యలు, వారి కుమారులు, కోడళ్ళు, వివాహముకాని కూతురు. సంతాన భేదమందు సగోత్ర త్రిపూరుష పురుషగణనము పురుష విషయములో గ్రహించ తగినది.

పైన వ్రాసినవారిలో ఎవరు మరణించినను వివాహమునకు ప్రతికూల మనబడును. ఇక్కడ సోదరుడు, పుత్రుడు, పౌత్రుడు వీరలకు ఉపనయనము కాకపోయినను, 3సం॥లు దాటినను 3 సం॥లు దాటి వివాహముకాని సోదరియైనను లెక్కలోనికి తీసుకొనవలెను. (3 సం॥రాల లోపు చనిపోయినచో లెక్కలోనికి తీసుకో నవసరం లేదు). ఇదే విధముగ కన్యయొక్క కులమందు గూడ తెలుసుకొనవలెను. కన్యయొక్క తల్లిదండ్రులు, పితా మహుడు, పితామహి ఇత్యాదులను గ్రహించవలెను. ఈ విషయమును వివాహోపనయనములందు త్రిపూరుషగణనను ఊహించుకొనవలెను.

**4.** ప్రతికూలమందు విశేషము చెప్పబడుచున్నది. తండ్రి, తల్లి, పితామహుడు, పితామహి, పినతండ్రి, పెదతండ్రులు, ప్రథమ భార్య, ప్రథమ భార్య కుమారుడు, సోదరులు, వివాహముకాని సోదరి వీరల యొక్క మరణము సంభవించినప్పుడు విశేషదోషముండుట చేత వివాహమును చేయకూడదు. ఈ వ్రాసినవారి కంటే భిన్నులైన త్రిపూరుష సపిండులయొక్క మరణము కలిగినచో శాంతి జరిపించి, దోషమును పోగొట్టుకొని వివాహము చేయవచ్చును. ఇది సాధారణ పరిస్థితులందు గ్రహించవలెను.

**5.** సంకట పరిస్థితులు ఏర్పడినపుడు తండ్రి మొదలగువారు చనిపోయినచో వారివారి మరణ సమయములనుండి ఆగవలసి నంతకాలము ఆగి తరువాత శాంతిని జరిపించుకొని దోషమును పరిహరించి వివాహమును చేయవచ్చును. అందులో మరియొక విషయమేమనగా వివాహము నిశ్చయమైన పిమ్మట తల్లి దండ్రులు ఇద్దరు చనిపోయినచో కాల ప్రతీక్ష శాంతుల వలన గూడ దోషము పోదు. కావున సంవత్సరము దాటిన తరువాతనే వివాహము చేయవలెను. ఒక వేళ తల్లిగాని, తండ్రిగాని యెవరో ఒకరు మాత్రమే చనిపోయినచో కాల ప్రతీక్ష శాంతుల వలన దోషమును పోగొట్టుకొని వివాహము చేయవచ్చును. సంకట పరిస్థితులేర్పడి నప్పుడు వివాహ నిశ్చయమైన పిదప తండ్రి పోతే 1 సం॥ము అశౌచము. తల్లికి 6 మాసములు, భార్య పోయినచో 3 మాసములు, సోదరులకు, పుత్రులకు $1^1/_2$ మాసములు ఆశౌచములని భావించవలెను. పైన వ్రాసిన వారి కంటె ఇతరులైన సపిండులకు 1 నెలరోజులు పూర్తి అయిన పిమ్మట శాంతిని జరుపుకొని వివాహ లగ్నమును పెట్టు కొనవలెను.

సంకటము, అతి సంకటము, మహా సంకటమని బాధాకరమైన కాలమును 3 రకాలుగా చెప్పినారు.

సాధారణ స్థితియందు తండ్రి మరణించినచో ఒక సంవత్సరము దాటిన తరువాత వినాయక శాంతిని జరిపించి వివాహమును జరుపవలెను. అతిసంకట పరిస్థితులెదురైనచో 6 మాసములు దాటిన పిమ్మట వినాయక శాంతిని, శ్రీపూజనము చేసి వివాహమును జరుపవలెను.

**విశేషముగ చెప్పిన ముఖ్య విషయము :–** వివాహ నిశ్చయమునకు పూర్వమందే మాతాపితరులలో నెవరు మరణించినను 1 సం॥ము వరకు వివాహమును చేయరాదను వచనము ఏ విధమైన సంకట పరిస్థితులు లేనప్పుడు అని గ్రహించవలెను.

**ప్రతికూలమునకు అపవాద వచనములు :-** మాత్రాది మరణములందు అతి సంకట పరిస్థితులు ఏర్పడినపుడు, నెలరోజులు కూడ ఆగుటకు అవకాశము లేని విషమ పరిస్థితులు కలిగి నపుడు, 10 రోజులు దాటిన తరువాత కొద్దిరోజులు దాటించి నెల లోపుగ కూడ వివాహమును జరిపించవచ్చును. వినాయక శాంతి, శ్రీపూజనము జరిపించవలెను. మరియు గోదానము విధిగా చేయవలెను. పై విషయములను బాగా ఆలోచించి సంకట తారతమ్యముచే గ్రహించవలెను. సంకట స్థితి లేకపోయినను, అతిసంకటస్థితి వచ్చినదని చెప్పినచో, అట్లు చెప్పినవారికి, చేసెడి వారికి గూడ దోషము సంక్రమించును. దుర్భిక్ష, రాష్ట్ర భంగము మొదలగు భయము కలిగినను, తల్లిదండ్రులకు ప్రాణసంకటస్థితి వచ్చినను అతిసంకటస్థితి అని గ్రహించవలెను. దీర్ఘ వ్యాధిపీడితులై ప్రాణ సందేహ స్థితి కలిగినప్పుడును, వధూవరులలో ఎవరికైనా దూరదేశమునకు పోవలసిన అత్యవసరస్థితి కలిగినప్పుడు, ప్రౌఢ కన్యల విషయములో ప్రతికూల విషయములను చూడనవసరము లేదు.

**ఏకోదరులకు ఉపనయన వివాహములు :-** ఏకోదరులగు ఇద్దరు కుమారులకు ఒక సంవత్సరమున ఉపనయనము గాని, వివాహములు గాని చేయరాదు. కుమారునకు ఉపనయనము, కుమార్తెకు వివాహము చేయవచ్చును. కాని, కుమార్తె వివాహము కంటె కుమారుని ఉపనయనము ముందు చేయవలెను. ఒక కుమారునకు, ఒక కుమార్తెకు ఒక సంవత్సరములో వివాహము చేయవచ్చును. అయితే కూతురు వివాహము మాత్రం ముందు చేయవలెను. ఇద్దరు కొడుకులకు, ఒక సంవత్సరము నందు ఉపనయన, వివాహాలు చేయరాదు. కవల పిల్లలగు స్త్రీ పురుషులకు మాత్రము జ్యేష్ఠ క్రమముగ ఒక సంవత్సర మందే చౌలోపనయన వివాహములను చేయవచ్చును. (వీరికి నిషేధము లేదని భావము.) తక్కిన కార్యములు చేయవచ్చును.

**ఉపనయన కర్తలు :-** ఉపనయనమును చేయుటకు తండ్రి ముఖ్యుడు. అతడులేనపుడు వరుసగా పితామహుడు, పెదతండ్రి, పినతండ్రులు, ఉపవీతులగు భ్రాతలు, పినతాత, పెదతాతలు, సపిండులు, సగోత్రుల, గురువులు వీరధికారులు. ఉపనయనము మధ్యలో తల్లి బహిష్ఠ యగుట, ఉపనయనమున వటువు బ్రహ్మచారులతో భోజనము చేయుటకు పూర్వం తల్లి బహిష్ఠ అయినచో మరల జేయవలెను. భోజనము అయిన తరువాత అయినచో బాధలేదు. ఐతే వటుడు కన్నకొడుకు గాక ఇతరులు ఎవరైనను (తమ్ముడైనను) తన భార్య ఎప్పుడు బహిష్ఠ అయినను ఉపనయనము మాననక్కర లేదు.

## 60 సంవత్సరముల పేర్లు

ప్రభవ, విభవ, శుక్ల, ప్రమోదూత, ప్రజాపతి, ఆంగీరస, శ్రీముఖ, భావ, యువ, ధాత, ఈశ్వర, బహుధాన్య, ప్రమాథి, విక్రమ, వృష, చిత్రభాను, స్వభాను, తారణ, పార్థివ, వ్యయ, సర్వజిత్, సర్వధారి, విరోధి, వికృతి, ఖర, నందన, విజయ, జయ, మన్మథ, దుర్ముఖ, హేమలంబ, విలంబ, వికారి, శార్వరి, ప్లవ, శుభకృత్, శోభకృత్, క్రోధి, విశ్వావసు, పరాభవ, ప్లవంగ, కీలక, సౌమ్య, సాధారణ, విరోధికృత్, పరీధావి, ప్రమాది, ఆనంద, రాక్షస, నల, పింగళ, కాళయుక్త, సిద్ధార్థ, రౌద్ర, దుర్మతి, దుందుభి, రుధిరోద్గారి, రక్తాక్ష, క్రోధన, క్షయ.

## తిథులలో చేయదగిన కార్యాలు

**కృష్ణ పాడ్యమి :** అధిపతి అగ్నిః. వివాహం, యాత్ర, చౌలం, సీమంతం, దేవతా ప్రతిష్ఠ, గృహప్రవేశం, వృక్షచ్ఛేదన మొదలగు శుభకర్మలు చేయవచ్చు.

**విదియ :** అధిపతి విధాతా. వాస్తు కార్యాలు, ప్రతిష్ఠ, యాత్ర, వివాహం, గృహకర్మలు, స్వర్ణ, రజత భూషణ ధారణ, సమస్త పుష్టికర్మలు చేయవచ్చు.

**తదియ :** అధిపతి గౌరీ. సంగీతం, శిల్పం, విద్యారంభం, సీమంతం, అన్నప్రాశన, చౌలం, గృహప్రవేశం, పశు క్రయ విక్రయాలు, ప్రతిష్ఠలు మొదలగునవి చేయవచ్చు.

**చవితి :** అధిపతి గణేశః. ఆయుధ, అగ్ని సంబంధ శస్త్ర మారణాద్యఖిల కర్మలు చేయవచ్చు.

**పంచమి :** అధిపతి నాగః. చర, స్థిర రూపాలైన సమస్త శుభాలు, ఋణాలివ్వడం, మంగళోత్సవాలు, ఉపనయనం, వివాహం, గ్రహశాంతిక పౌష్టిక క్రియలు చేయవచ్చు.

**షష్ఠి :** అధిపతి కుమారః. వస్త్ర అలంకార క్రియలు, యుద్ధసామగ్రి, పౌష్టిక క్రియలు చేయవచ్చు.

**సప్తమి :** అధిపతి రవిః. విదియ, తదియ, పంచమి తిథుల్లో చెప్పబడ్డ కార్యాలు చేయవచ్చు.

**అష్టమి :** అధిపతి మహేశః. వాస్తు, శిల్ప, నృత్యక్రియలు, స్త్రీ, రత్న, అలంకార క్రియలు, యుద్ధసంబంధమైన క్రియలు, అఖిల లేఖనాలు, కృషి, వాణిజ్యం మొదలగు క్రియలు చేయవచ్చు.

**నవమి :** అధిపతి దుర్గా. అగ్నిసంబంధ కర్మలు, విరోధాలు, మిత్ర భేదాదికాలు, సంభాషణ ఘాతుక కర్మలు మొదలగువానికి పనికి వస్తాయి.

**దశమి :** అధిపతి యమః. 2,3,5,7 తిథుల్లో చెప్పబడినవి చేయవచ్చు. శాంతి పుష్ట్యాదికాలు, ప్రాసాద స్థాపనం మొదలగు కార్యాలకు మంచిది.

**ఏకాదశి :** అధిపతి విశ్వేదేవాః. వ్రతాలు, ఉపవాసాలు, అన్ని ధర్మ కర్మలు, వివాహ, దేవతోత్సవాలు, వాస్తు యుద్ధ కర్మలు, కృషి, వాణిజ్య, భూషణాదికాలు, శిల్ప, నృత్య, గృహకర్మలు చేయవచ్చు.

**ద్వాదశి :** అధిపతి హరిః. శాన్తిక, పౌష్టిక కర్మలు, శుభకర్మలు చేయవచ్చు. యాత్ర, అన్నప్రాశన చేయరాదు.

**త్రయోదశి :** అధిపతి కామః. 2,3,5,10 తిథులకు చెప్పిన శుభకర్మలు చేయవచ్చు.

**చతుర్దశి :** అధిపతి శివః. అగ్ని ప్రధాన, ఉగ్రకృత్యాలు, యుద్ధ, శస్త్ర, అస్త్ర, లోహ, వ్రణ క్రియలు చేయవచ్చు.

**పూర్ణిమ :** అధిపతి చంద్రః. యజ్ఞక్రియలు, మంగళ కృత్యాలు, వాస్తుకర్మలు, వివాహ, దేవతా ప్రతిష్ఠలు చేయవచ్చు. అభ్యంగన, క్షౌర క్రియలు చేయరాదు.

**అమావాస్య :** అధిపతి చంద్రః. శుభకర్మలు చేయరాదు. పితృకర్మలు చేయాలి.

## వారములలో చేయదగిన కార్యాలు

**ఆదివారం:** ఉద్యోగంలో చేరడం, మంగళ కృత్యాలు, ఉత్సవాలు, నృపాభిషేకం, లోహం, చెక్క, చర్మ, ఊక పనులు, యుద్ధం, అస్త్రకర్మలు, వ్యవసాయపు పనులు, ధ్యాన క్రియలు, ఔషధ సేవనం, వైద్యం, మంత్ర తంత్రాలు, ఉపదేశాలు, ఉల్లి, పొగాకు, మిర్చి మొదలగు తోటలు వేయడం, ఉత్తరదిక్కుకు ప్రయాణం, కెంపు ధరించడం చేయవచ్చు.

**సోమవారం:** ముత్యం, స్ఫటికం, నూతులు, కాలువలు, చెఱువులు, జలం, ఉపనయనం, భూమి, పైకప్పులు, సంగీత, నృత్య, నాటకాది కళలు ప్రారంభించడం, స్తంభ ప్రతిష్ఠ, భూ సంబంధ కార్యాలు, తెల్లని వస్త్రాలు ధరించడం, వెండి వస్తువులు ఉపయోగించడం, ముత్యాలు ధరించడం, దక్షిణదిక్కుకు ప్రయాణం, కృషి క్రియలు, సమస్త వాస్తు కర్మలు చేయవచ్చు.

**మంగళవారం:** విష, అగ్ని, ఆయుధ, ఉగ్ర, అసత్యక్రియలు, వెండి, బంగారం, రాగి, ఇత్తడి, ఇనుము, ధాతువులు కరిగించడం, కోర్టు వ్యవహారాలు, ధైర్య సాహస విషయాలు, కందులు, వేరుశనగ వంటి ధాన్యాలు సాగు చేయడం, తూర్పుదిక్కుకు ప్రయాణం, పగడపు ఉంగరం ధరించడం చేయవచ్చు.

**బుధవారం:** బంగారం మొదలైన నగలు చేయడం, వాహనం, శిల్పం, విద్య, రాజీలు, వివాహం, వ్యాపారం, క్రయ విక్రయాలు, గణితం, రత్నాభరణ ధారణ క్రియలు, దస్తావేజులు, నూతన వ్యాపారాలు, యుక్తిగా కార్యాలు నిర్వర్తించడం, చిత్ర శిల్ప గణిత శాస్త్ర వ్యాకరణాది విద్యల నభ్యసించడం, అరటి, కొబ్బరి, మామిడి తోటలు పెంచటం, పెసలు మొదలైన పైర్లు వేయడం. పడమట దిక్కుకు ప్రయాణం మంచిది.

**గురువారం:** యజ్ఞయాగాది క్రియలు, వివాహాది శుభకార్యాలు, వైదిక కార్యాలు, నూతన విద్యారంభం, వృక్షదోహద క్రియలు, అలంకార ధారణ క్రియలు, గురువులను, దేవతలను పూజించడం, యుద్ధారంభం, తీర్థ యాత్రలు, అక్షరాభ్యాసం, శనగలు, చెఱకు, ప్రత్తి వంటి వ్యాపారాలు ప్రారంభించడం, పుష్యరాగం ధరించడం మొదలైనవి. పడమర దిశగా ప్రయాణం మంచిది. దస్తావేజులు, ఒప్పంద పత్రాలు వ్రాయడం మంచిది కాదని సంప్రదాయం.

**శుక్రవారం:** స్త్రీ సంబంధ క్రియలు, ముత్యం, వజ్రం, వైఢూర్యం, ఆభరణ ధారణ, సుగంధ శయ్యాభరణాలు, ఉద్యోగ కృషి, వ్యవసాయం, కాలువలు, వివాహం, పుష్ప సంబంధమైన మంగళకార్యాలు, నూతన వస్త్రాలు ధరించడం, కొనడం, రాజకీయరంగ ప్రవేశం, ధాన్య సంబంధపు పనులు ప్రారంభించడం, సాహిత్య విషయాలు, కళలు నేర్చుకోవడం. ఉత్తరం వైపు ప్రయాణం మంచిది.

**శనివారం :** చెక్కడం, కొట్టడం, సీసపు పనులు, దీక్షావలంబన, తగర లోహపుపనులు, స్థిరమైన పనులు, గృహ నిర్మాణాది క్రియలు, ఆవులు, గేదెలు మొదలగు వాని పనులు, ఇనుమునకు సంబంధించినవి, పాప కార్యాలు. అసత్య వాదన, దాసదాసీలను చేర్చుకొనడం మొదలగు పనులకు మంచిది. ఆయుధ నిర్మాణం, మోసం, దుష్ట సంభాషణం, శని దోష పూజాది కార్యక్రమాలు.

### నక్షత్రాలలో చేయదగిన కార్యములు

**అశ్విని :** అధిపతి అశ్వినౌ. గర్భాధానం, నామకరణం, రథారోహణం, పురప్రవేశం, కృషి, వైద్యం, యాత్ర, చౌలం, బీజావాపం, మంత్రోపదేశం, గృహారంభం, వర్తకం, వ్యవసాయం, ప్రయోగం, అన్నప్రాశన, వ్రాతపని, పట్టాభిషేకం, వనప్రతిష్ఠ, ఉద్యోగారంభం, క్రతువులు, ఉపనయనం, విద్యారంభం, వాస్తు కర్మలు, స్త్రీ సంపర్కం, చిత్రలేఖనం.

**భరణి :** అధిపతి యమః. యుద్ధారంభం, కొట్లాటలు, వధ, బంధనం, సాహస కర్మ, అగ్నికర్మలు, శస్త్రకర్మ, అనృతం, తాంత్రికం, జూదాలు, అభిచారకర్మ, దొంగతనం, మంత్ర పునశ్చరణ, బిలప్రవేశం, సేవక స్వీకారం, ధన గ్రహణం.

**కృత్తిక :** అధిపతి అగ్నిః. అప్పుతీర్చడం, దుష్టకృత్యాలు, ధనం దాచడం, ఔషధ సేవ, ధాతువాదం, అగ్ని సంబంధ లోహకార్యాలు, పశు విక్రయం, ఓషధీకరణ, మంత్ర స్వీకారం.

**రోహిణి :** అధిపతి ప్రజాపతిః. పుంసవనం, నామకరణం, వివాదం, చౌలం, సీమంతం, అన్నప్రాశన, ఉపనయనం, యజ్ఞయాగాదులు, శాంతి, పౌష్టిక కర్మలు, హోమకర్మలు, వాస్తుకర్మలు, నూత వస్త్రధారణ, ఆభరణ ధారణ, విద్యారంభం, పదవీ స్వీకారం, ఉపదేశాలు, గృహప్రవేశం, కృష్యారంభం.

**మృగశిర :** అధిపతి చంద్రః. ప్రయాణం, ఉద్యోగారంభం, దేవతా ప్రతిష్ఠ, ఆభరణ ధారణ, సీమంతం, గృహారంభం, ఉపనయనం, అక్షరాభ్యాసం, వ్రతాలు, కృష్యారంభం, నామకరణం, వివాహం, చౌలం, విద్యారంభం.

**ఆర్ద్ర :** అధిపతి రుద్రః. ఆయుధక్రియ, గర్భాధానం, ఈశ్వర ప్రతిష్ఠ, అక్షరాభ్యాసం.

**పునర్వసు:** అధిపతి అదితిః. పదవీ స్వీకారం, సీమంతం, పుంసవనం, ఉపనయనం, అన్నప్రాశన, నామకరణ, ఆభరణ ధారణ, కర్ణవేధ, గృహారంభం, ఉద్యోగం, ఔషధ సేవ.

**పుష్యమి :** అధిపతి బృహస్పతిః. యాత్ర, యానం, ఉపదేశం, వాహనం, గృహకర్మలు, సీమంతం, నామకరణం, కృషి, చౌలం, గృహప్రవేశం, భృత్యస్వీకారం, అస్త్రగ్రహణం, పట్టాభిషేకం, పూజారంభం, విద్యారంభం, నూతన ఆభరణ ధారణ, పశుసంగ్రహం, ఉపనయనం. (వివాహానికి పనికిరాదు).

**ఆశ్రేష :** అధిపతి సర్పః. మాయ, అగ్నిప్రవేశం, యుద్ధ ప్రయాణం, అనృత ప్రసంగం, అస్త్ర వినోదం, వాదం, అభిచారక్రియ, నుయ్యి, తటాకం, మంత్ర స్వీకారం.

**మఘ :** అధిపతి పితరః. వివాహం, వాపీకూప తటాకాదులు, వివిధసర్ప మంత్రాలు, గయాది పితృతర్పణాలు, కర్ణవేధ, ఉపనయనం.

**పూ.ఫల్గుని:** అధిపతి అర్యమా. మంత్ర ప్రయోగం, అగ్నికర్మ, అస్త్ర విద్యాభ్యాసం, వాపీ కూప తటాక ప్రతిష్ఠ, వృక్షస్థాపన, అక్షరాభ్యాసం, అభిఘాతకర్మ, శత్రు సంహారం.

**ఉత్తర :** అధిపతి భగః. దేవతా ప్రతిష్ఠ, వివిధ భూషణ ధారణ, కృషి, చౌలం, వివాహం, వేద శాస్త్రారంభం, బీజావాపనం, ఉపనయనం, నామకరణం, చతుష్షష్టి కళాభ్యాసం, అన్నప్రాశన, రథారోహణం, సీమంతం, పుంసవనం, నూతన వస్త్రధారణ, దేవతాపూజ, వాపీ కూప తటాకాదులు, ఉద్యోగారంభం, వాస్తుకర్మలు.

**హస్త :** అధిపతి సవితా. వివాహం, ఆభరణధారణ, చౌలం, సీమంతం, యాత్ర, అక్షరాభ్యాసం, ఉద్యోగం, నూతన వస్త్రధారణం, నూతనాలంకారం, ధాన్య సంగ్రహణ, నామకరణం, ఉపనయనం, ధన సంగ్రహణ, అన్నప్రాశన, గృహారంభం చేయవచ్చు. గృహప్రవేశం చేయరాదు.

**చిత్ర :** అధిపతి త్వష్టా. చౌలం, ఉపనయనం, అన్నప్రాశన, నామకరణం, ఉద్యోగం, నాట్యారంభం, రథం, గుఱ్ఱం, ఏనుగుల శిక్షణలు, వైద్యం, అలంకరణలు, కర్ణవేధ, వ్యాపారం, గృహకర్మలు, వివాహం.

**స్వాతి :** అధిపతి వాయుః. గర్భాధానం, విద్యారంభం, కృషి, అన్నప్రాశన, వన ప్రతిష్ఠ, బీజావాపనం, అలంకారధారణ, నామకరణం, ఉపనయనం, పుంసవనం, నృత్యారంభం, అక్షరాభ్యాసం, సంగీతారంభం. వివాహానికి చాలా మంచిది.

**విశాఖ :** అధిపతి ఇంద్రాగ్నీ. బీజావాపం, కృషి ప్రయత్నం, తటాక, కూప, సేతు, పరిఘాది ప్రవేశం, దిగుడు బావులు, వృక్షస్థాపన, లతాది స్థాపన, నిర్మాణం.

**అనూరాధ:** అధిపతి మిత్రః. గృహప్రవేశం, ఆభరణధారణ, ఉద్యోగం, యాత్ర, ద్రవ్య ప్రసంగం, విద్యాభ్యాసం, చౌలం, అన్నప్రాశన, నామకరణం, ఉపనయనం, వివాహం.

**జ్యేష్ఠ :** అధిపతి ఇంద్రః. యుద్ధం, శస్త్రం, దహనం, కత్తి, ధనుస్సు, మంత్రగ్రహణ, దుష్ట కృత్యాలు, పశు విక్రయం, దాస దాసీ స్వీకారం, శత్రువిజయం.

**మూల :** అధిపతి అసురః. యాత్ర, వివాహం, యజ్ఞ యాగాదులు, చౌలం, వైద్యం, వాపీ కూపాదులు, నామకరణం, గర్భాధానం, బీజావాపనం, తరు గుల్మాది ప్రతిష్ఠ, ఉపనయనం, ఆభరణ ధారణ, విద్యారంభం, పుంసవనం.

**పూర్వాషాఢ:** అధిపతి ఆపః. వాపీ, కూప ప్రారంభం, ధనుర్విద్యాభ్యాసం, నిధి, ద్రవ్య ప్రసంగం, గణిత శాస్త్రం, పశుసంగ్రహం, వేదాంతశాస్త్రం, అభిచార కృత్యం, బీజావాపనం, హింసార్థక కర్మలు, ఋణ విమోచనం.

**ఉత్తరాషాఢ:** అధిపతి విశ్వేదేవాః. విద్యాభ్యాసం, అన్నప్రాశన, గృహకర్మలు, వాహనాలు, సీమంతం, నామకరణం, చౌలం, ఉద్యోగం, గర్భాధానం, దేవాగారం, ఆభరణం, ఉత్సవాలు, బీజావాపనం, వివాహాదులు.

**శ్రవణం :** అధిపతి విష్ణుః. విద్యాభ్యాసం, అలంకారం, గృహ కర్మలు, అక్షరాభ్యాసం, అన్నప్రాశన, ప్రయాణం, కృషి, వైద్యం, చౌలం, ఉపనయనం, యజ్ఞ యాగాదులు, రాజ్యాభిషేకం, కర్ణవేధనం, గర్భాధానం, నామకరణం చేయవచ్చు. గృహప్రవేశం చేయరాదు.

**ధనిష్ఠ :** అధిపతి వసూ. ఉపనయనం, విద్యారంభం, యాత్ర, అలంకారం, వివాహం, పట్టాభిషేకం, అన్నప్రాశన, వైద్యం, గృహకర్మలు, వాహనం, శాన్తికర్మలు, పశు క్రయ విక్రయాలు, గృహప్రవేశం, గర్భాధానం.

**శతభిషం :** అధిపతి వరుణః. వర్తకం, నామకరణం, అన్నప్రాశన, ఉపనయనం, విద్య, కృషి, ఉద్యోగం, వాహనం, వైద్యం, గర్భాధానం, చౌలం, యాత్ర, వివాహం, అక్షరాభ్యాసం, వడ్డీవ్యాపారం.

**పూర్వాభాద్ర :** అధిపతి అజచరణః. వాపీకూపాదులు, శస్త్రపు శిక్షణ, శత్రుహరణం, మంత్ర తంత్ర శిక్షణ, వస్తువులు కొనడం.

**ఉత్తరాభాద్ర:** అధిపతి అహిర్బుధ్న్యః. యాత్ర, యాగం, ఉద్యోగం, వైద్యం, చౌలం, సీమంతం, వివాహం, గృహకర్మలు, పుంసవనం, తరుప్రతిష్ఠ, శిల్ప విద్య, ఉపనయనం, వాహనం, నామకరణం, అన్నప్రాశన, గర్భాధానం, అక్షరాభ్యాసం, అలంకారం.

**రేవతి :** అధిపతి పూషా. ఉపనయనం, వివాహం, సమస్త విద్యలు, గృహకర్మలు, అలంకారం, అక్షరాభ్యాసం, గర్భాధానం, అన్నప్రాశన, కృషి, క్రయ విక్రయాదులు, రాజ్యాభిషేకం, వాహనం.

**ఊర్ధ్వముఖ నక్షత్రాలు**

**రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పుష్యమి, ఉత్తరఫల్గుని, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర :-** మేడలు కట్టడానికి, పందిళ్ళు వేయడానికి, పట్టాభిషేకాలకు, ప్రాకారాదులకు (ప్రహరీ లకు), సింహద్వారాలు ఎత్తడానికి, తోటలు (ఆరామాలు), ప్రతిష్ఠలు చేయడానికి, వృక్ష, లతా స్థాపనాదులు, గొడుగు వేసుకోవడానికి, గృహారంభాలకు శుభప్రదం.

**అధోముఖ నక్షత్రాలు**

**భరణి, కృత్తిక, ఆశ్రేష, మఘ, పూర్వఫల్గుని, విశాఖ, మూల, పూర్వాషాఢ, పూర్వాభాద్ర :-** వాపి(కోనేరు), కూప(బావి), తటాకాదు(చెఱువులు)లకు శుభం. నిధినిక్షేపాలు దాచటానికి, ప్రవేశానికి, గణితానికి మంచివి.

**సమస్త కార్యాలకు శుభనక్షత్రాలు**

అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, మఘ, ఉత్తర ఫల్గుని, హస్త, చిత్ర, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శ్రవణం, ఉత్తరాభాద్ర, రేవతి ఈ నక్షత్రాలలో సమస్త శుభకార్యాలు చేయడం శుభం.

**నక్షత్రాలకు క్షిప్రాది సంజ్ఞలు**

**క్షిప్ర :** అశ్విని, హస్త ఇవి శీఘ్రంగా ఫలితాలనిస్తాయి. శిలలు, శాస్త్ర జ్ఞానం, అలంకారం, నృత్యాది చతుష్షష్టి (64) కళలకు మంచివి. గురువారం ప్రశస్తం.

**దారుణ:** మూల, ఆర్ద్ర, జ్యేష్ఠ, ఆశ్రేష భయాన్ని కలుగు చేస్తాయి. దారుణ నామధేయాలు, హింసకు సంబంధించిన కర్మ, భయంకరకృత్యాలు, విద్వేష, పశువుల శిక్షణాదులకు శనివారం ప్రశస్తం.

**మృదు:** చిత్ర, రేవతి, మృగశిర, అనూరాధ – వస్త్ర, క్రీడా, మిత్ర కృత్యాదులకు మంచివి. శుక్రవారం ప్రశస్తం.

**స్థిర(ధ్రువ):** రోహిణి, ఉత్తరఫల్గుని, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర – బీజావాపన, గృహారంభ, శాంతి, ఉద్యాపన ప్రతిష్ఠాదులకు మంచివి. ఆదివారం ప్రశస్తం.

**ఉగ్ర :** భరణి, మఘ, పూర్వఫల్గుని, పూర్వాషాఢ, పూర్వాభాద్ర – మారణ, అగ్ని, కర్మలు, కపట కృత్యాలు, శస్త్ర, ఉగ్రాది కర్మలకు మంచిది. మంగళవారం ప్రశస్తం.

**చర :** స్వాతి, పునర్వసు, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం- గజ, అశ్వాది ఆరోహణాలకు, తోటలు, యాత్రాదులకు మంచిది. సోమవారం ప్రశస్తం.

**యోగాలు – ఉపయోగాలు**

**విష్కంభ :** అధిపతి యముడు. చౌలం, విత్తులు నాటడం, కఱ్ఱపని (వడ్రంగం), శత్రువులను వెళ్ళగొట్టడం మొదలగు పనులకు మంచిది.

**ప్రీతి :** అధిపతి విష్ణువు. స్నేహం, అలంకరణ, ధారణ, భూక్రయం, రాజవశ్యం, ఉత్సాహ కార్యాలు.

**ఆయుష్మాన్:** అధిపతి ధాత. నూతన వస్త్రధారణ, అలంకరణ, సౌభాగ్య కర్మలు.

**సౌభాగ్య :** అధిపతి ధాత. నూతన వస్త్రధారణ, అలంకరణ, సౌభాగ్య కర్మలు.

**శోభన :** అధిపతి జీవుడు. పదవీ స్వీకారం, వివాహం, దానాలు, ఆయుర్వృద్ధికర్మలు, భూ, స్థలక్రయం.

**అతిగండ :** అధిపతి చంద్రుడు. యుద్ధం, నిగ్రహం, వధ, బంధనం, వృక్షచ్ఛేదనం, వంచన క్రియలు, క్షుద్ర క్రియలు.

**సుకర్మ :** అధిపతి ఇంద్రుడు, చిత్రలేఖనం, గృహారంభం, పట్టాభిషేకం, భూమి కొనడం, మంగళకార్యాలు.

**ధృతి :** అధిపతి తోయం. దేవాలయం, గృహనిర్మాణం, ప్రాకారం, తోరణాది నిర్మాణాలు.

**శూల :** అధిపతి అహిః. క్రూర, మారణ, దహన, శత్రు సంహారక క్రియలు, బంధన, అవమాన క్రియలు.

**గండ :** అధిపతి సూర్యుడు. వివాహం, తటాకం, ధనగ్రహణం, సేతు బంధనం, విత్తులు చల్లడం, వస్త్ర ధారణలు.

**వృద్ధి :** అధిపతి రవిః. భూ సంపాదన, వివాహాదులు, శుభ కర్మలు, ఆయుష్కర్మలు.

**ధ్రువ :** అధిపతి భూమి. వస్త్ర, రత్నధారణ, గృహారంభం, తటాక, సేతుబంధన, అలంకరణలు.

**వ్యాఘాత :** అధిపతి మరుత్తు. బంధన, రోదన, ఘాతన, ఛేదన, క్రూరకర్మలు.

**హర్ష :** అధిపతి రుద్రుడు. వివాహాదులు, శుభకర్మలు, భూ సంపాదన, ఆయుష్కర్మలు, వాహనారోహణం, వస్త్ర ధారణ.

**వజ్ర :** అధిపతి తోయపః. సౌమ్యకర్మలు, ఆయుధ ధారణ.

**సిద్ధి :** అధిపతి గణేశుడు. ఉంగరాలు, హస్తాభరణాలు, కంఠాభరణాలు.

**వ్యతీపాత :** అధిపతి రుద్రుడు. శుభకర్మలు చేయరాదు. శ్రాద్ధ క్రియలు, దానాలు, ఉచ్చాటన, విషహరణ క్రియలు చేయవచ్చు.

**వరీయాన్ :** అధిపతి ధనదుడు. ఆభరణ ధారణ.

**పరిఘ :** అధిపతి త్వష్ట. బంధనం, భేదనం, క్రూరకర్మలు.

**శివ :** అధిపతి మిత్రుడు. పుష్పమాలలు, అలంకారాలు ధరించవచ్చు.

**సిద్ధ :** అధిపతి షణ్ముఖుడు. దేవతా ప్రతిష్ఠలు, గృహారంభం. నగర, ప్రాకార, తోరణాది నిర్మాణాలు.

**సాధ్య :** అధిపతి సావిత్రి. దేవ గురుపూజ, సరస్వతీ పూజ, మంత్రదీక్ష.

**శుభ :** అధిపతి కమల. గృహారంభ, ప్రవేశాలు, విత్తనాలు, నాటడం, రత్నధారణ, భూమిని కొనడం, ధనధాన్య సంగ్రహం.

**శుక్ల :** అధిపతి గౌరి. కన్యాదానం, భూషణం, లేపనం.

**బ్రహ్మ :** అధిపతి పితరులు. గ్రహశాంతులు, రోగశాంతులు, ఉపనయనం, చౌలం, క్షౌరం.

**ఐంద్ర :** అధిపతి అదితి. గజారోహణ, కావ్య నాటక గాన విద్యలు నేర్పడం.

**వైధృతి :** హింసించడం, ఇతర రాష్ట్ర వంచన, క్రూరకర్మలు.

**కరణాలలో చేయదగిన కార్యాలు**

**బవ :** చరకరణం. అధిపతి ఇంద్రుడు. ఇందులో శుభ కార్యలు, ధర్మకార్యాలు, పుష్టిని కలిగించే పనులు, వాణిజ్య, పశు సంబంధమైన, ధాన్య సంబంధమైన పనులు, శ్రౌతస్మార్తాది కర్మలు చేయవచ్చు.

**బాలవ :** చరకరణం. అధిపతి బ్రహ్మ. ధర్మకార్యాలు, స్నేహం, మంగళ కృత్యాలు, ఉత్సవాలు, అన్నప్రాశనాదులు, వాస్తుక్రియలు, రాజ్యాభిషేకాలు, యుద్ధక్రియలు చేయవచ్చు.

**కౌలవ :** చరకరణం. అధిపతి మిత్రుడు. కన్యావరణము (కన్యా నిర్ణయమునకు) శుభ కార్యాలు, స్నేహం, బాలవకు చెప్పినవి, ఏనుగులు, ఒంటెలు, గుఱ్ఱాలకు సంబంధించిన పనులు, ఉపనయనం, అడవులను పెంచడం.

**తైతిల :** చరకరణం. అధిపతి అర్యముడు. ముఖ్యులతో కలవడం, గృహసంబంధ కృత్యాలు, తోటలు, విగ్రహాలు, క్రయవిక్రయాలు, యాత్ర, బావులు, చెఱువులు.

**గరజి :** చరకరణం. అధిపతి భూమి. కృషి, బీజావాపనం, ప్రాకారాలు కట్టడం, వ్యవసాయపు పనులు, జల సంబంధ క్రియలు.

**వణిక్ :** చరకరణం. అధిపతి లక్ష్మి. వ్యాపారాలు, స్థిర కార్యాలు, ధాతుక్రియలు.

**భద్ర :** చరకరణం. అధిపతి యముడు. అశుభ కార్యాలు, మంత్ర, శత్రునాశనానికి, వధ, బంధన, అగ్ని, భేదన, ఉచ్చాటన నిర్వర్తించవచ్చు. శుభకర్మలు చేయరాదు.

**శకుని :** స్థిరకరణం. అధిపతి కలి. ఓషధులను గ్రహించడం, వ్యాధి నివారణ, ఔషధాలు తేవడం, నూరడం, మంత్రసాధన, మంత్ర ఉపదేశం, పౌష్టిక క్రియలు, ఔషధసేవ, గో సంబంధ క్రియలు.

**చతుష్పాత్ :** స్థిరకరణం. అధిపతి వృష(రాక్షసుడు). గో సంబంధ కార్యాలు, పితృదేవతలను గూర్చి బ్రాహ్మణులకు దానమివ్వడం, రాజ కార్యాలు.

**నాగవం :** స్థిరకరణం. అధిపతి ఫణి. దారుణ కర్మలు, అందరికి ద్వేషం కలిగించే ద్వేష కర్మలు.

**కింస్తుఘ్నం :** స్థిరకరణం. అధిపతి వాయువు. శుభకర్మలు, పుత్ర కామ్యాది యజ్ఞకర్మలు, శరీర పోషణ, వివాహాది మంగళకర కార్యాలు, సిద్ధి కార్యాలు.

**పంచక రహితము : (1)** ముహూర్త సమయమునకు గల తిథి వార నక్షత్ర లగ్న సంఖ్యలను కూడి ఆ మొత్తమును 9 చే భాగించగా మిగిలిన శేషము 1 మృత్యు పంచకము, 2 అగ్ని పంచకము, 4 రాజపంచకము, 6 చోరపంచకము, 8 రోగ పంచకము. ఈ ఐదును పరిహార్యములు. **(2)** పక్షాంతరమున కృష్ణపక్షమందలి ముహూర్తములకు తిథిని శుక్లపక్షాదిగా గణన చేయవచ్చును. మతాంతరానుసారముగా గత తిథిని, లగ్న సంఖ్యను కలిపిన మొత్తమును 9చే భాగించగా వచ్చిన శేషమును అనుసరించి పై విధముగా పంచకమును నిర్ణయింపవచ్చును. ఈ పద్ధతి యందును కృష్ణపక్షమందలి ముహూర్తములకు తిథిని శుక్ల పక్షాదిగా గణన చేయవచ్చును. **(3) ధ్రువకరీత్యా పంచక రహితము :-** మేషమునకు4, వృషభమునకు 5, మిథునమునకు 6, కర్కాటమునకు 5, సింహమునకు 4, కన్యకు 3, తులకు 2, వృశ్చికమునకు 1, ధనస్సుకు 0, మకరమునకు 1, కుంభమునకు 2, మీనమునకు 3. ఈ ప్రకారముగా ధ్రువక సంఖ్యను చేర్చి రహితము చేయవలెను.

**గమనే కృషి వాణిజ్యే తటాకే ధన నిక్షిపే ।**
**శివలింగ ప్రతిష్ఠాయాం రహితం ధ్రువకాన్వితమ్ ॥**

ప్రయాణమునకు, వ్యవసాయమునకు, వ్యాపారమునకు, చెరువులు త్రవ్వించుటకు, ధనము దాచుటకు, శివలింగ ప్రతిష్ఠాదులకు ధ్రువక యుక్తముగా రహితము చేయవలెను.

**తారాబలము :** జన్మ నక్షత్రము నుండి నిత్య నక్షత్రము వరకు గణన చేసి 9 చే భాగించగా శేషము 1. జన్మతార,2. సంపత్తార, 3. విపత్తార, 4 క్షేమతార, 5 ప్రత్యక్తార, 6 సాధనతార, 7 నైధనతార, 8 మిత్రతార, 9 పరమ మిత్రతార అగును. 2,4,6,8,9 తారలు శుభప్రదములు. 1,3,5,7 తారలు అశుభ ప్రదములు. జన్మతార యందు 3వ పాదము, విపత్తార యందు 1వ పాదము, ప్రత్యక్తారయందు 4వ పాదము నైధన తారయందు 2వ పాదము అశుభకరములు. కావున ఈ పాదములను కాక మిగిలిన వాటిని దానపూర్వకముగ గ్రహించవచ్చును.

జన్మతారకు తోటకూర, విపత్తారకు బెల్లము, ప్రత్యక్తారకు లవణము, నైధన తారకు నువ్వులతో గూడిన సువర్ణమును దానము చేసిన నిషిద్ధ వ్యతిరిక్త పాదములు శుభకరములగును. జన్మతార ప్రథమ నవకమందును, విపత్తార ద్వితీయ నవక మందును, ప్రత్యక్తార తృతీయ నవకమందును, నైధన తార 3 నవకములందును నిషిద్ధమని మఱియొక మతము.

**తారా ఫలితములు**

**1. జన్మతార :-** దేహపీడ, కార్యహాని, చికాకులు, అధికశ్రమ, ఆటంకాలు.

**2. సంపత్తార :-** ఆర్థిక సదుపాయం, బాకీల వసూలు, ఋణ సౌకర్యం, ఋణతీర్మాణం, బ్యాంకు వ్యవహారాలు, కొనుగోళ్ళు, వ్యాపార వ్యవహార లాభం, వస్తుప్రాప్తి, సౌఖ్యం, మనోవికాసం, ప్రయోజనసిద్ధి.

**3. విపత్తార :-** ఆపద, అపాయం, గాయాలు, శ్రమ, నిర్బంధం, అనారోగ్యం, ఆందోళన, భయం, ఆటంకం, నష్టం, అవమానం, చిక్కులు, కష్టాలు, ప్రమాదాలు.

**4. క్షేమ తార :-** ఆరోగ్యం, సౌకర్యం, రక్షణ, భద్రత, ప్రయాణం, కష్ట విమోచనం, కార్యానుకూలత, శ్రేయోభిలాషుల సహకారం, నిరపాయ స్థితి, శుభకార్యం, నూతన కార్యారంభం.

**5. ప్రత్యక్ తార :-** ఆశాభంగం, విపరీతాలు, దుఃఖం, నిరాశ, కార్యభంగం, ఆటంకాలు, ఓటమి, అవమానం, నష్టం, కష్టం, మనోవ్యాకులత.

**6. సాధన తార :-** కార్య సాధన, ప్రయోజన సిద్ధి, ఆశయ సాఫల్యం, ఇష్ట వస్తు ప్రాప్తి, ద్రవ్య సదుపాయం, గుర్తింపు, రాణింపు, శ్రమకు ప్రతిఫలం.

**7. నైధన తార :-** విరోధం, కలహం, వివాదాలు, పోటీలు, శత్రుభయం, ఒత్తిడి, వ్యతిరేకత, అవమానం, పరాజయం, పెద్దల విముఖత, వంచన, శోకం, అపాయం, ప్రమాదాలు.

**8,9. మిత్ర పరమ మిత్ర తారలు :-** పరిచయ లాభం, మిత్ర సహకారం, పెద్దల సుముఖత, శుభకార్యం, విందు వినోదాలు, వ్యక్తిత్వ వికాసం, సమర్థతకు రాణింపు, అనుకూల పరిణామాలు, పలుకుబడి, ఆనందం, సదుపాయాలు కార్యసిద్ధి, లాభం.

జన్మతార యందు గం॥ 02:48 ని॥లు, విపత్తారయందు గం॥ 01:12 ని॥లు, ప్రత్యక్, నైధన తారలందు గం॥ 03:12 ని॥లు విడువవలెనని కొందరి మతము. చంద్రుడు జన్మ, పరమ మిత్ర తారలందు గాక విపత్ప్రత్యక్తారలందు స్వోచ్చ స్వగతుడైన సర్వ కర్మలయందు శుభప్రదుడని కొందరి అభిప్రాయము.

**చంద్రబలము :** జన్మరాశి నుండి చంద్రుడున్న రాశి వరకు గణన చేయగా 1,3,6,7,10,11 రాశుల యందు చంద్రుడున్న ధనలాభము, కార్యసిద్ధి, శుభమును ఇచ్చును. మిగిలిన రాశుల యందు కార్యవిఘ్నము కలిగించును. శుక్లపక్షమున 2,5,9 రాశుల యందును, కృష్ణ పక్షమున 4,8,12 రాశులయందును నున్న చంద్రుడు తల్లి కుమారుని రక్షించునట్లు రక్షించునని కొందఱు గ్రంథకర్తల అభిప్రాయము. శుక్లపక్షమున చంద్ర బలమును, కృష్ణపక్షమున తారా బలమును ముఖ్యముగా జూడవలెనని కొందఱి అభిప్రాయము.

# వాస్తు ప్రకరణము

ధీమంతుడు మొదట గ్రామార్వణమును పరిశీలించాలి అంటే తనకు ఏ గ్రామము లేక పట్టణము లేక నగరము అనుకూలిస్తుందో తెలుసుకోవాలి. తరువాత తన నివాసము కొరకు గృహనిర్మాణానికి తగిన దిశ, భూమి నక్షత్రాదికములను పరిశీలించవలసి వుంటుంది.

**గ్రామార్వణము :**

సంస్కృత భాషలోని అక్షరాలను 8 వర్గాలుగా విభజించవచ్చును. అవి అ వర్గము (12), క వర్గము (5), చ వర్గము (5), ట వర్గము (5), త వర్గము (5), ప వర్గము (5), య వర్గము (4), శ వర్గము (4).

**1వ పద్ధతి :-** అ క చ ట త ప య శ లు తూర్పు మొదలు 8 దిక్కులలో ఉంచవలెను. ఈ వర్గములకు వరుసగా గ్రద్ద, పిల్లి, సింహము, కుక్క, పాము, ఎలుక, లేడి, కుందేలు అధిపతులు. ప్రతి వర్గమునకు తననుంచి 5 వ వది శత్రువర్గము అవుతుంది.

| ఈశాన్యం | తూర్పు | ఆగ్నేయం |
|---|---|---|
| శ వర్గము కుందేలు | అ వర్గము గ్రద్ద | క వర్గము పిల్లి |
| ఉత్తరం — య వర్గము లేడి | | చ వర్గము సింహము — దక్షిణం |
| ప వర్గము ఎలుక | త వర్గము పాము | ట వర్గము కుక్క |
| వాయవ్యం | పడమర | నైరృతి |

**ఉదా:-** అ వర్గమునకు అధిపతి గ్రద్ద, అ వర్గమునకు 5వ వర్గము త వర్గము, త వర్గమునకు అధిపతి పాము, కావున పరస్పర శత్రుత్వము. ఈ పై వర్గచక్రము సులభ గ్రాహ్యము.

| | | | |
|---|---|---|---|
| అ వర్గము | – | అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఏ, ఐ, ఓ, ఔ | (12 అక్షరములు) |
| క వర్గము | – | క, ఖ, గ, ఘ, ఙ | (5 అక్షరములు) |
| చ వర్గము | – | చ, ఛ, జ, ఝ, ఞ | (5 అక్షరములు) |
| ట వర్గము | – | ట, ఠ, డ, ఢ, ణ | (5 అక్షరములు) |
| త వర్గము | – | త, థ, ద, ధ, న | (5 అక్షరములు) |
| ప వర్గము | – | ప, ఫ, బ, భ, మ | (5 అక్షరములు) |
| య వర్గము | – | య, ర, ల, వ | (4 అక్షరములు) |
| శ వర్గము | – | శ, ష, స, హ | (4 అక్షరములు) |

ఒక వ్యక్తి తన నామము యొక్క ప్రథమాక్షరము ఏ వర్గములోనిదో తెలిసికొని ఆ వర్గమునకు 5వ వర్గములోని అక్షరములతో ప్రారంభించు గ్రామములలో నివాసము చేయుట లాభకరము కాదు. **స్వవర్గాత్ పంచమో రిపుః రిపు వర్గం పరిత్యజ్య శేషవర్గాః శుభప్రదాః** – కావున 5వ వర్గమును వదిలి ఇతర వర్గాలలోని అక్షరములతో అరంభమయిన గ్రామములో నివాసము చేయవచ్చును.

**ఉదా:-** రాముడు అనే వ్యక్తికి హైదరాబాదునందు నివాసము అనుకూలిస్తుందా లేదా?

రా అనే అక్షరము య వర్గములోనిది. హై అనే అక్షరము శ వర్గములోనిది. య వర్గమునకు, శ వర్గము 5వది కాదు. కావున రామునకు హైదరాబాదు అనుకూలిస్తుంది. మరియు, **కేప్యాహూ రధవర్గాణాం స్వస్థానే శుభదం గృహమ్** – అనుట వలన స్వవర్గము గల గ్రామ నివాసము ఉత్తమమనుట మతాంతరము.

**2వ పద్ధతి :-** వ్యావహారిక నామరాశి నుండి 2,5,9,10,11 వ రాశులందున్న గ్రామములో నివసించుట ఉత్తమము. 1,3,4,7 వ రాశులలో గల గ్రామ నివాసము మధ్యమము, 6,8,12 రాశులలో గల గ్రామ నివాసము అధమము.

**ఉదా:** రాముని నామ రాశి తుల, హైదరాబాదు నామరాశి కర్కాటకము. తులకు హైదరాబాదు 10వ రాశి కావున హైదరాబాదు నివాసము ఉత్తమము.

**3వ పద్ధతి : – వాస్తురత్నావళి**

గ్రామ నక్షత్రమునుంచి నివాస కర్త యొక్క నక్షత్రము వరకు లెక్కించవలెను. ఈ సంఖ్య నరాకృతి చక్రములోని అవయవమునకు సంబంధించిన ఫలితము కలుగును.

| | | | |
|---|---|---|---|
| (1–5 నక్షత్రములు) | శిరస్సు | – | లాభము |
| (6–8 నక్షత్రములు) | ముఖము | – | ధననష్టము |
| (9–13 నక్షత్రములు) | కుక్షి | – | ధనలాభము |
| (14–19 నక్షత్రములు) | పాదము | – | స్త్రీ హాని |
| (20 వ నక్షత్రము) | పృష్ఠము | – | పాదహాని |
| (21–24 నక్షత్రములు) | నాభి | – | సంపద |
| (25 వ నక్షత్రము) | గుహ్యము | – | భయం |
| (26 వ నక్షత్రము) | దక్షిణ హస్తము | – | శోకం |
| (27 వ నక్షత్రము) | వామ హస్తము | – | భేదము |

**ఉదా:** నివాసకర్త యొక్క పేరు రాముడు. కావున నామ నక్షత్రము చిత్ర, గ్రామము, హైదరాబాదు. గ్రామముయొక్క నామ నక్షత్రము పుష్యమి. చిత్ర నుంచి పుష్యమి వరకు లెక్కించగా 22. ఈ సంఖ్య నాభిలో పడినది. కావున సంపద కలుగును. అంటే రామునకు హైదరాబాదు నివాసానికి అనుకూలమని తేలినది.

**4వ పద్ధతి :- కాలామృతము**

అకారమునుంచి గ్రామ నామము యొక్క మొదటి అక్షరము వరకు లెక్కించగా వచ్చిన సంఖ్యకు ఎడమవైపున, అకారమునుండి నివాసకర్త యొక్క నామ ప్రథమాక్షరము వరకూ లెక్కించగా వచ్చిన సంఖ్యను ఉంచాలి. ఈ విధముగా వచ్చిన సంఖ్యను 8చే భాగించగా శేష సంఖ్య ధన సంజ్ఞకమవుతుంది. మరల ఆ సంఖ్యలను తారుమారు చేసి, 8చే భాగిస్తే, శేష సంఖ్య ఋణ సంజ్ఞకమవుతుంది. ధన సంఖ్య ఋణ సంఖ్యకంటే ఎక్కువగా నుంటే ఆ గ్రామము నివాసానికి అనుకూలంగా వుంటుంది. **ఉదా:** హైదరాబాదులోని హై అను అక్షరపు సంఖ్య 45, (అ, అను అక్షరము మొదలు) నివాస కర్త రాముడు 'ర' యొక్క సంఖ్య 39, కావున ఈ సంఖ్యను 45కి ఎడమవైపు ఉంచితే వచ్చే సంఖ్య 3945, దీనిని 8 చే భాగిస్తే, శేషము 1. ఇది ధనము, ఇప్పుడు 45కి కుడివైపున 39 వుంచితే 4539 అవుతుంది. దీనిని 8 చే భాగిస్తే శేషము, 3 ఇది ఋణము. ధనము కన్న ఋణము ఎక్కువ.

**5వ పద్ధతి :- ముహూర్త చింతామణి**

ఇంతకు ముందు అ మొదలు హ వరకు గల అక్షరములు 8 వర్గములుగా విభజించబడినవి. గ్రామముయొక్క మొదటి అక్షరము, ఏ వర్గములోనిదో ఆవర్గ సంఖ్యకు, ఎడమవైపున నివాస కర్త యొక్క నామాక్షర వర్గసంఖ్య ఉంచి 9 చే భాగిస్తే ధనము. మరల తారుమారు చేసి 8చే భాగిస్తే ఋణము. ఋణముకంటే ధనము ఎక్కువగా వుంటే ఆ గ్రామము తనకు అనుకూలము.

**ఉదా :-** హైదరాబాదులోని 'హ' – శ వర్గములోనిది. శ వర్గ సంఖ్య 8. రాముడులో 'ర' య వర్గములోనిది. 'య' వర్గ సంఖ్య 7 కావున, 78ని 8 చే భాగిస్తే శేషం 6. ఇది ధనము. ఇప్పుడు తారుమారు చేయగా, 87. దీనిని 8 చే భాగిస్తే శేషము 7. ఇది ఋణము. ధనము కంటె ఋణము ఎక్కువ. కావున హైదరాబాదు రామునకు అనుకూలము కాదు.

**6వ పద్ధతి :- జ్యోతిర్నిబంధం**

నివాసకర్తయొక్క నామాక్షర వర్గసంఖ్యను ద్విగుణించి, గ్రామనామాక్షర వర్గ సంఖ్యను కలిపి, 8చే భాగిస్తే, శేషసంఖ్య నామకాకిణి అవుతుంది. గ్రామనామాక్షర

వర్గ సంఖ్యను ద్విగుణించి, నామాక్షర వర్గ సంఖ్యను కలిపి 8 చే భాగిస్తే, శేష సంఖ్య గ్రామకాకిణీ అవుతుంది. అధిక సంఖ్య ఋణీ అవుతుంది, అంటే ధన ప్రదమవుతుంది. కావున గ్రామకాకిణీ, నామకాకిణీ కంటే ఎక్కువగా ఉండుట మంచిది.

**ఉదా :** రాముని వర్గసంఖ్య 7, ద్విగుణీకరించగా, 14. దీనిని, హైదరాబాదు వర్గసంఖ్య 8ని కలిపి 8చే భాగిస్తే, శేషము 6. ఇది నామకాకిణి సంఖ్య. హైదరాబాదు వర్గ సంఖ్యయగు 8ని ద్విగుణీకరించగా 16 దీనికి రాముని వర్గసంఖ్య 7ను కలిపితే 23. దీనిని 23చే భాగిస్తే శేషము 7. ఇది గ్రామకాకిణి సంఖ్య. నామకాకిణి కంటె గ్రామకాకిణి ఎక్కువ కావున హైదరాబాదు రామునకు ధనమునిచ్చును.

**7వ పద్ధతి :-** అ మొదలు హ వరకు గల అక్షరములను 7 వర్గములుగ విభజించ వలెను. సప్తవర్గములకు సప్త గ్రహములు ఈ దిగువ తెలియదగును.

| | | | |
|---|---|---|---|
| అ వర్గము | - రవి | చ వర్గము | - కుజుడు |
| క వర్గము | - చంద్రుడు | ట వర్గము | - శుక్రుడు |
| త వర్గము | - బుధుడు | ప వర్గము | - గురువు |
| య వర్గము | - శని | - 8 అక్షరములు. | |

నివాసకర్త వర్గాధిపతి, గ్రామవర్గాధిపతి పరస్పరము మిత్రులయినను, ఏకాధిపతులైనను, ఆ గ్రామ నివాసము అనుకూలముగా నుండును. పరస్పరము సములయినచో మధ్యమము. అన్యోన్య శత్రువులయితే హానికరము. రాముని వర్గాధిపతి శని, హైదరాబాదు వర్గాధిపతి కూడ శని. కావున హైదరాబాదు రామునకు అనుకూలము.

**8వ పద్ధతి :** గ్రామనామాక్షర సంఖ్యను, 4చే గుణించి, నివాస కర్తయొక్క నామాక్షరము సంఖ్యను కలిపి, 7చే భాగిస్తే, 1,2,4,6 శేషములయితే లాభము, 3,5,7 శేషములయితే హాని కల్గును.

**దిగర్వణము :** తనకు ఏ గ్రామము, పట్టణము లేక నగరము అనుకూలిస్తుందో, తెలిసికొనిన తరువాత ఆ గ్రామము మధ్య బిందువు నుండి ఏ దిశలో గృహనిర్మాణము చేయవలెనో తెలిసికొనవలెను.

వృషభ, మిథున, సింహ, మకర రాశుల వారు గ్రామమధ్యన, మీన, వృశ్చిక, కన్యారాశుల వారు తూర్పున, కర్కాటక రాశివారు దక్షిణమున, ధనూరాశివారు పడమర, మేష, తులా, కుంభరాశి వారు ఉత్తరమున గృహనిర్మాణము చేసి నివసించరాదు.

**దిగ్దశ (వాస్తుప్రదీప) :** అకారాది 8 వర్గముల స్వరాంకములు వరుసగా 8, 5, 6, 4, 7, 1, 3, 2 వీటిని తూర్పు మొదలు 8 దిక్కుల స్వరాంకములుగ తెలిసికొనవలెను.

| | | | | | |
|---|---|---|---|---|---|
| అ వర్గము | తూర్పు | - 8 | క వర్గము | ఆగ్నేయము | - 5 |
| చ వర్గము | దక్షిణము | - 6 | ట వర్గము | నైఋతి | - 4 |
| త వర్గము | పడమర | - 7 | ప వర్గము | వాయవ్యము | - 1 |
| య వర్గము | ఉత్తరము | - 3 | శ వర్గము | ఈశాన్యము | - 2 |

గ్రామము యొక్క, నివాస కర్తయొక్క, దిశ యొక్క స్వరాంకములను కలిపి 9చే భాగించవలెను. శేషము 1 నుంచి 9 వరకు వరుసగా రవి, చంద్ర, కుజ, రాహు, గురు, శని, బుధ, కేతు, శుక్ర వింశోత్తరీ దశలు గృహనిర్మాణ సమయము నుంచి ప్రారంభమవుతాయి.

**ఉదా :** హైదరాబాదు శ వర్గములోనిది. శ వర్గము యొక్క స్వరాంకము 2, రాముడు నివాసకర్త. య వర్గము స్వరాంకము 3. ఉత్తరదిశ స్వరాంకము 3, అపుడు 2,3,3 కలిపితే 8. కావున 8వ దశ కేతు దశ 7 సంవత్సరములు గృహనిర్మాణ సమయము నుండి ప్రారంభమగును.

**దశాఫలితములు :** రవి దశ చిత్త చాంచల్యము. చంద్ర దశ ధనము, కుజ దశ భయవ్యాకులము, రాహు దశ జ్వరాదిపీడ, గురు దశ సౌఖ్యము, శని దశ రోగము, బుధ దశ సౌఖ్యము, కేతు దశ దుఃఖము, శుక్ర దశ సౌఖ్యము నిచ్చును. పైన చూపిన ఉదాహరణలో కేతుదశ 7 సంవత్సరములయిన తరువాత శుక్ర దశ 20 సంవత్సరములు సౌఖ్యము నిచ్చును.

**ప్రకారాన్తరము :** (వాస్తురాజవల్లభము) నివాస కర్తయొక్క నామాక్షర వర్గసంఖ్య, గ్రామము యొక్క నామాక్షర వర్గ సంఖ్య, దిశ యొక్క సంఖ్య ఈ మూడింటినీ కలిపి 9చే భాగిస్తే శేషము సూర్యాది వింశోత్తరీ దశను తెలుపును.

**ఉదా:** నివాసకర్త రాముడు కావున య వర్గము, య వర్గము 7వది. హైదరాబాదు శ వర్గములోనిది. శ వర్గము 8వ ది. దిశ ఉత్తరము కావున దిశ సంఖ్య 7. మొత్తము 22, 9చే భాగించగా శేషము 4 అంటే, రాహుదశ 18 సంవత్సరములు గృహనిర్మాణ సమయము నుండి ప్రారంభమగును.

**భూపరీక్ష :** గృహనిర్మాణము చేయుటకు, స్థలము పరీక్షించ వలసి యుంటుంది. మట్టి యొక్క రంగు, రుచి, వాసన, స్పర్శ, శబ్దములను బట్టి స్థల నిర్ణయము చేయవచ్చును. తెలుపు లేక ఎరుపు రంగు గల మట్టి పుష్పములు సువాసన లేదా తేనె వాసన, మధురమయిన ధ్వనులు భూమినుండి వినబడుట ఇవి గల్గియుండిన స్థలము యోగ్యము. మద్య మాంసాదుల వాసన ఉండకూడదు. భూమిలోంచి భయంకర శబ్దములు వినబడకూడదు. మట్టి ఎక్కువగా కఠినముగా ఉండకూడదు. మట్టి ఎక్కువగా వేడిగాను, ఎక్కువ చల్లగాను ఉండకూడదు.

**స్థలపరీక్షలు :**

**1వ పద్ధతి : కాలామృతము** - పిడి తక్కువ మూరెడు పల్లమును త్రవ్వి యీ పల్లమును దాని మట్టిచే పూడ్చగా మన్ను తక్కువయితే కీడు కలుగచేయును. సరిపోతే సామాన్యఫలము. అధికమయితే ఉత్తమఫలము ఇస్తుంది. ఆ మట్టిని బయటకు తీసి సాయంకాలమున ఆ పళ్ళములో నిండా నీరుపోసి మరునాడు ఉదయమున చూడగా నీరు ఉంటే ఆ స్థలము శుభప్రదము, బురదుంటే దరిద్రము, దుమ్ముంటే మృతిని కలుగచేస్తుంది.

**2వ పద్ధతి : వాస్తురాజ వల్లభము** - గుంటనిండా నీరుపోసి, 100 అడుగుల దూరము వెళ్ళి వచ్చి చూస్తే నీరు సగానికి పైగా ఉంటే శ్రేష్ఠము, సగానికి తక్కువంటే మధ్యమ ఫలము, నాలుగోవంతు కన్న తక్కువుంటే అనిష్టప్రదము. స్థలము యొక్క లక్షణము తెలిసికొనుట తాను గృహనిర్మాణము చేయదలచిన స్థలముయొక్క జీవిత మృతాది లక్షణములను తెలిసికొనవలెను. దానికి పద్ధతులు -

**1వ పద్ధతి :** గ్రామ, నామ, దిశల యొక్క వర్గ సంఖ్యలను కలిపి 3 చే భాగిస్తే, శేషము 1 అయితే జీవిత, 2 అయితే మృతి, 3 అయితే శూన్యస్థలమగును. జీవిత స్థలము - శుభప్రదము.

**ఉదా:** గ్రామము హైదరాబాదు. కావున అది శ వర్గమునకు చెందినది. శ వర్గ సంఖ్య 8, నివాసకర్త రాముడు. కావున య వర్గము. య వర్గ సంఖ్య 7. ఉత్తరదిశలో నిర్మాణము దిశసంఖ్య 7. అప్పుడు 8,7,7 కలుపగా 22, 3చే భాగిస్తే శేషము 1.

కావున రాముడు ఇల్లు కట్టదలచిన స్థలము జీవిత లక్షణము కలది కావున ఉత్తమము.

**2వ పద్ధతి :** నివాస కర్త గ్రామ, దిశలయొక్క స్వరాంకమును కలిపి 3చే భాగిస్తే, శేషము 1 అయితే జాగరిత స్థలము, 2 అయితే సమ స్థలము, 3 అయితే రాక్షస స్థలము. రాక్షస స్థలము నింద్యము.

**ఉదా:** హైదరాబాదు శ వర్గమునకు చెందినది. శ వర్గము యొక్క స్వరాంకము 2, రాముడు య వర్గమునకు సంబంధించుటచే, య వర్గము యొక్క స్వరాంకము 3. దిశ ఉత్తరము, ఉత్తరము యొక్క స్వరాంకము 3. అపుడు, 2,3,3 కలిపితే 8, దీనిని 3చే భాగిస్తే శేషము 2 కావున సమస్థలము.

**3వ పద్ధతి :** గ్రామ, నామ, దిశల యొక్క స్వరాంకములను కలిపి వచ్చిన సంఖ్యకు 9 కలిపి ఈ మొత్తమును 7చే గుణించి 4చే భాగిస్తే శేషము 1 అయితే సౌఖ్యము, 2 అయితే సుప్తము, 3 అయితే మృతము, 4 అయితే శూన్యము.

**ఉదా:** హైదరాబాదు శ వర్గములోనిది. శ వర్గము యొక్క స్వరాంకము 2. రాముడు య వర్గమునకు సంబంధించుటచే య వర్గముయొక్క స్వరాంకము 3. దిశ ఉత్తరము. స్వరాంకము 3. అపుడు, 2,3,3 కలిపితే 8. ఆ 8కి 9 కలిపితే 17. 17ని 7చే

గుణిస్తే వచ్చినది 119. ఈ 119ని 4చే భాగిస్తే శేషము 3. కావున నింద్యము.

**4వ పద్ధతి :-** స్థలమందు జల్లిన సర్వబీజములు 3 రోజులలో మొలిస్తే ఆ స్థలము ఉత్తమము. 5 రోజులలో మొలిస్తే మధ్యమము. 7 రోజులలో మొలిస్తే అధమము. (సర్వ బీజములు - వడ్లు, పెసలు, గోధుమలు, ఆవాలు, నువ్వులు, యవలు మొదలగునవి.)

**శల్యోద్ధరణము :-** ఎముకలు, బూడిద, ఊక, బొగ్గులు, కట్టెలు, లోహ శకలములు మొదలగునవి శల్యములనబడును. స్థలము త్రవ్వి శల్యములను తీసివేయవలెను. **పురుషాధ స్థితం శల్యం న గృహే దోషదం భవేత్ -** అనగా పురుష ప్రమాణము లోతుకంటె ఎక్కువ లోతులో శల్యములు కలబడితే గృహనిర్మాణమునకు దోషప్రదములు కావు. పురుషప్రమాణము అంటే 120 అంగుళములు. 6 అడుగులని కొందరి అభిప్రాయము.

**శల్య విచారణ :-** అ క చ ట త ప య శ లను 8 అక్షరములు వరుసగా తూర్పు మొదలు ఈశాన్యము వరకు 8 దిక్కులు, హ ప య లు మధ్యను సూచించును.

| ఈశాన్యం | తూర్పు | ఆగ్నేయం | |
|---|---|---|---|
| శ వర్గము | అ వర్గము | క వర్గము | |
| ఉత్తరం: య వర్గము | హ ప య వర్గములు | చ వర్గము | దక్షిణం |
| ప వర్గము | త వర్గము | ట వర్గము | |
| వాయవ్యం | పడమర | నైరృతి | |

ప్రాశ్నికుడు ఉచ్చరించిన ప్రథమాక్షరమును బట్టి శల్యములు ఏ దిక్కులో నుండునో తెలిసికొనవచ్చును.

**ఉదా:** ప్రశ్న క అను అక్షరముతో మొదలయితే శల్యములు ఆగ్నేయమందు ఉండునని ఊహించవచ్చును. ప్రశ్న పైన చెప్పబడిన ఏ అక్షరముతోను ప్రారంభము కాకపోతే స్థల మందు శల్యములు లేవని చెప్పవచ్చును.

**తానున్న గృహములో శల్యములను తెలిసికొనుట:** మూడు సంవత్సరాలకొకసారి ఇంటిలో మరణము కలుగుతూ ఉంటే, తూర్పు భాగమున మనుష్య శల్యములు ఉండవచ్చును. ఆ ఇంటిలో నున్నవారికెవరికైన ఉద్యోగభంగము తత్సంబంధమైన కష్టములు కలిగితే ఆగ్నేయమున గాడిద ఎముకలు ఉండవచ్చును. గృహ యజమాని దీర్ఘవ్యాధితో బాధపడుతూ వుంటే, దక్షిణమున ఎముకలుండ వచ్చును. మృతశిశువులు కలుగుతూ వుంటే నైఋతిలో కుక్క ఎముకలు ఉండవచ్చును. కుటుంబములో ఎవరికైనను ఉన్మాదము కలిగితే పడమరన శిశుశల్యములు ఉండవచ్చును. గృహయజమాని 12 సంవత్సరములలో సంపత్తు క్రమముగా కోల్పోయినచో ఉత్తరమున మనిషి ఎముకలు ఉండవచ్చును. గృహ యజమాని దావాలతోను, శత్రువులతోను 12 సంవత్సరములుగా బాధపడుతూ వుంటే బొగ్గులు ఊక వాయవ్యమున ఉండవచ్చును. పశునష్టము కలుగుతూ ఉంటే ఈశాన్యమున పశుశల్యములు ఉండవచ్చును. వంశ క్షయము కలిగితే గృహ మధ్య భాగమున ఇనుపముక్కలు, ఎముకలు, బూడిద ఉండవచ్చును.

స్థలమును శుభ్రపరచడానికి త్రవ్వుతున్నపుడు బంగారము, ఇటుకలు, రాళ్ళు కనబడితే మంచిది. ఊక, ఎముకలు, గ్రుడ్లు, పాములు, చినిగిన గుడ్డ పీలికలు కనపడుట మంచిది కాదు. బొగ్గుముక్కలు కనిపిస్తే అగ్ని ప్రమాద సూచకము. దూది కనబడితే వ్యాధి సూచకము. గవ్వలు కనబడితే తరచు కలహములు కలుగుతాయి. కావున అటువంటి వాటిని తీసివేసి స్థలమందు తెల్లని మట్టితో చదును చేయవలెను. స్థలములు ఆకారమును బట్టి సాధారణముగా 10 రకములుగా చెప్పుకోవచ్చు. అవి త్రికోణము, చతురస్రము, వృత్తము, భద్రాసనము, చక్రము, విషమ బాహువు, వ్యజనము, త్రికోణము, కూర్మపృష్ఠము, ధనుస్సు. వీటిలో చతురస్ర మరియు ఆయత అనగా దీర్ఘచతురస్ర స్థలములు గృహనిర్మాణానికి ప్రశస్తములు.

అన్ని దేశములకును ధ్రువస్థానము ఉత్తరమున ఉండుటచే దిక్సూచి యంత్రముచే ముందుగా ఉత్తరదిశను తెలిసికొనినచో, ఇతర దిశలను సులభముగా తెలిసికొనవచ్చును. చతురస్ర, దీర్ఘచతురస్ర స్థలములు శ్రేష్ఠములు అయినను, మినప గింజ ప్రమాణమైనను ఈశాన్యము పెరిగియుంటే మంచిది. ఆగ్నేయము వడ్లగింజ ప్రమాణము పెరిగినను శుభావహము కాదు. ఈశాన్యము ఎంత పెరిగితే అంత మంచిది అనుట ఆధునికుల అభిప్రాయము కాని ఇది విషమబాహు స్థలము అవుతుంది.

**స్థలము - వీధులు :**

**1. తూర్పు స్థలము :** తూర్పున వీధియుంటే తూర్పు స్థలమంటారు. లేక తూర్పు ఉత్తర దక్షిణములందు వీధులున్నను తూర్పు స్థలమవుతుంది. ఇట్టి స్థలములో తూర్పున సింహద్వారము గల గృహము ప్రశస్తము.

**2. ఆగ్నేయ స్థలము :** తూర్పు దక్షిణములందు వీధులుంటే ఆగ్నేయ స్థలమవుతుంది. సింహద్వారము తూర్పున ఉండటం ప్రశస్తము. నిర్మాణానన్తరము దక్షిణమున తక్కువ స్థలము తూర్పున ఎక్కువ స్థలము ఉండటం శ్రేష్ఠము.

**3. దక్షిణ స్థలము :** దక్షిణమున వీధియున్నను లేక దక్షిణ తూర్పు పడమరలయందు వీధులున్నను దక్షిణ స్థలమవుతుంది. సింహద్వారము దక్షిణమున ఉండవచ్చును.

**4. నైఋతి స్థలము :** దక్షిణ పడమరలయందు వీధులుంటే నైఋతి స్థలమవుతుంది. సింహద్వారము పడమర ఉంటే ప్రశస్తము.

**5. పశ్చిమ స్థలము :** పడమరన వీధి లేక దక్షిణ ఉత్తరములందు వీధులున్నను పశ్చిమ స్థలము అవుతుంది. సింహద్వారము పడమరన ఉంటే ప్రశస్తము.

**6. వాయవ్య స్థలము :** ఉత్తర పడమరలందు వీధులుంటే వాయువ్య స్థలమవుతుంది. సింహద్వారము పడమరన ప్రశస్తము. తూర్పు ఉత్తరములందు స్థలము ఎక్కువ వదలవలెను.

**7. ఉత్తర స్థలము :** ఉత్తరమున గాని లేక ఉత్తర తూర్పు పడమరలందు వీధులున్నను, ఉత్తర స్థలమవుతుంది. సింహ ద్వారము ఉత్తరమున ప్రశస్తము.

**8. ఈశాన్య స్థలము :** ఉత్తర తూర్పులందు వీధులుంటే ఈశాన్యపు స్థలమవుతుంది. సింహద్వారము తూర్పున ఉంచి ఎక్కువ స్థలమును ఉత్తరమున వదలవలెను. ఉత్తరమున సింహద్వారముంటే తూర్పున ఎక్కువ స్థలమును వదలవలెను.

**స్థలముల ఎత్తు పల్లములు :** తూర్పు ఈశాన్య ఉత్తర భాగములందు, పల్లముగా నుండుట, ఆగ్నేయ, దక్షిణ, నైఋతి, పడమర వాయవ్య భాగములందు మెరకగా నుండుట మంచిది.

**1. సుపథ వాస్తు :** దక్షిణ ఆగ్నేయముల మధ్య మెరకగా నుండి వాయువ్య ఉత్తరముల మధ్య పల్లముగా ఉంటే సుపథ వాస్తు అని చెప్పబడుతుంది.

**2. దీర్ఘాయుర్వాస్తు :** ఉత్తర ఈశాన్యముల మధ్య పల్లము, నైఋతి దక్షిణముల మధ్య మెరకగాను ఉంటే దీర్ఘాయుర్వాస్తు అనబడుతుంది. ఇది వంశాభివృద్ధి ప్రదము.

**3. పుణ్యక వాస్తు :** ఉత్తర ఈశాన్యముల మధ్య పల్లము, నైఋతి పశ్చిమముల మధ్య మెరకగాను ఉంటే పుణ్యకవాస్తు అనబడుతుంది. ఇది ద్విజులకు అనగా బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులకు శుభప్రదము.

**4. గజపృష్ఠ స్థలము :** దక్షిణ, పడమర, నైఋతి, వాయవ్యములందు మెరకగా నుండు స్థలము గజపృష్ఠ స్థలము అనబడు తుంది. దీర్ఘాయురారోగ్యములను ఇచ్చును.

**5. కూర్మపృష్ఠ స్థలము :** మధ్య భాగమందు మెరకగా నుండిన, కూర్మపృష్ఠ స్థలము అనబడుతుంది. సుఖసంతోషములనిచ్చును.

**6. దైత్యపృష్ఠ స్థలము :** పడమర పల్లము, తూర్పు ఆగ్నేయ ఈశాన్యములు మెరకగా నుండుట దైత్యపృష్ఠ స్థలమనబడును. ధన, పుత్ర, పశు హాని.

**7. నాగపృష్ఠ స్థలము :** తూర్పు పడమరలు పొడవు, దక్షిణోత్తరములు మెరక ఉన్న స్థలమును నాగపృష్ఠ స్థలము అంటారు. మృత్యు భయము, శత్రుభయము.

**పల్లములున్న స్థలములు :**

**1. గోవీధి స్థలము :** తూర్పున పల్లముగా ఉంటుంది. ఇది పశుసంపదను ఇస్తుంది.

**2. ధాన్యవీధి స్థలము :** వాయవ్యమున పల్లముగా ఉంటుంది. ఇది ధాన్య సంపదను ఇస్తుంది.

**3. గజవీధి స్థలము :** ఉత్తరమున పల్లముగా ఉంటుంది. ఇది సంపదనిస్తుంది.

**4. ధనవీధి స్థలము :** ఈశాన్యమున పల్లముగా ఉంటుంది. సుఖసంపదలనిస్తుంది.

**5. వహ్నివీధి స్థలము :** ఆగ్నేయమున పల్లముగా ఉంటుంది. రోగ భయము కలుగజేస్తుంది.

**6. ప్రేతవీధి స్థలము :** దక్షిణమున పల్లముగా ఉంటుంది. రోగభయము కలుగజేస్తుంది.

**7. నాగవీధి స్థలము :** నైర్‌బుతి పల్లముగా ఉంటుంది. సర్పబాధ కలుగుతుంది.

**8. జలవీధి స్థలము :** పడమర పల్లముగా ఉంటుంది. ఎప్పుడూ డబ్బు కొరత ఏర్పడుతుంది.

**అశుభ వాస్తు స్థలములు :**

**1. పితామహ వాస్తు :** తూర్పు, ఆగ్నేయములందు మెరక, పడమర వాయవ్యములందు పల్లము. శుభప్రదము కాదు.

**2. అపథ వాస్తు :** తూర్పు, ఆగ్నేయములందు పల్లము, పడమర వాయవ్యములందు మెరక. కలహములు కల్గును.

**3. రోగకృద్వాస్తు :** దక్షిణ, ఆగ్నేయములందు పల్లము, వాయువ్య ఉత్తరములందు మెరక. రోగభయము.

**4. అర్గళ వాస్తు :** దక్షిణ, ఆగ్నేయములందు పల్లము, ఉత్తర ఈశాన్యములందు మెరక. బ్రహ్మహత్యాదోషము కలుగును.

**5. శ్మశాన వాస్తు :** తూర్పు, ఈశాన్యములందు మెరక, పడమర నైర్‌బుతి లందు పల్లము. కులక్షయము.

**6. శ్యేనక వాస్తు :** ఆగ్నేయమున పల్లము, నైర్‌బుతి వాయువ్య ఈశాన్యములందు మెరక. మృత్యుభయము.

**7. శ్వముఖ వాస్తు :** నైర్‌బుతిన పల్లము, ఈశాన్య ఆగ్నేయ పడమరలందు మెరక. దరిద్రము కలుగజేయును.

**8. బ్రహ్మఘ్న వాస్తు :** నైర్‌బుతి ఆగ్నేయ ఈశాన్యములందు మెరక. తూర్పు వాయవ్యములందు పల్లము. అశుభప్రదము.

**9. స్థావర వాస్తు :** ఆగ్నేయమందు మెరక, నైర్‌బుతి వాయవ్య ఈశాన్యములందు పల్లము. కులనాశనము కలుగజేయును.

**10. స్థండిల వాస్తు :** నైర్‌బుతి యందు మెరక, ఆగ్నేయ వాయవ్య ఈశాన్యములందు పల్లము. నాశనము.

**11. శాండుల వాస్తు :** ఈశాన్యమందు మెరక, ఆగ్నేయ నైర్‌బుతి వాయవ్యములందు పల్లము. అశుభము.

**కొలమానము :** స్థలగృహాదులను కొలుచుటకు అంగుళహస్తముల గురించి గ్రంథములలో వివరింపబడిననూ, అంగుళహస్తముల నిర్వచనములో భిన్నాభిప్రాయములు, హస్తముల రకములలో బాహుళ్యము ఉన్నట్లు సర్వవిశదము (మయమతములో).

| | | | | | |
|---|---|---|---|---|---|
| 8 పరమాణువులు | = | 1 రేణువు | 8 రేణవులు | = | 1 వాలాగ్రము |
| 8 వాలాగ్రములు | = | 1 లీక్ష | 8 లీక్షలు | = | 1 యూక |
| 8 యూకలు | = | 1 యవ | 8 యవలు | = | 1 అంగుళము |

**అంగుళంతు భవేన్మాత్రం వితస్తిర్ద్వాదశాంగుళమ్** – అని చెప్పుటచే 12 అంగుళములు 1 వితస్తి, 2 వితస్తులు 1 హస్తము. అనగా 24 అంగుళములు. దీనిని కిష్కువంటారు. 24 అంగుళముల హస్తము ప్రాజాపత్యము. 20 అంగుళముల హస్తము ధనుర్ముష్టి. 27 అంగుళముల హస్తము ధనుర్గ్రహమంటారు. ఈ నాలుగు రకముల హస్తములలో ధనుర్ముష్టి వాస్తువులకుపయోగించాలి. మధ్యవ్రేలు యొక్క మధ్య పర్వము యొక్క విస్తారము ఎంత ఉండునో ఆ ప్రమాణము మాత్రాంగుళముగా చెప్పబడినది. సమరాంగణ మందు ప్రాశయ, సాధారణ, శయహస్తములు చెప్పబడినవి. వాస్తురాజ వల్లభమందు – ఉత్తమ గజము, మధ్యమ గజము, అధమ గజము అను 3 భేదములు చెప్పబడినవి. ప్రాసాదములకు మధ్యమ గజముచే కొలుచుకొనవలెను **"మధ్యేన హర్మ్యాదికం"**. 7 యవోదరములచే నిర్ణయింపబడినది మధ్యమగజము. బొటనవ్రేలు యొక్క చుట్టుకొలతలో సగము ప్రమాణము 1 అంగుళము. ఇట్టి 24 అంగుళములు 1 హస్తమని జ్యోతిర్నిబంధములో చెప్పబడింది.

శ్రీ విద్యామాధవీయములో – **బ్రహ్మక్షత్రేధనుస్తథా** – అని చెప్పుటవలన బ్రాహ్మణులకు, క్షత్రియులకు ధనువనెడి హస్తముతో కొలువవలెను. **"షట్ త్రింశత్ ధనురిత్యుక్తమ్"** అనుట వలన 36 అంగుళములు గల ధనువనెడి హస్తమని చెప్పబడినది. 36 అంగుళములు కల ధనుర్హస్తము బ్రాహ్మణ క్షత్రియులకు చెప్పబడుట వలన ధనుర్హస్తము అనగా 36 అంగుళముల గజముతో అన్ని వర్గముల వారు కొలత తీసికొనవచ్చును. ఇది సులభము.

**మేలనము:** వివాహ విషయంలో వధూవరులకు మేలపక విచారణ చేసినట్టు గృహ గృహాధిపతులకు విచారణ చేయవలెనని జ్యోతిర్నిబంధములో చెప్పబడినది. కాలామృత మందు కూడా – **దంపత్యోరపి యత్ఫలం పరిణయే కర్తుః గృహే తత్ఫలమ్** – అని చెప్పబడినది. ముహూర్త చింతామణిలో చెప్పబడిన అష్టవిధ కూటములతో గృహ యజమాని నక్షత్రమునకు ఏ నక్షత్రము గృహమునకు కుదురుతుందో విచారణ చేయవలెను. ఇచట గృహ నక్షత్రమంటే గృహనిర్మాణ సమయమున నుండు నక్షత్రము కాదని తెలియదగును. జ్యోతిర్నిబంధమున వాస్తు విషయమున నామరాశి ప్రధానత్వమే చెప్పబడినది **"దేశే గ్రామే యుద్ధే సేవాయాం వ్యవహారకే । నామరాశేః ప్రధానత్వం జన్మరాశిం న చింతయేత్"**. ఇచ్చట రాశి కల్పనము భిన్నముగా చెప్పబడినది. మేషమందు అశ్విని భరణి కృత్తిక, సింహమందు మఖ పుబ్బ ఉత్తర, ధనుస్సునందు మూల పూర్వాషాఢ ఉత్తరాషాఢ నక్షత్రములు కల్పించబడినవి. మిగిలిన రాశులలో, రెండేసి నక్షత్రములను కల్పించాలి. వృషభంలో రోహిణి మృగశిరలు, మిథునంలో ఆర్ద్ర పునర్వసులు, కర్కాటకములో పుష్యమి ఆశ్లేషలు, కన్యలో హస్త చిత్రలు, తులలో స్వాతి విశాఖలు, వృశ్చికములో అనూరాధ జ్యేష్ఠలు, మకరంలో శ్రవణ ధనిష్ఠలు, కుంభంలో శతభిష పూర్వాభాద్రలు, మీనంలో ఉత్తరాభాద్ర రేవతులు కల్పించబడినవి. ఇందుకు గర్గమహర్షి – **అశ్విన్యాది త్రయం మేషే సింహే ప్రోక్తం మఖాత్రయం । మూలాదిత్రితయం చాపే శేషభేషు ద్వయం ద్వయమ్** ॥ మరియొక విశేషము. వివాహ విషయంలో ఏకనాడీ నక్షత్రములు నింద్యములు. కాని వాస్తు విషయంలో, ఏకనాడీ నక్షత్రములు ప్రశస్తములు. **సేవ సేవకయో శ్చైవ గృహ తత్స్వామినో రపి । పరస్పరం మిత్రయోశ్చ హ్యేకనాడీ ప్రశస్యతే ॥**

**క్షేత్రఫల సాధనము :** పైన చెప్పబడిన ప్రకారము అష్ట కూటములను విచారించి, తన నామ నక్షత్రమునకు, అనుకూలమయిన గృహనక్షత్రమును నిర్ణయించుకొనవలెను. సామాన్యముగా ఆర్ద్ర పునర్వసు పుష్యమి ఆశ్లేష మఖ పుబ్బ శతభిషం పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర ఈ 9 నక్షత్రములును గృహనక్షత్రములుగ పనికి వస్తాయి. వీటిలో తమకు యోగ్యమైన నక్షత్రమును నిర్ణయించుకొనవచ్చును. మరియు తనకు ఇష్టమైన ఆయమును నిర్ణయించుకొనవలెను.

**ఆయములు 8 :** అవి 1. ధ్వజ, 2. ధూమ, 3. సింహ, 4. శునక, 5. వృషభ, 6. ఖర, 7. గజ, 8. కాక. వీటిలో ధ్వజాయము, సింహాయము, వృషభాయము, గజాయములు శుభప్రదములు.

క్షేత్రఫలమునకు గృహపిండమని, పదమని నామాంతరములు కలవు. పైన చెప్పబడినట్లుగా తన కిష్టమయిన గృహనక్షత్ర సంఖ్యలో 1 తీసివేసి, 152 చే గుణించవలెను. తన కిష్టమయిన ఆయ సంఖ్యలో 1తీసివేసి 81 చే గుణించవలెను. ఈ రెండింటి గుణఫలములు కలిపి, దీనికి 17 కలిపి, 216 చే భాగించగా, మిగిలిన శేషము క్షేత్రఫలము లేక పదము అవుతుంది.

ఉదా:– గృహ నిర్మాత ఆనంద్. నామ నక్షత్రము కృత్తిక. మేషరాశి. ఇష్ట నక్షత్రము మఖ. అశ్విని నుంచి మఖ 10వ నక్షత్రము.

కావున : 10–1=9, 9 × 152 = 1368.

ఇష్టమయిన ఆయము గజాయము. ఇది 7వ ఆయము. కాబట్టి,

7×1 = 7, 6 × 81 = 486.

1368 + 486 = 1854.

1854 + 17 = 1871

1871 ని 216 చే భాగిస్తే శేషము = 143.

అంటే, 143 హస్తములు గృహము యొక్క పదమవుతుంది. వెడల్పు 11 హస్తములు ఉంచితే పొడవు 13 హస్తములవుతుంది. (పదము = పొడవు×వెడల్పు) పదమును ప్రధాన గృహమునకు గాని, లేక గర్భమునకు గాని అవశ్యము సాధించవలెను. హస్తములనగా గజములు. వెడల్పుచే పదమును భాగించగా, శేషము మిగిలితే, 36 చే గుణించి, వెడల్పుచే భాగిస్తే అంగుళములగును. ఈ అంగుళాది నిక్షేపణ కేవలము పొడవునందే గాని వెడల్పునందు చేయరాదు. తూర్పు పడమరల కొలత కంటె నాలుగవ వంతైన అధికం దక్షిణోత్తరముల కొలత ఉండవలెను. దీనిని చంద్రవిద్ధ అంటారు. దీనికి వ్యత్యయము సూర్యవిద్ధ. ఇది శుభప్రదము కాదు.

**పూర్వపశ్చిమయోర్దీర్ఘం సపాదం దక్షిణోత్తరమ్ ।**
**శుభావహం చంద్రవిద్ధం సూర్యవిద్ధం న శోభనమ్ ॥**

**ఆయాది వర్గ సాధన :** వర్గులను సాధించు విషయములో కొందరు చతుర్దశ వర్గులను, కొందరు ఏకాదశ వర్గులను సాధిస్తారు. కాని కనీసము, షడ్వర్గులైన సాధించుట ఆవశ్యకమని వశిష్ఠ సంహిత యందు చెప్పబడినది.

1. ( పదము × 9 ) / 8 = ఆయము
2. ( పదము × 8 ) / 12 = ధనము
3. ( పదము × 3 ) / 8 = ఋణము
4. ( పదము × 9 ) / 7 = వారము
5. ( పదము × 8 ) / 27 = నక్షత్రము
6. ( పదము × 6 ) / 9 = అంశ

**1.** ఆయములలో ధ్వజ (1), సింహ (3), వృషభ (5), గజ (7) ఆయములు శుభప్రదములు. కావున ఆయ సాధనలో బేసి సంఖ్యలగు 1,3,5,7 శేషములు ప్రశస్తములు. 2,4,6,8 శేషములు అశుభప్రదములు. బ్రాహ్మణుని విషయములో సింహాయనమును త్యజించుట మంచిది.

**2.** ధనసంఖ్య ఋణసంఖ్య కంటే ఎక్కువ ఉండుట ప్రశస్తము.

**3.** ఋణసంఖ్య ధనసంఖ్య కంటె తక్కువ ఉండవలెను.

**4.** వారములో శని ఆది మంగళవారములు త్యాజ్యములు.

**5.** గృహనిర్మాత యొక్క నామ నక్షత్రమునుండి గృహ నక్షత్రము వరకు లెక్కించి 9చే భాగించగా శేషములు 1,2,4,6,8 యోగ్యములు. నామనక్షత్రము, గృహ నక్షత్రము ఒకటే అగుట, భిన్నరాశులయినపుడు మాత్రమే శుభప్రదముగాని రాశి ఒకటే అయినప్పుడు శుభప్రదము గాదని కొందరి అభిప్రాయము.

**రాశ్యైక్యే యం దోషః న తు భిన్నరాశిత్వే – పీయూషధారా.**

మరియు, గృహనక్షత్రములు ఉత్తమ మధ్యమ అధమములుగా విభజింపబడినవి.

**ఉత్తమ :** అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, హస్త, చిత్ర, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం.

**మధ్యమ :** ఆర్ద్ర, పునర్వసు, ఉత్తరఫల్గుని, జ్యేష్ఠ, ఉత్తరాభాద్ర, రేవతి.

**అధమ :** భరణి, కృత్తిక, ఆశ్లేష, మఘ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, స్వాతి, విశాఖ, మూల.

**6.** అంశ అనగా నవాంశ. శేషములు 1,4,5,6 నింద్యాంశలు. శేషములు 2, 3, 7, 8, 9 యోగ్యములు.

షడ్వర్గ సాధనకు ఉదాహరణము: ఇంతకుముందు ఉదాహరణములో సాధిత పదము (క్షేత్ర పదము) 143.

1. (143 × 9 ) / 8 = శేషము 7. అనగా గజాయము. ఇది ప్రశస్తము.
2. (143 × 8 ) / 12 = శేషము 4. ఇది ధనము.
3. (143 × 3 ) / 8 = శేషము 5. ఇది ఋణము.
4. (143 × 9 ) / 7 = శేషము 6. అనగా శుక్రవారము, మంచిది.
5. (143 × 8 ) / 27 = శేషము 10. 10వ నక్షత్రము మఘ. అధమ నక్షత్రము. కానీ తారాబలము కుదిరినది.
6. (143 × 6 ) / 9 = శేషము 3. ఇది ప్రశస్తము.

కావున 6 వర్గులలో ఆయ, వార, నక్షత్ర అంశలు ప్రశస్తములు. ఈ దిగువ పట్టికలో చతుర్దశ ఏకాదశ నవ వర్గులు సుబోధకములు.

| చతుర్దశవర్గు | | ఏకాదశవర్గు | నవవర్గు | షడ్వర్గు |
|---|---|---|---|---|
| | గృ – హా | | | |
| ఆయం | 9 – 8 | ఆయం | ఆయం | ఆయం |
| ఆయువు | 9 – 120 | ఆయువు | ఆయువు | |
| ధనం | 8 – 12 | ధనం | ధనం | ధనం |
| ఋణం | 3 – 8 | ఋణం | ఋణం | ఋణం |
| తిథి | 6 – 30 | తిథి | తిథి | |
| వారం | 9 – 7 | వారం | వారం | వారం |
| నక్షత్రం | 8 – 27 | నక్షత్రం | నక్షత్రం | నక్షత్రం |
| అంశ | 6 – 9 | అంశ | అంశ | అంశ |
| దిక్పతి | 9 – 8 | దిక్పతి | దిక్పతి | |
| యోగం | 4 – 27 | యోగం | | |
| కరణం | 5 – 11 | కరణం | | |
| భూతం | 3 – 5 | | | |
| కులం | 9 – 4 | | | |
| లగ్నం | 9 – 12 | | | |

ముహూర్తగణపతిలో తిథి విషయమున గుణకము 8 హారకము 15 అని చెప్పబడింది. మరియు, ఆయు ర్విషయములో గుణకము 8 అని చెప్పబడింది. కావున, ఈ రెండు అభిప్రాయములు కాలామృతాభిప్రాయానికి భేదించినవి.

**గమనిక :** సాధించిన గృహపిండము లేక పదముచే గృహ ప్రమాణము తక్కువగా ఉంటే దానికి 216 లేక 2 ని 216చే గుణించి, లేక 3 ని 216 చే గుణించటం, తన ఇచ్ఛానుసారము సాధిత గృహపిండమునకు కలిపితే, వాస్తవిక గృహపిండము లేక పదము అవుతుంది. ఇప్పుడు వెడల్పును కల్పించి పొడవును నిశ్చయించవలెను.

**ఆయుః షష్ట్యధికం శుభం గృహపతేః హీనంతు హానిప్రదం** – కాలామృతం.

ఆయుర్విషయమున ఆయుస్సంఖ్య 60 కంటె ఎక్కువ ఉండుట మంచిది. తక్కువ నింద్యము.

**రిక్త తిథులు :** అమావాస్య, శుక్ల పాడ్యమి, అనిష్టప్రదములు. తక్కినవి యోగ్యములు.

పైన చూపిన పట్టిక పరిశీలిస్తే ఆయ సంఖ్యకును దిక్పతి సంఖ్యకును భేదము లేదు. మరియు, ఆయ ఫలితములు దిక్పతి ఫలితములు సమానముగా చెప్పబడుట వలన ముహూర్త చింతామణిలో, 9వ వర్గు దిక్పతికి బదులు యోగము చెప్పబడినది. ఇక భూత విషయమున శేషం 1 భూతత్త్వము, 2 మిగిలితే జలతత్త్వము, 3 మిగిలితే అగ్నితత్త్వము, 4 మిగిలితే వాయుతత్త్వము, 5 మిగిలితే ఆకాశతత్త్వము. వీటిలో భూతత్త్వ, జలతత్త్వములు ప్రశస్తములు.

కుల విషయములో, శేషం 1 బ్రాహ్మణ, 2 క్షత్రియ, 3 వైశ్య, 4 శూద్ర. ఏ కులం వారికి ఆ కులసంఖ్య యోగ్యము. ఇక లగ్న విషయంలో పాపగ్రహాధిపత్య లగ్నములు నింద్యములు. ఈ దిగువ పట్టికలో 9 యోగ్య నక్షత్రములకు (మతాంతరము), ధ్వజ, సింహ, వృషభ, గజాయములకు సాధిత పదములు తెలియదగును.

ఈ క్రింద చూపిన పట్టికలో చూపబడిన పదములకు ద్విగుణీకృతాదులను చేసికొనవచ్చును.

**ధ్వజ సింహ వృషభ గజాయనముల పట్టిక**

| గృహనక్షత్రము | ధ్వజ | సింహ | వృషభ | గజ |
|---|---|---|---|---|
| ఆర్ద్ర | 129 | 75 | 21 | 183 |
| పునర్వసు | 65 | 11 | 173 | 119 |
| పుష్యమి | 1 | 163 | 109 | 55 |
| ఆశ్లేష | 153 | 99 | 45 | 207 |
| మఘ | 89 | 35 | 197 | 143 |
| పుబ్బ | 25 | 187 | 133 | 79 |
| శతభిషం | 57 | 3 | 165 | 111 |
| పూర్వాభాద్ర | 209 | 155 | 101 | 47 |
| ఉత్తరాభాద్ర | 145 | 91 | 37 | 199 |

**శంకు విన్యాసము**:- శంకువును తయారుచేయుటకు కావలసిన చెక్కకుపయోగించు వృక్షములు బిల్వ శమి దేవదారు మద్ది క్షీర వృషములు మొదలగునవి. **వితస్తి మాత్రం శంకు స్యాత్సర్వేషాం సర్వదా శుభం** - అను వశిష్ఠోక్తి ననుసరించి సర్వ వర్ణముల వారికి 12 అంగుళముల శంకువును వినియోగించవచ్చును.

**శంకు వృత్తం తదర్ధకమ్** అనగా శంకు ప్రమాణము సగటు చుట్టుకొలత యుండవలెను. ఈశాన్యమున శంకుస్థాపనము బహుసమ్మతమయియున్నది. సూత్రన్యాస శిలాన్యాస ప్రథమేష్టకాదులన్ని ఈశాన్యము నుండి ప్రారంభము చేయవలెను.

**సంప్రార్థ్య స్థాపయే ద్గేహే శంకుం వైఖిత్తి మధ్యమే ।**
**ప్రధాన సదనం వీక్ష్య శంకుం తత్రైవ విన్యసేత్ ॥**

అను ప్రామాణిక వచనముల బట్టి ప్రధాన గృహప్రదేశమందే శంకుస్థాపన చేయుట శాస్త్రీయము.

**ఏకాశీతిపద వాస్తు :** ప్రాసాదభవన గృహారంభ ప్రవేశాదుల యందు ఏకాశీతి పదవిన్యాస పూర్వకముగ వాస్తు పూజను చేసి, వాస్తుబలి, బ్రాహ్మణ భోజనం, బీదలకు అన్నదానం, మొదలగునవి జరుపవలెను. మత్స్యపురాణమందు చెప్పబడిన ప్రకారము ఏకాశీతి పదవిన్యాస చక్రము ఈ దిగువ చూడదగును. పడమర మొదలు తూర్పు వరకు పది రేఖలు దక్షిణము నుంచి ఉత్తరము వరకు 10 రేఖలును మొత్తం 20 రేఖలు వరుసగా శాన్తా, యశోవతీ, కాంతా, విశాలా, ప్రాణవాహినీ, సతీ, వసుమతీ, నందా, సుభద్రా, మనోరమా, మరిణీ, సుప్రభా, లక్ష్మీ, విభూతీ, విమలా, ప్రియా, జయా, జ్వాలా, విశోకా, ఇడా అను పేర్లతో వ్యవహరింపబడినవి.

**ఏకాశీతి పద విన్యాస చక్రము**

చరకి — తూర్పు — విదారి

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| 32 | 1 | | | | | | 2 | 10 |
| 31 | | 8 | | 1 | | 2 | | 11 |
| 30 | | | బ్ర | బ్ర | బ్ర | | | 12 |
| 29 | | 7 | బ్ర | బ్ర | బ్ర | 3 | | 13 |
| 28 | | | బ్ర | బ్ర | బ్ర | | | 14 |
| 27 | | 6 | | 5 | | 4 | | 15 |
| 26 | 4 | | | | | | 3 | 16 |
| 25 | 24 | 23 | 22 | 21 | 20 | 19 | 18 | 17 |

పాపరాక్షసి — పడమర — పూతన

పైన చూపబడిన పట్టికలో మధ్యభాగమున 9 గదులున్నవి. బ్ర అను అక్షరముతో చూపబడినవి. అధిష్ఠాన దేవత బ్రహ్మ, ఈ భాగము వాస్తు పురుషుని హృదయము. ఈ మధ్య భాగమునకు వాస్తు నామము గర్భము. ఈ భాగమునకైనను క్షేత్రఫలము లేక పదము అవశ్యము సాధించవలెను. తరువాత 16 గదులలో 8 అధిష్ఠాన దేవతలు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. ఆర్యము | - దక్షిణస్తనము | 2. సవిత | - అంగుళ్యాగ్రము |
| 3. వివస్వంతుడు | - దక్షిణ జఠరము | 4. విబుధ | - మేఢ్రం |
| 5. మిత్ర | - వామ జఠరం | 6. రాజయక్ష్మ | - అంగుళ్యాగ్రము |
| 7. పృథ్వీధర | - వామస్తనము | 8. అపవత్స | - వక్షస్థలము |

తరువాత 24 గదులలో నలుగురు అధిష్ఠాన దేవతలు.

| | | | |
|---|---|---|---|
| 1. ఆపః | - ముఖము | 2. సావిత్రి | - అంగులీమూలం |
| 3. ఇంద్ర | - మేఢ్రం | 4. రుద్ర | - అంగులీమూలం |

తరువాత 32 గదులు, 32 అధిష్ఠాన దేవతలు.

| | | | |
|---|---|---|---|
| 1. శిఖీ | - శిరస్సు | 2. పర్జన్య | - దక్షిణ నేత్రము |
| 3. జయన్త | - దక్షిణ కర్ణము | 4. ఇంద్ర | - దక్షిణ భుజము |
| 5. సూర్య | - దక్షిణ బాహువు | 6. సత్య | - బాహుమూలం |
| 7. భృశ | - బాహుమధ్యం | 8. ఆకాశ | - దక్షిణ కఫోణి |
| 9. వాయు | - ప్రకోష్ఠము | 10. పూషా | - దక్షిణ మణిబంధం |
| 11. వితథ | - దక్షిణ పార్శ్వం | 12. గృహర్క్షత | - దక్షిణ పార్శ్వం |
| 13. యమ | - దక్షిణ ఊరు | 14. గంధర్వ | - దక్షిణ జానూ |
| 15. భృంగరాజ | - దక్షిణ జంఘం | 16. మృగ | - దక్షిణ స్ఫిక్ |
| 17. పితృగణ | - పాదములు | 18. దౌవారిక | - వామస్ఫిక్ |
| 19. సుగ్రీవ | - వామ జంఘము | 20. పుష్పదంత | - వామజానూ |
| 21. జలాధిప | - వామ ఊరూ | 22. అసురః | - వామపార్శ్వం |
| 23. శోష | - వామపార్శ్వం | 24. పాప | - వామ మణిబంధం |
| 25. రోగ | - ప్రకోష్ఠము | 26. నాగ | - వామ కఫోణి |
| 27. ముఖ్య | - బాహుమధ్యము | 28. భల్లాట | - బాహుమూలం |
| 29. సోమ | - వామ బాహు | 30. సర్ప | - వామభుజము |
| 31. అదితి | - వామ కర్ణము | 32. దితి | - వామ నేత్రము |

పైన చూపిన 45 అంగాధిష్ఠాన దేవతలు గృహకర్త యొక్క అంగాధిష్ఠాన దేవతలగుదురు. గృహకర్త యొక్క ఏ అంగమందు దోషము కలుగునో, వాస్తు పురుషుని యొక్క ఆ అంగాధిష్ఠానదేవత బలహీనమైనదని తెలుసుకొని ఆ దేవతను పూజా, బలి, దానములతో సంతుష్టిపరచినచో క్షేమము కలుగును. వాస్తు పురుషుని కుడి భుజము బలహీనమయితే స్త్రీ దోషములు కలుగును, ఎడమ చెయ్యి బలహీనమైతే ధనధాన్య నష్టము కలుగును. శిరస్సు బలహీనమయితే అనారోగ్యము, పాదములు బలహీనమైతే స్త్రీ దోషములు, పుత్ర మరణము కలుగును. వాస్తుపురుషుని అన్ని అంగములు బలముగా నుండిన, ధనధాన్యాది సంపద కల్గుచుండును.

**షోడశ వేధలు :**

**01. అంధక :** సింహద్వారమునకు (ప్రధాన ద్వారము) ఇరువైపుల కిటికీలు లేక పోవుట అంధక వేధ. **అంధకే రోగమతులం స్యాత్** - అనగా యజమానికి తరచు రుగ్మత కలుగుతుంది.

**02. రుధిర :** ఏకాశీతి పదవాస్తు ననుసరించక, గృహము కట్టితే రుధిర వేధ. **రుధిరేతి సారజం భయం** - అతిసార వ్యాధి కలుగుతుంది.

**03. కుబ్జ :** గృహమునకు తగునట్లు ద్వారములు, కిటికీలు పొడవు వెడల్పులు నుండనట్లయిన కుబ్జవేధ. కుష్టు, క్షయ, ఉబ్బసము మొదలగు వ్యాధులు కలుగవచ్చును. **కుబ్జే కుష్ఠాది రోగం స్యాత్.**

**04. కాణ :** సింహద్వారమునకు ఒకవైపున మాత్రమే కిటికీ ఉంటే కాణ వేధ కలుగుతుంది. – **కాణేంధత్వం ప్రజాయతే** – అనునట్లు నేత్ర రోగము కలుగవచ్చును.

**05. బధిర :** గృహముయొక్క నేలమట్టమునకు దిగువ భాగములో సింహద్వారముంటే బధిర వేధ – **పృథ్వీద్వారే సర్వదుఃఖం మరణం చ జాయతే** – దుఃఖములు, మృతి కలుగును.

**06. దిగ్వక్ర :** గృహమునకు తగినట్లు గాక ద్వారములు కిటికీలు పెద్దవిగా నుండిన దిగ్వక్ర వేధ. **దిగ్వక్రే గర్భ నాశః స్యాత్** – సంతాన నష్టము కలుగుతుంది.

**07. చిపిట :** ఇంటి స్థలమునకు తగినట్లు గాక, తక్కువ ఎత్తుకల గృహమయితే చిపిట వేధ. **చిపిటే నీచ సంగతిః** – నీచులతో సాంగత్యము కలుగును.

**08. మురజ :** సింహద్వారమునకు ఏ పార్శ్వమైన ఎక్కువ ఎత్తు వుంటే మురజ వేధ. **మురజే చ కులక్షయః** – కులక్షయము కలుగుతుంది.

**09. వ్యంగ్య :** గృహము చూచుటకు అందహీనముగ, అసహ్యముగ నుండినచో వ్యంగ్య వేధ. **వ్యంగ్యే చ అంగతాహీనం** – అంగవైకల్యము కలుగును.

**10. కుటిల :** గృహ యజమాని ఎత్తు కంటే ఎత్తు తక్కువుంటే కుటిల వేధ. **కుటిలే చ గృహక్షయః** – వంశక్షయము కలుగును.

**11. కుట్టక :** గృహనిర్మాణమునకు స్థలము చదునుచేయకపోతే కుట్టకవేధ. పిశాచ బాధ కలుగును.

**12. సుప్త :** సూర్యుడున్న నక్షత్రము నుండి 5,7,9,12,19,26 వ నక్షత్రములందు క్రమముగా 4,8,5,3,6,7 ఘటికలలో గృహ నిర్మాణము ప్రారంభమయితే సుప్తవేధ. **సుప్తే గృహపతేః మృత్యుః** – మృత్యువు కలుగుతుంది.

**13. శంకపాలక :** స్తంభములు లేకుండా గృహనిర్మాణము జరిగితే శంకపాలక వేధ. అందు నివశించువారు కురూపులవుతారు.

**14. వికటి :** సింహద్వారము వికటముగాను, చాల పెద్దదిగాను ఉంటే వికట వేధ. **వికటే చ పతినాశనం** – గృహపతికి మృత్యువు.

**15. కంక :** విషమ సంఖ్యాక వసారాలు, అసమాన కొలతలును కలిగియున్న కంక వేధ. **కంకైశ్చూన్యం** – దారిద్ర్యముతో బాధపడును.

**16. కైకర :** చాల ఎత్తు, చాల విశాలము గల గృహము కైకర వేధ కలిగించును. గృహ యజమాని భార్యకు హాని కలుగును. **స్త్రీ హానిః కైకరే భవేత్.**

**ద్వారములు :**– కర్కాటక,వృశ్చిక,మీన రాశులవారికి సింహద్వారము తూర్పు దిక్కున ఉండుట మంచిది. కన్యా,మకర,వృషభ రాశులవారికి దక్షిణమున ఉండుట మంచిది. మిథున,తులా,కుంభ రాశులవారికి పడమరన ఉండుట మంచిది. మేష,సింహ,ధనుస్సు రాశులవారికి ఉత్తరమున ఉండుట మంచిది. ఇది బహుగ్రంథ సమ్మతం. ధ్వజాయము గల సింహద్వారము నాల్గుదిక్కులందును, సింహాయము గల సింహ ద్వారము పడమర వదిలి మిగిలిన దిక్కులందును, గజాయము గల సింహద్వారము తూర్పు, దక్షిణము లందును, వృషభాయము గల సింహద్వారము తూర్పునందును శుభప్రదమైనది.

**సింహేచ్చోత్తర దిగ్ద్వారం పశ్చిమాస్యం వివర్జయేత్** – అను విశ్వకర్మ ప్రకాశికా వాక్యమును బట్టి సింహాయము గల సింహద్వారము ఉత్తరమునందు కూడా శుభప్రదముగాదని తెలియదగును. బ్రాహ్మణులకు పశ్చిమ ద్వారము, క్షత్రియులకు ఉత్తర ద్వారము, వైశ్యులకు తూర్పు ద్వారము, శూద్రాదులకు దక్షిణ ద్వారము ప్రశస్తము.

**ప్రధాన ద్వారస్థాన నిర్ణయము :**

దక్షిణమున 5 భాగములు, ఉత్తరమున 3 భాగములను వదలగా మిగిలిన భాగములలో ప్రధానద్వారము నుంచవలెను. మధ్యభాగమునందు ద్వారము పనికి రాదు. ఇంటిలో ప్రవేశించునప్పుడు ఏ భాగము దక్షిణభాగమో, ఆ భాగమే దక్షిణము.

**విశతాం యథా భవనం భవన్తి తాన్యేవ దక్షిణతః**

ప్రధాన ద్వారము తప్ప మిగిలిన ద్వారములు సమాన ప్రమాణములో నుండవలెను. సింహద్వారమందు, కుంభ పత్ర ఫలాది గంగళ చిహ్నములను చిత్రించవలెను.

సామాన్యముగ శిల్పులు ఉలి లోపల ప్రమాణమును తీసుకొని సింహద్వార ప్రమాణమును, ఇతర ద్వార ప్రమాణములను ఈ క్రింది విధముగా గ్రహిస్తున్నారు.

1. సింహద్వారము పొడవు 73 అంగుళములు. వెడల్పు 37 అంగుళములు. ఇతర ద్వారములు పొడవు 69 అంగుళములు. వెడల్పు 33 అంగుళములు.
2. సింహద్వారము పొడవు 71 అంగుళములు, వెడల్పు 35 అంగుళములు. ఇతర ద్వారముల పొడవు 69 అంగుళములు. వెడల్పు 33 అంగుళములు.
3. సింహద్వారము పొడవు 67 అంగుళములు. వెడల్పు 31 అంగుళములు. ఇతర ద్వారముల పొడవు 66 అంగుళములు. వెడల్పు 30 అంగుళములు.

సమసంఖ్యగల ద్వారములుండవలెను. 10, 20, 30 మొదలగు సున్నలు గల సంఖ్య పనికి రాదు. కిటికీలు అలమారలు ఈ విధముగానే చూచుకొనవలయును. ద్వారం లేని దిశలలో కిటికీలు ఉంచవలెను. ఒక ద్వారము, మరియొక ద్వారమునకు గాని కిటికీగాని అభిముఖముగా నుండవలెను. రెండుకంటె ఎక్కువ ద్వారములు దూరదర్శన యంత్రములోవలె నుండకూడదు.

**ద్వారస్యోపరి యద్ద్వారం, ద్వారం ద్వారస్య సమ్ముఖమ్ ।**
**న కార్యం వ్యయదం యచ్చ సంకటం తద్దరిద్రకృత్ ॥**

ద్వారమునకు పైన ద్వారము, ద్వారమునకు సరిగా ఎదుటనున్న ద్వారము నింద్య మనుట వేరు వేరు ఆయములు గల అభిముఖ సింహద్వార విషయమని, జ్యోతిర్నిబంధ వాక్యోద్దేశముగా తెలియదగును. ద్వారములు మరీ పెద్దవి గాను, మరీ చిన్నవి గాను ఉండకూడదు. తలుపులు స్వయముగా తెరుచుకుంటున్నచో చిత్రభ్రమ కలుగుతుంది. స్వయముగా మూసుకుంటున్నచో కులనాశనము. లోపలకు వంగి యున్న ద్వారము యజమాని మృతిని కలిగించును. వెలుపలకు వంగిన ద్వారము పరదేశ ప్రవాసమును కలిగించును.

**మధ్యే ద్వారం న కర్తవ్యం మనుజానాం కదం చ న ।**
**మధ్యే ద్వారు కృతే తత్ర కులనాశః ప్రజాయతే ॥**

గర్భముయొక్క మధ్యరేఖలో సింహద్వారమధ్యమ ముందునట్లు ద్వారమును ఉంచరాదు.

**ద్వార వేధ:**– ద్వారమునకు ఎదురుగా చెట్టు, బావి, స్తంభము, జలయంత్రము, వీధి మొదలగునవి ఉంటే ద్వారవేధ కలుగుతుంది. బృహత్సంహితలో –

**రథ్యావిద్ధం ద్వారం నాశాయ కుమార దోషదం తరుణా**
**పంకద్వారే శోకో వ్యయోంబు నిస్స్రావిణీ ప్రోక్తః ।**
**కూపే నాపస్మారో భవతి వినాశశ్చ దేవతా విద్ధే**
**స్తంభేన స్త్రీ దోషాః కులనాశో బ్రహ్మణాభి ముఖే ॥**

1. వీధికి ఎదురుగా ద్వారముంటే గృహ యజమానికి అనారోగ్యమము.
2. చెట్టుకు ఎదురుగా ద్వారముంటే సంతాన నష్టము.
3. ద్వారమునకు ఎదురుగా ఎల్లపుడు బురద ఉంటే శోకము.
4. జలయంత్రముంటే వృధా ధన వ్యయం.
5. బావి ఉంటే అపస్మారక రోగము.
6. దేవతా విగ్రహముంటే వినాశము.
7. బ్రహ్మస్థానమునకు ఎదురుగా ద్వారముంటే కులనాశము.

వాస్తురత్నాకర వాక్యయందు, **బ్రాహ్మణాభిముఖే** – అని తీసుకొని బ్రాహ్మణ గృహాభిముఖద్వారమని చెప్పబడింది. కాని భట్టోత్పలుని వివృతియందు –

**దేవ ద్వారం వినాశాయ శంకర ద్వారమేవ చ ।**
**బ్రహ్మణా యచ్చ సంవిద్ధం తద్ద్వారం కులనాశనమ్ ॥**

అని వ్యాఖ్యానించబడినది. **ఉత్తరే పంచమ ద్వారం బ్రహ్మణో విద్ధముచ్యతే** అని విశ్వకర్మ ప్రకాశికలో చెప్పబడుట వలన ఉత్తరదిశ యందు 5వ భాగమందున్న ద్వారము బ్రహ్మవేద యనబడుతుంది.

పైన చెప్పబడిన ద్వార వేధకములు, ద్వారము యొక్క ఎత్తుకు రెట్టింపు దూరములో ఉంటే, వేధ దోషము ఉండదు అని బృహత్సంహితయందు చెప్పబడింది. ముహూర్త గణపతిలో గృహముయొక్క ఎత్తుకు రెట్టింపు దూరములో ఉంటే వేధ దోషముండదని చెప్పబడింది.

శివలింగము గృహమునకు ఎదురుగా 100 దండముల దూరములో ఉన్ననూ, విష్ణు సంబంధ ఆలయమునకు వెనుక 100 దండములలో గృహమున్నను, దుర్గ గుడి పార్శ్వమందున్నను, గణపతి ఊర్ధ్వదృష్టి కలిగినను శుభావహము గాదు. దేవాలయ సన్నిధానమున నున్న గృహములకు ఛాయా వేధ కలుగుతుంది. ఇది 2, 3 యామములందు పడితే దోషము గాని మిగిలిన యామములందు పడితే ఛాయా దోషముండదు.

ఔత్తరాహులు కొందరు అన్ని గోడలతో సహా ఆయమును గణించి గృహ నిర్మాణము చేయుచున్నారు. కొందరు ప్రధాన గర్భమునకు మాత్రమే ఆయాదులను చూస్తున్నారు.

**పాషాణే సర్వతో బాహ్యం ఇష్టికాయాం తదర్ధకం ।**
**వృత్తికాయాం పిండమాత్ర మిత్యుక్తం బ్రహ్మాయామిళే ॥**

రాళ్ళతో కట్టబడిన గృహము, ఆయము గోడ లోపలికే (ఉలి లోపల) ఉండవలెను. ఇటుకలతో కట్టిన గోడలకు ఆయం మధ్య ఉండవలెను. మట్టితో కట్టిన గోడలకు ఆయము లోపల నుండవలెను. కాని శిల్పరత్నమందు, **గృహాణాం భిత్తి మధ్యే తు** అనుట వలన గృహములన్నిటికిని, అన్ని విధములైన గోడలకును ఆయం గోడల మధ్యకే ఉండాలి. ఈ విషయం ఆంధ్రదేశంలో ఎక్కువగా ప్రచారంలో ఉన్నది.

**ప్రహరీ గోడలు, గేటు, వీధిశూలలు :**

ఇల్లు కట్టుటకు ముందు ప్రహరీ గోడ చుట్టూ కట్టుట మంచిది. ఇది సమీప పరిసరాలలోని వాస్తుదోషము నుంచి కాపాడుతుంది. తూర్పుప్రహరీ గోడ యొక్క ఎత్తు, పడమర ప్రహరీ గోడ ఎత్తుకంటే తక్కువ ఉండవలెను. ఉత్తరపు ప్రహరీ గోడ ఎత్తు దక్షిణ ప్రహరీ గోడ ఎత్తు కంటె తక్కువగా ఉండవలెను. ఈ విధముగా ఉంటే, సంపద, వృద్ధి, సత్సంతానము కలుగుతుంది.

గేటును సింహద్వారమునకు ఎదురుగా పెట్టదలచుకుంటే సింహద్వార మధ్య బిందువు గేటు యొక్క మధ్యబిందువు లంబరేఖలో నుండకూడదు. గేటు యొక్క ఎత్తు సింహద్వారము ఎత్తుకంటే తక్కువ ఉండవలెను. సింహద్వారము యొక్క వెడల్పు కంటె గేటు యొక్క వెడల్పు ఎక్కువగా ఉండవలెను. గేటు తూర్పున గాని, ఈశాన్యమున గాని, ఉత్తరమున గాని ఉండుట మంచిది. తూర్పు సింహ ద్వారమునకు ఈశాన్యమున, పడమర సింహద్వారమునకు ఆగ్నేయమున, ఉత్తర సింహద్వారమునకు వాయవ్యమున గేటు పెట్టవచ్చును. **రథ్యావిద్ధం ద్వారం నాశాయ** అనగా వీధికి ఎదురుగా ద్వారమున్న గృహయజమానికి కీడు కలుగుతుంది. గృహముయొక్క యిరుపార్శ్వములకు ఒక వీధి రెండుగా చీలిపోతే అది మార్గవేధ. ఇది శోక సంతాపములను కలిగిస్తుంది.

**మార్గశ్చైకో యథా గచ్ఛేత్ ఉభయోః గృహ పార్శ్వయోః ।**
**మార్గవేధా స్తథా స స్యాత్ శోక సంతాప కారకః ॥**

తూర్పున స్నానగృహము, ఆగ్నేయమున వంట యిల్లు, దక్షిణమున శయన గృహము, నైరృతిన ఆయుధ గృహమును, పడమర భోజన గృహమును, వాయవ్యమున పశుశాల, ఉత్తరమున ధనశాల, ఈశాన్యమున పూజా గృహమును కట్టవలెను. వాటి వాటి ఆయముల నెరిగి కట్టవలెను. (కాలామృతము)

**మెట్లు కట్టుట:-** పై అంతస్థులకు వెళ్ళడానికి మెట్లు ఇంటికి పడమర ఉత్తర దిక్కు లందు ప్రారంభమై దక్షిణావర్తముగా ఉండాలి. మెట్లకు పైభాగమున ఉన్న ద్వారము తూర్పు దక్షిణ దిక్కుల వైపు ఉండాలి. మెట్లకు క్రిందిద్వారము పై ద్వారము కంటే 12వ వంతు తక్కువ ఉండాలి. క్రిందనున్న అంతస్తు కంటే పై అంతస్తు 12వ వంతు తక్కువ ఉండాలి. మేడల అంతస్తులు 11 వరకు ఉండవచ్చును. అంతస్తులు బేసి సంఖ్యలో ఉండాలి.

**ఖాళీ స్థలము:-** ఇంటికి నాలుగు వైపుల ఖాళీస్థలముంటే ప్రశస్తము. తూర్పు ఖాళీ స్థలము పడమర ఖాళీస్థలము కంటే కొంచెము ఎక్కువ ఉండాలి. ఉత్తరపు ఖాళీస్థలము దక్షిణపు ఖాళీస్థలము కంటే ఎక్కువ ఉండాలి. ఈశాన్యభాగమున ఖాళీ స్థలముండుట శ్రేయస్కరము. నైరృతి దిక్కున పాకీదొడ్డి కట్టాలి. బావి లేక పంపు లేక బోర్‌వెల్ ఈశాన్యమున ఉండాలి. ఉపగృహము నైరృతి మూల గాని, వాయవ్య మూల గాని కట్టుట మంచిది. గృహమును పెంచాలంటే నాలుగు దిక్కులందు సమానంగా పెంచాలి. ఒక్కవైపు మాత్రమే పెంచకూడదు. అవసరం అనుకుంటే తూర్పు, ఉత్తర దిశలందు మాత్రము పెంచవచ్చును. దక్షిణ పశ్చిమ దిశలయందు మాత్రము పెంచకూడదు. తూర్పున పెంచితే మిత్ర వైరము. దక్షిణమున పెంచితే మృత్యు భయము. పడమరన పెంచితే ధనక్షయము. ఉత్తరమున పెంచితే మనస్తాపము కలుగుతుంది.

గృహానికి ప్రక్కన మరియొక గృహమును దక్షిణదిక్కున గాని, పశ్చిమ దిక్కున గాని నిర్మించుట గాని, కొనుట గాని శుభావహము కాదు. ఉత్తర దిక్కున గాని, తూర్పుదిక్కున నిర్మించుట గాని, కొనుట గాని మంచిది. ఒకవేళ దక్షిణ దిశలో గాని, పశ్చిమ దిశలో గాని గృహమును కొనవలసి వచ్చినచో లేక నిర్మించవలసి వచ్చినచో తన గృహమునకు రెట్టింపు దూరములో నిర్మించుట మంచిది. ఇది మాండవ్య వచనము.

గృహావరణములో ముండ్ల చెట్లు శత్రుభయమును, క్షీర వృక్షములు ధన నష్టమును కలుగచేయును. ఫల వృక్షములు సంతానం వలన వేదన కలుగచేయును. ఒకవేళ ఫలవృక్షములను ఛేదించటానికి ఇష్టము లేకపోతే ఆ చెట్లమధ్య ఒక శుభ వృక్షమును స్థాపించిన శుభము కలుగుతుంది. కొందరు అరటి చెట్టు గృహావరణమందు మంచిదని చెప్పిరి. కాని, వశిష్ఠుడు మాత్రము అరటి, పసుపు, మాదీఫల వృక్షములు పనికిరావని దృఢముగ చెప్పెను. మామిడి చెట్లు, కొబ్బరి చెట్లుండుట శ్రేష్ఠము. సువర్ణ వృక్షమైనను గృహమందు పనికిరాదు. కాని, తులసి మొక్క సర్వపాప నాశకరము. కొందరు తులసికోట వంటింటికి ఎదురుగా నుంటే శుభకరమని చెప్తారు.

**యది స్వర్ణమయం వృక్షం గృహమధ్యే న రోపయేత్ ।**
**అజిరే తులసీ వృక్షం రోపయేదఘనాశనమ్ ॥**

**జల ప్రవాహము :-** ఇంటిలోనుండి నీరు పోయేటందుకు ఏర్పరచిన తూము గాని, గృహావరణములో నున్న నీరు బయటకు పోయేందుకు ఏర్పరచిన తూము గాని ప్రాగాది దిశలందుండిన గలుగు ఫలితములు వాస్తు సంగ్రహములో చెప్పబడినవి.

**శుభం మృతిశ్చ నిర్ధనం క్షయం చ పుత్రనాశనమ్ ।**
**సుఖం చ రాజ్య సంపదః ధనం క్రమేణ పూర్వతః ॥**

తూర్పు నుండి బయటకు నీరుపోతే శుభము. ఆగ్నేయము నుండి పోతే మృతి. దక్షిణము నుండి పోతే దరిద్రము. నైరృతి నుండి పోతే నాశము. పడమర నుండి పోతే సంతాన నష్టము. వాయవ్యము నుండి పోతే సుఖము. ఉత్తరము నుండి పోతే రాజ్యసంపద. ఈశాన్యము నుంచి పోతే ధనము కలుగును. కాలామృతందు తూర్పు ఈశాన్య ఉత్తర దిక్కులు మాత్రమే ప్రశస్తములని చెప్పబడింది.

గృహమునకు పడమర దక్షిణ దిశలందున్న స్థలములను కలుపుకొనరాదు. అట్లు కలుపుకొనవలసి వచ్చినచో 6 సంవత్సరముల వరకు ఆ స్థలమును దొడ్లుగా గాని, తోటగా గాని ఉంచి, తదుపరి స్థలమందు కలుపుకొనవచ్చును. వంటిల్లు ఇంటికి ఆగ్నేయ భాగమున ఉండుట ప్రశస్తము. దక్షిణ నైరృతి దిశలందుండుట మధ్యమ పక్షము. ఏ దిశయందైనను మూడు ద్వారములు బయటకు కనిపించునట్లు పెట్టరాదు. సామాన్యముగ అన్ని ద్వారములు భూమట్టమునకు సమాన స్థాయిలోనే ఉండాలి. గర్భగృహము కంటె వసారాల భూమి కొంచెము పల్లముగా నుండాలి. ఇతరుల ఇంట్లోంచి దీపకాంతి తన సింహద్వారము నుండి గృహములోనికి రాకూడదు. గృహ ఆవరణలో కట్టబడిన ఉపగృహములు ప్రధానగృహము కంటె ఎక్కువ విశాలముగా గాని, ఎత్తుగా గాని యుండరాదు.

**శుభమ్**

ఈ పంచాంగమందలి
ఏకవింశతి మహాదోష వివరములు మరియు వాస్తుప్రకరణము
**'మహామహోపాధ్యాయ' శ్రీమాన్ శ్రీ ఇరంగంటి రంగాచార్య**
గురువు గారి ముహూర్త సింధువు గ్రంధము నుండి వారి అనుమతితో కృతజ్ఞతా పూర్వకముగా స్వీకరించడమైనది.

## వివాహమునకు ఉపయోగించు రాశికూటాది పట్టిక

| నక్షత్రము | రాశి | వర్ణం | వశ్యం | యోని | గణం | నాడి | రాశ్యాధిపతి |
|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | మేషం | క్షత్రియ | చతుష్పద | అశ్వం | దేవ | ఆది | కుజుడు |
| భరణి | మేషం | క్షత్రియ | చతుష్పద | గజం | మనుష్య | మధ్య | కుజుడు |
| కృత్తిక 1వ పాదము | మేషం | క్షత్రియ | చతుష్పద | మేషం | రాక్షస | అంత్య | కుజుడు |
| కృత్తిక 2,3,4 పాదములు | వృషభం | వైశ్య | చతుష్పద | మేషం | రాక్షస | అంత్య | శుక్రుడు |
| రోహిణి | వృషభం | వైశ్య | చతుష్పద | సర్పం | మనుష్య | అంత్య | శుక్రుడు |
| మృగశిర 1,2 పాదములు | వృషభం | వైశ్య | చతుష్పద | సర్పం | దేవ | మధ్య | శుక్రుడు |
| మృగశిర 3,4 పాదములు | మిథునం | శూద్ర | మనుష్య | సర్పం | దేవ | మధ్య | బుధుడు |
| ఆర్ద్ర | మిథునం | శూద్ర | మనుష్య | శునకం | మనుష్య | ఆది | బుధుడు |
| పునర్వసు 1,2,3 పాదములు | మిథునం | శూద్ర | మనుష్య | మార్జాలం | దేవ | ఆది | బుధుడు |
| పునర్వసు 4వ పాదము | కర్కాటకం | బ్రాహ్మణ | జలచర | మార్జాలం | దేవ | ఆది | చంద్రుడు |
| పుష్యమి | కర్కాటకం | బ్రాహ్మణ | జలచర | మేషం | దేవ | మధ్య | చంద్రుడు |
| ఆశ్రేష | కర్కాటకం | బ్రాహ్మణ | జలచర | మార్జాలం | రాక్షస | అంత్య | చంద్రుడు |
| మఘ | సింహం | క్షత్రియ | చతుష్పద | మూషికం | రాక్షస | అంత్య | రవి |
| పూర్వఫల్గుని | సింహం | క్షత్రియ | చతుష్పద | మూషికం | మనుష్య | మధ్య | రవి |
| ఉత్తర 1వ పాదము | సింహం | క్షత్రియ | చతుష్పద | గోవు | మనుష్య | ఆది | రవి |
| ఉత్తర 2,3,4 పాదములు | కన్య | వైశ్య | మనుష్య | గోవు | మనుష్య | ఆది | బుధుడు |
| హస్త | కన్య | వైశ్య | మనుష్య | దున్న | దేవ | ఆది | బుధుడు |
| చిత్ర 1,2 పాదములు | కన్య | వైశ్య | మనుష్య | వ్యాఘ్రం | రాక్షస | మధ్య | బుధుడు |
| చిత్ర 3,4 పాదములు | తుల | శూద్ర | మనుష్య | వ్యాఘ్రం | రాక్షస | మధ్య | శుక్రుడు |
| స్వాతి | తుల | శూద్ర | మనుష్య | దున్న | దేవ | అంత్య | శుక్రుడు |
| విశాఖ 1,2,3 పాదములు | తుల | శూద్ర | మనుష్య | వ్యాఘ్రం | రాక్షస | అంత్య | శుక్రుడు |
| విశాఖ 4వ పాదము | వృశ్చికం | బ్రాహ్మణ | కీట | వ్యాఘ్రం | రాక్షస | అంత్య | కుజుడు |
| అనూరాధ | వృశ్చికం | బ్రాహ్మణ | కీట | లేడి | దేవ | మధ్య | కుజుడు |
| జ్యేష్ఠ | వృశ్చికం | బ్రాహ్మణ | కీట | లేడి | రాక్షస | ఆది | కుజుడు |
| మూల | ధనుస్సు | క్షత్రియ | మనుష్య | శునకం | రాక్షస | ఆది | గురువు |
| పూర్వాషాఢ | ధనుస్సు | క్షత్రియ | చతుష్పద | వానరం | మనుష్య | మధ్య | గురువు |
| ఉత్తరాషాఢ 1వ పాదము | ధనుస్సు | క్షత్రియ | చతుష్పద | ముంగిస | మనుష్య | అంత్య | గురువు |
| ఉత్తరాషాఢ 2,3,4 పాదములు | మకరం | వైశ్య | చతుష్పద | ముంగిస | మనుష్య | అంత్య | శని |
| శ్రవణం | మకరం | వైశ్య | చతుష్పద | వానరం | దేవ | అంత్య | శని |
| ధనిష్ఠ 1,2 పాదములు | మకరం | వైశ్య | జలచర | సింహం | రాక్షస | మధ్య | శని |
| ధనిష్ఠ 3,4 పాదములు | కుంభం | శూద్ర | మనుష్య | సింహం | రాక్షస | మధ్య | శని |
| శతభిషం | కుంభం | శూద్ర | మనుష్య | అశ్వం | రాక్షస | ఆది | శని |
| పూర్వాభాద్ర 1,2,3 పాదములు | కుంభం | శూద్ర | మనుష్య | సింహం | మనుష్య | ఆది | శని |
| పూర్వాభాద్ర 4వ పాదము | మీనం | బ్రాహ్మణ | మనుష్య | సింహం | మనుష్య | ఆది | గురువు |
| ఉత్తరాభాద్ర | మీనం | బ్రాహ్మణ | జలచర | గోవు | మనుష్య | మధ్య | గురువు |
| రేవతి | మీనం | బ్రాహ్మణ | జలచర | గజం | దేవ | అంత్య | గురువు |

## అమృతాది యోగములు

| | అశ్వి | భర | కృత్తి | రోహి | మృగ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్రే | మఘ | పుబ్బ | ఉత్త | హస్త | చిత్ర | స్వాతి | విశా | అనూ | జ్యేష్ఠ | మూల | పూషా | ఉషా | శ్రవ | ధని | శత | పూభా | ఉభా | రేవ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| **ఆది** | సి | ప్రఅ | అసి | సి | సి | సి | సి | సి | సి | మ | సి | అ | అసి | సి | సి | ఉ | మ | మ | అ | సి | అ | అ | మ | సి | సి | అ | అ |
| **సోమ** | సి | సి | మ | అ | అసి | సి | సి | అ | సి | మ | సి | సి | సి | ప్ర | అ | మ | సి | సి | సి | ఉ | మ | అ | సి | సి | మ | సి | సి |
| **మంగళ** | అసి | సి | సి | అ | సి | మ | సి | సి | సి | సి | సి | అ | సి | సి | సి | మ | అసి | ఉ | అ | సి | ప్రఅ | అ | సి | మ | మ | అ | సి |
| **బుధ** | మ | సి | అ | సి | సి | సి | సి | సి | సి | సి | అ | అ | మ | సి | సి | సి | అసి | సి | మ | అ | అ | సి | ప్రఅ | అసి | అ | సి | ఉ |
| **గురు** | అ | సి | మ | ఉ | మ | మ | అ | అసి | సి | అ | సి | మ | సి | సి | అ | సి | సి | ప్రఅ | సి | సి | సి | సి | సి | మ | సి | సి | సి |
| **శుక్ర** | అ | సి | సి | సి | సి | మ | సి | సి | మ | మ | సి | సి | అ | సి | సి | సి | సి | మ | అ | ప్రఅ | సి | మ | సి | సి | సి | సి | ఉ |
| **శని** | సి | సి | అ | అ | సి | సి | సి | సి | మ | అ | సి | ఉ | మ | మ | అ | సి | సి | సి | సి | సి | సి | సి | సి | అ | మ | మ | ప్రఅ |

అ – అమృతయోగము, సి – సిద్ధయోగము, అసి – అమృత సిద్ధయోగము, ఉ– ఉత్పాతయోగము, మ – మరణయోగము, ప్రఅ – ప్రబలారిష్టయోగము

వెనుకకు మరలుట జరుగదు. సందర్భమును బట్టి దాని దూర / కాలములని అనుపాతములో ఉజ్జాయింపు చేస్తాము. అలాగే కరణగ్రంథాలలో ఆయా రచయితల విజ్ఞత / అనుభవము / అవసరములను బట్టి ఉజ్జాయింపులు ఉండును. వాటిని వాటికి మూలాధారములైన గణిత సూత్రముల దృష్ట్యా సులభముగ అర్థము చేసికొనగలము. లేనిచో మా పద్ధతి / సంప్రదాయము ఇదే అను పిడివాదము తప్పదు.

15. అలాగే ఇంతకు ముందు మనము ప్రస్తావించుకున్న కల్యాణ గణితములోని సూర్యభ్రమణము సంవత్సరానికి (1-1-15-31-31) అనునది 5/6 వందల సంవత్సరముల వరకు సరిపోవచ్చు 1000/2000 సంవత్సరాలకైతే మరి ఆ చివరి పరకల (విలిప్తల) లోని అంకెను కూడ సవరించుకొనవలసి వచ్చును.

**అయితే ఇట్టి సవరింపులకి సిద్ధాంత విజ్ఞానము తప్పనిసరి. ప్రత్యక్ష పరిశీలన మరింత తప్పనిసరి.** ప్రాచీన మహర్షులు తమ తపః శక్తితో / దివ్యదృష్టితో ఆ పని సులభముగ చేయుచుండెడివారు. తదనంతరకాలమున (ప్రస్తుతం మన దూరదర్శినుల వంటి) నాళికలనబడే పరికరములను వాడెడివారట. వాటి నిర్మాణ ఉపయోగ పద్ధతుల సాహిత్యము ఈనాడు మనకి లభించుట లేదు. ఆ సంప్రదాయము లుప్తమైనది.

16. సిద్ధాంతగ్రంథములన్నీ గ్రహస్థితి గతులని నిత్యము తప్పని సరిగ దృక్తుల్యము చేసికొనుచుండవలెననే బోధిస్తున్నాయి. దానికై ఏవో గణిత సూత్రములపై ఆధారపడక నేరుగ ఖగోళ పరిశీలన చేయమనే చెప్పుచున్నాయి. ఇట్టిపని అనాదిగ మన దేశమున జరుగుచున్నట్లు మన తంత్ర / కరణ గ్రంథములే సాక్షి. కాగా దురదృష్టవశాత్తు గత 1500 / 2000 సంవత్సరముల కాలములో మన దేశము పరాయిపాలనలో పడినప్పటినుండి మన విద్యలు, కళలు, ఆచారములు అన్నిటికీ గ్రహణము పట్టినది. ఇంగ్లీషు వారి కాలమున అది శ్రుతిమించినది. పర్యవసానముగ మన భారతీయ సంస్కృతి సంప్రదాయములు - పంచాంగ సంప్రదాయము అన్నీ చిత్తుగ శిథిలమైనాయి. ఖగోళ పరిశీలన మరుగున పడిపోయినది. పంచాంగ రచన అసలులో కండెవలె పాతకాలపు కరణ గ్రంథముల మీదనే ఎలాగో సాగుచున్నది. (అసలు ఆగిపోలేదు. అదే మనకి ఒక పెద్ద వరము). ఇట్టి స్థితిలో అదృష్టవశాత్తు గత శతాబ్దముననే కొందరు విజ్ఞులు పరిస్థితిని గుర్తించి, తగు పరిష్కారములకై అన్వేషింపదొడగిరి.

17. ఓడలు బండ్లను వచ్చును. బండ్లోడలవచ్చును - అన్నచందమున ఒకపుడు భారతదేశము నుండియే బహువిధ విజ్ఞాన జ్యోతిస్సులను - ముఖ్యముగ జ్యోతిర్విజ్ఞాన జ్యోతిస్సుని - పుష్కలముగ పొందియున్న పాశ్చాత్యులు ఆధునిక విజ్ఞానరంగమున నేడు కడు ఉన్నతస్థితిలో నున్నారు. నవీన ఖగోళ దూరదర్శినులతో వారు ఖగోళ పరిశీలనలో నిష్ణాతులై గ్రహస్థితి గతులని ఊహకి అందనంత అత్యన్త సూక్ష్మపరిశీలనతో గుర్తించగలుగుచున్నారు. (ఈ రంగమున వారికి భారతీయ శాస్త్రవేత్తల సహాయ సహకారములు పుష్కలముగనే ఉన్న సంగతి జగమెరిగిన సత్యమే). **కర్దమాదపి కాంచనం** - (బంగారాన్ని బురదలో నుండి కూడా తెచ్చుకొనవచ్చు / కడిగి ఉపయోగించు కొనవచ్చు) అన్నట్లు ఆ పరిశీలనా ఫలాలని మనమెందుకు ఉపయోగించుకొనకూడదు?

ఆధునికుల / నాస్తికుల విజ్ఞానమును మనము ఉపయోగించుకొనవచ్చునా?

దంపుడు బియ్యం దొరకనపుడు మరబియ్యముతోనైనా అన్నము వండుకొనవలదా?

నిజానికి తమ వైజ్ఞానిక కండూతిని తీర్చుకొనుటకంటె పాశ్చాత్యులు / నవీనులు తమతమ ఖగోళ విజ్ఞానముతో బావుకొనుచున్నది / బావుకొనగలిగిన ఉత్తమ / ఉన్నత ప్రయోజనమేమి?

మనకైతే అది నిర్దుష్ట పంచాంగమునకు ఎంతయో ఉపయోగపడును. తద్వారా మనము ధర్మార్థకామములనే పురుషార్థములను చక్కగా సాధించుకొనగలము. మనకు / మనతో పాటు సమస్త ప్రపంచమునకు అశుభములను తొలగించుకొనగలము. క్షేమ శుభ సుఖ సంతోష శాంతులని పుష్కలముగ సాధించుకొనగలము. కనుక నవీన విజ్ఞాన సహాయముతో మన పంచాంగములను పరిష్కరించుకొనుట అత్యంతము సముచితమేనని సాంప్రదాయకులే అయిన కొందరు పెద్దలు దానికై తగు ప్రయత్నములను చేసిరి / చేయుచున్నారు.

18. మహారాష్ట్రీయుడైన దామోదర బాపూజి కేత్కరు అను పండితుడు ఈ రంగమున మిక్కిలి కృషి చేసి **జ్యోతిర్గణితము** అనే గ్రంథమును నిర్మించిరి. దాని ప్రకారము నేటి కాలానికి అనుగుణమైన అత్యంత దృక్తుల్యమైన గ్రహణ గణితమును సులభముగ చేయుటకు వీలు అగుచున్నది. నేటికి సుమారు 150 సం॥ల నాడే కాశీలోని పండిత సుధాకర ద్వివేది గారు, వారి శిష్యులు మురళీధర ఝా గారు (బీహారు), మన తెలుగు ప్రాంతమున పిడపర్తి వారు ఇలా ఎందరో మన ప్రాచీన జ్యోతిర్విజ్ఞానమును నవీన ఖగోళ విజ్ఞానముతో మేళవించి ఉత్తమ పంచాంగ రచనలకి పూనుకొనిరి. ఇట్టి ప్రయత్నములను సంప్రదాయ పరిరక్షణ దీక్షితులేయగు శ్రీ కామకోటి పీఠాధిపతులు మున్నగు గురువులు ఆమోదించిరి. భారత ప్రభుత్వము వారు 1953లో నియమించిన పంచాంగ సంస్కరణల సంఘము వారు కూడ ఇట్టి పంచాంగములనే శాస్త్రీయమని ఆమోదించుటే గాక - వీటికి అనుగుణముగ ప్రధాన భారతీయ భాషలన్నిట రాష్ట్రీయ పంచాంగములని ప్రకటించుచున్నారు.

19. ఇంతకు **ఈ పద్ధతిలో చేసేవే దృక్పద్ధతి పంచాంగాలు.** నిజానికి ఇట్టి దృక్పద్ధతి పంచాంగాలనే నిజమైన పూర్వపద్ధతి పంచాంగాలని అనాలి. ఎందుకనగా అనాదిగ మన సిద్ధాంత / తంత్ర / కరణ గ్రంథాలన్నీ ఆ అనాది సిద్ధాంతాన్ని దృక్పద్ధతిలో నవీకరించుకొనుచునే ఉన్నాయి కదా. (ఈ సంగతి ఇది వరలో బాగానే చెప్పుకుని ఉన్నాము). దురదృష్టవశాత్తు గత 5/6 శతాబ్దములలో ఇట్టి దృక్సంస్కార ప్రక్రియ దెబ్బతిన్నది. కాగా ఏ విధముగనైనను కాలానుగుణ దృక్సంస్కారము చేసినదే నిజమైన "పూర్వపద్ధతి" అనజెల్లును.

20. దృక్సంస్కారము జరుగవలసినదే గాని అది ఆర్షమైయుండవలెను. నవీన / పాశ్చాత్య దృక్పథము మనకి పనికిరాదు అని కొందరి అభిప్రాయము. ప్రాచీన నాళికల ద్వారానే ఆ పని జరగాలని వారి ఆకాంక్ష. మంచిదే. ఆ ప్రకారం మనం సత్యానికి బాగా సన్నిహితులమే గావచ్చు. నవీన పద్ధతిలో

బెత్తెడు దూరము కావచ్చు. కాని బొత్తిగ దానిని వదిలి వేసినచో బారెడు దూరము అగుట తప్పదు. **కాగా ప్రస్తుత కాలమున పూర్వపద్ధతి యనబడునది సత్యాన్వేషణలో నిజమైన పూర్వపద్ధతి యొక్క ప్రారంభదశ / పరిణతి చెందని / లక్ష్యమును చేరని దశ మాత్రమే. అది తనను తాను సవరించుకుని లక్ష్యమును చేరుచో అదే ప్రస్తుత దృక్పద్ధతియగును.** ఈ బండి గిట్టనివారు మరొక దానిలోనైనా రావలసినది ఇక్కడికే.

21. పూర్వపద్ధతి / దృక్పద్ధతి – దేనిలో అయినా సూర్యచంద్రుల స్థితిగతులని సిద్ధం చేసుకుంటే సగం పంచాంగం పూర్తి అయినట్లే. చంద్ర సూర్యాంతరమున బట్టి తిథి, చంద్రస్థితిని బట్టి నక్షత్రము, చంద్రసూర్య స్ఫుటముల మొత్తము యోగము, తిథ్యర్థము కరణము. పంచాంగ గణన ఇలా సాగుతుంది. వారమునకు ఈ గ్రహగణితావసరము లేదు. సృష్ట్యాది ఆదివారము ఉదయముతో ప్రారంభమైనది. అప్పటి నుండి రోజులు లెక్కపెట్టుకుని వారమును నిర్ణయించుకొనవచ్చును. అదృష్టవశాత్తు ఈ విషయములో ప్రపంచములో అందరు ఏకాభిప్రాయముతోనే ఉన్నారు.

22. ఒక విధముగ వార ప్రవృత్తి సూర్యాది శన్యంత గ్రహముల పైననే ఆధారపడియున్నది. తాత్త్వికముగ రవి చంద్రులు జీవ పరమాత్మలు. కుజాదులు పంచభూతాధిపతులు. భ్రమణ వేగ స్థాయిని బట్టి గ్రహముల వరుస – భూమి, చంద్ర, బుధ, శుక్ర, రవి, కుజ, గురు, శనులు. అందరిలో చంద్రుని వేగమెక్కువ – శనిది కనిష్ఠము. ఇక రోజుకి 24 హోరలు (hours) = గంటలు. ఒక్కొక్క హోరకి ఒక్కొక్క గ్రహాధిపత్యము. సృష్ట్యాది రవిహోరతో ప్రారంభము. అది ఆదివారము. రెండవహోరకి రవి వెనుకనే యున్న శుక్రుడు. తరువాత బుధుడు. తరువాత చంద్రుడు అధిపతులు. కాగా, ఐదవ హోరకి శని, ఆరవహోరకి గురువు, ఏడవ హోరకి కుజుడు అధిపతులైనారు. మరల ఇదే వరుసలో (రవి, శుక్ర, బుధ, చంద్ర, శని, గురు, కుజ) ఒక్కొక్క హోరకి ఒక్కొక్క గ్రహము అధిపతి. ఇలా జరుగుచుండగా మూడు ఆవృత్తులపైన నాలుగవ ఆవృత్తిలో 3 × 7 = 21 హోరలు + 3 హోరలు. రవి, శుక్ర, బుధులు పూర్తికాగా 24 హోరలు పూర్తి అయినాయి. 25వ హోర మరునాటి మొదటి హోర. దానికి చంద్రుడధిపతి. అది సోమవారము. ఈనాడు చంద్ర, శని, గురు, కుజ, రవి, శుక్ర, బుధహోరలు మూడు మారులు తిరిగి చివరి మూడు చంద్ర, శని, గురువులు కాగా, మరునాటి మొదటి హోర కుజునిదాయెను. అది కుజ (మంగళ)వారము. ఇట్లే ఏడు వారములు తిరుగుచుండును. రాహు కేతువులకి దానిలో స్థానము లేదు. ప్రపంచము అంతట ఈ వారవిధానమిట్లే నడుచుచున్నది. గ్రహ పరిభ్రమణములతో దానికి సంబంధం లేదు.

23. ఇక పంచాంగ రచనలో గణితానికి సంబంధించినంత వరకు మిగిలిన దానిలో ప్రధానభాగము కుజాది గ్రహగతులు మరియు గ్రహణాలు. **పూర్వపద్ధతి పంచాంగాలలో కుజాది గ్రహాలకి కరణ గ్రంథాలని బట్టి దృక్సంస్కారం చేస్తారు. (అవి ఈ కాలానికి సరిపోవని తెలిసికూడా).** దానిని బట్టి మౌఢ్యాలు మున్నగువాటిలో దృక్పంచాంగాలకి / పూర్వ పంచాంగాలకీ చాల తేడా వస్తుంది. **మౌఢ్యాల ఆరంభ సమాప్తులని ఖగోళ పరిశీలనలో గుర్తించవచ్చు. అవి దృగ్గణితానికి మాత్రమే సరిపోతాయి.**

**ఇక గ్రహణాలు. ఇవి దృగ్గణితములో మాత్రమే కుదురుతాయి.** నేరుగ కనిపిస్తాయి. పూర్వపద్ధతి – ఏ కరణ గ్రంథంతో జరిగినా ఇవి కుదరనే కుదరవు. (కారణం వాటిలోని గ్రహగతులు ఈ కాలానివి కావు). కనుక గ్రహణాలని పూర్వపద్ధతి వారు కూడ నవీన పద్ధతిలోనే చేయక తప్పదు. చేయుచున్నారు కూడా.

ఇక మిగిలినవి ముహూర్తాలు, పండుగలు, పర్వాలు. ఇవి ఎవరి పంచాంగం ప్రకారం వారు వ్రాసుకుంటారు. వీటికి వలయు ప్రమాణ గ్రంథాలు ప్రధానముగా అందరికి ఒకటే. **ఏ పద్ధతిలో అయినా ఒక రచయితకి మరొకరికి ఈ అంశాలలో భేదం వచ్చిందంటే అది మూలగ్రంథాలలో అనుమతింపబడిన సంప్రదాయభేదం కావచ్చు. రచయిత అజ్ఞానం / పొరపాటు కావచ్చు. పాఠకుల శ్రద్ధా సంస్కారాలే వాటికి పరిష్కారము.**

**24. దృక్పద్ధతి పంచాంగాలలో కూడా (గణిత పరముగ) భేదాలు లేకపోలేవు. అవి ప్రధానముగ అయనాంశకి సంబంధించినవి.** దీని వివరణ ఒకింత సాంకేతికము. దీనిని ప్రస్తుతానికి కాస్త ఆపి – ఇచ్చట ఇపుడు మూడవ రకం పంచాంగాలని – మిశ్రపద్ధతి వాటిని గురించి ముచ్చటించుకుందాము. వీటిలో సూర్యచంద్రులకి దృక్సంస్కారము చేయరు. కుజాదులకి చేస్తారు. వాటికి కూడ కొందరు కరణ గ్రంథాలని బట్టి, మరికొందరు నవీన పట్టికలని బట్టి చేస్తారు. సూర్యచంద్రులకి దృక్సంస్కారము చేయరు గనుక వీటిలోని తిథి, నక్షత్ర, యోగ, కరణములనబడే (పంచాంగములోని) నాలుగు అంగములలో బాగా తేడా వస్తుంది. వాటిని బట్టి ముహూర్తాలు, పండుగలు, పర్వాలలో కూడా తేడాలు వస్తాయి.

25. ఇక ఈ మూడు రకాలలో ఏది సరియైనది? ఏది సాంకేతికముగ శాస్త్రీయమైనది. ఏది ధర్మశాస్త్రానుగుణమైనది? అనునది విజ్ఞులు ఎవరికి వారే నిర్ణయించుకొనవచ్చును. వాద ప్రతివాదములలోనికి దిగినచో ప్రతివారు ఏవో కారికలు చెప్పటమే గాక వాటికి తమ స్వంత భాష్యములనే చెప్పి – తమని తాము సమర్థించుకునే తిప్పలు పడకతప్పదు. వాదికి సత్యమక్కరలేదు.

మహాభారత వ్యాఖ్యాత నీలకంఠ పండితుడు – తన కాలములో లభించిన – అనేక ప్రాంతాల భారత ప్రతులని సేకరించి, అన్నిటినీ ప్రత్యక్షర పరీక్ష చేసికొని – పాఠాంతరాలలో ఏది సాధుతమము? ఏది త్యాజ్యము? ఏది సాంప్రదాయికము? దేనిని శిష్టులు అంగీకరిస్తారు? అని తెగ విచారించిన మీదటనే సరియగు పాఠమును నిర్ణయించుకుని వ్యాఖ్యానించెనట.

**బహూన్ సమాహృత్య విభిన్న దేశ్యాన్ కోశాన్ వినిశ్చిత్య చ పాఠ మగ్ర్యమ్ ।**

**ప్రాచాం గురుణా మనుసృత్య వాచ మారభ్యతే భారత భావదీపః ॥**

అన్నాడు. **మన పంచాంగకర్తలకి – ముఖ్యముగా పూర్వపద్ధతి అనబడే వారికి ఇలాంటి స్పృహ లేదు. వారిలో చాలమందికి (క్షమించాలి) సిద్ధాంతమనే మాటయే నచ్చదు. (కొందరికి అది ఒకటి ఉన్నదని కూడ తెలియదు).** కొందరికి పూర్వగ్రంథాలని అర్థము చేసికొనుటకు వలయు

**భాషా పరిచయము కూడా లేదు.** ఏదో ఒక అలవాటుగా పంచాంగ రచన చేస్తారు. (జాతక ముహూర్తాదులలో నైపుణ్యం ఉండవచ్చు).

26. కొందరు తమ పద్ధతిని సమర్ధించుకునేందుకు తమ పంచాంగము ప్రకారము పెట్టిన ముహూర్తములలో జరిగిన పనికి శుభఫలాలు తాము చెప్పినట్లుగ అందినాయని / తమ పంచాంగం ప్రకారం జాతక ఫలితాలు సరిపోవుచున్నాయని కనుక తమ పద్ధతి / తమ పంచాంగమే ప్రమాణమని, గ్రాహ్యమని అంటారు.

ఒక కర్మ ఫలించటానికి ముహూర్త మొక్కటే కారణము కాజాలదు. దేశ, కాల, మన్త్ర, తన్త్ర, ద్రవ్య, చిత్త, భక్తి, శ్రద్ధాదు లెన్నియో కర్మఫలానికి సహకారాలు. ఇవి గాక ప్రారబ్ధము / వ్యక్తి అర్హత కూడా ఉంటాయి. వీటన్నింటిని మించిన సంగతి – కర్మ ఫలప్రదాత పరమేశ్వరుడు. మనకి ప్రాప్తించిన శుభాశుభములు ఏనాటి ఏ కర్మ ఫలములో మనమెవరు నిర్ణయించి చెప్పలేము. **కర్మణ్యేవాధికారః.** కనుక మనము తెలిసినంత వరకు / వీలైనంతవరకు కర్మలని శాస్త్రప్రకారమే అనుష్ఠించాలి. ముహూర్తము అవసరమగుచోట శాస్త్ర నిర్దిష్ట ముహూర్తములను అనుసరించాలి. అందుకై శాస్త్రీయ పంచాంగము నందించట పంచాంగకర్త బాధ్యత. అంతేగాని ఏదో ఒక ఫలితమును బట్టి పంచాంగ ప్రామాణ్యతని నిర్ధారించరాదు. అగుచో ఎపుడైనా వ్యతిరేకము జరిగినచో ఏమగును? తస్మాత్ .......!

జాతక ఫలితములు కూడ అదృష్టవశాత్తు కొన్ని సరిపోవచ్చు. వైద్యరంగమున సామాన్య పరిజ్ఞానముతో చేయుచున్న చికిత్సలు కూడ సామాన్యముగ ఫలించుచునే ఉన్నాయి. అంతమాత్రమున విశేష పరిశ్రమ / లోతైన విజ్ఞానము (SPECIALISATION) అనవసరమని అనుట హేతుబద్ధమా?

27. మరికొందరు ఇది తమ సంప్రదాయమని – తరతరములుగ తమ పూర్వులు/గురువులు – అనుసరించుచున్న పద్ధతియని కనుక అదే ప్రామాణికమని అంటారు. సంప్రదాయము / శిష్టాచారమననేమో కాలమాధవీయమున శ్రీ మాధవాచార్యుల వారు చర్చించి నిగ్గు తేల్చినదేమనగా –

**సంమర్శినః** = **యుక్తికుశలాః** (విషయమునకు సంబంధించిన సంపూర్ణ పరిజ్ఞానముతో – పూర్వపక్ష సిద్ధాన్త రూపమున మంచి చెడులని పూర్తిగ విమర్శ చేయువారు).

**యుక్తాః** = **శాస్త్రతత్పరాః** (శాస్త్రమునందు శ్రద్ధగలవారు)

**ఆయుక్తాః** = **తదనుష్ఠానతత్పరాః** (కేవలము పరోపదేశముకొరకు గాక – తమ శాస్త్ర పరిజ్ఞానమును స్వానుష్ఠానమునకు వినియోగించుకొనువారు).

**అలూక్షాః** = **క్రోధవర్జితాః** (తమ వాదమే గెలిచితీరాలనే మొండి పట్టుదల లేనివారు)

**ధర్మతత్పారాః** = ధర్మము నందు మిక్కిలి శ్రద్ధగలవారు.

ఇట్టి **బ్రాహ్మణాః** = బ్రహ్మజ్ఞాన సంపన్నుల ఆచరణయే శిష్టాచారము.

ఇట్టి వారి అభిప్రాయమే శిరోధార్యము.

అంతేకాని కేవలం తండ్రితాతలు చేసినది / చెప్పినది మొత్తము సంప్రదాయము కాజాలదు. తాత ముత్తాతలు కట్టి నివసించి ఇచ్చినదని మరీ పాతబడ్డ ఇంటిని కాలానుగుణములైన చేర్పులు, మార్పులు, కూర్పులు లేకుండా వాడుకొననక్కరలేదు. వాడి తీరాలని అనరాదు. అవసరమైతే మొత్తము కూలగొట్టి క్రొత్తది కట్టుకొనవచ్చును కూడా.

ధర్మశాస్త్రములో ఇలాగాని, అలాగాని అని వికల్పాలు కూడా ఉంటాయి. ఆడపిల్లలకి బేసి సంఖ్యాక్షరములతో పేరు పెట్టాలి. మగపిల్లలకి సరిసంఖ్యతో. అయినా ఇచట **యథావైషాం కులధర్మః స్యాత్** అని ఆపస్తంబ మహర్షి నిర్దేశించారు. ఇట్టి చోట కులధర్మము (తండ్రి తాతల పద్ధతిని) అనుసరించాలి. ఇక్కడ వారి (తండ్రితాతల) విషయంలో ఇంతకుముందు చెప్పుకున్న **సంమర్శినః, యుక్తాః, ఆయుక్తాః** అనే విచారణ అక్కరలేదు. ఆడపిల్లకి సరస్వతి, మగపిల్లవానికి కేశవ అని నామకరణం చేయవచ్చు.

గడచిన 5/6 శతాబ్దములలో మన జాతికి రాజకీయముగ పట్టిన దుర్దశలో మన విద్యలకి, సంప్రదాయాలకి, విజ్ఞానానికి పట్టిన గ్రహణములో – మన పూర్వులు చాలమంది ఎలాగో అప్పటికి అందుబాటులో ఉన్న విద్యని, విజ్ఞానాన్ని కాపాడుకున్నారు. ఖగోళ పరిశీలనలను చేయలేకపోయినా / చేసిన వారి సమాచారము అందుబాటులోని రాకపోవుట వలననో **సర్వనాశే సముత్పన్నే అర్ధం త్యజతి పండితః** అన్నట్లు తెలిసికూడా – కొందరు ఆ పాత కరణ గ్రంథాలతోనే గడుపుకున్నారు. వాటినే మనకి అందించినారు. **అందుకు మనము వారిని అభినందించాలి. కృతార్థులమై ఉండాలి.** లేకున్నచో మనకి అది కూడా లేకుండా పోయేది. బియ్యము దొరకని కాలాలలో జొన్న అన్నముతో కాలము గడుపుకున్నారు. పూరిగుడిసెలలో నివసించారు. మనకి చేతనైనంత విజ్ఞానాన్ని అందించినారు. ఇపుడు మనకు నవీన విజ్ఞానము / ఖగోళ పరిశీలన అందుబాటులో ఉన్నాయి. వాటిని సద్వినియోగము చేసికొనుట విజ్ఞత. మనమిపుడు చక్కని డాబాలలో / మేడలలో ఉంటున్నాము. పూరి గుడిసెలలో ఉండుటే సంప్రదాయము కాదు.

28. ఈ వాద వివాదాల సంగతి ఇక్కడితో వదిలిపెట్టి – విషయ పరిజ్ఞానము కోసం ఈ పూర్వపద్ధతి / దృక్సిద్ధాంతములలోని ప్రధాన సాంకేతిక భేదాలని ఒకింత పరిశీలిద్దాము.

i. పూర్వపద్ధతి : సూర్య చంద్రులకు దృక్సంస్కారం చేయరు. కుజాది పంచగ్రహాలకి కరణ గ్రంథాలను బట్టి చేస్తారు.

**దృక్సిద్ధాంతం** : అన్ని గ్రహాలకు నవీన పద్ధతిలోనే దృక్సంస్కారం చేస్తారు.

ii. పూర్వపద్ధతి : దృక్సిద్ధతిథులు యజ్ఞయాగాదులు, శ్రాద్ధాదులు అగు ధర్మకర్మలకి పనికి రావని వీరి మతము.

**దృక్సిద్ధాంతం** : దృక్సిద్ధ తిథులే సమస్త కార్యాలకీ గ్రాహ్యాలు అని వీరి నిర్ణయము.

iii. పూర్వపద్ధతి : వీరిలో కొందరు, యాత్రా వివాహాదులు దృష్టఫల కర్మలు అనీ - వాటికై జాతక ముహూర్తాదులకు మాత్రము దృక్సిద్ధ తిథులను వాడవచ్చునని అంటారు.

**దృక్సిద్ధాంతం** : వీరికి అన్నిటికీ నవీన దృక్సిద్ధ తిథులే.

iv. పూర్వపద్ధతి : గ్రహణాలకు మాత్రం సూర్య చంద్రులకు దృక్సంస్కారం (నవీన పద్ధతిలోనే) చేస్తారు.

**దృక్సిద్ధాంతం** : అన్నిటికి అలా చేయవలసినదే.

v. పూర్వపద్ధతి : పూర్వకాలపు కరణ గ్రంథాల మీద ఆధారపడినది కనుక ఇది పూర్వపద్ధతి యనబడుచున్నది.

**దృక్సిద్ధాంతం** : నవీన వేధశాలల ప్రత్యక్ష పరిశీలకి నిలబడునది (సరిపోవునది) కనుక ఇది దృక్సిద్ధ పద్ధతి యనబడుచున్నది.

vi. పూర్వపద్ధతి : సిద్ధాన్త, తంత్ర, కరణగ్రంథాదులన్నిట అంతర్లీనమైయున్న కాలానుగుణ సంస్కారములు చేయరు గనుక ఇది నిజమైన పూర్వపద్ధతి కాదు.

**దృక్సిద్ధాంతం** : ఆ అంతస్సూత్రమును సర్వాత్మనా అనుసరించునది గనుక ఇదే నిజమైన పూర్వపద్ధతి యనజెల్లును. నిజమైన దృక్పద్ధతియును ఇదియే.

29. **పూర్వపక్ష / సిద్ధాంతములు -**

**(అ) పూర్వపద్ధతి వారు -**

1. **స్యాద్దేశోచిత నిర్బీజ గ్రహైః పంచాంగ శోధనమ్ । సబీజైః గ్రహణాదీనాం పుణ్య కర్మణి శస్యతే ॥**

2. **దృక్సిద్ధ గ్రహ కాలేన గ్రహణాదీని శోధయేత్ । శాస్త్ర సిద్ధ గ్రహగతిః అదృష్టార్థేషు కర్మసు ॥**

ఇత్యాది కారికలను బట్టి అదృష్ట ఫల సిద్ధికరములగు - అనగా వ్రతోపవాస యజ్ఞ శ్రాద్ధాదులకు నిర్బీజ (దృక్సంస్కార రహిత) గ్రహములను / తిథులను గ్రహించాలనీ - గ్రహణ, గ్రహ సమాగమ, గ్రహోదయాస్తమయ, చంద్ర శృంగోన్నతి మున్నగు వాటికై దృక్సంస్కారమును చేయవలెనని చెప్పుచున్నారు.

**సిద్ధాన్తము :** కారికలు యుక్తి సహములు కావు. కృషి వాణిజ్యాదులు కేవలము దృష్టఫలములు కావచ్చు. వ్రతోపవాస యజ్ఞాదులు దృష్టాదృష్ట ఫలప్రదములే. కేవల దృష్టఫలములకై కూడ వ్రతోపవాస యజ్ఞాదుల అనుష్ఠానము జరుగును. గ్రహణములు దృష్టములు కావచ్చు. గ్రహణ కాలీన స్నాన దాన శ్రాద్ధాదులు కేవలము అదృష్టార్థములే గదా. మరి గ్రహణాదుల పుణ్యకర్మల విషయంలో దృక్సంస్కారము చేయమనుట ఏమి? దృక్సిద్ధ గణితముతో దృగ్గోచర గ్రహణ కాలములను తెలిపినను, పూర్వపక్షము వారు దృక్సంస్కార రహిత గణితముతో దృగ్గోచరము కాని గ్రహణ కాలాదులని కూడా తెలిపి - ఆ సమయముననే గ్రహణ సంబద్ధ పుణ్యకర్మలని జేయవలెనని చెప్పవలెగదా. మేఘాచ్ఛన్నమైనపుడు గ్రహణము దృగ్గోచరము కాకున్నను - **శాస్త్రతో జ్ఞాత్వా** - స్నానదానాదుల జేయ వలెనని ప్రసిద్ధమే కదా. అట్లె దృక్సంస్కార రహిత గణితాగత గ్రహణకాలము లందే గ్రహణ కాల పుణ్య కర్మలని చేయమనరేమి?

మొత్తము మీద ఈ కారికలలో గందరగోళమున్నది.

ఈ కారికకు వ్యతిరేకముగా

**భ చక్ర నాభి దృక్సిద్ధే కుర్యాచ్ఛ్రాద్ధ వ్రతాదికమ్ । భ చక్ర నాభి దృశ్యస్య కర్మాంగత్వే చ హేతవః ॥**

అని కూడ కారిక యున్నది. (పిడపర్తి వారి సిద్ధార్థి సం. పంచాంగ - అనుబంధములో) మరి దీని సంగతి ఏమి?

**(ఆ) పూర్వపద్ధతి వారు -**

దృష్టఫలములగు జాతక ముహూర్త యాత్రా వివాహాదులను దృక్సిద్ధ గ్రహములను, అదృష్టఫలములగు యజ్ఞ శ్రాద్ధాదులకు అదృష్ట (దృక్సంస్కార రహిత) గ్రహములను గ్రహించాలని అంటారు.

**సిద్ధాన్తము :** దృష్టబ్రాహ్మణ సమారాధన, దృష్ట గురు వృద్ధ సేవ, దృష్ట విగ్రహాదుల పూజ, దృష్టాగ్నులలో హోమము ఇవన్నీ కేవలం దృష్ట ఫలములే కాదు కదా. వీటన్నిటా అదృష్ట ఫలము కూడా ఉండును గదా !

అదృష్ట ఫలార్థము కేవలము అరణి / దర్భస్తంబము వంటి అదృష్టాగ్నులలోనే హోమము జేయుట లేదు గదా.

అదృష్ట దేవతోపాసనతో దృష్ట ఫలములు లభించుచున్నాయి గదా. వివాహము కేవలము దృష్ట ఫలకమేనా? అదృష్ట ఫలకమగు సంస్కారము కాదా?

ఇలా విచారించగా పూర్వపక్షము వారి కారికలు ధర్మానుగుణముగ లేవు గనుక మరియు ప్రసిద్ధ ధర్మ స్మృతులలో / నిబంధన గ్రంథములలో లేవు గనుక ఉపేక్ష్యములు అనక తప్పదు.

మన యుక్తి సరిపోకున్నను – స్మృతి మూలకములగుచో ప్రమాణములే యగును. కాని ఇవి ఆబాపతువనటానికి ఆధారములు కనపడుట లేదు. ఒకవేళ ఇవి విశిష్ట విజ్ఞాన సంపన్నులగు కొందరు పెద్దల అభిప్రాయములగుచో – అట్లయినను సమాదరణీయములే కావచ్చును గాని – తత్తుల్యులగు మరొకరు దానికి విరుద్ధమైన మరొక కారికను చెప్పుచుండగా – **తుల్యబల విరోధ న్యాయమున** రెండును ప్రమాణములే యగుచో రెంటిలో ఏది యుక్తి సహమో దానినే గ్రహించ నగును. లేదా వ్యవస్థిత వికల్పము ఏర్పడవలెను. మరి ఆ వ్యవస్థ ఏమి? **సమాధానము దొరకుట లేదు గనుక – పూర్వపక్షము వారి కారికలు ఉపేక్ష్యములనక తప్పదు.**

**(ఇ) పూర్వపద్ధతిలో –**

**బాణవృద్ధీ రస క్షయః –** అను కారికను బట్టి తిథి పరమ వృద్ధి 5 ఘడియలు, పరమ క్షయము 6 ఘడియలు.

**సిద్ధాన్తము :** వ్రత శ్రాద్ధాదులన్నిటికి దిన ప్రమాణమును ప్రాత స్సంగవాదిగ పంచధా విభాగము చేసి శ్రాద్ధాదులకు వలయు కర్మకాలమును పూర్వేద్యురేవ / పరేద్యురేవ ఇత్యాదిగ షట్పక్షవిచారణ చేసినగాని ఆ కార్యక్రమము ఏ రోజు జరుగవలెనో నిర్ణయము కాదు. ఈ పంచకాల / షట్పక్ష విచారణ అన్ని నిబంధన గ్రంథములందును ఒకే రీతిన ఉన్నది. ఈ కాలప్రమాణము సామాన్యముగా 6 ఘడియలు. కర్మ భూమియగు భారత దేశమున ఏ ప్రాంతమున అయినను – ఏ రోజున అయినను ఇది తప్పక 5 ఘడియలకు మించియే ఉండును.

మరి పూర్వపద్ధతిలో తిథి పరమవృద్ధి 5 ఘడియలే గనుక – ఈ షట్పక్ష విచారణలో మూడవది యగు **ఉభయేద్యుః** అనునది దీనిలో ప్రసక్తము కాదు. ప్రసక్తము కాని దానికై నిబంధన కర్తలందరు అంతపట్టుగ ఏకరీతిగ విచారించి షట్పక్ష విధానమును అనుసరించిరనుట న్యాయము కాదు. **కనుక పూర్వపద్ధతి వారి తిథులు ధర్మానుగుణములు కావనక తప్పదు.**

**(ఈ) పూర్వపక్షము –**

**దృక్పద్ధతిలో – వసు వృద్ధిః దశక్షయః** - అనగా తిథి పరమవృద్ధి 8 ఘడియలు, పరమక్షయము 10 ఘడియలు.

కాగా ఒకపుడొక తిథి ముందు వెనుక రోజులలో ఏ రోజునను ప్రాతస్సంగవాది పంచకాలములలో ఒకదానిని ఏ మాత్రము స్పృశించనే స్పృశించదు. (ఇది షట్పక్ష విచారణలో **అనుభయేద్యుః** అనుదానికి చెందే సందర్భము). మరి శ్రాద్ధాదులు – ముఖ్యముగ ప్రత్యాబ్దికములు అపరాహ్ణవ్యాప్తిని బట్టి జరుగవలసినవి గనుక – ఇట్టి సందర్భములలో శ్రాద్ధానికి ఏ రోజూ పనికిరాక శ్రాద్ధలోపము జరుగును. ఒకవేళ మానుకొనలేక ఏదో ఒకరోజు చేసినా ఆ శ్రాద్ధము చెల్లదు. పితృదేవతలు అంగీకరించక శపిస్తారు.

**దృక్సిద్ధ ఖేట గ్రహ సాధితాసు కుర్వంతి కేచిత్తిథిషు ప్రమాదాత్ ।**

**శ్రాద్ధాదికం తత్పితృ శాపతప్తే పుణ్యక్షయా ద్దుర్గతి మాప్నువంతి ॥**

అను వాక్యమును బట్టి ఇది ఖాయము. కనుక దృక్పద్ధతి మంచిది కాదు అని పూర్వపద్ధతి వారి పూర్వపక్షము.

**సిద్ధాన్తము :** ఇట్టి పరిస్థితి పూర్వపద్ధతిలో కూడ రావచ్చు. అహఃప్రమాణము 30 ఘడియల కంటె బాగా తక్కువ అయి – పరమక్షయము 6 ఘడియల దగ్గర నున్నపుడు ఈ పరిస్థితి వచ్చును. అలా వచ్చుచో – పూర్వపక్షము వారు ముందు వెనుకల తిథులని సర్దుబాటు చేసుకుని ఎలాగో అపరాహ్ణ స్పర్శని (కాగితముపై) సాధిస్తారట. ఇదే తప్పు. **ఉభయాపరాహ్ణ స్పర్శ లేకుండుట తప్పుకాదు. ధర్మానుగుణమే. షట్పక్ష విచారణలో ఇది ఒక అంశమే గదా. ఇట్టి పరిస్థితిలో శ్రాద్ధము ఎప్పుడు ఆచరించవలెనో కాలమాధవీయాది సమస్త నిబంధన గ్రంథములందు స్పష్టముగనే ఉన్నది. శ్రాద్ధలోపము జరుగదు. ప్రసిద్ధ గ్రంథములన్నింటికి విరుద్ధమైన పూర్వపక్షము వారి కారికయే హేయము.**

**కనుక దృక్పద్ధతి సర్వాత్మనా ధర్మానుగుణమే. ఇంతకు ముందు చెప్పుకున్నట్లు. ఉభయేద్యుః అనే సందర్భమును స్పృశించని పూర్వపద్ధతియే ధర్మవిరుద్ధము. దృక్పద్ధతియే సర్వాత్మనా ధర్మానుగుణము.**

ఒక్క శ్రాద్ధ విషయముననే గాదు – వ్రతాది సమస్త ధర్మ శాస్త్రముల విషయమున నిబంధన గ్రంథములన్నిట **– అనుభయేద్యుః –** సందర్భము చర్చించి నిర్ణయము చేయబడుచునే యున్నది. కనుక దృక్పద్ధతియే సంపూర్ణముగ ధర్మానుగుణము.

**(ఉ) పూర్వపక్షము –**

దృక్సంస్కారమునకై నవీన వేధశాలలపై ఆధారపడుట అసాంప్రదాయకమని పూర్వపద్ధతి వారి ఆక్షేపణ.

**సిద్ధాన్తము :** సంప్రదాయమనగానేమో – దృక్పద్ధతి ఏ విధముగ అనాది సంప్రదాయమునే అనుసరించుచున్నదో – పూర్వపద్ధతి గత 5/6 శతాబ్దములుగ ఆ సంప్రదాయమున వెనుక ఎలా పడియున్నదో పలుమారులు చెప్పుకున్నాము.

ప్రస్తుత కాలమున మనలో దాదాపు అందరమూ ప్రతిదానికి ఆధునిక సౌకర్యములను వాడుకొనుచునే ఉన్నాము. గత్యంతరము ఉన్నచోట కూడ ఆధునికతకు అంటుకుపోయి ఉన్నాము. డాబాలు / మేడలలో నివసిస్తున్నాయి. సిమెంటు వాడుకుంటున్నాము. రైళ్ళు, బస్సులు, పంపులు, విద్యుత్తు అన్ని ఉపయోగించుకుంటున్నాము. వైశ్వదేవాదులు మానివేశాము. వేషభాషలలో దాదాపు అసాంప్రదాయికులమే. ఒక్క ఈ విషయములో అంతపట్టుదల దేనికి?

**అవృత శ్చాస్త్రీభ్యః ప్రతీయేరన్ (ఆశూద్రాభ్యః)** అని ఆపస్తంబ మహర్షి ఉపదేశము. మంగళకర విషయములను స్త్రీల నుండి (శూద్ర స్త్రీల నుండి కూడా) గ్రహించాలని దాని భావము. **బాలాదపి సుభాషితమ్. కనుక ఆధునిక పరిశీలనలోని యోగ్య విషయములను గ్రహించుట తప్పుకాదు - గ్రహించకుండుటే తప్పు. గ్రహించుటయే వివేకము.**

**గమనిక :-**

పంచాంగ గణనలో ప్రధానభాగము సూర్యచంద్రులపై ఆధారపడిన తిథి, నక్షత్ర, యోగ, కరణములకు సంబంధించినదే. సూర్యచంద్రులకు కూడ కాలానుగుణ సంస్కారములు చేసి తీరవలెనని - అదే అనాది పంచాంగ సంప్రదాయమనీ - ధర్మశాస్త్ర నిర్దేశము కూడా అదేనని నిరూపించు కొనియున్నాము.

**మిశ్ర పద్ధతిలో సూర్యచంద్రులకు దృక్సంస్కారము ఉండదు గనుక అది అనాదరణీయమని వేరుగ చెప్పనక్కరలేదు.**

30. కాలానుగుణ దృక్సంస్కార సంపన్నమైన దృక్పద్ధతియే అన్ని విధాలా యోగ్యము అని తేల్చుకున్నాము. అయితే - వీటిలో కూడా అవాంతర భేదాలు లేకపోలేదు. దీనికి ప్రధాన కారణము అయనాంశలోని మన చర్చలో 24వ ఖండిక (పేరా)లో ప్రస్తావించుకున్నాము. **ఈ అయనాంశయననేమి? దానికీ మన పంచాంగ గణితానికీ సంబంధమేమియను దానిని మనము బాగా అర్థం చేసుకోవాలి.** అందులకై కొన్ని ఖగోళ గణితమునకు సంబంధించిన మౌలిక సాంకేతిక పరిభాషలని కూడ చెప్పుకోవాలి.

31. **అయనాంశకి సంబంధించిన సాంకేతిక విషయములు**

1. సూర్యాది గ్రహములు మేషాది రాశులలోనికి ప్రవేశించుట సంక్రమణము / సంక్రాన్తి అంటారు. ఇవి సాయనములు / నిరయణములు అని రెండు రకములు.
2. రాశిచక్రంలో సూర్యుని గతి చాల నియతముగా - సుమారు 365 రోజులలో ఒక చుట్టు (360 భాగలు = డిగ్రీలు) పూర్తి అవుతుంది. ఇదే సౌర సంవత్సరం. నిరయణ సంక్రమణాలన్నీ ఎల్లకాలం సౌరమానంలో దాదాపు ఒకే రోజులలో (తేదీలలో) జరుగుతాయి.
   ఉదాహరణకి :- మకర సంక్రాంతి జనవరి 14.
3. సాయన సంక్రమణములు అలా కాదు. వీటికీ నియతి ఉంటుంది గాని నిరయణాల వలె ఇవి ఎల్లకాలం ఒకే తేదీలలో రావు. ప్రస్తుతకాలములో సాయన సూర్య సంక్రమణాలు నిరయణ సంక్రమణాల కంటె 24 రోజులు ముందుగానే అగుచున్నాయి. కాలం గడిచే కొద్దీ ఈ దూరం పెరుగుతుంది. మరికొంత కాలానికి తగ్గవచ్చును కూడా. మార్పుమాత్రం చాల సూక్ష్మం. సంవత్సరానికి దాదాపు 50 విలిప్తలు. **దీనినే అయనాంశమంటారు.**
4. సంవత్సరానికి 50 విలిప్తలు అనగా 22 సం.లకు ఒక భాగ (డిగ్రీ) ఈ లెక్కన సూర్యుని ఒక చుట్టూ (పరిభ్రమణం) అనగా 360 డిగ్రీలు పూర్తి కావటానికి 360 × 72 = దాదాపు 26000 సంవత్సరాలు పట్టవచ్చు. **ఇది పరిభ్రమణ సిద్ధాంతం.**
5. ఎల్లకాలం ఇది ఇలానే జరిగిపోతుందని కొందరి అభిప్రాయం. కాగా ఇలా జరిగిపోతూ ఉంటే $180^0$ డిగ్రీల తరువాత సాయనాలు నిరయణాలకి వెనుకపడినట్లే కనిపిస్తాయి.
6. కొందరు అలా జరుగదనీ - అయనాంశలు 27 భాగల (డిగ్రీల) వరకు పెరిగి (ఒక క్షణం ఆగి) తగ్గటం ఆరంభిస్తాయనీ, అలా తగ్గి తగ్గి సున్నా అయి, ఇంకా వెనుకకి 27 భాగల (డిగ్రీల) వరకు పోతాయనీ, ఇలా ఇవి 54 భాగల (డిగ్రీల) మేరలో అటూ ఇటూ ఉయ్యాల వలె, పిల్లలు ఆడుకునే తాడు - బొంగరంలోని బొంగరం తలవలె ఊగిసలాడుచుండునని అంటారు. ఈ ఊగిసలాటికి (72 సంవత్సరములకి ఒక భాగ (డిగ్రీ) చొప్పున 54 × 72 =) సుమారు 4000 సం॥లు పట్టవచ్చు. **ఇది దోలన సిద్ధాంతము.**
7. **దురదృష్టవశాత్తు ఈ విషయంలో మనకి ప్రస్తుతము లభించుచున్న పూర్వగ్రంథాలలో స్పష్టమైన సమాచారము లభించుట లేదు. నవీన విజ్ఞానులలో కూడా అభిప్రాయ భేదాలు ఉన్నాయి.** నిజానిజాలు ప్రత్యక్షంగా తేలవలెనంటే - ప్రస్తుతం అయనాంశలు $24^0$ అయితే ఇవి $27^0$ లకు చేరటానికి మరొక $3^0$ ల ప్రయాణం అవసరం. 72 సం॥లకు ఒక చొప్పున ఈ ప్రయాణానికి 3 × 72 = దాదాపు 250 అగును. కాగా అప్పుడు గాని మన ప్రత్యక్ష పరిశీలన సాధ్యము కాదు.
8. భూమధ్య రేఖకి ఖగోళానికి పెంచితే ఖగోళ మధ్య రేఖ అవుతుంది. **దానినే విషువత్ వృత్తము / సంపాత వృత్తమని కూడా అంటారు.** (విషువత్ అనే మాటకి పగలు / రాత్రి సమానముగా (ఒక్కొక్కటీ 12 గం॥లు) ఉండే కాలమని అర్థము. సూర్యుడు దాని దగ్గరకు వచ్చినపుడు అట్లు అగును).
9. భూమి సూర్యుని చుట్టూ సంవత్సరమున కొక భ్రమణము చేయుచున్నది. భూమియే స్థిరముగ నున్నదనుకున్నచో - సూర్యుడే తిరుగు చున్నట్లుగుపించుచునే ఉన్నది కదా. ఇట్లు **సూర్యుడు భూమి చుట్టూ తిరుగుచున్నట్లు కనిపించుచున్న మార్గాన్నే రాశి చక్రమంటారు.** (ఇంకా దీనినే జ్యోతిశ్చక్రమనీ, భచక్రమనీ, క్రాన్తివృత్తమనీ కూడా అంటారు).
10. విషువత్ వృత్తము - రాశిచక్రములు పరస్పరం $23^{1/2}$ భాగల (డిగ్రీలు) కోణములో ఖండించుకుంటాయి. ఖండన బిందువులు రెండు.

**వీటికే విషువత్**




**బిందువని పేరు.** ఒకటి వసంత విషువత్. రెండవది శరత్ విషువత్. (వీటినే సంపాత బిందువలని కూడా అంటారు).

(సూర్యుడు వసంత విషువత్ దగ్గరకు ప్రస్తుత కాలమున మార్చి 21న వచ్చును. అపుడు సౌర వసంత ఋతువు ఆరంభమగును. అట్లే శరత్ విషువత్ దగ్గరకు సెప్టెంబరు 22న వచ్చును. అపుడు సౌర శరత్ ఋతువు ప్రారంభమగును.

11. నిజానికి ఆకాశములో సూర్యచంద్రాదుల కక్ష్యలు ఎవరికి వారివే అయినా కోణీయముగా అందరూ క్రాంతి (రాశి) చక్రము మీదనే సంచరించుచున్నట్లు లెక్కలు వేస్తారు. **ఇది గోళగణిత పద్ధతి.** దీనిలోని 12 సమాన భాగాలే మేషాది రాశులు. ఒక్కొక్క రాశికి నిడివి 30 భాగలు.

12. భూమి రోజుకి ఒక మారు తన చుట్టూ అనగా తన ఉత్తర దక్షిణ ధ్రువ రేఖ చుట్టూ తిరుగుచునే సంవత్సరమున కొకసారి సూర్యుని చుట్టూ కూడా తిరుగుచున్నదని ప్రసిద్ధము. ఈ రెండు చలనాలే గాక భూమికి ఇంకా చాల చలనాలు ఉన్నాయి.

తాడు – బొంగరం ఆటలోని బొంగరం తన చుట్టూ తిరుగుటకు గాక మరొక అక్షం చుట్టూ కూడ తిరుగుచు కొంత ప్రక్కకి కూడా పోతుంది. దాని ములికి నేలపై వృత్తమును గాక చాపచుట్టు ముఖ చిత్రములోని వక్రరేఖవంటి –



ఇలాంటి గీతని గీస్తుంది. ఇంక దాని తలభాగం ఒకనిలువుగీతకి అటూఇటూ ఊగుతూ ఉంటుంది. ఇంతకు భూమికి కూడ ఇలాంటి చలనాలు చాలానే ఉన్నాయి. (దానికి సంబంధించిన భౌతిక కారణాలు / ఆకర్షణలు మున్నగునవి కూడా చాలానే ఉంటాయి).

ఫలితముగ ఆకాశమున భూమధ్యరేఖ స్థిరము కాదు (భూమిపై స్థిరమే). అంటే ఆకాశమున ఖగోళ మధ్య రేఖ కూడా స్థిరము కాజాలదు. దానిని రెండు ఇరుసుల మీద వదులుగా అటు ఇటూ ఊగే పళ్ళెము వలె ఊహించుకొనవచ్చును. ఇది ఒకవైపు క్రిందికి వంగితే ఆవైపు ఆ మేరకు విషువత్ బిందువు క్రాంతి వృత్తము (రాశిచక్రము)పై క్రిందికి దిగిపోతుంది. రెండవ విషువత్తు ఆ మేరకు ఆ రాశిచక్రము మీదనే పైకి లేస్తుంది.

**ఇలా ఈ విషువత్ బిందువులు రాశిచక్రముపై సంవత్సరానికి కోణీయముగా ఎంత దూరం పోతాయో ఆ దూరమే (ఆ కోణమే) మన మిదివరలో చెప్పుకున్న అయనాంశ.**

13. విషువత్తులు స్థిరముగా నున్నచో – అటనుండి సూర్యుడు రాశిచక్రములో ఒక పరిభ్రమణ చేయటానికి ఒక సంవత్సరము పట్టును కదా. మరి విషువత్తు ఒకవైపు దిగిపోవుచున్నచో – అటుగా – అనగా దానికి అభిముఖముగా సూర్యుడు వచ్చుచున్నచో సూర్యుడు దానిని (ఆ విషువత్ బిందువుని) కలిసే సమయం ఒక సం. కంటె ఒకింత తక్కువయే అగును కదా. ఇక విషువత్తు 72 సం.లలో సుమారు ఒక భాగ దిగగా సూర్యుడు దానిని ఒకరోజు ముందుగనే కలిసికొనుట జరుగును. ఈ లెక్కన వసన్త విషువత్తు ఇప్పటికి 24 డిగ్రీలు దిగియున్నచో సూర్యుడు దానిని 24 రోజుల ముందుగనే కలియుట జరుగును.

14. ఇక ఈ అయనాంశల కొలతకి మొదలెక్కడ. చలరాశుల లెక్కకి స్థిర రాశి అంటూ ఒకటి ఉండాలి కదా. అది ఏమి అనగా – ఆకాశములో సూర్యచంద్రాది గ్రహాలు అన్నీ నిత్యము చలనశీలాలే. వాటి కదలికలతో ఎట్టి సంబంధం లేకుండా ఎక్కడో అనంత దూరాలలో దాదాపు స్థిరముగ ఉండేవి నక్షత్రాలు. (న క్షరతి = న చలతి = నక్షత్రం అని వ్యుత్పత్తి). నిజానికి అశ్విన్యాదులలో ప్రతిదీ ఎక్కడెక్కడో ఉన్న అనేక నక్షత్రాల సమూహమే. ప్రస్తుతానికి అలాంటి సమూహాలలో ఒక్కొక్క దానిని ఒక్కొక్క నక్షత్రముగాను – మరల ఇవన్నీ రాశి చక్రముపై కోణీయముగా సమానదూరాన్ని వ్యాపించి స్థిరముగ ఉన్నట్లు భావించి ఖగోళ గణన జరుగుచూ ఉంటుంది. కాగా నక్షత్రపు నిడివి 13 భాగల 20 లిప్తలు. ($13^0 20'$).

15. రాశిచక్రాన్ని 12 భాగాలు చేసుకుంటే ఒక్కొక్క భాగం ఒక్కొక్క రాశి. దాని పొడవు 30 భాగలు. నక్షత్రవ్యాప్తిని నాలుగు భాగాలు చేస్తే ఒక్కొక్కటి ఒక్కొక్కపాదం. దాని పొడవు 3 భాగల 20 లిప్తలు. 27 నక్షత్రాలకి 27×4=108 పాదాలు. ఇవి 12 రాశులని సమానముగా వ్యాపించగా ఒక్కొక్క రాశిలో 9 నక్షత్ర పాదాలు చేరుతాయి. 12 × 9 = 108 నక్షత్ర పాదాలు. మేషరాశి అశ్వినితో మొదలు.

16. **ఇంతకు అశ్విని ఆరంభ స్థానము నుండి ఈ అయనాంశల కొలత ఆరంభమౌతుంది. అనగా విషువత్ చలనము అశ్విని ఆరంభ స్థానము నుండి లెక్కించబడుతుంది.** (నిజానికి ఈ కొలతని మన ఇష్టానుసారం ఎక్కడి నుండి అయినా ఆరంభించవచ్చు. కాని ఎవరికి వారు తలొకచోట కాకుండా – ఖగోళ గణిత సౌకర్యార్థం అందరూ అశ్విన్యాదితో ప్రారంభిస్తారు).

కాగా ప్రస్తుత అయనాంశలు 24 భాగలు. అనగా వసంత విషువత్తు అశ్విన్యాది నుండి రాశి చక్రము మీద 24 భాగలు (డిగ్రీలు) దిగినది అని అర్థము.

17. ఇంతకు **– కదిలిపోతూ ఉండే ఈ విషువత్తుల ఆధారముగ చేయబడే గణితము సాయన గణితము. కదలని నక్షత్రముల ఆధారముగా (సౌకర్యార్థము అశ్విని ఆరంభము నుండి) చేయబడేది నిరయణ గణితము.**

**గమనిక :–** 1. ఈ నిరయణ – సాయన పదములలోని అయనము (కదలిక) విషువత్తులది. సూర్యునిది కాదు.

2. సంక్రమణము నిరయణము గాని / సాయనము గాని క్షణికమే.

3. ఉత్తరాయణ / దక్షిణాయనములు అర్ధసంవత్సరాత్మకములగు కాలభాగములు. వీటిలోని అయనము సూర్యునిది. విషువత్తులది కాదు. రాశి చక్రమున సూర్యుడు ఉత్తరమున సంచరించుకాలము ఉత్తరాయణము. అట్లే దక్షిణాన సంచరించు కాలము దక్షిణాయనము.

18. మేషాది రాశులు నక్షత్రాలని వదిలి విషువత్తులతో పాటు కదలుచున్నాయని భావిస్తే – భావించి లెక్కిస్తే – వసంత విషువత్తుతో పాటు మేషరాశి – దానివెంట తతిమా రాశులు అన్ని ఒకదాని వెంట ఒకటి కదిలిపోయి ఎప్పటికప్పుడు రాశిచక్రముపై క్రొత్త స్థావరాలు చేరినట్లు అవుతుంది. **ఈ క్రొత్త స్థావరాలలోనికి గ్రహాలు రావటమే సాయన సంక్రమణములు. కదిలిపోయే విషువత్తులతో సంబంధం లేకుండా నక్షత్రాలని పట్టుకుని స్థిరంగా ఉన్న రాశుల లోనికి (రాశుల స్థావరాలలోనికి) గ్రహాలు రావటమే నిరయణ సంక్రమణములు.** (నిరయణం = అయనము లేనిది).

19. కాలగతిలో ఒకానొక శుభక్షణాన వసంతవిషువత్తు అశ్విని ఆరంభ స్థానమునకు (అనగా నిరయణ మేషరాశి మొదటికి) రాక తప్పదు. అపుడు ఆ వసంత విషువత్తుతో పాటు సాయన మేషారంభము కూడా అచటికి చేరినట్లె అగును కదా. అనగా ఆ శుభక్షణాన నిరయణ సాయనరాశులు అన్నీ మమేకమైపోతాయి. (నిరయణ మేషముతో సాయన మేషము – ఈ విధముగా) అపుడు జరిగే సంక్రమణాలకి సాయన నిరయణ భేదము ఉండదు. **ఆ క్షణాన్ని అయనశూన్యకాల మంటారు.**

**(సైద్ధాంతికముగ అది ఒక క్షణమే గాని – వ్యవహార దశలో ఆ అయనశూన్యదశ కొన్ని సంవత్సరాల పాటు సాగవచ్చు. అతి సూక్ష్మమైన ఆ విషువత్ చలనాన్ని రోజురోజుకి గుర్తించలేము కదా).**

20. **దరిమిలా విషువత్ చలనముతో అయనాంశ ఆరంభమౌతుంది. నిరయణ సాయనాలు విడిపోతాయి. కనుకనే అయనాంశల లెక్క అక్కడ నుండి (అశ్విన్యాది నుండి) ఆరంభము అవుతుంది.**

21. అలా సంవత్సరానికి 50 విలిప్తలు (72 సం.కి ఒక డిగ్రీ) చొప్పున ఇప్పటికి 24 డిగ్రీలు అయి ఉన్నాయని ఒక లెక్క. అనగా వసంత విషువత్తు అశ్విని నుండి 24 డిగ్రీలు దిగింది. అంటే చిత్రా నక్షత్రం మధ్యకి చేరింది అని. **కనుక ఈ లెక్కని చైత్ర పక్ష అయనాంశములని అంటారు.** వీటి ప్రకారం సాయన సూర్యసంక్రమణాలు ప్రస్తుత కాలంలో నిరయణ సూర్య సంక్రమణాల కంటె 24 రోజులు ముందుగానే అగుచున్నట్లు లెక్క

**22. ముఖ్యమైన గమనిక :**

(1) ఈ అయనాంశలు సంవత్సరానికి 50 విలిప్తలు అనేది దైవదత్తమైన అంకె ఏమి కాదు. ఇది ఎంత అనేది ఒక యక్షప్రశ్న. ప్రాచీన నవీన ఖగోళ గ్రన్థాలలో అభిప్రాయ భేదాలు / వాదాలు చాలానే ఉన్నాయి. కొందరు 30 విలిప్తలు అనగా మరికొందరు 60 అని కూడ అన్నారు. ఎక్కువ మంది 50 దగ్గర ఉన్నారు.

(2) ఇది 50 కావచ్చు మరొకటి కావచ్చు – ఏది అయినను ఒక ఉజ్జాయింపు మాత్రమేగాని ఎల్లకాలమిది ఇట్లు స్థిరమనుకొనుట కుదరదు.

**32.**

## సాయన, నిరయణముల అవసరము

(ముహూర్త చింతామణి / పీయూషధార వ్యాఖ్య – పుట 205–209).

ఇంతకు ఈ రెండు రకాల లెక్కలు దేనికి? అనగా ఆ అవసరము ఉన్నది. ప్రతిదానికి దాని ఉపయోగాలు / హద్దులు ఉన్నాయి. స్థూలముగా –

**అ) సాయనముల సంగతి :**

1) సాయన చలనాలు ప్రత్యక్షములు. వేధశాలలో దూరదర్శినుల ద్వారా నేరుగ చూడవచ్చు.

2) దినరాత్రి ప్రమాణాలు సాయన సూర్య సంక్రమణాలని బట్టి నిర్ణయమౌతాయి. ఇవి మనకి ప్రత్యక్షముగ కనిపిస్తాయి. ఎలా అనగా –

i) ప్రస్తుతకాలములో సాయన విషువత్తు (ఇదే సాయన మేషసంక్రమణం / మేషాయనం) మార్చి 21న జరుగు చున్నది. అట్లే సాయన తులా

సంక్రమణం (శరత్ విషువత్తు / తులాయనం) సెప్టెంబరు 22న జరుగుచున్నది. ఈ రెండు రోజులలోను అన్ని ప్రాంతాలలోను పగలు రాత్రి సరిసమానముగ ఉండటం సర్వప్రత్యక్షం.

ii) సాయన కర్కాటక సంక్రమణం జూన్ 21న జరుగును. ఆనాటి నుండి రాశి చక్రములో సూర్యుడు దక్షిణమునకు మరలుట ప్రత్యక్షముగా చూడవచ్చు. అన్ని ప్రాంతాలలో ఆనాటి పగటి ప్రమాణం గరిష్ఠం. రాత్రి ప్రమాణం కనిష్ఠం. అప్పటి నుండి పగటి ప్రమాణం తగ్గటం మొదలై తగ్గితగ్గి డిసెంబరు 22న కనిష్ఠమౌతుంది.

iii) డిసెంబరు 22 సాయన మకర సంక్రమణం. ఆనాటి నుండి సూర్యుడు రాశి చక్రంలో ఉత్తరానికి మరలటం అందరికి నేరుగ తెలుస్తుంది. ఆనాటి పగటి ప్రమాణం కనిష్ఠం. రాత్రి ప్రమాణం గరిష్ఠం. అప్పటి నుండి అన్ని ప్రాంతాలలో పగటి ప్రయాణం రోజు రోజు పెరుగుతుంది. అలా పెరిగి పెరిగి జూన్ 21న సాయన కర్కట సంక్రమణం నాడు గరిష్ఠమౌతుంది.

iv) సాయన మకర / కర్కాటక సంక్రమణముల ఫలితముగ సూర్యుడు రాశి చక్రమున ఉత్తర / దక్షిణములకు మరలుట గోడలు / చెట్ల నీడలని బట్టి గుర్తించగలము.

v) ఖగోళ గణితానికి / పంచాంగ గణితానికి సాయనాల ఉపయోగాలు చాల ఉన్నాయి.

**ఆ) నిరయణముల సంగతి :**

i) మన ధార్మిక కార్యక్రమములన్నీ నిరయణాలతోనే ముడిపడి ఉన్నాయి.

ii) తిథి, వారములకు సాయన / నిరయణ భేదము ఉండదు. నక్షత్ర – యోగములకి మాత్రము ధార్మిక కార్యక్రమాలకు సంబంధించినంతవరకు నిరయణములే కావాలి.

iii) చైత్రాది చాంద్రమాసములు నిరయణముననే చెప్పబడినాయి.

iv) అధిక / క్షయ మాసములు నిరయణముననే కుదురుతాయి. సాయనమున కాదు.

v) గ్రహణాలు నిరయణమున మాత్రమే కుదురుతాయి. సాయనమున కుదరనే కుదరవు.

vi) జాతక ముహూర్తాది శాస్త్రములు, గురు పుష్యాది శుభయోగాలు, భరణీ విష్కంభాది దుర్యోగాలు ఇవన్నీ సాయనంలో చెల్లవు. నిరయణంలోనే చెప్పబడినాయి. నిత్యకృత్యాలలో నిరయణాల అవసరం ఇలా చాలానే ఉన్నది.

vii) ఉత్తర దక్షిణాయనముల ఆరంభము సాయన మకర / కర్కాటక సంక్రణములతోటే ప్రత్యక్షగోచరమగును. **అయినను ఆయా అయనములలో చేయవలసిన ధార్మికక్రియలకై – ఆయా అయనముల ఆరంభమును మాత్రము నిరయణ సంక్రమణములని బట్టి మాత్రమే గ్రహించవలెనని ధర్మశాస్త్ర నిర్దేశము.** అనగా – ధార్మిక కార్యక్రమములకై నిరయణ మకర సంక్రమణమును బట్టి ఉత్తరాయణారంభము. అట్లే నిరయణ కర్కాటక సంక్రమణమును బట్టి దక్షిణాయనారంభమని గ్రహించవలెను.

**గమనిక :** సాయన నిరయణ సంక్రమణములన్నియు (మొత్తము 24) పుణ్యకాలములే. ఆ సమయములలో చేసెడి స్నాన దాన శ్రాద్ధ జప హోమాది పుణ్యకర్మలకు ఫలమెక్కువ.

**విశేషమేమనగా – "సుకృతం చల సంక్రాన్తావక్షయం పురుషోఽ శ్నుతే"** (ధర్మప్రదీపము – పుట 10) అనగా **నిరయణ సంక్రమణ పుణ్యకాలము కంటే – సాయన సంక్రమణ పుణ్య కాలమున పుణ్యఫలము మరీ ఎక్కువ** – అని.

33. అయితే వేధశాలలో / దురదర్శినుల ద్వారా సాయనచలనాలే దృగ్గోచరమౌతాయి. నిరయణాలు కావు. అయనాంశము తెలిసినచో సాయనముల నుండి నిరయణములను రాబట్టుకొనగలము. తదర్థము అయనాంశ పరిజ్ఞానము తప్పనిసరి. వేధశాలల నుండి లభించిన సాయన సమాచారమును బట్టి మనము నిరయణ గ్రహస్థిత్యాదులను గణించి – తద్వారా నిరయణ పంచాంగ గణన చేసికొనవలసి యున్నది. కనుక ఎప్పటికప్పుడు అప్పటి అయనాంశలని మనము తెలిసికొనుచునే ఉండాలి. అయనాంశలో మార్పు అతిసూక్ష్మము గనుక ఇవి ఏ రోజుకి ఆ రోజును గాక – సంవత్సరానికొకమారు గుర్తిస్తారు. ఈ **హేమలంబ** సంవత్సరారంభమున చైత్ర పక్షాయనాంశలు $24^{\circ}05'33''$.

ఈ మధ్యనే స్వర్గస్థులైన (రాజమండ్రి) **శ్రీ మధుర కృష్ణమూర్తి శాస్త్రి గారు వారి గురువుగారు శ్రీపాద వెంకటరమణ శర్మ గారి** మార్గములో ఈ అయనాంశలతో ఏకీభవించలేదు. వారి లెక్క ప్రకారం ఈ హేవలంబారంభాయనాంశలు $20^{0}58'33''$.

ఈ విషయమై చిరకాలముగ ఖగోళ సిద్ధాంతుల మధ్య వాద వివాదాలు జరుగుచూనే ఉన్నాయి. శ్రీ మధుర వారు ఈ రంగమున ఉద్దండ పండితులే అయినా ఆ రంగమున తదితరులెవ్వరు వారి వాదము నంగీకరించుట లేదు. ఆ వాద వివాద విషయము అతి సాంకేతికము గనుక ఇచట దానిని ప్రస్తావించుట కుదరదు.

దృక్పద్ధతి పంచాంగములలో భేదమంతయు ఈ అయనాంశభేదము వలననే అని – ప్రస్తుతము మన భారతదేశమున / ముఖ్యముగ మన తెలుగునాట దృక్పద్ధతి పంచాంగములు ఈ రెండు రకములేనని – ప్రస్తుతానికి బహు విజ్ఞుల ఆదరణని పొందినవి చైత్ర పక్ష అయనాంశలే అని మరొకసారి గుర్తు చేసుకుందాము.

**– సత్యం పరం ధీమహి –**

## వరుణ స్తోత్రం

నీరే ప్రాణాధారం. ప్రాణులకు ఆహారం కూడ అవసరమే. కాని పంటలు సరిగ పండి ఆహారం బాగా లభించాలంటే దానికి కూడ నీరు బాగా అవసరం. మానవులకు అయితే ఇంటికి – వంటికీ – మరెన్నో అవసరాలకు కూడ నీరు చాలా కావాలి. కాని యీ కాలంలో ప్రపంచంలో చాలా చోట్ల – మనదేశంలో అన్ని చోట్ల – నీటి కరువు ఎక్కువగా ఉన్నది. ముఖ్యంగా వేసవిలో మరీను. కృష్ణా – గోదావరి వంటి మహానదులు, జీవనదులలోనే నీరు అడుగంటి పోవుచున్నది. చెఱువులు, బావుల సంగతి చెప్పనక్కరలేదు. భూగర్భజలసంపద కూడ ఘోరముగ తగ్గిపోవుచున్నది. వీటన్నిటికి వర్షాభావము ముఖ్యకారణము. ఒకప్పుడు అకాల – విపరీత వర్షముల వలన తీవ్రమయిన కీడు కూడ ఏర్పడుచున్నది.

ఇట్టి సందర్భములలో భగవన్తుని ఈ వారుణ స్తోత్రముతో స్తుతించిన వరుణదేవుని అనుగ్రహము ద్వారా అకాల – అతివృష్టి – అనావృష్టి బాధలు తొలగును. సకాల సువృష్టితో దేశము సస్యశ్యామలమై ప్రజలు సుభిక్షము, సుఖశాన్తులతో వర్ధిల్లుదురు. కనుక మనమందరము మన కోసమై, మనవారి కోసమై – మనతోటి వారి కోసమై మనవంతు కర్తవ్యముగ ప్రతిరోజు ఈ స్తోత్రమును 11 సార్లు పారాయణం చేతాము.

చంద్రప్రభం పంకజ సన్నివిష్టం
పాశాంకుశా భీతి వరాన్ దధానం ।
ముక్తా కలాపాంకిత సర్వగాత్రం
ధ్యాయేత్ప్రసన్నం వరుణం సువృష్ట్యై ॥ 1

అపామధిపతే దేవ దయాళో దీనవత్సల ।
త్వం వై జలపతిర్భూత్వా సర్వ సస్యాభివృద్ధయే ॥ 2

నిమంత్రితో మహేశాన పూర్వం త్రైలోక్య రక్షణే ।
అస్మాభిః ప్రార్థితో నూన మనావృష్టి ప్రపీడితైః ॥
అద్య త్రైలోక్య రక్షార్థం అపః క్షిప్రం ప్రవర్షయ ॥ 3

పాశ వజ్ర ధరం దేవం వరదాభయ పాణినం ।
అభ్రారూఢం చ సర్వేశం వృష్ట్యర్థం ప్రణమామ్యహమ్ ॥ 4

యస్య కేశేషు జీమూతా నద్య స్సర్వాంగ సంధిషు ।
కుక్షౌ సముద్రా శ్చత్వారః తస్మై తోయాత్మనే నమః ॥ 5

పుష్కలా వర్తకై ర్మేఘైః ప్లావయన్తం వసుంధరాం ।
విద్యుద్గర్జన సంబోధ తోయాత్మానం నమామ్యహం ॥ 6

ఆయాతు వరుణం శీఘ్రం ప్రాణినాం ప్రాణరక్షకః ।
అతుల్య బలవానత్ర సర్వ సస్యాభివృద్ధయే ॥ 7

ఋష్య శృంగాయ మునయే విభండక సుతాయ చ ।
నమ శ్శాంతాధిపతయే సద్య స్సువృష్టి హేతవే ॥ 8

విభండక సుత శ్రీమాన్ శాంతాపతి రకల్మషః ।
ఋష్య శృంగ ఇతి ఖ్యాతో మహావర్షం ప్రయచ్ఛతు ॥ 9

***

## శ్రీ దుర్గా సప్తశ్లోకీ

శివ ఉవాచ –
దేవి ! త్వం భక్తసులభే సర్వ కార్య విధాయిని ।
కలౌ హి కార్యసిద్ధ్యర్థ ముపాయం బ్రూహి యత్నతః ॥
దేవ్యువాచ –
శృణు దేవ ప్రవక్ష్యామి కలౌ సర్వేష్టసాధనమ్ ।
మయా తవైవ స్నేహేనాప్యమ్బాస్తుతిః ప్రకాశ్యతే ॥

అస్య శ్రీ దుర్గా సప్తశ్లోకీ స్తోత్ర మంత్రస్య నారాయణ ఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యో దేవతాః, శ్రీ దుర్గాప్రీత్యర్థం సప్తశ్లోకీ దుర్గాపాఠే వినియోగః ।

జ్ఞానినా మపి చేతాంసి దేవీ భగవతీ హి సా ।
బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి ॥ 1.

దుర్గే స్మృతా హరసి భీతి మశేషజంతోః
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ।
దారిద్ర్య దుఃఖ భయహారిణి కా త్వదన్యా
సర్వోపకారకరణాయ సదార్ద్రచిత్తా ॥ 2.

సర్వ మంగళ మాంగల్యే శివే సర్వార్థసాధికే ।
శరణ్యే త్ర్యంబకే గౌరి నారాయణి నమోఽస్తుతే ॥ 3.

శరణాగతదీనార్త పరిత్రాణ పరాయణే ।
సర్వస్యార్తి హరే దేవి నారాయణి నమోఽస్తుతే ॥ 4.

సర్వస్వరూపే సర్వేశే సర్వశక్తి సమన్వితే ।
భయేభ్య స్త్రాహి నో దేవి దుర్గే దేవి నమోఽస్తుతే ॥ 5.

రోగానశేషానపహంసి తుష్టా
రుష్టా తు కామాన్ సకలానభీష్టాన్ ।
త్వామాశ్రితానాం న విపన్నరాణాం
త్వామా శ్రితా హ్యాశ్రయతాం ప్రయాంతి ॥ 6.

సర్వబాధా ప్రశమనం త్రైలోక్యస్యాఖిలేశ్వరి ।
ఏవ మేవ త్వయా కార్య మస్మద్వైరి వినాశనమ్ ॥ 7

య ఏత త్పరమం గుహ్యం సర్వరక్షా విశారదమ్ ।
దేవ్యా సంభాషితం తత్ర సర్వత్ర విజయీ భవేత్ ॥ 8

★★★

0883 - 246 2565
903 246 2565

MOHAN PUBLICATIONS

# మోహన్ పబ్లికేషన్స్,

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533101.

WWW.MOHANPUBLICATIONS.COM

## మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

63. కలశపూజలు (9ఒకేసారి) 150-00
64. కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) ....
65. హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) ....
66. గోమాత 40-00

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

1. శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు 45-00
పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం
2. లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, 50-00
3. లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, 50-00
4. స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) 99-00
5. లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి 63-00
6. స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ 108-00
7. సర్వదేవతా స్తోత్రమంజరి 120-00
8. సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) 24-00
9. విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) 25-00
10. లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) 36-00
11. లలితా సహస్రనామములు 24-00
12. లక్ష్మీ సహస్రనామములు 24-00
13. దుర్గా సహస్రనామములు 24-00
14. ఆంజనేయ సహస్రనామములు 24-00
15. శివ సహస్రనామములు 24-00
16. విష్ణు సహస్రనామములు 24-00
17. గణపతి సహస్రనామములు 24-00
18. సుబ్రహ్మణ్య సహస్రనామములు 24-00
19. గాయత్రి సహస్రనామములు 24-00
20. లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు 24-00
21. శ్రీరామా సహస్రనామములు 24-00
22. సరస్వతి సహస్రనామములు 24-00
23. సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం 24-00
24. శ్రీవేంకటేశ్వరసహస్రనామములు 24-00
25. మణిద్వీపవర్ణన (పెద్దది) 24-00
26. సంధ్యావందనం 24-00
27. మంత్రపుష్పమ్ ....
28. త్రిభాషా హనుమాన్‌చాలీసా 15-00
29. హనుమాన్ చాలీసా 10-00

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

| | | |
|---|---|---|
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |

## 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాధ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | "శ్రీసాయి"కోటి | 27-00 |
| 18. | "శ్రీసాయిరామ్"కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |

| | | |
|---|---|---|
| 24. | శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం | 63-00 |
| 25. | ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు | 15-00 |
| 26. | షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం | 99-00 |
| 27. | సాయిసత్యవ్రతం | 30-00 |
| 28. | సాయి అనుగ్రహమ్ | 120-00 |
| 29. | నవగురువారాల వ్రతకల్పము | 15-00 |
| 30. | శ్రీదత్తలీలామృతము | 99-00 |
| 31. | హృదయంలో సాయి | 15-00 |
| 32. | శ్రీషిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్ఛరిత్ర) | 120-00 |
| 33. | గజాననమహరాజ్ చరిత్ర | 99-00 |

## 4. జ్యోతిషాలు

| | | |
|---|---|---|
| 1. | 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) | 72-00 |
| 2. | గ్రహభూమి పంచాంగము (గార్గేయ) | 108.00 |
| 3. | ఆనందసిద్ధి పంచాంగం (వై.వి.శాస్త్రి) | 63.00 |
| 4. | ములుగు వారి రాశిఫలితాలు (12రాశులువారికి) | 50.00 |
| 5. | ములుగు వారి రాశిఫలితాలు విడివిడిగాఒక్కొక్కటి | 12.00 |
| 6. | కాలచక్రంజ్యోతిషక్యాలండర్ | 25.00 |
| 7. | గ్రహబలం క్యాలండర్ (శ్రీనివాసగార్గేయ-భక్తిటివి) | 25.00 |
| 8. | శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ | 25.00 |
| 9. | సాదా క్యాలండర్ | 5.00 |
| 10. | పాకెట్ క్యాలండర్ | 15.00 |
| 11. | తాజకనీలకంఠీయమ్ | 100-00 |
| 12. | కేరళ జ్యోతిష రహస్యాలు | 180-00 |
| 13. | జ్యోతిష బ్రహ్మ రహస్యాలు | 180-00 |
| 14. | మానసాగరి జాతకపద్ధతి | 180-00 |
| 15. | వరాహమిహిర జాతకపద్ధతి | 180-00 |
| 16. | వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు | 99-00 |
| 17. | సింపుల్ రెమిడీస్ | 180-00 |
| 18. | శంభు హోరప్రకాశిక | 250-00 |
| 19. | పూర్వ పరాశరి | 100-00 |
| 20. | పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం | 200-00 |
| 21. | ప్రశ్న సింధు | 99-00 |
| 22. | నక్షత్ర విశేష ఫలితాలు | 63-00 |
| 23. | సూర్యసిద్ధాంతపంచాంగగణితంచేయడంఎలా? | 180-00 |
| 24. | దృక్సిద్ధాంతపంచాంగగణితం చేయడంఎలా? | 180-00 |

| | | |
|---|---|---|
| 25. | ఆయుర్దాయ నిర్ణయం | 63-00 |
| 26. | జాతక గణిత ప్రవేశిక | 63-00 |
| 27. | జ్యోతిషమర్మబోధిని | 63-00 |
| 28. | జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 63-00 |
| 29. | ముహూర్తం నిర్ణయించడంఎలా? | 63-00 |
| 30. | జాతక మకరందం | 63-00 |
| 31. | జ్యోతిష సరస్వతి | 63-00 |
| 32. | మీజననకాల విశేషాలు | 63-00 |
| 33. | ముహూర్త విజ్ఞాన భాస్కరం | 63-00 |
| 34. | జ్యోతిష స్వయంబోధిని | 63-00 |
| 35. | శుభముహూర్త శిరోమణి | 63-00 |
| 36. | నక్షత్ర ఫలమంజరి | 36-00 |
| 37. | పంచాంగం చూసే విధానం | 36-00 |
| 38. | సర్వార్థ జ్యోతిషం | 36-00 |
| 39. | ప్రాథమిక జ్యోతిషం | 36-00 |
| 40. | నవరత్నములు శుభయోగములు | 36-00 |
| 41. | శుభశకునాలు | 30-00 |
| 42. | హస్తరేఖాఫలితాలు | 36-00 |
| 43. | సంఖ్యల్లో భవిష్యత్ | 36-00 |
| 44. | ముహూర్త దీపిక | 99-00 |
| 45. | పుట్టుమచ్చలు ఫలితాలు | 30-00 |
| 46. | కలలు ఫలితాలు | 30-00 |
| 47. | జాతక చక్రం వేయడం ఎలా? | 36-00 |
| 48. | మానసాగరి (ప్రాచీనజ్యోతిషగ్రంథం) -పుచ్చాశ్రీనివాసరావు | 250-00 |
| 49. | జ్యోతిషశాస్త్ర చిట్కాలు | 120-00 |
| 50. | గుప్తా శతాబ్ది పంచాంగం (1940-2050) | 999-00 |
| 51. | ప్రశ్నచండేశ్వరమ్ | 63-00 |
| 52. | ద్వాదశభావ ఫలచంద్రిక | 250-00 |
| 53. | జ్యోతిష శతయోగరత్నావళి (నూరుయోగాలఫలితాలు) | 120-00 |
| 54. | అంగసాముద్రికం | 36-00 |
| 55. | హస్త సాముద్రికం | 63-00 |
| 56. | లాల్ కితాబ్ | 99-00 |
| 57. | శకునశాస్త్రం | 63-00 |
| 58. | ఆధునికప్రశ్నశాస్త్రం | 120-00 |
| 59. | పరాశరజ్యోతిష ప్రశ్నజ్యోతిషం | 180-00 |

| | | |
|---|---|---|
| 60. | అష్టకవర్గు (కొండపల్లి) | 63-00 |
| 61. | బృహత్‌జాతకం (ప్రాచీనప్రతికిపునర్ముద్రణ) | 250-00 |
| 62. | లగ్నరత్నాకరం | 63-00 |
| 63. | షట్పంచాశిక | 120-00 |
| 64. | 40 రోజుల్లో జ్యోతిషంనేర్చుకొనండి | 270-00 |
| 65. | 40 రోజుల్లో సాముద్రికంనేర్చుకొనండి | 180-00 |
| 66. | 40 రోజుల్లో సంఖ్యాశాస్త్రం | 180-00 |
| 67. | 40 రోజుల్లో నక్షత్ర (నాడీ) ఫలితములు | 270-00 |
| 68. | 40 రోజుల్లో వైద్యజ్యోతిషం నేర్చుకోండి | 250-00 |
| 69. | మీ పుట్టినతేదీ అద్భుతరహస్యాలు (సాయిగణపతిరెడ్డి) | 270-00 |
| 70. | కె.పి.జ్యోతిషం (పరిచయం) | 63-00 |
| 71. | ముహూర్తచింతామణి | 99-00 |
| 72. | సూర్యచంద్ర గ్రహణములు | 63-00 |
| 73. | ప్రసిద్ధవ్యక్తుల జాతకాలు (వేరేకొండప్ప) | 180-00 |
| 74. | అదృష్టరెమెడీస్ | 144-00 |
| 75. | గ్రహసంచార ఫలనిర్ణయదీపిక | 63-00 |
| 76. | జ్యోతిష రెమిడీస్ | 300-00 |
| 77. | జాతకమార్తాండం పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 78. | జ్యోతిషవిద్యాప్రకాశిక పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 79. | నాడీజ్యోతిషం | 63-00 |
| 80. | నక్షత్రపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 81. | లగ్నపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 82. | గౌతమసంహిత | 63-00 |
| 83. | హోరరత్నమాల | 63-00 |
| 84. | జాతకఫల మణిమంజరి | 200-00 |
| 85. | పుష్కర పంచాంగం (2013-14నుండి 2024-25) | 560-00 |
| 86. | దశాభుక్తిఫల నిర్ణయం | 250-00 |
| 87. | వింత జోస్యములు | 63-00 |
| 88. | షోడశవర్గులు | 200-00 |
| 89. | రవిగ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 90. | చంద్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 91. | కుజ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 92. | బుధ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 93. | గురు గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 94. | శుక్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |

| | |
|---|---|
| 95. శని గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 96. రాహు & కేతు గ్రహముల సమస్త ప్రభావములు | 99-00 |
| 97. ఆధునిక గ్రహములు-ఉపగ్రహములు సమస్త ప్రభావములు | 99-00 |
| 98. ముహూర్తమార్తాండం | 63-00 |
| 99. లఘుజాతకం | 63-00 |
| 100. జాతకాలంకారము | 63-00 |
| 101. మేషలగ్న ఫలితములు | 99-00 |
| 102. వృషభ లగ్న ఫలితములు | 99-00 |
| 103. మిథున లగ్న ఫలితములు | 99-00 |
| 104. కర్కాటక లగ్న ఫలితములు | 99-00 |
| 105. సింహలగ్న ఫలితములు | 99-00 |
| 106. కన్యలగ్న ఫలితములు | 99-00 |
| 107. తుల లగ్న ఫలితములు | 99-00 |
| 108. వృశ్చిక లగ్న ఫలితములు | 99-00 |
| 109. ధనుస్సు లగ్న ఫలితములు | 99-00 |
| 110. మకర లగ్న ఫలితములు | 99-00 |
| 111. కుంభ లగ్న ఫలితములు | 99-00 |
| 112. మీన లగ్న ఫలితములు | 99-00 |
| 113. నారద సంహిత | 200-00 |
| 114. పంచాంగపీఠికలేఖికాగణితం | 250-00 |
| 115. తారాబలం - చంద్రబలం (వేరే కొండప్ప) | 99-00 |
| 116. సులభలగ్న సాధన (చిత్రాలగురుమూర్తిగుప్తా) | 200-00 |
| 117. రాహు కేతువుల యోగము | 99-00 |
| 118. ఛాయాగ్రహములు | 99-00 |
| 119. జ్యోతిషవిజ్ఞాన దీపిక | 63-00 |

**బి.వి.రామన్ గారి గ్రంథములు**

| | |
|---|---|
| 120. జ్యోతిష విద్యారంభం | 50-00 |
| 121 గ్రహభావ బలములు | 50-00 |
| 122. కాలచక్రదశ | 50-00 |
| 123. అనుభవ ప్రశ్నాజ్యోతిషం | 50-00 |
| 124. జ్యోతిషశాస్త్రంలో వాతావరణ భూకంపాలు | 50-00 |
| 125. పురోగామి జాతకం | 50-00 |
| 126. భావార్థరత్నాకరం | 75-00 |
| 127. భారతీయజ్యోతిష సర్వస్వం | 75-00 |
| 128. అష్టకవర్గ పద్ధతిః | 75-00 |

